AADAAB-E-ZINDAGI
(Telugu)

# ఇస్లామీయ జీవనసరళి

మూలం :

మౌలానా ముహమ్మద్ యూసుఫ్ ఇస్లాహి

అనువాదం :

అబ్దుర్రహ్మాన్ సాబిర్

# విషయ సూచిక

# తొలిపలుకు

జీవితంతో పరిపూర్ణంగా ప్రయోజనం పొందడం, మాధుర్యాన్ని గ్రోలడం, విజయవంతంగా జీవితం గడపడం వాస్తవానికి మీ హక్కు. దానికిగాను మీరు జీవితం గడిపే విధానం నేర్చుకోవాలి. విజయవంతమైన జీవితానికి కావలసిన సూత్రాలు, విధానాలు గ్రహించాలి. క్రియాత్మకంగా వాటిని ఆచరించాలి.

మర్యాద, మన్నన, హుందాతనం, పొందిక, పరిశుద్ధత, పరిశుభ్రత, నేర్పు, అలంకరణ, కూర్పు, నిర్వహణ, సున్నిత భావాలు, ఉన్నత అభిరుచి, విశాలహృదయం, విశిష్టనైజం, సానుభూతి, హితాభిలాష, మార్దవం, మాధుర్యం, వినయం, వినమ్రత, త్యాగం, నిస్వార్థత, ప్రేమ, చిత్తశుద్ధి, సంకల్పనిరతి, శౌర్యం, విధి నిర్వహణ, చురుకుదనం, దైవ భయం, నిష్ఠాపరత్వం, దైవంపై భరోసా, ముందడుగు వేసే సాహసం - ఇది ఇస్లామీయ జీవన సరళికి సుందర స్వరూపం. ఈ విధంగా సంస్కరణ పొందిన విశ్వాసి జీవితంలో సభ్యత, అసాధారణమైన ఆకర్షణ, బలమైన ప్రభావిత శక్తి జనిస్తుంది. కేవలం ముస్లింలే కాదు, ముస్లిమేతరుల చూపులు కూడ అనూహ్యమైన రీతిలో విశ్వాసి వైపు మరలుతాయి. మనస్సు ఆలోచిస్తుంది. మానవాళిని అమితంగా ఉన్నతం చేసిన, తీర్చిదిద్దిన, అసాధారణ ఆకర్షణ అందజేసిన సభ్యతా సంస్కారాలు ప్రసాదించిన ఆ జీవన సరళి వాస్తవానికి గాలి, వెలుతురులా సర్వమానవుల ఉమ్మడి సంపత్తి. యావత్ మానవాళి దాన్ని స్వీకరించి, దాని పునాదుల మీద తన వ్యక్తిగత, సామాజిక జీవితాన్ని నిర్మించుకోవాలి. ఎందుకంటే ప్రాపంచిక జీవితంలోనూ సుఖ సౌభాగ్యాలు, సంతోషం, ఆనందం, శాంతి, రక్షణ ప్రాప్తిస్తాయి, మరణానంతర జీవితంలో కూడా విజయవంతమైన శ్రేయస్కర జీవితం పొందాల్సిన పుణ్యఫలం, అన్ని సుఖ, సౌభాగ్యాలు ప్రాప్తిస్తాయి.

ఈ పుస్తకం - ఇస్లామీయ జీవనసరళి - లో ఇస్లామీయ నాగరికత సూత్రాలు, మర్యాదలను సాధారణ రచనా శైలిలో సమర్పించడానికి ప్రయత్నం జరిగింది. దైవగ్రంథం, ప్రవక్త (సఅసం) పవిత్ర జీవితం, మిగతా మహనీయుల అడుగుజాడల్లో ఇస్లామీయ నైజం, అభిరుచి ప్రకారం జీవన సరళిని బోధించే అంశాలు చేర్చబడ్డాయి. ఇందులో ఐదు ప్రధాన అధ్యాయాలు వున్నాయి.

మొదటి అధ్యాయం - సభ్యత, సంస్కారం

రెండవ అధ్యాయం - ఆరాధనానందం

మూడవ అధ్యాయం - సుందర సమాజం

నాల్గవ అధ్యాయం - ధర్మ సందేశం

ఐదవ అధ్యాయం - దైవదాస్యం

ఈ ఐదు అధ్యాయాల్లో జీవితంలోని అన్ని రంగాలకు సంబంధించిన అన్ని అంశాలను ప్రభావవంతంగా సాధారణ భాషలో సులభంగా అర్థమయ్యే రీతిలో మనోజ్ఞమైన నిదర్శనాలతో, సంబోధనా శైలిలో రచించడం జరిగింది.

ఈ జీవన సరళి సమీకరణ శ్రద్ధాభక్తులుగల అన్ని వర్గాల వారికి, పెద్దలు, చిన్నలకు దేవుని కృపవల్ల ప్రయోజనకరంగా భాసిల్లుతుందని ఆశిస్తున్నాము. ఇస్లాం పట్ల ప్రేమానురాగాలుగల సోదర, సోదరీమణులు ఈ అమూల్యమైన కృతి ద్వారా ఆవేదనపూరితమైన ప్రార్థనలతో తమ జీవితాలను తీర్చిదిద్దుకోవాలి. తమ పిన్నల నీతి నడవడిని కూడా సంస్కరించేందుకు ప్రయత్నించాలి. సాధ్య మైనంత వరకు తమ పిన్నలకు ఈ మర్యాదలను, దుఆలను బోధించాలి. ఈ మర్యాదలను అనుసరించడం ద్వారా ప్రపంచ జీవితంలోనూ, గౌరవ మర్యాదలు, ప్రేమానురాగాలు ప్రాప్తమవుతాయి. పరలోకంలో కూడా పుణ్యఫలం లభిస్తుంది. ఈ పుస్తక రచనలో పరిశీలించిన గ్రంథాల పేర్లు ఆయా స్థలాల్లోనే ఇవ్వబడ్డాయి.

దైవం ఈ సేవను స్వీకరించాలని వేడుకొంటున్నాను. ఇంకా దీని ద్వారా ప్రజలు తమ జీవితాలను తీర్చిదిద్దుకుని ఇస్లామ్ కొరకు తమ హృదయాల్లోను, ఇతరుల హృదయాల్లోను శ్రద్ధ, భక్తి భావాలు, ఆచరించే ఆసక్తిని జనింపజేయాలని, ఈ పుస్తకం వలన దేవుని దాసులైన మానవులు తమ నిజ ధర్మం వైపునకు మరలి రావాలని కూడా ప్రార్థిస్తున్నాను. ఇది దీని రచయితకు దైవం సన్నిధిలో అపరాధాల క్షమాపణ కాగలగాలని, దీని తయారీకై పరిశీలించిన గ్రంథాల రచయితలకు కూడా పుణ్యఫలం ప్రాప్తం కావాలని అల్లాహ్‌ను అర్థిస్తున్నాను. ఆమీన్!

**రాంపూర్.** **ముహమ్మద్ యూసుఫ్ ఇస్లాహి,**

**3-8-1967**

అనంత కరుణామయుడు అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# 1

# సభ్యత, సంస్కారం

## 1. పరిశుభ్రత – పరిశుద్ధత

పారిశుధ్యాన్ని, పరిశుభ్రతను అలవరచుకున్న వారిని అల్లాహ్ తన ప్రేమపాత్రులుగా అభివర్ణించాడు. పారిశుధ్యం విశ్వాసంలో సగభాగమని మహాప్రవక్త (సఅసం) ప్రవచనం. అంటే ఆత్మ పవిత్రత విశ్వాసంలో సగమయితే శరీర పరిశుభ్రత మరో సగభాగమని భావం. ఈవిధంగా "విశ్వాసం" పరిపూర్ణమవుతుంది.

ఆత్మ పవిత్రత అంటే, ఆత్మను అవిశ్వాసం, బహుదైవారాధన, మార్గభ్రష్టతలాంటి చెడులకు దూరంగావుంచి, అందులో సవ్యమయిన విశ్వాసాలను, పవిత్రమయిన గుణగణాలను ప్రవేశపెట్టాలని అర్థం. శరీర పరిశుభ్రత, పారిశుధ్యం అంటే దాన్ని బాహ్య మలినాలనుండి పరిశుభ్రంచేసి, ఉత్తమ సంప్రదాయ, సంస్కారాలతో అలంకరింపజెయ్యాలన్నమాట.

1. నిద్రనుండి మేల్కొన్న తరువాత చేతులు కడుక్కోకుండా నీటిపాత్రలో చెయ్యి ముంచరాదు. ఎందుకంటే నిద్రలో చేతులు ఎక్కడెక్కడ పడతాయో తెలియదు.

2. స్నానాల గదిలో లేక స్నానాలు చేసేచోట మూత్ర విసర్జనచేసే అలవాటును మానుకోవాలి. ముఖ్యంగా ఆ చోటు తడిగా ఉన్నప్పుడు ఈ పని అసలు చేయరాదు.

3. మల, మూత్ర విసర్జన సమయాల్లో కిబ్లా దిక్కు (నమాజ్ చేసే దిశ)కు తిరిగి లేక ఆ వైపునకు వీపుపెట్టి కూర్చోరాదు. మలమూత్రాల విసర్జన తరువాత ఇటుక పెడ్డతో, నీళ్ళతో శుభ్రం చేసుకోవాలి. లేక కేవలం నీళ్ళతో శుభ్రం చేసుకున్నా సరిపోతుంది. ఎముక ముక్కతో, పిడకతో, బొగ్గు ముక్కతో శుభ్రం చేసుకోరాదు. ఆ తరువాత సబ్బుతోగాని, పరిశుభ్రమయిన మట్టితోగాని చెయ్యి బాగా కడుక్కోవాలి.

4. మల, మూత్ర విసర్జన అవసరమయినప్పుడు భోజనానికి కూర్చోరాదు. ఆ అవసరం తీరిన తరువాతే భోంచెయ్యాలి.

5. భోజన పానీయాలకు, వుజూ చెయ్యడానికి నిత్యం కుడిచేతినే ఉపయోగించాలి. ముక్కు మొదలయినవి, శుభ్రం చేసేటప్పుడు ఎడమచేతినే వాడాలి.

6. మెత్తగా ఉన్ననేలపైన మూత్ర విసర్జన చెయ్యాలి. అలా చేస్తే తుంపరలు చిందకుండా ఉంటాయి. సాధారణంగా కూర్చునే మూత్ర విసర్జన చెయ్యాలి. ఒకవేళ కూర్చోవడం సాధ్యపడకపోతే లేదా మరేదయినా బలమయిన కారణంవల్ల తప్పనిసరి అయితే నిలబడి మూత్ర విసర్జన చెయ్యవచ్చు. కాని మామూలు పరిస్థితుల్లో అలా చెయ్యడం అసభ్యకరమయిన, అసహ్యకరమయిన అలవాటు. దాన్ని తక్షణం మానుకోవడం అవసరం.

7. నది, కాలువ ఒడ్డున, మామూలు దారుల్లో, నీడనిచ్చే ప్రదేశాల్లో మల విసర్జన చెయ్యకూడదు. అలా చెయ్యటంవల్ల ఇతరులకు ఇబ్బంది కలగడమే కాదు, అది సభ్యతకు, సంస్కారానికి విరుద్ధం కూడా.

8. మరుగుదొడ్డికి వెళ్ళేటప్పుడు చెప్పులు తొడుక్కొని, టోపి ధరించి, లేక ఏదయినా బట్టతో తల కప్పుకొని వెళ్ళాలి. వెళ్తూ ఈ దువా (ప్రార్థన) పఠించాలి.

اَللّٰهُمَّ اِنِّیْٓ اَعُوْذُبِكَ مِنَ الْخُبُثِ وَالْخَبَآئِثِ (بخاری، مسلم)

అల్లాహుమ్మ ఇన్నీ అఊజుబిక మినల్ ఖుబుసి వల్ ఖబాయిస్

దేవా! షైతాన్ స్త్రీ పురుష దుష్టశక్తుల బారినుండి రక్షణ కొరకు నీ శరణు వేడుకొంటున్నాను. (బుఖారి, ముస్లిమ్)

మరుగుదొడ్డి నుండి బయటికి వచ్చిన తరువాత ఈ దుఆ పఠించాలి.

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِیْ اَذْهَبَ عَنِّی الْاَذٰی وَعَافَانِیْ (نسائی، ابن ماجہ)

అల్ హమ్దు లిల్లాహిల్లజీ అజ్ హబ అన్నిల్ అజా వ ఆఫానీ.
నా కష్టాన్ని బాపి హాయిని కలుగచేసిన స్వామికి కృతజ్ఞతాభివందనాలు.
(నసాయి, ఇబ్నుమాజ)

9. ముక్కు శుభ్రం చేసుకునేటప్పుడు లేక కళ్ళను తుప్పేనప్పుడు ఇతరులకు అసహ్యం కలగకుండా జాగ్రత్తపడాలి. దీనిగ్గాను ప్రత్యేకించిన సాలభ్యాన్ని వినియోగించుకోవాలి. లేదా బయలు ప్రదేశంలో ముక్కు చీదటంలాంటి అవసరం కలిగితే ఇతరుల కళ్ళపడకుండా చెయ్యాలి.

10. మాటి మాటికీ ముక్కులో వేలుపెట్టి శుభ్రం చేసుకుంటూ ఉండటం అసహ్యకరంగా ఉంటుంది. ముక్కును శుభ్రం చేయడం అవసరమయితే ఇతరుల దృష్టిని ఆకర్షించకుండా చాటుగా చేసుకోవాలి.

11. చేతి గుడ్డలో కళ్ళను తుప్పుకోవడం చెడ్డ అలవాటు. అలా చెయ్యడం అనివార్యమే అయితే ఎదుటివారి కంటపడకుండా చేయటం శ్రేయస్కరం.

12. మాట్లాడేటప్పుడు ఎదుటివారిపై తుంపరపడేలా కిళ్ళీలు (పాన్) నములుతూ మాట్లాడకూడదు. దానివల్ల ఎదుటి వారికి బాధకలుగుతుంది. అదేవిధంగా, పొగాకు, జర్దా, కిళ్ళీలు బాగా అలవాటున్నవారు నోటిని శుభ్రంగా ఉంచుకోవడానికి ప్రయత్నించాలి. మాట్లాడేటప్పుడు ఎదుటివారికి ఇబ్బంది కలగకుండా కాస్త ఎడంగా ఉండి మరీ మాట్లాడాలి.

13. వుజూ అతి శ్రద్ధతో చెయ్యాలి, అవసరమయిన ప్రతిసారీ వుజూ చెయ్యడం సాధ్యంకాకపోతే, వీలయినంతమటుకు వుజూ కాపాడుకోవాలి. నీళ్ళు దొరక్కపోతే తయమ్ముం చేసుకోవాలి, బిస్మిల్లాహ హిర్రహ్మా నిర్రహీమ్, పఠించి మరీ ప్రారంభించాలి. వుజూ చేస్తూ ఈ దుఆ చెయ్యాలి.

اَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَحْدَهٗ لَا شَرِيْكَ لَهٗ وَاَشْهَدُ اَنَّ مُحَمَّدًا
عَبْدُهٗ وَرَسُوْلُهٗ اَللّٰهُمَّ اجْعَلْنِیْ مِنَ التَّوَّابِيْنَ وَاجْعَلْنِیْ مِنَ الْمُتَطَهِّرِيْنَ (ترمذی)

అష్హదు అల్లాఇలాహ ఇల్లల్లాహు వహ్దహూ లాషరీకలహూ వ అష్హదు అన్న ముహమ్మదన్ అబ్దుహూ వ రసూలుహూ. అల్లాహుమ్మజ్ అల్నీ మినత్తవ్వాబీన వజ్ అల్నీ మినల్ ముతతహ్హిరీన్.

అల్లాహ్ తప్ప ఇతరులెవ్వరూ ఆరాధనకు అర్హులు కానేకారనీ, ఆయన ఒక్కడేనని, ఆయనకు సమానులు వేరెవ్వరూ లేరనీ నేను సాక్ష్యమిస్తున్నాను, ముహమ్మద్ (సఅసం) అల్లాహ్ దాసుడూ, ఆయన సందేశహరుడని కూడా నేను సాక్ష్యమిస్తున్నాను. ప్రభూ ! అత్యధికంగా క్షమాపణ వేడుకునే వారిలోనూ ఇతోధికంగా, పరిశుద్ధంగా, పరిశుభ్రంగా ఉండేవారిలోనూ నన్ను చేర్చు. (తిర్మిజి)

వుజూ పూర్తి అయిన తరువాత ఈ దుఆ పఠించాలి :

سُبْحَانَكَ اللّٰهُمَّ وَبِحَمْدِكَ اَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّآ اَنْتَ اَسْتَغْفِرُكَ وَ اَتُوْبُ اِلَيْكَ (نسائی)

సుబ్హానకల్లాహుమ్మ వ బిహమ్దిక అష్హదు అల్లా ఇలాహ ఇల్లా అన్‌త; అస్తగ్‌ఫిరుక వ అతూబు ఇలైక్.

దేవా ! నీవు పవిత్రుడివి, సకల స్తోత్రాలకు అర్హుడివి. నీవు తప్ప వేరే దైవం లేనేలేదు. నేను నిన్నే క్షమాపణ కొరకు అర్థిస్తున్నాను, నీ వైపునకే మరలుతున్నాను. (నసాయి).

మహాప్రవక్త (సఅసం) ఒక హదీసులో ఇలా అన్నారు : "నా అనుచర సంఘానికి చెందినవారి నుదురు, వుజూ వల్ల పరిశుభ్రమయిన అవయవాలు ప్రళయదినాన నా అనుచరులనడానికి ఆనవాలుగా, తేజోవంతంగా మెరిసిపోతుంటాయి. ఏ వ్యక్తి తన రూపాన్ని ఆనాడు తేజోవంతం చేసుకోవాలని కోరుకుంటాడో అతడు అలా చేసుకోగలడు." (బుఖారి, ముస్లిమ్)

14. నియమం తప్పక దంతావధానం చెయ్యాలి. 'అనుచరులు కష్టపడతారనే ఆలోచనే నాకు లేకపోతే మిస్వాక్ (పల్లను బ్రష్ చేయడం)ను విధిగా చేయాలని ఆదేశించేవాణ్ణి' అని మహాప్రవక్త సెలవిచ్చారు.

ఒకసారి మహాప్రవక్త (సఅసం) వద్దకు కొందరు వ్యక్తులు వచ్చారు. వారి పల్లు మలినంగా ఉండడం చూసి ఆయన వారిని మిస్వాక్ చేయమని తాకీదు చేశారు.

15. కనీసం వారంలో ఒక్కసారయినా తప్పక స్నానం చెయ్యాలి. (నీళ్ళు సమృద్ధిగా దొరికేచోట ప్రతిదినం స్నానం చెయ్యడం ఉత్తమం). శుక్రవారమయితే మరువకుండా స్నానం చెయ్యాలి. పరిశుభ్రమయిన బట్టలు తొడుక్కొని శుక్రవారం నమాజ్‌లో పాల్గొనాలి. మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు: "అమానతును వాపసు చేయడం అన్నది మనిషిని స్వర్గానికి తీసుకెళు

తుంది". అప్పుడు ఆయన సహచరులు, "ఓ దైవప్రవక్తా! అమానత్ అంటే ఇక్కడ భావం ఏమిటి?" అనడిగారు.

"మాలిన్యాన్ని దూరం చేసుకొని పరిశుద్ధులయ్యేందుకు స్నానం చెయ్యడం. అల్లాహ్ నియమించిన అమానతుల్లో పారిశుధ్యానికి మించిన అమానతు లేదు. కనుక స్నానం చేసే అవసరం ఏర్పడినప్పుడు మనిషి స్నానం చెయ్యాలి."

16. అపరిశుద్ధావస్థలో మస్జిద్ లోనికిగానీ మస్జిద్ ప్రాంగణంలోంచిగానీ వెళ్ళకూడదు. అనివార్యం అయినప్పుడు మాత్రం తయమ్ముమ్ చేసి మస్జిద్ లోనికయినా, ప్రాంగణం నుంచయినా వెళ్ళవచ్చు.

17. తలకు నూనె రాయడాన్ని, దువ్వుకోవడాన్ని మరువకూడదు. గడ్డాన్ని సవ్యంగా, సక్రమంగా కత్తిరించుకోవాలి. కళ్ళకు సుర్మా పెట్టుకోవాలి, గోళ్ళను ఎప్పటికప్పుడు కత్తిరించుకోవాలి. నిరాడంబరమయిన, సమంజసమయిన వస్త్రధారణను, అలంకరణను చేసుకోవాలి.

18. తుమ్మేటప్పుడు తుంపరలు ఇతరులపై పడకుండా చేతి రుమాలును ముక్కుకు అడ్డంగా పెట్టుకోవాలి.

తుమ్మిన తరువాత :

"اَلْحَمْدُ لِلّٰهِ"

"అల్ హమ్దులిల్లాహ్" (అల్లాహ్‌కే స్తోత్రాలు) అనాలి.

వినేవారు,

يَرْحَمُكَ اللّٰهُ

"యర్ హముకల్లాహ్" (దైవం మీపై కరుణించుగాక) అని బదులివ్వాలి.

దానికి ప్రతిగా మొదటివ్యక్తి

يَهْدِيْكَ اللّٰهُ

"యహ్‌దీకల్లాహ్" (దైవం మీకు సన్మార్గం చూపుగాక) అనాలి.

19. పరిమళ ద్రవ్యాలను వాడాలి. మహాప్రవక్త (అత్తరు మొదలైన) పరిమళాలంటే ఎంతో ఇష్టపడేవారు. ఉదయంపూట కాలకృత్యాలు తీరిన తరువాత బయటికి వెళ్ళే ముందు ఆయన సువాసన ద్రవ్యాలను బహుధా వాడేవారు.

# 2. ఆరోగ్యమే మహాభాగ్యం

1. ఆరోగ్యం దైవం ప్రసాదించిన మహత్తర వరప్రసాదం - మహత్తరమైన అమానతు కూడా. ఆరోగ్యాన్ని ఆదరించండి. దాని పరిరక్షణలో ఏమాత్రం ఉపేక్ష కనబరచకూడదు. ఒక్కసారి ఆరోగ్యం చెడిందంటే తరువాత అది అతికష్టంమీద నయమవుతుంది. ఏవిధంగానయితే అతిస్వల్పమయిన చెదలు గొప్ప గొప్ప గ్రంథాలయాలనే స్వాహా చేసివేస్తుందో అదేవిధంగా ఆరోగ్య విషయంలో ఏకాస్త అజాగ్రత్త జరిగినా స్వల్పమయిన వ్యాధి యావత్తు జీవితాన్నే నాశనం చేసేస్తుంది. ఆరోగ్యం గురించి ఉపేక్షాభావం దాని పరిరక్షణలో అలసత్వం చూపడం వాస్తవంగా మొండితనానికి, దేవునిపట్ల కృతఘ్నతకు మరో రూపం.

మానవ జీవితానికి అసలు ఊపిరి బుద్ధి వివేకాలు, నీతి నడవడికలు, విశ్వాసం చైతన్యాలు. ఇవన్నీ ఆరోగ్యంగా ఉండాలంటే అది చాలావరకు శారీరక ఆరోగ్యంపైనే ఆధారపడి ఉంటుంది. బుద్ధివివేకాల పెరుగుదల, నీతి నిజాయితీల ఆచరణ, ధార్మిక విధుల నిర్వహణ వీటన్నింటికీ శారీరక సౌష్టవం పునాదిలాంటిది. బలహీనమయిన, వ్యాధిగ్రస్తమయిన దేహంలో బుద్ధివివేకాలు కూడా బలహీనంగానే ఉంటాయి. వాటి పనితనంకూడా మందగిస్తుంది. జీవితం, ఆశయాలతో ఆశలతో ధైర్యస్థయిర్యాలతో అలరారకపోతే, సంకల్పం సన్నగిల్లితే ఆవేశాలు అడుగంటితే - ఇలాంటి నిస్తేజమయిన జీవితం బలహీన శరీరానికి ఓ భారంగా పరిణమిస్తుంది.

జీవితంలో విశ్వాసి చేయవలసిన కార్యాలు, నిర్వహించవలసిన ఖిలాఫత్ (దైవప్రాతినిధ్యం) బాధ్యతలు కోరేదేమంటే శరీరంలో సత్తువ ఉండాలి, బుద్ధి వివేకాలలో బలం ఉండాలి, సంకల్పాలలో స్థిరత్వం ఉండాలి, ఆశయాల్లో ఔన్నత్యం ఉండాలి. జీవితం ఉరకలు వేసే ఉత్సాహంతో, పరవళ్ళు తొక్కే ఉద్రేకంతో, నిత్యం ప్రవహిస్తూవుండే భావవాహినితో కళ కళలాడుతూ ఉండాలి. ఆరోగ్యవంతులయిన ప్రజల ద్వారానే సజీవ జాతులు ఉదయిస్తాయి. ఇలాంటి జాతులే జీవన రంగంలో ఉత్తమ త్యాగాలు చేసి ఉన్నత స్థానాన్ని సంపాదించుకుంటాయి. జీవితపు విలువల్ని లోకానికి చాటి చెబుతాయి.

2. నిత్యం సంతోషంగా ఉల్లాసభరితంగా చురుకుగా ఉత్సాహంగా ఉండండి. కళకళలాడే వదనంతో ఆనందంగా నవ్వుతూ నవ్విస్తూ జీవితాన్ని అందంగా

ఆకర్షవంతంగా, ఆరోగ్యంగా తీర్చి దిద్దుకోండి. కోపతాపాలకు, దుఃఖఖేదాలకు, చీకుచింతలకు ఈర్ష్యా ద్వేషాలకు, దురాలోచనలకు, దుష్టభావాలకు సంకుచిత బుద్ధికీ, మనసులో మాంద్యానికి, మస్తిష్కంలో చిక్కులకూ తావీయకండి. ఈ నైతిక రుగ్మతలు, మనసులోని సమస్యలు మీ జీర్ణాశయాన్ని తలక్రిందులు చేస్తాయి. జీర్ణాశయం చెడితే ఆరోగ్యం ఒక శత్రువును కొని తెచ్చుకుందనే అనుకోండి. అందుకే మహాప్రవక్త (సఅసం) ఒకసారి ఇలా సెలవిచ్చారు :

"నిరాడంబరంగా ఉండండి. మధ్యేమార్గాన్ని అవలంబించండి. నిత్యం సంతోషంగా, ఉల్లాసంగా మెలగండి." (మిష్కాత్)

ఒక ముదుసలి తన ఇద్దరు కొడుకుల ఆధారంతో వారిమధ్యన కాళ్ళీడ్చుకుంటూ పోతుంటే మహాప్రవక్త(సఅసం) చూశారు. అతనికేమయిందని ఆయన అడగ్గా ఆ ముసలివాడు కాబా(దైవగృహం) వరకు కాలి నడకన పోవాలని మొక్కుకున్నాడని తెలిపారు. అప్పుడు మహాప్రవక్త "ఈ వృద్ధుడు తనకుతాను విధించుకున్న శిక్షను దైవం కోరడం లేదు" అని పలికి ఆయనను ఏదయినా వాహనం ఎక్కించి పంపవలసిందిగా ఆదేశించారు.

ఒకసారి ఒక యువకుడు నిస్సత్తువగా నత్తనడక నడుస్తూ ఉంటే హజ్రత్ ఉమర్ (రజిఅన్) అతన్ని ఆగమన్నారు. "నీకేమయినా వ్యాధా?" అని అతన్ని ప్రశ్నించగా అతడు "ఏమీలేదే!" అని బదులిచ్చాడు. అప్పుడు హజ్రత్ ఉమర్ కొరడా పైకెత్తి బెదిరించి "నడిచేటప్పుడు బలంగా, యువకునిలా నడు" అని ఆదేశించారు.

మహాప్రవక్త (సఅసం) నడిచేటప్పుడు ఏదయినా పల్లం వైపునకు పోతున్నట్లు బలంగా వేగంగా అడుగులు వేసేవారు.

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ హారిస్ ఇలా చెప్పారు, "నేను మహాప్రవక్త (సఅసం) కంటే ఎక్కువగా చిరునగవు చిందించే వారినిచూడనే లేదు." (తిర్మిజి)

మహాప్రవక్త తన అనుచర సమాజానికి నేర్పిన దుఆ (ప్రార్థన) ను కూడా మరువకండి.

اَللّٰهُمَّ اِنِّیْ اَعُوْذُبِکَ مِنَ الْهَمِّ وَالْحُزْنِ وَالْعِجْزِ وَالْکَسَلِ وَ

ضَلَعِ الدَّیْنِ وَغَلَبَةِ الرِّجَالِ (بخاری، مُسلم)

అల్లాహుమ్మ అఊజుబిక మినల్ హమ్మి వల్ హుజ్ని వల్ ఇజ్ జి వల్ క్సలి వ జుల్ యిద్దైని వ గలబతిర్రిజాలి.

"దేవా ! నేను నీ శరణు వేడుకుంటున్నాను – కష్టాలనుండి, దుఃఖంనుండి, అశక్తతనుండి, సోమరితనం నుండి, అప్పుల భారంనుండి నాపై ప్రజలు జరిపే అణచివేతనుండి". (బుఖారి, ముస్లిమ్)

3. తమపైన అవసరానికి మించిన భారం వేసుకోరాదు. శారీరక శక్తుల్ని వ్యర్థం చేసుకోరాదు. శారీరక శక్తుల్ని జాగ్రత్తగా వాడుకోవడమే వాటి యెడల మనకుగల బాధ్యత, అవి భరించగల పనుల్ని మాత్రమే చెయ్యాలి.

"మీలో ఎంత పని చేయగల శక్తివుందో అంత పనే చేయండి. ఎందుకంటే అల్లాహ్ తన దాసుల సత్క్రియలను ఆదరించటంలో అలసిపోడు. మీరే అలసి పోతారు చివరికి" అని ప్రవక్త (సఅసం) బోధించారని హజ్రత్ ఆయిషా (ర.అ) తెలిపారు. (బుఖారి)

హజ్రత్ అబూ కైస్ (ర.అ) ఒకసారి మహాప్రవక్త (సఅసం) ప్రసంగం చేస్తున్న సమయంలో వెళ్ళారు. ప్రసంగం వింటూ హజ్రత్ అబూ కైస్ ఎండలోనే నిల్చున్నారు. మహాప్రవక్త ఆజ్ఞాపించి ఆయన్ని నీడలోకి పంపారు. (అల్ అదబుల్ ముఫ్రద్)

మనిషి దేహం ఒకేసారి కొంత ఎండలోనూ, కొంత నీడలోను ఉండరాదని కూడా ప్రవక్త చెప్పారు.

బాహిలా తెగకు చెందిన ఒక మహిళ హజ్రత్ ముజీబా (ర.అ) ఉల్లేఖించారుః "ఒకసారి మా నాన్న ధర్మజ్ఞాన సముపార్జన కొరకు ప్రవక్త (సఅసం) వద్దకు వెళ్ళారు. ధర్మానికి సంబంధించిన కొన్ని ముఖ్య విషయాలు తెలుసుకొని ఇంటికి తిరిగి వచ్చారు. ఒక సంవత్సరం తరువాత మళ్ళీ ప్రవక్త (సఅసం) వద్దకు వెళ్ళారు. అప్పుడు ప్రవక్త (సఅసం) ఆయన్ని గుర్తుపట్టలేదు. అందుకు మా నాన్న నన్ను మీరు గుర్తు పట్టలేదా అని ప్రవక్త (సఅసం)ను అడిగారు. "లేదే మిమ్మల్ని నేను గుర్తుపట్టలేక పోతున్నాను. మీరెవరో కాస్త చెప్పండి" అని ప్రవక్త (సఅసం) ప్రశ్నించగా మా నాన్న, "నేను బాహిలా వర్గానికి చెందిన వ్యక్తిని, గత సంవత్సరం కూడా మీ వద్దకు వచ్చాను" అని పరిచయం చేసుకున్నారు.

మహాప్రవక్త (సఅసం) ప్రశ్నించారు. "నీ స్థితి ఇలా అయిపోయిందేమిటి? పోయిన సంవత్సరం వచ్చినప్పుడు నీ ఆరోగ్య పరిస్థితి చాలా బాగుండేదే".

అందుకు మా నాన్న, "మీ దగ్గరనుండి వెళ్ళిన నాటినుండి నేటివరకు ఉపవాసాలు (రోజావ్రతం) పాటిస్తున్నాను. రాత్రిపూట మాత్రమే భోజనం చేస్తున్నాను" అని బదులు పలికారు. "నిన్ను నీవు అనవసరంగా శిక్షించుకున్నావు. (ఆరోగ్యాన్ని పాడుచేసుకున్నావు)" అని చెప్పి రమజాన్‌లో నెలంతా రోజాలు పాటించమని తరువాత ప్రతినెల ఒకరోజు రోజా పాటించమని ఉద్బోధించారు మహాప్రవక్త.

ఆయన ఒక దినంకంటే ఎక్కువ అనుమతించండని కోరాడు. నెలలో రెండు రోజులు ఉపవాసం పాటించేందుకు మహాప్రవక్త అనుమతించారు. మళ్ళీ ఆయన ఇంకా ఎక్కువ అనుమతికై అర్థించాడు. ప్రతినెలా మూడు రోజులు అనుమతించారు. ఆయన మరల "అయ్యా ! ఇంకా ఎక్కువ చెయ్యండ"ని ప్రాధేయపడగా, ప్రవక్త(సఅసం) "సరే, ప్రతి సంవత్సరం పవిత్రంగా పరిగణించబడే నెలల్లో ఉపవాసాలు పాటించవచ్చు లేక వదలివేయవచ్చ"ని చెబుతూ తన మూడు వ్రేళ్ళను దగ్గరగా కలిపి మళ్ళీ విడదీశారు. అంటే రజబ్, షవ్వాల్, జీకఅదా, జిల్ హజ్ నెలల్లో రోజా పాటించవచ్చు, ఏదో ఒక సంవత్సరం మాని వేయవచ్చు కూడా అని భావం.

ఆ తరువాత ప్రవక్త(సఅసం) ఈ విధంగా అన్నారు : "మోమిన్(విశ్వాసి) తన్ను తాను హీన పరుచుకోవడం భావ్యం కాదు." మోమిన్ తన్ను తాను ఏ విధంగా హీనపరచుకుంటాడు అని అక్కడున్నవారు ప్రశ్నించగా "అతడు భరించలేని పరీక్షలకు తన్నుతాను గురిచేసుకోవడమే హీనపరచుకోవటమ"ని ప్రవక్త(సఅసం) సమాధానం పలికారు. (తిర్మిజి)

4. శ్రమతో కూడుకున్న, సాహసవంతమైన జీవితం గడపాలి. అన్ని విధాల కష్టాలను ఓర్చుకోవడం, పరిస్థితుల్ని ఎదుర్కోవడం అలవర్చుకోవాలి. మొండిగా, నిరాడంబరంగా సాహసోపేతంగా జీవితం గడపాలి. విశ్రామ ప్రియులుగా, సోమరులుగా, అశ్రద్ధపరులుగా, సుకుమారులుగా, భోగలాలసులుగా, అధైర్య వంతులుగా, విషయవాంఛలకు దాసులుగా రూపొందరాదు.

ప్రవక్త (సఅసం) హజ్రత్ ముఆజ్ ఇబ్నె జబల్ (ర.అ)ను యమన్ గవర్నర్‌గా నియమించి పంపే సమయంలో ఇలా హితవు చెప్పారు. "ముఆజ్, నీవు సుఖ భోగాలకు దూరంగా ఉండాలి. ఎందుకంటే అల్లాహ్ దాసులు సుఖభోగలాలసులు కాజాలరు." (మిష్కాత్)

హజ్రత్ అబూ ఉమామ, ప్రవక్త (సఅసం) ఇలా అన్నారని తెలిపారు. "నిరాడంబర జీవితం గడపడం విశ్వాసానికి నిదర్శనం." (అబూ దావూద్)

ప్రవక్త (సఅసం) ఎల్లప్పుడూ నిరాడంబరమైన, వీరోచితమైన జీవనం

గడిపేవారు. ఎల్లవేళలా తన బలాన్ని వ్యర్థపరచకుండా కాపాడుకోవడానికి, దాన్ని పెంపొందించుకోడానికి ప్రయత్నం చేసేవారు. ఆయనకు ఈత అంటే ఎంతో ఆసక్తి. ఎందుకంటే ఈదడం మంచి వ్యాయామం. ఒకసారి ఒక చెరువులో ఆయన మరి కొందరు సహచరులు ఈదసాగారు. అప్పుడు ఆయన (సఅసం) ఈదేవారిని జతలుగా ఏర్పరచారు. ప్రతిమనిషి ఈదుతూ వెళ్ళి తన జతగాడ్ని చేరుకోవాలి. అలా ఆయనకు జతగా హజ్రత్ అబూబకర్ (ర.అ) వచ్చారు. ఆయన (సఅసం) ఈదుకుంటూ అబూబకర్ (ర.అ) వద్దకు చేరుకొని ఆయన మెడనుచుట్టుకున్నారు.

మహాప్రవక్త (సఅసం)కు గుర్రపు స్వారీ అంటే చాలా ఇష్టం. తన గుర్రానికి తానే స్వయంగా సేవచేసేవారు. తన చొక్కా చేతితో దాని మూతిని తుడిచి శుభ్రం చేసేవారు. దాని జూలును తన వ్రేళ్ళతో సవరించేవారు. "అంతిమదినం వరకు దాని నుదిటిపైన శుభం తాండవిస్తూ ఉంటుంది" అని అనేవారు.

హజ్రత్ అకబా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు: "బాణం వేయడం నేర్చుకోవాలి. గుర్రపు స్వారీ చేయాలి. విలువిద్య నేర్పరులంటే, గుర్రపు స్వారీ చేసేవారంటే నాకు ఎక్కువ ఇష్టం. ఏ వ్యక్తి అయితే విలువిద్య నేర్చుకొని దాన్ని విస్మరిస్తాడో అతడు దేవుని వరాన్ని అగౌరవించాడు."

(అబూ దావూద్)

హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్నె ఉమర్ (ర.అ) ప్రవక్త (సఅసం) ఇలా బోధించారని తెలిపారు: "ఏ వ్యక్తి అపాయకరమైన స్థితిలో ముజాహిద్[1] లకు కాపలా కాస్తాడో అతని ఎడల ఆ రాత్రి షబెకద్ర్[2] కంటే మహత్ పూర్వకమైనది." (హాకిమ్)

మహాప్రవక్త (సఅసం) తమ అనుచరులను ఉద్దేశించి ఇలా అన్నారు: "ఆకలిగొన్నవారు భోజనాలమీద ఏవిధంగా విరుచుకు పడతారో అదేవిధంగా నా ఉమ్మత్ (అనుచర సమాజం)పైన ఇతరులు విరుచుకుపడే తరుణం రానున్నది." అప్పుడు అక్కడ ఉన్నవారు "ఓ దైవ ప్రవక్తా! ఆ సమయంలో మేము పరులు అంతం చేసేటంతటి అల్ప సంఖ్యలో ఉంటామా?" అని అడిగిన దానికి ఆయన "కాదు - ఆ సమయంలో మీరు సంఖ్యలో అధికంగానే ఉంటారు. కాని ప్రవాహంలో కొట్టుకుపోయే గడ్డి పరకల్లా బలహీనులయిపోతారు. మీ శత్రువుల

---

1. *ముజాహిద్ అంటే ధర్మసంస్థాపనార్థం అవిరళ కృషి సలిపేవాడని అర్థం.*
2. *షబెకద్ర్ అంటే రమజాన్ నెలలో తారసపడే ఒకానొక శుభప్రదమయిన రాత్రి.*

గుండెల్లో మీ భీతి అంతరించి పోతుంది. మీ గుండెల్లో అధైర్యం గూడు కట్టుకుంటుంది." అని చెప్పారు. అప్పుడు ఓ వ్యక్తి అడిగాడు - "మాలో అంత అధైర్యం ఏ కారణంచేత చోటు చేసుకుంటుంది?" "కారణం ఏమిటంటే, మీరు ప్రపంచాన్ని అమితంగా ప్రేమిస్తారు, మృత్యువంటే ఏవగించుకుంటారు" అని జవాబిచ్చారు ప్రవక్త మహనీయులు (సఅసం).

హజ్రత్ అబూ హురైరా (రజి), ప్రవక్త (సఅసం) ఇలా అన్నారని ఉల్లేఖించారు : "ఏ వ్యక్తి తన గుర్రం కళ్ళేన్ని పట్టుకొని, దైవమార్గంలో దాన్ని ఊపుతూ తిరుగుతూ ఎక్కడైనా ప్రమాదం వాటిల్లిన వార్త వినగానే గుర్రం ఎక్కి అక్కడికి చేరుకుంటాడో, మృత్యువును వెదుక్కుంటూ తిరిగే వాడివలె నిర్భయంగా తిరుగుతాడో అతని జీవితం ఉత్తమమయింది." (ముస్లిమ్)

5. మహిళలు కూడా కష్టం, కృషి, శ్రమతో కూడుకున్న జీవితం గడపాలి. ఇంటి పనులు స్వయంగానే చేసుకోవాలి. కాలి నడక నడిచేందుకు, కష్టాలను సహించేందుకు అలవాటు పడాలి. సుఖాభిలాష, సోమరితనం, విలాసాలకు దూరంగా ఉండాలి. పిల్లల్ని కూడా మొదటినుండే కష్టాలకు, శ్రమకు ఓర్చుకునే వారుగా పెంచాలి. ఇంట్లో నౌకరు ఉన్నప్పటికీ పిల్లలు ప్రతి దానికీ నౌకరుమీదనే ఆధారపడటాన్ని వారించాలి. వారు తమ పనులన్నీ స్వయంగానే చేసుకొనేలా అలవాటు చేయాలి. ప్రవక్త (సఅసం) సహచరులైన మహిళలు తమ ఇంటి పనులన్నీ తామే చేసుకొనేవారు. వంట పని, పిండి విసరటం, నీళ్ళు తోడటం, బట్టలు ఉతకడం, కుట్టుపని, ఇత్యాది పనులన్నీ చేసుకునేవారు. కఠిన శ్రమతోకూడిన జీవితం గడిపేవారు. అవసరమైతే రణరంగంలో గాయపడిన వారికి కట్లుకట్టి, నీరందించి వారి దాహం తీర్చే పని కూడా నిర్వహించేవారు. ఇలా కష్టభరితమైన జీవితం గడపడం మూలాన మహిళల ఆరోగ్యంతోపాటు నడవడికూడా బాగు పడుతుంది. వారు పెంచే పిల్లలపైన మంచి ప్రభావం పడుతుంది. ఇంటి కార్య కలాపాలలో నిమగ్నమై ఉండి రేయింబవళ్ళు తన ఇంటి బాధ్యతల్లో మునిగిపోయిన శ్రమవల్ల ముఖంపైన అలసట ఛాయలు, వంటగదిలోని పొగ, మసి మరకలు కనబడే ఇల్లాలు ఉత్తమ భార్యగా పరిగణించబడుతుంది.

ప్రవక్త (సఅసం) అన్నారు : "నేను, మరకల చెక్కిళ్ళుగల స్త్రీ తుదిదినాన ఇలా ఉంటాము (అంటూ తన రెండు వ్రేళ్ళను కలిపి చూపించారు)".

6. ప్రొద్దుటే మేల్కొనే అలవాటు చేసుకోవాలి. నిద్ర విషయంలో కూడా జాగ్రత్త అవసరం. శరీరానికి పూర్తిగా విశ్రాంతి లభించకుండా అలసిపోయిన అవయవాలు శక్తిని పునరుద్ధరించుకునే అవకాశం ఇవ్వకుండా తక్కువగా నిద్రించ రాదు. అలా అని సోమరితనం, అలసత్వం కలిగేటట్లు ఎక్కువగా కూడా నిద్రించకూడదు. రాత్రి పెందలకడనే నిద్రపోవటం, ఉదయం పెందరాళే మేల్కొనడం అలవాటు చేసుకోవాలి.

ప్రొద్దున్నే లేచి నమాజ్ తర్వాత ఉద్యానవనంలోనో, మైదానంలోనో వ్యాహ్యాళికి వెళ్ళాలి. ప్రాతఃకాలపు నిర్మలమయిన గాలులు ఆరోగ్యానికి ఆహ్లాదాన్నిస్తాయి. ప్రతిదినం శరీర సౌష్టవాన్నిబట్టి సాధారణమయిన వ్యాయామం చెయ్యాలి. ప్రవక్త మహనీయులు తోటల్లో విహరించటానికి ఇష్టపడేవారు. ఆయన స్వయంగా తోటల్లోకి వెళ్ళి కాలక్షేపం చేసేవారు. ఆయన (సఅసం) ఇషా నమాజ్ తరువాత జాగరణ చెయ్యడాన్ని, మాట్లాడుకుంటూ కూర్చోవడాన్ని నిషేధించారు. ఇషా తరువాత ధార్మిక విషయాల చర్చలోనో లేదా ఇంటివారితో అవసరమయిన సంప్రతింపుల్లోనో ఉండేవ్యక్తి తప్ప మరెవరూ మేల్కొనరాదని సెలవిచ్చారు.

7. మనోనిగ్రహాన్ని అలవాటు చేసుకోవాలి. భావోద్రేకాలను, ఆలోచనలను, కోరికలను, కాంక్షలను అదుపులో ఉంచుకోవాలి. ఆలోచనలు, దృష్టి పరిపరి విధాలా పోకుండా, హద్దుల్ని మీరకుండా జాగ్రత్తపడాలి. హద్దులు మీరిన వాంఛలు చెదరిపోయిన దృష్టి మూలంగా మీరు మనోమస్తిష్కాల ప్రశాంతతను కోల్పోతారు. అలాంటివారి ముఖాలు యవ్వనంలోని అందం ఆకర్షణ, మగసిరి లక్షణాల్ని కోల్పోతాయి. వారు జీవిత రంగాలన్నింటిలో ధైర్యం లేని వారుగా, పిరికివారుగా మారిపోతారు.

మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రకటించారు :

"చూపును పరిపరి విధాల ప్రసరింపచేయడం కన్నుల వ్యభిచారంతో సమానం, అశ్లీలమైన మాటలు మాట్లాడటం నోటి వ్యభిచారంతో సమానం. మనస్సు కోరికలు కోరుతుంది. మర్మావయం ధృవపరచటమో తిరస్కరించటమో చేస్తుంది."

ఒక విజ్ఞాని ఇలా అన్నాడు :

"ముస్లిములారా ! నీతిబాహ్యమైన పనుల ఛాయలకు కూడా పోకండి. దానిలో ఆరు దుర్గుణాలు ఉన్నాయి. మూడు దుర్గుణాలు ఇహలోకానికి సంబంధించినవి, మూడు పరలోకానికి సంబంధించినవి. ప్రపంచానికి సంబంధించిన ఆ దుర్గుణాలు ఇవి :

☆ మనిషి ముఖకాంతి, ఆకర్షణ తగ్గుతూ పోతాయి. ☆ మనిషిని పేదరికం, దారిద్ర్యం అలుముకొంటాయి. ☆ వయస్సు తరుగుతూ పోతుంది.

8. మత్తు పదార్థాలకు దూరంగా మెలగండి. మత్తు పదార్థాలు మెదడునూ, జీర్ణశక్తినీ పాడుచేస్తాయి. మద్యపానమైతే నిషిద్ధమైనదే. ఇదేకాకుండా మత్తును కలిగించే పదార్థాలన్నింటికి కూడా దూరంగా ఉండాలి.

9. అన్నిపనుల్లో ఓ క్రమాన్ని, మధ్యేమార్గాన్ని నిరాడంబరత్వాన్ని పాటించాలి. శారీరక శ్రమలో, మానసికమైన పనుల్లో స్త్రీ పురుషుల సంబంధాల విషయంలో, అన్న పానీయాల్లో, నిద్ర విశ్రాంతుల్లో సుఖదుఃఖాల్లో, కాలక్షేపంలో, ఆరాధనల్లో, మాటల్లో చేతల్లో సమస్త విషయాల్లో మధ్యేమార్గాన్ని పాటించాలి. దాన్నే సుఖసౌభాగ్యాల సరోవరమని భావించాలి. ప్రవక్త(సఅసం) ఇలా వివరించారు: "కలిమిలోను, లేమిలోను, ఆరాధనల్లోను అన్నిటా మధ్యేమార్గాన్ని అనుసరించటమే శుభప్రదమయింది." (కన్జుల్ ఉమ్మాల్)

10. వేళకు భోజనం చేయాలి. కడుపునిండా తినటం మంచిదికాదు. ఎల్లప్పుడూ ఏదో ఒకటి నములుతూ ఉండటం కూడా మంచిదికాదు. బాగా ఆకలి అయినప్పుడే తినాలి. కాస్త ఆకలిమిగిలి వుండగానే భోజనం ముగించాలి. ఆకలి కంటే ఎక్కువ తినరాదు. ప్రవక్త(సఅసం) ఇలా అన్నారు : "విశ్వాసి (మోమిన్) ఒక ప్రేగు పట్టేంత భుజిస్తాడు. అవిశ్వాసి ఏడు ప్రేగులు పట్టేంత తింటాడు."

(తిర్మిజీ)

ఆరోగ్యం చాలా వరకు జీర్ణకోశం బాగోగులపైన ఆధారపడి ఉంటుంది. మితిమీరి తినడంవల్ల జీర్ణకోశం పాడైపోతుంది. ప్రవక్త(సఅసం) ఒక ఉదాహరణ ఇస్తూ ఇలా విశదీకరించారు: "జీర్ణకోశం శరీరానికి ఒక కోనేరులాంటిది. నరాలు ఆ కోనేటినుండి నీరు గ్రహిస్తాయి. కాబట్టి జీర్ణకోశం ఆరోగ్యంగా ఉంటే నరాలు కూడా ఆరోగ్యాన్ని మోసుకువస్తాయి. ఒకవేళ జీర్ణకోశమే చెడిపోయి వ్యాధి గ్రస్తమయితే నరాలు రోగాన్నే గ్రోలి తెస్తాయి." (బైహకి)

తక్కువ తినటాన్ని బోధిస్తూ మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారుః ఒక మనిషికి సరిపడే భోజనం ఇద్దరు సరిపుచ్చుకోవచ్చు.

11. ఎల్లప్పుడు సాధారణమైన భోజనమే చేయాలి. జల్లెడ పట్టని పిండి రొట్టె తినాలి. ఎక్కువ వేడిగా ఉన్న అన్నం తినకూడదు. మసాలాలు, క్రొవ్వులు, అతిగా రుచులు కోరడం మానుకోవాలి. సులువుగా జీర్ణమయ్యే, సాదాసీదా, ఆరోగ్యకరమయిన, శక్తిదాయకమయిన ఆహారం భుజించాలి. కేవలం రుచుల కోసం ప్రాకులాడటం పనికిరాదు. ప్రవక్త (సఅసం) జల్లెడ పట్టని పిండిరొట్టె అంటే ఇష్టపడేవారు. బాగా పలుచనైన, లేదా మైదాతో చేసిన చపాతీలను ఇష్టపడేవారు కారు. ఆవిర్లు క్రక్కే వేడి వేడి అన్నం భుజించేవారు కాదు. ఎప్పుడయినా ఇలా అనేవారు : "దేవుడు మనకు అగ్నిని తినిపించటం లేదు. వేడి భోజనంలో బరకత్ (శుభం) ఉండదు." ఆయన మాంసం అంటే ఇష్టపడేవారు. ముఖ్యంగా ముందు తొడల మాంసం, మెడపైని మాంసం, మూపురంమీది మాంసాన్ని ప్రీతితో భుజించేవారు. వాస్తవమేమంటే శరీరానికి శక్తినీ, వీరోచితమైన స్వభావాన్ని కలిగించేందుకు మాంసం ఒక ముఖ్యమైన, తప్పనిసరి అయిన ఆహారం. ధైర్యసాహసాలు, శక్తిసామర్థ్యాలు విశ్వాసి అనివార్య లక్షణాలు. మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు :

"ఒకవ్యక్తి దైవమార్గంలో పోరాడుతూ మరణించకపోగా కనీసం అతని హృదయంలో షహాదత్ (అమరగతి)ని పొందే అభిలాష కూడా లేకపోతే అతడి మరణం కపట స్థితిలో జరిగినట్లే." (ముస్లిమ్)

12. భోజనం అత్యంత ప్రశాంతంగా, నెమ్మదిగా, బాగా నములుతూ చేయాలి. విచారం, కోపం, భయాందోళనల స్థితిలో భుజించడం మంచిదికాదు. మనశ్శాంతి ఉన్నప్పుడు సంతోషంగా ప్రశాంతంగా చేసే భోజనం శరీరానికి శక్తిని చేకూరుస్తుంది. విచారం, కలవరం, ఆందోళన వంటి స్థితుల్లో తినే అన్నం జీర్ణకోశంపై చెడు ప్రభావం వేస్తుంది. అందువల్ల అసలు శక్తే చేకూరదు. భోజనం చేసే సమయంలో మౌనంగా విచారంగా కూర్చోరాదు. అలా అని మితిమీరిన సంతోషం, నవ్వులూ కూడా మంచిదికాదు. భోజనం చేసేటప్పుడు పకపకా నవ్వటం ఒక్కొక్కప్పుడు ప్రాణానికి ముప్పుగా పరిణమించవచ్చు. మితంగా సంభాషిస్తూ, సంతోషంగా భోంచేయాలి. దైవం ప్రసాదించిన దానికి కృతజ్ఞతలు తెలుపుకుంటూ మరీ భోంచేయాలి. జబ్బుగా ఉన్నప్పుడు పత్యం పాటించాలి.

ఉమ్మె మున్‌జిర్(రజి) ఇలా వివరించారుః "ఒకసారి ప్రవక్త(సఅసం) మా వద్దకు వచ్చారు. మా వద్ద అప్పుడు ఖర్జూరపు గుత్తులు వ్రేలాడుతున్నాయ్. ప్రవక్త (సఅసం) వాటిలోనుండి తినసాగారు. హజ్రత్ అలీ (ర.అ) కూడా వారి వెంట వచ్చారు. ఆయన కూడా తినసాగారు. ఆయన్ని ప్రవక్త (సఅసం), 'ఇప్పుడిప్పుడే నీవు జబ్బునుండి కోలుకుంటున్నావ్, నీవు తినడం మంచిదికాదు' అని వారించారు. తక్షణం హజ్రత్ అలీ మానివేశారు. ప్రవక్త(సఅసం) మాత్రం తింటూ ఉన్నారు". ఉమ్మె మున్‌జిర్ ఇంకా ఇలా వివరించారు, "తరువాత నేను 'జౌ' (అధమ రకం గోధుమలు), బీట్‌రూట్ వండాను. ప్రవక్త (స) హజ్రత్ అలీతో అన్నారుః 'అలీ ! దీన్ని తిను. ఇది నీకు మంచి ఆహారం" (షిమాయిలే తిర్మిజీ)

ప్రవక్త(సఅసం) వద్దకు ఎవరయినా అతిథి వచ్చినప్పుడు ఆయన కొసరి కొసరి తినిపించేవారు. అతిథి తృప్తిగా భుజించి ఇక చాలు అన్న తరువాతగాని వదిలేవారు కాదు. అంటే ప్రవక్త(సఅసం) అత్యంత సంతోషకరమైన వాతావరణంలో హాయిగా సంభాషిస్తూ భోజనం చేసేవారు అన్నమాట.

13. మధ్యాహ్నం భోంచేసిన తరువాత కొంతసేపు మేను వాల్చటం మంచిది. రాత్రి భోజనం తరువాత కాస్సేపు అటూ ఇటూ పచార్లు చెయ్యడం మంచిది. భోజనానంతరం వెంటనే ఎటువంటి మానసికమయిన పని అసలు చేయరాదు. అరబ్బీలో ప్రసిద్ధమయిన సామెత –"తగద్ద తమద్ద, తఅష్ష తమష్ష"

'మధ్యాహ్నం భోజనానంతరం పడక, రాత్రి భోజనానంతరం నడక.'

14. కన్నుల విషయంలో చాలా జాగ్రత్తలు తీసుకోవాలి. అధికమైన కాంతిని చూడకూడదు. సూర్యుని మీద దృష్టి నిలుపరాదు. మసక మసకగా ఉన్నా లేక మరీ ఎక్కువగా వెలుగు ఉన్నా చదువరాదు. నిత్యం సాధారణ కాంతిలో, సరిపోయే వెలుగులో చదవాలి. ఎక్కువ సమయం మేల్కొని ఉండటం కూడా శ్రేయస్కరం కాదు. దుమ్ము, ధూళినుండి కళ్ళను రక్షించుకోవాలి. కళ్ళకు సుర్మా వాడాలి. ఎల్లవేళలా కళ్ళను శుభ్రంగా ఉంచుకోవటానికి ప్రయత్నించాలి. పొలాల్లో, తోటల్లో ఆకుపచ్చగా ఉన్న వనాల్లో విహరించాలి. ఆకుపచ్చని రంగు చూస్తే దృష్టిపై మంచి ప్రభావం పడుతుంది. చెడు చూపు నుంచి కళ్ళను కాపాడుకోవాలి. అలా చేయకపోతే కంటి కళ తగ్గిపోతుంది. ఆరోగ్యం పైన కూడా చాలా చెడు ప్రభావం పడుతుంది. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రకటించారుః

"మీ కళ్ళకు కూడా మీపై హక్కు ఉంది." దేవుని ఈ వరాన్ని కాపాడుకోవటం విశ్వాసి విధి. దాన్ని దేవుని అభీష్టం ప్రకారం ఉపయోగించాలి. కళ్ళ ఆరోగ్యానికి ఉపకరించే అన్ని పద్ధతులనూ అనుసరించాలి. కళ్ళను నష్టపరిచే

అన్ని విషయాలనూ విసర్జించాలి. అలాగే ఇతర అవయవాల, ఇతర శక్తుల విషయంలోకూడా జాగ్రత్తగా ఉండాలి. ప్రవక్త(సఅసం) ఇలా అన్నారు: "కళ్ళకు సుర్మా పెట్టుకుంటూ ఉండండి. సుర్మా కళ్ళలోని మలినాన్ని దూరం చేస్తుంది. వెంట్రుకలను పెంచుతుంది." (తిర్మిజి)

15. పళ్లను శుభ్రంగా ఉంచటంలో అలక్ష్యం చేయరాదు. పళ్ల పరిశుభ్రత మానసిక ఉల్లాసానికి కారణమౌతుంది. దానివల్ల జీర్ణశక్తిపై మంచి ప్రభావం పడుతుంది. పళ్లు పటిష్టంగా ఉంటాయి. వేపపుల్ల వగైరాలతో మిస్వాక్(బ్రష్) చేయడం అలవాటు చేసుకోవాలి. పళ్లపొడి మొదలయినవి కూడా ఉపయోగించ వచ్చును. కిళ్ళీలు, పొగాకు ఎక్కువగా వాడి పళ్లను పాడు చేసుకోరాదు. భోజనం చేసిన తరువాత కూడా దంతావధానం చేయటం శ్రేయస్కరం. దంతాలు అపరిశుభ్రంగా ఉంటే రకరకాల రోగాలు వచ్చిపడతాయి. నిద్రనుండి మేల్కోగానే మిస్వాక్‌తో నోటిని శుభ్రం చేసుకోవటం మహాప్రవక్త (సఅసం) అలవాటు. (ముత్తఫకున్ అలైహి)

హజ్రత్ ఆయిషా (ర.అ) ఇలా విశదీకరించారు : "మేము ప్రవక్త (సఅసం)కు వుజూ చేసుకోవడానికి నీళ్ళు, మిస్వాక్ సిద్ధం చేసి వుంచేవారం. దైవాదేశం అయినప్పుడు ఆయన లేచి మిస్వాక్ చేసుకునేవారు. తరువాత వుజూ చేసుకుని నమాజ్ చేసేవారు" (ముస్లిమ్)

ప్రవక్త (సఅసం) ఇలా బోధించారని హజ్రత్ అనస్ (ర.అ) అన్నారు: "నేను మీకు మిస్వాక్ చేసే విషయంలో చాలా నొక్కి చెప్పాను. దానిపట్ల అలక్ష్యం చెయ్యకండి." (బుఖారి)

హజ్రత్ ఆయిషా (ర.అ), ప్రవక్త (సఅసం) ఇలా నుడివారని తెలిపారు: "మిస్వాక్, నోటిని శుభ్రం చేస్తుంది. దైవాన్ని సంతోషపెడుతుంది." (నసాయి)

ప్రవక్త (సఅసం) సెలవిచ్చారు : "ఒకవేళ నా ఉమ్మత్‌కు (అనుచర సమాజానికి) కష్టం కలుగుతుందని అనుకోకపోతే ప్రతి నమాజ్ సమయంలో తప్పనిసరిగా మిస్వాక్ చేయాలని ఆదేశించేవాణ్ణి." (అబూ దావూద్)

"ఒకసారి ఆయన్ని (సఅసం) కలుసుకోటానికి కొందరు ముస్లిమ్‌లు వచ్చారు. వారి దంతాలు పాచిపట్టడంవల్ల మలినంగా ఉన్నాయి. ఆయన (సఅసం) చూసి వారితో అన్నారు: "మీ పళ్లు అలా పచ్చగా అగుపడుతున్నాయేం? మిస్వాక్ చేస్తూ ఉండండి." (ముస్నద్ అహ్మద్)

16. మలమూత్ర విసర్జన అవసరం కలగగానే దాన్ని తీర్చుకోవాలి. ఆ అవసరాన్ని ఆపుకోవడం వల్ల జీర్ణమండలంపైనా, మెదడుపైనా చాలా చెడుప్రభావాలు పడతాయి.

17. పారిశుధ్యాన్ని, పరిశుభ్రతను పాటించాలి. దివ్య ఖుర్‌ఆన్‌లో ఉంది- 'పరిశుద్ధంగా ఉండేవారిని అల్లాహ్ ప్రేమిస్తాడు.' (తౌబా)

ప్రవక్త(సఅసం) ఇలా ప్రవచించారు : "పరిశుభ్రత పరిశుద్ధతలు విశ్వాసంలో సగభాగం"

పరిశుద్ధత, పరిశుభ్రతల ఈ ప్రాముఖ్యానికి తగిన విధంగానే ప్రవక్త (సఅసం) పరిశుద్ధత విషయంలో ఎంతో విపులమయిన ఆదేశాలు ఇచ్చారు. ప్రతి విషయంలో పరిశుభ్రతను, పరిశుద్ధతను పాటించాలని నొక్కిచెప్పారు.

తినే, త్రాగే వస్తువులపైన మూతలు పెట్టి ఉంచాలి. అవి అపరిశుభ్రం కాకుండా చూడాలి. పాత్రలను శుభ్రంగా కడుక్కోవాలి. వస్త్రాలను, కూర్చునే, పడుకునే పరుపులను పరిశుభ్రంగా ఉంచుకోవడమేగాక పనిచేసే, నివసించే ప్రదేశాలను, పరిసర ప్రాంతాలను కూడా సదా శుభ్రంగా ఉంచుకోవాలి. శరీర పరిశుభ్రత కొరకు వుజూ స్నానాలు చేయటాన్ని పాటించాలి. శరీరం, బట్టలు, వాడుకునే వస్తువులు అన్నీ పరిశుభ్రంగా ఉంటే ఆత్మకు ఆహ్లాదం, ఆనందం. శరీరానికి ఉత్సాహం ఉల్లాసం కలుగుతాయి. అప్పుడే మానవుని దేహారోగ్యంపై శుభప్రదమయిన ప్రభావం పడుతుంది. హజ్రత్ అదీ బిన్ హాతిం(ర.అ) ఇలా ఉల్లేఖించారు:

"నేను ఇస్లామ్ స్వీకరించిన నాటినుండి ప్రతి నమాజ్ కొరకు వేరుగా వుజూ చేస్తూ ఉంటాను."

ఒకసారి హజ్రత్ బిలాల్(ర.అ)ని ప్రవక్త మహనీయులు(సఅసం)అడిగారు. "నీవు నాకంటే ముందే స్వర్గంలోకి ఎలా ప్రవేశించగలిగావు?" దానికి ఆయన (ర.అ) ఇలా పలికారు : "దైవప్రవక్తా, నేను అజాన్ పలికినప్పుడల్లా రెండు రకతుల నమాజ్ తప్పనిసరిగా చేస్తాను. వుజూ భంగమయినప్పుడల్లా వెంటనే నేను కొత్తగా వుజూ చేసుకుంటాను. సదా వుజూస్థితిలో ఉండటానికి ప్రయత్నిస్తాను".

హజ్రత్ అబూ హురైరా(ర.అ), ప్రవక్త(సఅసం) ఇలా అన్నారని వివరించారు : "వారంలో ఒక దినమయినా తలంటుస్నానం చెయ్యాలి. శరీరం పరిశుభ్రంగా ఉంచుకోవాలి. ఇది ప్రతి ముస్లిమ్‌కూ అల్లాహ్ విధించిన బాధ్యత."(బుఖారి)

వీలుంటే ప్రతిదినం స్నానం చేయటం శ్రేయస్కరం.

# 3. దుస్తులలో వ్యక్తిత్వం

1. సభ్యత, సౌశీల్యం, సంస్కారం, ఆత్మాభిమానాలు ఉట్టిపడే దుస్తుల్ని శరీరాన్ని కప్పిపెట్టే, కాపాడే వస్త్రాలను నాగరికత, సదాచారం, అందం, అలంకారాలను వ్యక్తంచేసే విధంగా ధరించండి.

దివ్య ఖుర్‌ఆన్‌లో ఈ గొప్ప కానుకను ఇలా ప్రస్తావించటం జరిగింది : "ఆదం సంతానమా ! మేము మీ కొరకు వస్త్రాలను పంపాము. అవి మీ మర్మావయవాలను మరుగు పరుస్తాయి. మీకు శరీర అలంకరణ, రక్షణలు కూడా వాటిద్వారా లభిస్తాయి." (అల్ ఆరాఫ్)

వస్త్రాలు మనిషి అందం, అలంకరణకొరకు, వాతావరణ ప్రభావాలనుండి రక్షణ కొరకు ఉపకరిస్తాయి. కాని మర్మావయవాలను మరుగు పరచటం వాటిముఖ్యోద్దేశ్యం. సిగ్గు, బిడియాలు మనిషి ప్రకృతిలోనే సృజించబడ్డాయి. అందుచేతనే హజ్రత్ ఆదం (అ.స) హజ్రత్ హవ్వా (అ.స) స్వర్గంలోని దివ్య వస్త్రాలను కోల్పోగానే స్వర్గంలోని చెట్ల ఆకులతో తమ శరీరాలను కప్పుకున్నారు. కాబట్టి ఈ ఉద్దేశ్యాన్ని ప్రధానమైనదిగా భావించాలి. అవయవాలను కప్పివేసే వస్త్ర ధారణ చెయ్యాలి. దీనితో పాటు ఈ వస్త్రాలు వాతావరణ ప్రభావాన్నుండి కూడా శరీరాన్ని కాపాడే విధంగా ఉండాలి. అవి అందానికి, అలంకరణకు సంస్కారానికి దోహదపడేలా ఉండాలి. అంతేకాని మీరు ఏదో వింత బొమ్మగా, చూసేవారికి వినోద వస్తువుగా కనిపించే వస్త్రాలను ధరించరాదు.

2. దుస్తులు ధరించేటప్పుడు, అవి దైవం కేవలం మానవునికి మాత్రమే ప్రసాదించిన వరమనే భావన మనసులో మెదలాలి. ఇతర సృష్టికి ఇది ప్రసాదించ బడలేదు. ఈ ప్రత్యేక కానుకను అనుగ్రహించినందుకు అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపుకోవాలి. ఈ అసాధారణ బహుమానాన్ని పొంది ఎలాంటి పరిస్థితిలోనూ కృతఘ్నత, అవిధేయతలతో కూడిన పనులు చేయకూడదు. వస్త్రాలు దేవుని అత్యంత అద్భుతమయిన సృష్టి. దుస్తులు ధరించేటప్పుడు ఈ భావాన్ని సజీవంగా ఉంచుకోవాలి. కృతజ్ఞతా భావాలను మహాప్రవక్త(సఅసం) విశ్వాసులకు నేర్పిన దుఆ ద్వారా వ్యక్తపరచాలి.

3. తఖ్వా (ధర్మనిష్ఠ)తో కూడుకున్నదే ఉత్తమ వస్త్రధారణ. అంటే ఆంతర్యంలో పవిత్రత, బాహ్యంలో నిష్ఠాపరాయణత అని భావం. షరీఅత్ ప్రకారం, దైవభక్తుల వస్త్రధారణకు అర్థమేమంటే, వస్త్రాల ద్వారా అహంభావం, గర్వం వ్యక్తం కాకూడదు. వస్త్రధారణ స్త్రీలను పురుషులుగా చూపేది, పురుషులను స్త్రీలుగా కనబరచేదిగా ఉండకూడదు. చూడగానే ఈ వ్యక్తి దైవచింతన కలవాడు, సద్వర్తనుడనే భావం కలగాలి. స్త్రీలు షరీఅత్ ఏర్పరచిన హద్దులను పాటించాలి. అలాగే పురుషులు షరీఅత్ నియమించిన పరిధులను జవదాటరాదు.

4. కొత్త బట్టలు ధరించేటప్పుడు ఈ బట్టలను దైవం ప్రసాదించాడని ఆ బట్టల పేరు చెబుతూ సంతోషాన్ని వెలిబుచ్చాలి. కృతజ్ఞతాభావం నిండిన మనస్సుతో, కొత్తబట్టలు కట్టుకునే సమయంలో మహాప్రవక్త (సఅసం) చదివిన ఈ దుఆను పఠించాలి.

హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (ర) ఇలా ఉల్లేఖించారు : ప్రవక్త (స) ఏదైనా నూతన వస్త్రం, తలపాగా, చొక్కా లేక దుప్పటి ధరించేటప్పుడు దాని పేరు చెబుతూ ఇలా దుఆ చేసేవారు :

اَللّٰهُمَّ لَكَ الْحَمْدُ اَنْتَ كَسَوْتَنِيْهِ، اَسْئَلُكَ خَيْرَهٗ وَخَيْرَ مَاصُنِعَ

لَهٗ وَاَعُوْذُ بِكَ مِنْ شَرِّهٖ وَشَرِّ مَاصُنِعَ لَهٗ (ابوداود)

అల్లాహుమ్మ లకల్ హమ్దు అన్త కసౌతనీహి, అస్అలుక ఖైరహూ వ ఖైర మా సునిఅ లహూ, వ అఊజుబిక మిన్ షర్రిహి వ షర్రిమా సునిఅ లహూ.

"దేవా ! నాకు ఈ వస్త్రాన్ని ధరింపజేశావు. కృతజ్ఞుణ్ణి. దీని మేలునూ, దీని తయారీలోని మేలునూ వేడుకుంటున్నాను. దీని కీడునుండి, దీని తయారీ లోని కీడు నుండి నీ శరణు వేడుకుంటున్నాను." (అబూదావూద్)

దీనిభావం, దైవం ప్రసాదించిన వస్త్రాలను పవిత్ర లక్ష్యాల కొరకు వినియోగించే బుద్ధిని కలుగజేయమని అర్థించడం. దానికై కృషి జరగాలి. వాటిద్వారా దేహాన్ని కప్పుకునేందుకు, అశ్లీల విధానాలనుండి దూరంగా మెలగేందుకు షరిఅత్ పరిధిలో వుంటూ రక్షణలు పొందేందుకు ప్రయత్నించాలి. దుస్తుల ద్వారా తన పెద్దరికాన్ని చాటడానికి, అహంకారం, అహంభావం వెలిబుచ్చుటానికి షరీఅత్ పరిధుల్ని అతిక్రమించడానికి పాల్పడరాదు.

హజ్రత్ ఉమర్ (రజి), ప్రవక్త (సఅసం) ప్రవచనాన్ని ఇలా అందజేశారు.

"కొత్త బట్టలను తొడుక్కున్న వ్యక్తి, అవకాశముంటే తన పాత బట్టలు ఒక పేదవానికి దానంగా ఇచ్చివేయాలి. కొత్త బట్టలు తొడుక్కున్నప్పుడు ఈ దుఆ చదవాలి -

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِىْ كَسَانِىْ مَا اُوَارِىْ بِهٖ عَوْرَتِىْ وَاَتَجَمَّلُ بِهٖ فِىْ حَيَاتِىْ.

అల్ హమ్దు లిల్లాహి ల్లజీ కసానీ మా ఉవారీ బిహి ఔరతీ వ అతజమ్మలు బిహి ఫీహయాతీ.

'నాకు ఈ దుస్తులు ధరింపచేసిన అల్లాహ్‌కే సర్వస్తోత్రాలు. వీటితో నేను నా శరీరాన్ని కప్పుకుంటాను, ఇవి ఈ జీవితంలో నాకు అందాన్ని, అలంకారాన్ని ఇస్తాయి.'

ఏ వ్యక్తి అయితే కొత్త బట్టలు ధరించేవేళ ఈ ప్రార్థన చేస్తాడో దేవుడు అతన్ని ఈ జీవితంలోనూ, మరణానంతర జీవితంలోనూ తన రక్షణనిస్తాడు."

(తిర్మిజి)

5. బట్టలు తొడుక్కునేటప్పుడు కుడిప్రక్కను గుర్తుంచుకోవాలి. చొక్కా, షేర్వాని, కోటు మొదలుగునవి తొడుక్కునేటప్పుడు మొదట కుడిచేయి తొడగాలి - అలాగే పైజామా, ప్యాంటు మొదలైనవి తొడుక్కునేటప్పుడు కుడికాలుకు మొదట తొడుక్కోవాలి. ప్రవక్త (సఅసం) చొక్కా తొడుక్కునేటప్పుడు మొదట కుడిచేతికి, తరువాత ఎడమ చేతికి తొడుక్కునేవారు. అలాగే చెప్పులు తొడుక్కునేటప్పుడు మొదట కుడి కాలికి, తర్వాత ఎడమకాలికి తొడుక్కునేవారు. చెప్పులు తీసి వేసేటప్పుడు మొదట ఎడమకాలి చెప్పు తర్వాత కుడికాలి చెప్పు తీసేవారు.

6. బట్టలు ధరించేముందు వాటిని బాగా దులుపుకోవాలి. ఎందుకంటే వాటిలో ఏదైనా విషకీటకం ఉండవచ్చు. దానివల్ల ఏదైనా అపాయం కలగవచ్చు. ప్రవక్త (సఅసం) ఒకసారి ఒక అడవిలో తన మేజోళ్ళు తొడుక్కోడానికి ఉపక్రమించారు. మొదటి మేజోడు తొడిగారు. రెండవది తొడుక్కునే సమయంలో కాకి ఒకటి అకస్మాత్తుగా వచ్చి ఆ మేజోడు నోట కరచుకొని చాలా పైకి ఎగిరి తిరిగి క్రింద పడవేసింది. చాలా ఎత్తునుండి క్రింద పడటంచేత ఆ అదురుకు అందులోనుండి ఒక పాము ఎగిరిపడింది. అది చూచి మహాప్రవక్త (సఅసం) అల్లాహ్‌కు కృతజ్ఞతాభివందనాలు అర్పించుకున్నారు. తర్వాత ఇలా ఉద్బోధించారు. "మేజోళ్ళు తొడుక్కునే ముందు వాటిని దులుపుకోవడం ఎంతైనా అవసరం."

(తిబ్రాని)

7. తెల్ల బట్టలు ధరించడం శ్రేయస్కరం. పురుషులకు తెల్లని దుస్తులే బాగుంటాయి. ప్రవక్త(స) ఇలా అన్నారు : "తెల్లని బట్టలే తొడుక్కోవాలి. అవి ఉత్తమమయినవి. జీవితంలోనూ తెల్ల బట్టలే ధరించాలి, మరణించిన వారికి తెల్లబట్టలనే కఫన్ తొడిగి సమాధిచెయ్యాలి." (తిర్మిజీ)

మరో సందర్భంలో ఆయన ఇలా అన్నారు, "తెల్లని వస్త్రాలు ధరించండి, ఎందుకంటే తెల్లని వస్త్రమే శుభ్రంగాను, శుచిగాను ఉంటుంది. వాటినే మీ శవాలకు తొడిగి సమాధి చెయ్యండి." (తిర్మిజీ)

తెల్లబట్టలు శుభ్రంగా ఉంటాయంటే అర్థం, వాటిపైన ఏమాత్రం మురికి పడినా లేక మరక ఏర్పడినా వెంటనే తెలిసిపోతుంది. మనిషి వెంటనే ఉతికి శుభ్రం చేసుకోగలడు. అలాకాక రంగుల దుస్తుల్ని ధరిస్తే మురికి, మరకలు, స్పష్టంగా కనబడవు. వెంటనే శుభ్రం చేసుకునే ఆలోచన కలుగదు. ప్రవక్త (సఅసం) అధికంగా తెల్లని దుస్తుల్ని ధరించేవారు. తన అనుచర సమాజంలోని పురుషులను కూడా వాటిని తొడగాలని సిఫారసు చేశారు. (బుఖారి)

8. పైజామా ప్యాంట్లు వగైరా కాలి చీలమండకు పైకి వుండేట్టు కట్టుకోవాలి. ఎవరయితే అహంతో గర్వంతో తమ పైజామా, లుంగీ మొదలయిన వాటిని నేలకు రాసుకునేలా జారవిడుస్తారో మహాప్రవక్త(సఅసం) దృష్టిలో వారు దౌర్భాగ్యులు, కఠినమైన శిక్షకు అర్హులు. ప్రవక్త (సఅసం) ఇలా వివరించారు :

"తుది దినాన దేవుడు మూడు రకాల వ్యక్తులతో మాట్లాడడు. వారిని కన్నెత్తి కూడా చూడడు, వారిని పరిశుద్ధపరిచి స్వర్గానికి పంపించడు; అంతేకాదు వారికి అత్యంత భయంకరమైన శిక్ష విధిస్తాడు."

హజ్రత్ అబూజర్ గిఫారి (ర.అ) అడిగారు – "దైవ ప్రవక్తా ! ఎవరీ దౌర్భాగ్యులు?" అని. దీనికి ప్రవక్త (సఅసం) "ఎవరయితే అహంకారంతో గర్వంతో తమ వస్త్రాన్ని చీలమండ క్రిందికి వ్రేలాడేలా ధరిస్తారో వారు ;

"తాము చేసిన మేలును మాటిమాటికీ ఎత్తి పొడుస్తూ ఉండేవారు;

"ఎవరు అసత్యపు ప్రమాణాలతో తమ వ్యాపారాన్ని వృద్ధి చేసుకోవాలని ఆశిస్తారో వారు. ఇలాంటి వారే ఆ దౌర్భాగ్యులు." (ముస్లిమ్)

హజ్రత్ ఉబైద్ ఇబ్నె ఖాలిద్(ర.అ) ఒక సంఘటనను వివరించారు :

"నేను ఒకసారి మదీనాకు వెళుతుండగా వెనుకనుండి ఎవరో ఇలా అన్నారు, లుంగీని పైకి జరపండి, అలా జేయడంవల్ల మనిషి బాహ్య మలినాలనుండి, ఆంతర్యంలోని అపరిశుద్ధతనుండి దూరంగా ఉంటాడు." వెనక్కి తిరిగి చూచాను. మహాప్రవక్త(సఅసం) అన్నమాటలివి. నేను, దైవప్రవక్తా! ఇది ఒక సాధారణమైన

దుప్పటి, ఇందులో అహం, గర్వం, ఏముంటుంది? అని అడిగాను. అప్పుడు ప్రవక్త(సఅసం), "నీవు నన్ను అనుసరించడం అవసరంకాదా?" అని ప్రశ్నించారు. ప్రవక్త(సఅసం) పలుకులు వినగానే నా దృష్టి ఆయన లుంగీపై బడింది. ఆయన లుంగీ మోకాలి కింద పిక్కలవరకే ఉండటం గమనించాను."

ప్యాంటు, పై జామా మొదలయినవి మడిమల పైకి ఉన్నట్లయితే మనిషి బాహ్యంలోనూ, ఆంతర్యంలోనూ పరిశుద్ధంగా ఉంటాడన్న మహాప్రవక్త ప్రవచనం భావగర్భితమయినది. వస్త్రం క్రిందికి వ్రేలాడితే దారిలోని మట్టి మలినాలు అంటి బట్టలు ఖరాబవుతాయి. ఇది ఎంతో అసహ్యకరమయిన విషయం. ఇకపోతే అంతర్ మలినం అన్నది వ్రేలాడే బట్టలు తొడిగేవాని మనస్తత్వం ద్వారా వ్యక్తమవుతుంది. ఈ కోవకు చెందిన వస్త్రధారణ అహంకారాన్ని, గర్వాన్ని చాటుతుంది. ఇవి మలిన గుణాలు అనడంలో సందేహం లేదు. ఈ ఆదేశానికి పైన పేర్కొన్న మర్మ హేతువులు లేకపోయినా "మహాప్రవక్త జీవితంలో మీ కొరకు గొప్ప ఆదర్శం ఉంది" (దివ్య ఖుర్‌ఆన్) అన్న దైవ సూచన చాలు, మనం మహాప్రవక్తను అనుసరించడానికి !

అబూ దావూద్ హదీసుల సంకలనంలో ఈ దుర్గుణానికి అతి భయంకరమైన శిక్ష సూచించబడింది. ఆయన (సఅసం) ఇలా అన్నారు - "మోమిన్ తొడిగిన లుంగీ (వస్త్రం) సగం పిక్కల వరకు ఉండాలి. లేదా చీలమండ పై వరకు ఉన్నా అభ్యంతరం లేదు. కాని చీలమండల క్రిందికి వ్రేలాడే భాగం నరకాగ్నిలో కాలుతుంది. ఏ వ్యక్తి గర్వంతో, అహంభావంతో వస్త్రాన్ని వ్రేలాడేలా ధరిస్తాడో తుది దినాన ఆ వ్యక్తి వైపు అల్లాహ్ కన్నెత్తిఅయినా చూడడు."

9. పురుషులు పట్టు వస్త్రాలు ధరించరాదు. అవి కేవలం మహిళలకే ప్రత్యేకించబడ్డాయి. ప్రవక్త(సఅసం) మహిళలు ధరించే వస్త్రాల్లాంటివి ధరించడం, వారివలె రూపు రేఖలు దిద్దుకోవడాన్ని అతి కఠినంగా వారించారు. ప్రవక్త (సఅసం) ప్రవచనాన్ని హజ్రత్ ఉమర్ (ర) ఇలా ఉల్లేఖించారుః

"పురుషులు పట్టు వస్త్రాలను ధరించకూడదు. ఎవరైతే ఈ లోకంలో పట్టు ధరిస్తారో వారు దాన్ని పరలోకంలో ధరించలేరు." (బుఖారి, ముస్లిమ్)

ఒకసారి ప్రవక్త (సఅసం) హజ్రత్ అలీ (ర.అ) తో అన్నారుః "ఈ పట్టు వస్త్రాలను * చింపివేసి, వీటిని ఓణీలుగాచేసి ఫాతిమాలకు పంచిపెట్టు." ** (ముస్లిమ్)

---

* ఈ పట్టు వస్త్రాన్ని దోమా దేశ పాలకుడయిన "ఉకేదర్" మహాప్రవక్త (సఅసం)కు కానుకగా పంపించాడు.

** ఫాతిమాలు అంటే గౌరవనీయులైన ముగ్గురు మహిళలు (1) ఫాతిమా జహరా

దీనివల్ల మహిళలు పట్టు వస్త్రాలు ధరించడం ఇష్టకరమైన విషయమని తెలుస్తోంది. అందుకే మహాప్రవక్త (సఅసం) మహిళలకోసం ఓణీలు చేయమని ఆదేశించారు.

10. స్త్రీలు దేహం కానవచ్చేలా పల్చటి బట్టలు ధరించరాదు. శరీర వంపు సొంపులు ఆకర్షవంతంగా బహిర్గతమయ్యేలా బిగుతు దుస్తులు ధరించరాదు. అలా జరిగితే వారు దుస్తులు ధరించీ దిగంబరులుగా అగుబడుతారు. ఇలాంటి లజ్జా విహీనులయిన వారు పరలోకాన అతిఘోరమయిన శిక్షకు పాత్రులవుతారని మహాప్రవక్త (సఅసం) హెచ్చరించారు.

"ఏ స్త్రీలయితే దుస్తులు ధరించీ నగ్నంగా కానవస్తారో, ఈ విధంగా ఇతరుల్ని ఆకర్షిస్తారో, ఇతరుల చేత తామూ ఆకర్షింపబడతారో వీరి తలలు గర్వంగా నడిచే ఒంటెల మూపురాల్లాగా వంకరయినవి. వీరు స్వర్గంలో ప్రవేశించలేరు. స్వర్గపు సువాసనలయినా ఆఘ్రాణించలేరు. యధార్థమేమంటే స్వర్గపు సువాసనలు బహుదూరం వరకు వస్తూంటాయి." (రియాజుస్సాలిహీన్)

ఒకసారి హజ్రత్ అస్మా (ర.అ) పల్చని దుస్తులు ధరించి మహాప్రవక్త (స) ఎదుటికి వచ్చారు. ఆమె రాగానే ఆయన ముఖం తిప్పుకొని ఇలా అన్నారు:

"అస్మా ! స్త్రీ యవ్వనవతి అయిన పిదప ఆమె ముఖం, చేతులు తప్ప శరీరంలోని ఏ భాగమూ కనబడటం ధర్మసమ్మతం కాదు."

11. లుంగీ లేక పైజామా ధరించి కూర్చునేటప్పుడు లేదా పడుకునేటప్పుడు దేహం బయల్పడకుండా జాగ్రత్తవహించాలి. ఇది మహాప్రవక్త (సఅసం) ప్రబోధం:

"ఒక్క పాదరక్షనే వేసుకు తిరగకండి. లుంగీ ధరించినప్పుడు ఒక్క మోకాలిపై కూర్చోకండి. ఎడం చేతితో తినకండి. పై దుప్పటిని (పనిపాట్లు చేసుకునేటప్పుడు) చేతులు బయటికి రాకుండేలా చుట్టుకోకండి. వెల్లికిలా పడుకొని కాలిపై కాలు మోపకండి." (ఇలా పడుకుంటే మర్మావయవాలు అగుపడే ప్రమాదముంది కాబట్టి).

12. వస్త్ర ధారణలో స్త్రీ, పురుషులు ఒకరినొకరు అనుకరించరాదు. మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు, "స్త్రీలాంటి వేషధారణ చేసే పురుషులను పురుషుల్లాంటి వేషధారణ చేసే స్త్రీలను దైవం శపించాడు." (బుఖారీ)

---

(ర.అ) ప్రవక్త (సఅసం) ముద్దుబిడ్డ. హజ్రత్ అలీ (ర.అ) అర్థాంగి. (2) హజ్రత్ అలి మాతృమూర్తి – ఫాతిమా బిన్తె అసద్. (3) ఫాతిమా బిన్తె హమ్జా (ర.అ) హజ్రత్ అమీర్ హమ్జా (ర.అ) మహాప్రవక్త (సఅసం) బాబాయి కూతురు.

హ|జత్ అబూ హురైరా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం "స్త్రీల వస్త్రాలు ధరించే పురుషులనూ, పురుషుల వస్త్రాలు ధరించే స్త్రీలనూ మహాప్రవక్త (సఅసం) శపించారు." (అబూదావూద్)

ఒకసారి హ|జత్ ఆయిషా (ర.అ)కు ఎవరో చెప్పారు, "ఒకామె పురుషుల్లాంటి పాదరక్షలు ధరిస్తుంది" అని. దానికి హ|జత్ ఆయిషా (ర.అ), "పురుషులవ్వాలని ప్రయత్నించే స్త్రీలపై మహాప్రవక్త (సఅసం) అభిశాపముంది" అని చెప్పారు.

13. మహిళలు ఓణీ వేసుకోవడం అలవరచుకోవాలి. దానిని తలపైన రొమ్ముపైన కప్పుకోవాలి. తల వెంట్రుకలు కనపడేలా పలుచని బట్టను ఓణీగా ఉపయోగించరాదు. బాహ్య అలంకారాన్ని చాటుపరచడమే ఓణీ ఉద్దేశ్యం - పవిత్ర ఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా బోధించాడు. "మీ రొమ్ములను మీ పైటలతో కప్పుకోండి." (అన్-నూర్-3)

ఒకసారి ప్రవక్త (సఅసం) వద్దకు ఈజిప్ట్‌లో తయారయిన పలుచని మల్లుబట్ట వచ్చింది. ఆయన దానిలో కొంతభాగం చింపి దిహియ కల్బీకి ఇచ్చి "దీంట్లో సగభాగంలో నీవు చొక్కా కుట్టించుకో, మిగిలిన సగ భాగం మేలిముసుగు వేసుకోవడానికి నీ భార్యకు ఇవ్వు. కానీ శరీర ఆకారం లోపలినుండి కనబడకుండా దానితో పాటు మరోగుడ్డ (లైనింగ్) వేయమని చెప్పు." (అబూదావూద్)

దైవగ్రంథం, ప్రవక్త (సఅసం) సంప్రదాయం ద్వారా అందిన స్పష్టమయిన ప్రబోధాల దృష్ట్యా దైవాజ్ఞ ఉద్దేశాన్ని నెరవేర్చండి. అంతేకాని, జానెడు గుడ్డను మెడలో వేసుకొని అల్లాహ్, ఆయన ప్రవక్త (సఅసం) ఆజ్ఞల్ని అపహాస్యంపాలు చేయకండి.

హ|జత్ ఆయిషా ప్రకారం పై దైవాజ్ఞ ప్రకటించబడిన వెంటనే స్త్రీలు పలుచని వస్త్రాలను వదిలివేసి దళసరి బట్టలను ఓణీలుగా చేసుకున్నారు. (అబూదావూద్)

14. వస్త్రాలు ఎల్లప్పుడు తమ స్థితిగతుల ప్రకారంగా ధరించాలి. అహంకారం, ప్రదర్శనా బుద్ధీ ఇతరుల్ని అల్పులని తలుస్తున్న భావన ఉట్టిపడే, తమ శ్రీమంతం, దర్పం అగుపడే వస్త్రాలు ధరించరాదు. మీ తాహతుకు మించిన బట్టలు ధరించి, దుబారా ఖర్చులు చేసిన అపరాధం కట్టుకోకండి. అలా అని అతి హీనంగా పేదరికం దర్శనమిచ్చేలా కానరారాదు - అన్ని ఉండికూడా ఏమీ లేనట్లుగా కనబడరాదు. కాబట్టి ఎల్లప్పుడు తమ శక్తికి తగినట్టు సంస్కారవంతమైన శుభ్రమైన దుస్తులు ధరించాలి.

కొందరు చిరిగిన, మాసికలువేసిన గుడ్డలు తొడుక్కొని దైన్యస్థితిని ప్రదర్శిస్తూ దానిని ధార్మిక జీవన విధానం అని భావిస్తారు. పరిశుభ్రమైన మంచి వస్త్రాలను ధరించేవారిని లౌకిక దృక్పథం కలవారని భావిస్తారు. ధార్మిక జీవనపు ఈ భావన పూర్తిగ తప్పు ఆలోచన, హజ్రత్ అబుల్ హసన్ అలీషాజ్లీ (రహ్) ఒకసారి అత్యంత విలువైన దుస్తులు ధరించారు. దైన్యస్థితిలోనున్న ఒక సూఫీ తాత్వికుడు, "దైవభక్తులు ఇంత విలువైన వస్త్రాలు ధరించే అవసరమేమిటి?" అని అభ్యంతరం వెలిబుచ్చారు. అందుకు షాజ్లీ(రహ్) ఇలా జవాబిచ్చారుః "ఈ హుందాతనం, మహోన్నతుడు, సకల ఘనతలకు గొప్పతనాలకు అర్హుడయిన అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపుకోవడానికే, ఆయన స్తోత్రం కొనియాడటానికే. పోతే, నీ దీనావస్థ అర్థింపుకు మారురూపం. నీవు ఈ వేషంలో వాస్తవానికి ప్రజలవద్ద అర్థిస్తున్నావు."

అసలు యధార్థమేమంటే ధార్మిక జీవితం, చినిగిపోయి మాసికలతో నిండి, జీర్ణించిపోయిన గుడ్డలు వేసుకోవడంపైనగాని, లేక అతి విలువైన ఆడంబరమైన వస్త్రాలు ధరించడంపైనగాని ఆధారపడిలేదు. ధార్మిక జీవనం మనిషి చిత్తశుద్ధి, సంకల్పనిరతి, సవ్యమయిన ఆలోచనలపై ఆధారపడి ఉంటుంది. మనిషి తన స్తోమతను స్థితినిబట్టి మధ్యేమార్గాన్ని అనుసరించాలి. దీనాతి దీనమైన బ్రతుకు వెళ్ళబుచ్చుతూ ఆంతర్యంలో ధార్మిక అహంభావానికి వీలు కల్పించకూడదు. అలాగే వైభవాన్ని ప్రదర్శించే వస్త్రాలు ధరించి అహంకారాన్నీ, గర్వాన్నీ, దర్పాన్నీ కనబరచరాదు.

హజ్రత్ అబుల్ అహవస్ (రహ్) తండ్రి తనకు సంబంధించిన ఒక సంఘటన తెలిపారుః నేనొకసారి ప్రవక్త(సఅసం) వద్దకు వెళ్ళాను. అప్పుడు నా ఒంటిమీద అతి సామాన్యమైన ముతక బట్టలు ఉన్నాయి. "నీ వద్ద ఏమైనా ధన సంపత్తి ఉందా?" అని ప్రవక్త(సఅసం) అడిగారు. నేను ఉన్నదని అన్నాను. దానికి ఆయన ఎటువంటి సంపత్తి ఉంది? అని ప్రశ్నించారు. "దేవుడు నాకు సకల విధాల సంపత్తి ప్రసాదించాడు. ఒంటెలు, ఆవులు, మేకలు, గుర్రాలు, బానిసలు అన్నీ ఉన్నాయి" అని నేను జవాబు ఇచ్చాను. అప్పుడు మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు. "దైవం నీకు ధన సంపత్తి ప్రసాదించినప్పుడు ఆయన అనుగ్రహం, కరుణాకటాక్షాల ప్రభావం నీ శరీరంపైన కనబడాలి." (మిష్కాత్)

అర్థమేమిటంటే దేవుడు నీకు అన్నీ ఇచ్చినప్పుడు ఏమీ లేనివానివలె ఫకీర్లవలె ఎందుకు వేషాలు వేస్తావు. ఇలా చెయ్యడం దైవ కృతఘ్నత కదా !

హ్రజత్ జాబిర్(రజి) ఉల్లేఖించారు : ఒకసారి ప్రవక్త(సఅసం) మమ్మల్ని కలుసుకునే నిమిత్తం మా ఇంటికి వచ్చారు. అక్కడ ఒక వ్యక్తి ధూళి దుమ్ము నిండి అపరిశుభ్రంగా ఉన్నాడు. అతని వెంట్రుకలు చిందర వందరగా సంస్కారరహితంగా ఉన్నాయి. అతన్ని చూచి మహాప్రవక్త(సఅసం) 'తల దువ్వుకోడానికి ఇతని వద్ద దువ్వెనలేదా' అని అడిగారు. అక్కడే మురికి గుడ్డలు తొడుక్కున్న ఇంకొక వ్యక్తిని చూసి 'బట్టలు ఉతుక్కోవటానికి ఇతని వద్ద ఏ పదార్థమూ(సబ్బులాంటిది) లేదా' అని అడిగారు. (మిష్కాత్)

ఒక వ్యక్తి ప్రవక్త (సఅసం) ని అడిగాడు. "ఓ అల్లాహ్ ప్రవక్తా ! నేను శ్రేష్ఠమయిన వస్త్రాలను ధరించాలని, నూనె రాసుకోవాలని, మంచి పాదరక్షలు తొడుక్కోవాలని కోరుకుంటున్నాను" అంటూ ఆ వ్యక్తి చాలా విషయాల్ని ప్రస్తావించాడు. తుదకు నా కమ్చి కూడా ఉత్తమమైనదయి ఉండాలని నా అభిలాష అన్నాడు. ప్రవక్త(సఅసం) అతని సంభాషణ విన్న తరువాత అన్నారు. "ఈ విషయాలన్నీ శ్లాఘనీయాలే. అల్లాహ ఈ పసందయిన అభిరుచిని మెచ్చుకుంటాడు కూడా." (ముస్తద్రక్, హాకిమ్)

హ్రజత్ అబ్దుల్లాహ ఇబ్నె ఉమర్ అన్నారు, నేను ప్రవక్త(సఅసం)ను ఇలా అడిగాను : "ఓ అల్లాహ ప్రవక్తా ! నేను శ్రేష్టమయిన, నాణ్యమైన బట్టలు ధరిస్తే అది గర్వం, అహంకారం అవుతుందా?" దానికి ప్రవక్త(సఅసం) ఇలా సెలవిచ్చారు, "కాదు, అది అందానికి సంబంధించిన విషయం. అల్లాహ ఇలా పరిశుభ్రంగా, అందంగా ఉండటాన్ని ఇష్టపడతాడు." (ఇబ్నుమాజ)

మహాప్రవక్త(సఅసం) ఇలా అన్నారని ఇబ్ను ఉమర్ చెప్పారు. "నమాజ్ చేసేటప్పుడు బట్టలు పూర్తిగా ధరించాలి. ఎందుకంటే చక్కగా అలంకరించు కొని హాజరుకావడానికి తగిన సన్నిధానం అల్లాహ్‌దే." (మిష్కాత్)

హ్రజత్ అబ్దుల్లాహ ఇబ్నె మస్ఊద్(రజి) మహాప్రవక్త(సఅసం) ప్రవచనాన్ని ఇలా ఉల్లేఖించారు. "ఎవరి హృదయంలో అణుమాత్రమైనా గర్వం ఉంటుందో ఆ వ్యక్తి స్వర్గ ప్రవేశం పొందలేడు. అక్కడున్న ఒక వ్యక్తి అడిగాడు, తన వస్త్రాలు నాణ్యమైనవిగా ఉండాలని ప్రతివ్యక్తి కోరుకుంటాడు. దానికి ప్రవక్త(సఅసం) ఇలా తెలిపారు : అల్లాహ స్వయంగా సుందరుడు, సౌందర్యాన్ని ఇష్టపడతాడు (అంటే మంచి వస్త్రధారణ గర్వం కాదు). సత్యాన్ని అలక్ష్యపరచడం ఇతరుల్ని అల్పులుగా, నీచులుగా తలపోయడమే అసలు అహంకారం. (ముస్లిమ్)

15. బట్టలు ధరించడంలోనూ సభ్యతను సంస్కారాన్ని పూర్తిగా పాటించాలి. చొక్కా గుండీలు విప్పుకొని తిరగడం, గుండీలు కిందా పైనా పెట్టుకోవడం, ప్యాంటు ఒక్క ప్రక్కన క్రిందికి మరో ప్రక్కన పైకి మడిచి కట్టుకోవటం, ఒకే చెప్పు తొడుక్కొని నిర్లక్ష్యంగా తిరగడం చింపిరి తలతో సంచరించడం ఇవన్నీ సభ్యతకు సంస్కారానికి బహుదూరమయిన నడవడికలు.

ఒకరోజు మహాప్రవక్త (సఅసం) మస్జిద్‌లో కూర్చొని ఉండగా ఒకవ్యక్తి అక్కడకు వచ్చాడు. అతని జుట్టు, గడ్డం చిందరవందరగా ఉన్నాయి. వెళ్ళి తల వెంట్రుకలు గడ్డం సరిచేసుకోమని, ప్రవక్త(సఅసం) సైగ చేశారు. అప్పుడా వ్యక్తి వెళ్ళి తన తలను గడ్డాన్ని సరిచేసుకొని వచ్చాడు. అప్పుడు ప్రవక్త(సఅసం) ఇలా అన్నారు, "భూతం మాదిరి అగుపించేలా వెంట్రుకల్ని చిందరవందరగా ఉంచుకోవడం కంటే ఇలా చక్కగా దువ్వుకొని అలంకరించుకోవటం బాగాలేదూ?" (మిష్కాత్)

"ఒక చెప్పు తొడుక్కొని నడవరాదు. రెండూ తొడుక్కోవాలి. లేదా రెండూ వదిలివేయాలి." అని మహాప్రవక్త బోధించినట్లు హజ్రత్ అబూ హురైరా తెలిపారు. (తిర్మిజీ) ఈ ప్రవచనం ఆధారంగానే ధర్మజ్ఞులు చొక్కా చేతుల్లో ఒక్కదాన్నే లేక ఒకే మేజోడును తొడుక్కోవడాన్ని నిషేధించారు.

16. ఎర్రని బట్టలు, కళ్ళు జిగేల్‌మనిపించే రంగుల బట్టలు, నగిషీ పనులతో మెరిసేబట్టలు నలుగురిలో ప్రదర్శనగా నిలబెట్టే బట్టలు, నల్లనివి, కాషాయ రంగువి తొడగడం పురుషులకు మంచిది కాదు. ఎర్రనివి, కళ్ళకు ఆకట్టుకునే రంగుల బట్టలు, నగిషీ బట్టలు నారీమణులకే తగు. వీరుకూడా హద్దులు మీరకుండా జాగ్రత్తపడాలి. ఇకపోతే ప్రదర్శనాబుద్ధిని సూచించే పొడుగైన జుబ్బాలు, నల్లనివి లేక కాశాయ రంగు దుస్తులు ధరించి ఇతరులకంటే తమ ప్రత్యేకతను, గొప్పతనాన్ని చాటుకోవడం కేవలం గర్వం అహంకారాలకు చిహ్నమే. అలాగే వింతయిన హాస్యాస్పదమయిన దుస్తులు కూడా ధరించరాదు. వాటివల్ల ఇతరుల అపహాస్యానికి, వేళాకోళానికి గురవుతారు.

17. ఎల్లప్పుడు సామాన్యమైనవే అయినా హుందాగల, సభ్యత కనబరచే వస్త్రాలు ధరించాలి - వస్త్రాలకై ఖర్చు చేసేటప్పుడు, మితిమీరకుండా ఖర్చుచేయాలి. దుస్తుల విషయంలో భోగలాలసత్వం అవసరానికి మించిన నాజూకుతనం చూపరాదు.

ప్రవక్త (సఅసం) ఇలా ప్రబోధించారు, "భోగలాలసత్వానికి దూరంగా ఉండండి. ఎందుకంటే దైవప్రేమకు పాత్రులైన దాసులు భోగలాలసులు కారు." (మిష్కాత్)

ఎవరయితే శక్తి, సంపత్తి ఉన్నప్పటికీ కేవలం వినయ వినమ్రతలవల్ల సాధారణ దుస్తులు ధరిస్తారో దైవం వారికి గౌరవ మర్యాదల, ఆదరాభిమానాల దుస్తులు అనుగ్రహిస్తాడు." (అబూదావూద్)

ఒకరోజు ప్రవక్త (సఅసం) అనుచరులు (ర) కూర్చొని ఏవో ప్రాపంచిక విషయాలు చర్చించుకుంటూ ఉండగా మహాప్రవక్త (సఅసం) వచ్చి ఇలా అన్నారు – దుస్తుల్లో నిరాడంబరత విశ్వాస చిహ్నాల్లో ఒకటి. (అబూదావూద్)

ఒకసారి మహాప్రవక్త (సఅసం) ఉపదేశించారు – "బాహ్యస్థితి ఎంతో సాధారణంగా ఉండే దైవదాసులు చాలామంది ఉన్నారు. వారి జుత్తుకు తైల సంస్కారం ఉండదు, ధూళితో నిండి ఉంటుంది, బట్టలు అతి సాధారణంగా ఉంటాయి. కాని దేవుని దృష్టిలో వారిస్థానం ఎంతో మహోన్నతంగా ఉంటుంది. వారు ఏ పనయినా చేయాలని ప్రమాణం చేస్తే దేవుడు ఆ ప్రమాణాన్ని నెరవేరుస్తాడు. అటువంటి.వారిలో బిరా బిన్ మాలిక్ (రజి) కూడా ఒకరు." (తిర్మిజి)

18. వంటినిండా గుడ్డలు లేని నిరుపేదలకు దుస్తులు దానం చేయాలి. ఇది దైవం ఇచ్చిన వరానికి కృతజ్ఞతా సూచకం. మహాప్రవక్త (సఅసం) ఉపదేశించారు, "ఏ వ్యక్తి ఒక విశ్వాసికి బట్టలు ప్రదానం చేసి అతని దేహానికి ఆచ్ఛాదన కల్పిస్తాడో అతనికి అల్లాహ్ ప్రళయదినాన స్వర్గలోకపు పచ్చబట్టలు ధరింపచేసి, సత్కరిస్తాడు." (అబూదావూద్)

మహాప్రవక్త (సఅసం) మరోసారి ఇలా బోధించారు : "ఒక విశ్వాసి తన మరో సోదరునికి బట్టలు తొడిగిస్తే ఆ దుస్తులు అతని శరీరంపై ఉన్నంతకాలం తొడిగించిన వ్యక్తిని దైవం తన సంరక్షణలో ఉంచి కాపాడుతుంటాడు." (తిర్మిజి)

19. రేయింబవళ్ళు మీ సేవచేసే నౌకర్లకు కూడా మీ తాహతుకు తగినట్లు బట్టలు పెట్టండి. మహాప్రవక్త (సఅసం) ప్రబోధించారు : "మీసేవకులు (బానిసలు, నౌకర్లు) కూడా మీ సోదరులే. దేవుడు వారిని మీ ఆధీనంలో అప్పగించాడు. కనుక మీలో ఏవరి ఆధీనంలోనయితే వారిని దైవం అప్పగించాడో వారు తాము తినేది వారికి తినిపించాలి. తాము తొడిగేది వారికి తొడిగించాలి. వారు చెయ్యగలిగినంతపనే వారిచేత చేయించాలి. వారు ఆ పనిని చెయ్యలేకపోతే తాము కూడా వారికి తోడ్పడాలి. (బుఖారి, ముస్లిమ్)

# 4. అన్నపానీయాలు–సంతృప్తికి చిహ్నాలు

1. భోజనానికి ముందు చేతులు శుభ్రంగా కడుక్కోవాలి. పారిశుధ్యం, పరిశుభ్రతలు కోరేదేమిటంటే భోజనంలో వేసే చేతుల విషయంలో మనిషికి సంతృప్తి కలగాలి.

2. **బిస్మిల్లాహ్ హిర్రహ్మా నిర్రహీమ్** (కరుణామయుడు, దయాసాగరుడయిన అల్లాహ్ నామంతో ప్రారంభిస్తున్నాను) అని భోజనానికి ఉపక్రమించాలి. ఒకవేళ అలా అనడం మరిచిపోయినట్లైతే గుర్తుకొచ్చిన తరువాత "బిస్మిల్లాహి అవ్వలహు వ ఆఖిరహు" అనాలి. భోంచేసేటప్పుడు దేవుని నామం స్మరించకపోతే అది షైతాన్ పరమైపోతుంది.

3. భోంచేసేటప్పుడు దేనికీ ఆనుకొని కూర్చోకూడదు. ఎంతో వినయంతో కూర్చోవాలి. మోకాళ్ళెత్తి, కాళ్ళపైనైనా కూర్చోవాలి, లేక ఒక మోకాలు పరచి లేక రెండు మోకాళ్ళు పరచి కూర్చోవాలి. దైవప్రవక్త (సఅసం) అలాగే కూర్చొనేవారు.

4. ఎల్లప్పుడు కుడి చేత్తోనే తినాలి. గత్యంతరం లేకపోతే ఎడమ చేతిని ఉపయోగించవచ్చు.

5. మూడు వేళ్ళతో తినాలి. అవసరమైతే చిటికెన వ్రేలు వదిలివేసి నాలుగు వ్రేళ్ళతో భోంచేయవచ్చు. పూర్తి వ్రేళ్ళకు అన్నం అంటుకోకుండా జాగ్రత్తపడండి.

6. మరీ పెద్ద ముద్ద లేక చిన్న ముద్దలు చేసి తినరాదు. ఒక ముద్ద బాగా నమిలి మ్రింగిన తరువాతనే రెండవ ముద్ద నోట్లో పెట్టుకోవాలి.

7. రొట్టెతో వ్రేళ్ళను తుడవటం మంచి అలవాటు కాదు.

8. రొట్టెల్ని దులపటం, వాటిని దస్తర్ లేక టేబుల్‌కేసి కొట్టడం తప్పు.

9. పళ్ళెంలో తన ముందు వైపునుండి తినడం సరయిన పద్ధతి. మధ్యనుండిగాని లేక, ఇంకొక వైపునుండి తినడం సరికాదు.

10. రొట్టెముక్క క్రింద పడినట్లైతే దాన్ని శుభ్రం చేసి లేక కడిగి తినాలి.

11. భోజనం అందరూ కలిసి తినాలి. అలా తినడం వల్ల ప్రేమ, అనురాగాలు కలగడమేకాక తృప్తి, దైవం ప్రసాదించే శుభం కలుగుతాయి.

12. భోజనానికి వంకలు పెట్టరాదు. ఇష్టంలేకపోతే వదలి వేయండి.

13. వేడి వేడి పొగలు గ్రక్కే అన్నం భుజించరాదు.

14. భోజనం చేసేటప్పుడు అసభ్యకరంగా నవ్వటం, అధికంగా మాట్లాడ్డం

మానుకోవాలి.

15. అనవసరంగా భోజన పదార్థాలను వాసన చూడకండి. ఇది చెడ్డ అలవాటు. భోజన సమయంలో నములుతూ అన్నం కనబడేలా మాటిమాటికి నోరు తెరువకండి. నోట్లో వేళ్ళుపెట్టి పల్లల్లో ఇరుక్కున్న దాన్ని తీసే ప్రయత్నం చెయ్యకూడదు. అలా చేయడం వల్ల ఇతరులకు ఏవగింపు కలుగుతుంది.

16. కూర్చొనే భోజనం చేయాలి. నీళ్ళు కూడా కూర్చునే త్రాగాలి. అవసరమైతే పళ్ళూ ఫలాలు నిల్చుని తినవచ్చు. నీళ్ళు కూడా త్రాగవచ్చు.

17. పళ్ళెంలో మిగిలిపోయిన పదార్థం పల్చగా ఉంటే త్రాగి వేయాలి. అలా చేయకపోతే వ్రేళ్ళతో పళ్ళాన్ని శుభ్రం చేయాలి.

18. తినే పదార్థాలపై ఊదరాదు, ఎందుకంటే లోపలినుండి వచ్చేగాలి అపరిశుభ్రమయినది, అనారోగ్యకరమయింది.

19. నీళ్ళు ఒకేసారి త్రాగకుండా మూడు మార్లు ఆగి శ్వాస తీసుకుంటూ మెల్లిమెల్లిగా త్రాగాలి. అందువల్ల అవసరమైనంత నీళ్ళు త్రాగే వీలవుతుంది. దాహంకూడా తీరుతుంది. ఒకేసారి పాత్రలోని నీళ్ళను గడగడ త్రాగడం వల్ల అప్పుడప్పుడు ఏదయినా బాధ కలుగవచ్చు.

20. సమిష్టిగా భోజనం చేస్తున్నప్పుడు ఆలస్యంగా, మెల్లిగా తినేవారిని గమనించి అందరితో పాటు తినాలి.

21. భోజనం పూర్తయిన తరువాత వేళ్ళను బాగా శుభ్రం చేసుకోవాలి. తరువాత చేతులు కడుక్కోవాలి. అందరితో పాటే లేవాలి.

22. పళ్ళు ఫలాలు తినేటప్పుడు ఒకేసారి రెండేసి పళ్ళనుగాని, లేదా రెండు మూడు ముక్కలు గాని తీసుకోవడం అసభ్యంగా ఉంటుంది.

23. తొండం చెంబుతోగాని కూజాతోగాని లేక అటువంటి ఇంకేదైనా పాత్రతోగాని నీళ్ళుత్రాగరాదు. నీళ్ళు స్పష్టంగా కనబడే పాత్రలో త్రాగాలి. లేకపోతే ఏదయినా అపరిశుభ్రమయిన లేక అపాయకరమైన పదార్థం కడుపులోకి పోయే ఆస్కారం ఉంది.

24. భోంచేసిన తరువాత ఈ దుఆ పఠించాలి :

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِىْ اَطْعَمَنَا وَسَقَانَا وَجَعَلَنَا مِنَ الْمُسْلِمِيْنَ

"అల్ హమ్దులిల్లాహిల్లజీ అత్ అమనా వ సఖానా వ జఅలనా మినల్ ముస్లిమీన్."

"మనకు తినిపించినవాడు, తాగించినవాడు, విశ్వాసులుగా పుట్టించిన ఆ దైవానికే సర్వస్తోత్రాలు."

# 5. నిద్ర – మేల్కొలుపు

1. సంధ్యవేళ ప్రారంభంకాగానే పిల్లల్ని ఇంటిలోనికి రప్పించుకోండి. బయట ఆడుకోనివ్వకండి. అయితే కాస్త చీకటి పడ్డాక బయటికెళ్ళే అనతి ఇవ్వవచ్చు. తప్పనిసరి అయితే తప్ప పిల్లవాళ్లను బయటికి పోనివ్వరాదు. మహాప్రవక్త (సఅసం) ఆదేశం వినండి :

"సాయంత్రం కాగానే పిల్లల్ని ఇండ్లలోనుండి పంపకండి. ఎందుకంటే ఆ సమయాన షైతానులు భువిలో నలువైపులా వ్యాపించిపోతారు. అయితే కాస్త చీకటిపడ్డ తరువాత పిల్లల్ని వదలవచ్చు." (సిహాసిత్తా – హిస్నె హసీన్)

2. సాయం సమయాన ఈ దుఆ పఠించాలి. మహాప్రవక్త (సఅసం) తన సహచరులకు ఈ దుఆ నేర్పారు :

اَللّٰھُمَّ بِکَ اَمْسَیْنَا وَبِكَ اَصْبَحْنَا وَبِكَ نَحْيَا وَبِكَ نَمُوْتُ وَاِلَيْكَ النُّشُوْرُ (ترمذی)

"అల్లాహుమ్మ బికఅమ్‌సైనా వ బిక అస్‌బహ్నా వ బిక నహ్యా వ బిక నమూతు వయిలైకన్నుషూర్." (తిర్మిజీ)

"ప్రభూ ! నీ సహకారంతోనే సాయంత్రానికి చేరాము, నీ సహాయంతోనే ప్రాతఃకాలానికి చేరాము, నీ దయతోనే జీవిస్తున్నాము, నీ అనుజ్ఞ అయితేనే మరణిస్తాము, చివరికి నీ వద్దకే హాజరవుతాము."

మగ్‌రిబ్ అజాన్ (నమాజు పిలుపు) విని ప్రత్యేకంగా ఈ దుఆ కూడా పఠించాలి.

اَللّٰھُمَّ ھٰذَا اِقْبَالُ لَیْلِكَ وَاِدْبَارُ نَھَارِكَ وَاَصْوَاتُ دُعَاتِكَ فَاغْفِرْلِیْ (ترمذی، ابوداؤد)

"అల్లాహుమ్మ హాజా ఇక్బాలు లైలికవ ఇద్బారు నహారికవ అస్వాతు దుఆతిక ఫగ్‌ఫిర్‌లీ." (తిర్మిజీ, అబూదావూద్)

"దేవా ! ఇది నీ రాత్రి ఆసన్నమయ్యే సమయం. నీ పగలు పోయేకాలం. నిన్ను పిలిచేవారి (ముఅజ్జిన్ల) ధ్వనులు వినిపించే సమయం. నాకు మోక్షం ప్రసాదించు."

3. ఇషా నమాజ్ చెయ్యనిదే పడుకోవడాన్ని మానుకోండి. లేకపోతే ఇషా నమాజ్ తప్పిపోయే ప్రమాదానికి గురి అవుతారు. నిద్రనుండి తిరిగి మేల్కొంటామో లేక స్వామి తన దాసుణ్ణి అటే పిలిపించుకుంటాడో ఎవరికి తెలుసు. మహాప్రవక్త ఇషా ప్రార్థనకు ముందు పడుకునేవారు కాదు.

4. రాత్రి అవగానే ఇంటిలో దీపం వెలిగించుకోండి. వెలుగుకోసం ఏర్పాటు లేని ఇంట్లో పడుకోవడాన్ని మహాప్రవక్త (స) ఒప్పుకునేవారుకారు.

5. చాలా రాత్రివరకు మేల్కొని ఉండరాదు. రాత్రి త్వరగా నిద్రించి పెందలకడనే మేల్కొనే అలవాటు చేసుకోవాలి, ప్రవక్త(సఅసం) ఇలా ప్రవచించారు- "ఇషా నమాజ్ తర్వాత అల్లాహ్‌ను స్మరించటానికి లేక ఇంటివారితో అత్యవసరంగా మాట్లాడటానికి తప్ప మేల్కొనరాదు."

6. రాత్రి మేల్కొని పగలు నిద్రించే అలవాటు విడనాడాలి. దేవుడు రాత్రిని సౌఖ్యం, విశ్రాంతులకై సృష్టించాడు. తిరిగి నిద్రనుండి మేల్కొని అవసరాలు తీర్చుకోవడానికి కృషి చేసే నిమిత్తం పగలును యేర్పాటు చేశాడు.

అల్ ఫుర్‌ఖాన్ (47) సూరాలో ఉంది, "ఆ దైవమే మీ కొరకు రాత్రిని తెరగా, నిద్రను విశ్రాంతి సౌఖ్యాల కొరకు, పగలును, లేచి పనిపాట్లలో నిమగ్నులవడానికిగాను నియమించాడు."

అన్ నబా సూరాలో "మీ కొరకు నిద్రను సుఖాన్నిచ్చేదిగాను, రాత్రిని తెరగాను, పగలు ఉపాధి సంపాదనకై కృషి చేసే కాలంగాను మేము నియమించాము" అని ఉంది.

అన్ నమల్ సూరాలో ఇలా ఉంది : "వీరు చూడటంలేదా? వారు విశ్రాంతిని, సుఖాన్ని పొందటానికి మేము రాత్రిని చీకటిగా సృజించాము. పగలును కార్యకలాపాలను చేయడానికి వెలుగుమయం చేశాము. దీనిలో విశ్వాసులకు దైవ నిదర్శనాలు కానవస్తాయి."

రాత్రిని చీకటిగా విశ్రాంతికి విరామానికి సమయంగాను, పగలును పనిపాట్లు చేసుకోవటానికి ప్రకాశవంతంగా చేయడమంటే, అందులో రాత్రిపూట నిద్రించాలని, పగలు తమ అవసరాల నిమిత్తం కృషి చేయాలని సంకేతం ఉంది. పగలు మీ ఉపాధికొరకు, ఇతర అవసరాల్ని తీర్చుకోవడానికి పూర్తిగా యత్నించి, అలసట, గ్లాని కలిగేలా శ్రమపడాలి; అప్పుడు రాత్రి ప్రశాంత వాతావరణంలో హాయిని, సౌఖ్యాన్ని అనుభవించాలి. ఉషోదయంకాగానే దైవనామంతో ఉత్సాహంగా తిరిగి క్రియా రంగంలోకి ఉరకాలి.

సుఖ లోలత్వంవల్ల, సోమరితనం వల్ల పగలే గుర్రుపెట్టి నిద్రించేవారు, లేక సుఖభోగాల్లో వ్యర్థ కార్యకలాపాల్లో రాత్రంతా మేల్కొనేవారు ప్రకృతి ధర్మాలను కాలరాయడమేకాక తద్వారా తమ ఆరోగ్యాన్ని కూడా సర్వ నాశనం చేసుకుంటారు.

పగలు గంటల తరబడి నిద్రించేవారు పగటివేళ నిర్వర్తించవలసిన బాధ్యతల్ని విస్మరించిన వారౌతారు. శరీరానికి సరయిన విశ్రాంతిని చేకూర్చలేరు, ఎందుకంటే పగటి నిద్ర రాత్రి నిద్రకు ఎంతమాత్రం సమానం కాజాలదు.

మనిషి రాత్రంతా మేల్కొని దైవారాధనచేస్తూ, తన శక్తికి మించిన భారాన్ని పైన వేసుకోవడం కూడా మహాప్రవక్త (సఅసం) ఇష్టపడలేదు.

ఒకసారి ప్రవక్త (సఅసం) హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ (రజి) తో "నీవు పగలు క్రమం తప్పకుండా రోజా వ్రతాన్ని పాటిస్తావని రాత్రుల్లో మేల్కొని నమాజు చేస్తావని విన్నాను - ఇది నిజమేనా?" అని అడిగారు. అందుకు హజ్రత్ అబ్దుల్లా (రజి), "ఔనండి, మీరు విన్నది నిజమే" అని బదులిచ్చారు. అప్పుడు మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు. "అలా చేయకు - ఒకప్పుడు రోజా పాటిస్తూ మరొకప్పుడు భోజన పానీయాలు తీసుకుంటూ గడుపు. అలాగే నిద్రకూడా పోవాలి. అప్పుడప్పుడు లేచి నమాజ్‌కూడా చేసుకోవాలి. ఎందుకంటే నీమీద నీ శరీరానికి, నీ కళ్ళకు కూడా హక్కు ఉంది." (బుఖారి)

7. ఎక్కువ సౌఖ్యాన్నిచ్చే పరుపులు ఉపయోగించరాదు. ఈ లోకంలో విశ్వాసి సుఖభోగలాలసత్వాలకు లొంగరాదు. జీవనరంగమంటే విశ్వాసికి నిరంతర సమరం, విశ్వాసి కష్టజీవిగా, ధైర్యశాలిగా, సహనశీలిగా ఉండాలి.

హజ్రత్ ఆయిషా (రజి) అన్నారు : "ప్రవక్త (సఅసం) పరుపు తోలుతో చేయబడింది. అందులో ఖర్జూరపు మట్టల నార నింపి ఉండేది."

(షిమాయిలే తిర్మిజి)

హజ్రత్ హఫ్సా (రజి) ను ఎవరో అడిగారు, "మీవద్ద ప్రవక్త (సఅసం) పరుపు ఎలా ఉండేది?" అందుకు ఆమె ఇలా జవాబిచ్చారు, "అది ఒక గొంగళి. దీన్ని రెండు మడతలు వేసి ప్రవక్త (సఅసం)కు పరచేవాళ్ళం. దీన్ని నాలుగు మడతలు చేసి వేస్తే ఇంకా కొంచెం మెత్తగా ఉంటుందనే అభిప్రాయంతో ఒకరోజు అలా చేశాము. ప్రొద్దునే ప్రవక్త (సఅసం) 'రాత్రి నాకు పరిచిందేమిటి?'

అని నన్ను అడిగారు. "అదే గొంగళి. అయితే దాన్ని నేను మెత్తగా ఉండాలని నాలుగు మడతలు వేసి పరిచాను" అని అన్నాను. దానికి ప్రవక్త(సఅసం)"రెండు మడతలుగానే ఉండనివ్వు - రాత్రిపడక మెత్తగా ఉండటం వల్ల తహజ్జుద్ (రాత్రిపూట) నమాజ్‌కు మేల్కొనలేకపోయాను." (షిమాయిలే తిర్మిజి)

హజ్రత్ ఆయిషా (రజి) ఇలా ఉల్లేఖించారు: ఒకసారి ఒక అన్సారీ మహిళ వచ్చి ప్రవక్త(సఅసం) పరుపును చూసింది. ఇంటికి వెళ్ళి ఆ మహిళ ఉన్ని బాగా నింపిన మెత్తని పరుపు తయారుచేసి ప్రవక్త(సఅసం)కొరకు పంపింది. ఇంటికి వచ్చిన తరువాత ప్రవక్త (సఅసం) అక్కడున్న మెత్తని పరుపును చూసి ఇదేమిటని అడిగారు. "ఒక అన్సారీ మహిళ ఇక్కడికి వచ్చి మీ పరుపును చూసి వెళ్ళింది. ఇప్పుడామె మీ కోసం దీన్ని తయారు చేసి పంపింది" అన్నాను.

"వద్దు - దీన్ని తిరిగి ఇచ్చివేయ్" అని ప్రవక్త(సఅసం)పురమాయించారు. నాకు ఆ పరుపు ఎంతో నచ్చింది. దాన్ని తిరిగి ఇవ్వడానికి మనసొప్పలేదు. కాని ప్రవక్త (సఅసం) ఆజ్ఞ మేరకు దాన్ని తిరిగి పంపించాల్సి వచ్చింది.

(షిమాయిలే తిర్మిజి)

ప్రవక్త (సఅసం) ఒకసారి ఒక చాపమీద పడుకున్నారు. దానివల్ల వారి దేహంపైన చాప గుర్తులు పడ్డాయి. అది చూచి హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి)కు దుఃఖం వల్ల కన్నీరు ఆగలేదు. ప్రవక్త(సఅసం) అది గమనించి ఎందుకు దుఃఖిస్తున్నావని అడిగారు.

"దైవప్రవక్తా! ఖైసర్, కిస్రాలు పట్టు, ముక్‌మల్ పరుపులపైన పరుంటే మీరు ఈ చాపపైన పడుకోవడమా?" అని విచారం వెలిబుచ్చారు. దానికి ప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు:

"ఇందులో దుఃఖించాల్సిన అవసరమేముంది? వారికి కేవలం ఇహలోకమే- మనకు పరలోకం" -

మహాప్రవక్త (సఅసం) ఒకసారి అన్నారు :

"అటు బాకా పూరించేదూత 'ఇస్రాఫీల్' బాకా నోటిలో పెట్టుకొని దైవాదేశం కొరకు చెవులప్పగించి, తలవంచి నిరీక్షిస్తుండగా నేను సుఖంగా, నిశ్చింతగా జీవితం ఎలా సాగించగలను?" (తిర్మిజి)

ప్రవక్త (సఅసం) వారి ఈ పవిత్ర సంప్రదాయం మనల్ని కోరేదేమంటే,

విశ్వసి, ఈ లోకంలో యోధునివలె జీవించాలి. భోగభాగ్యాలు అనుభవించే కాంక్ష విడనాడాలి.

8. నిద్రించడానికి ముందు వుజూ చేసుకోవడం అలవరచుకోవాలి. పరిశుద్ధంగా పరిశుభ్రంగా నిద్రపోవాలి. ఒకవేళ చేతులు ఏ కారణంవల్లనయినా పరిశుభ్రంగా లేకపోయి జిగటుగా ఉంటే బాగా కడుక్కొని మరీ నిద్రపోవాలి. ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు :

"ఎవరయితే జిగటుగా ఉన్న తమ చేతుల్ని కడుక్కోకుండా పడుకుంటారో, వారికి ఏదయినా విషకీటకం కరిచే ప్రమాదం సంభవిస్తే - చేతులు కడుక్కోకుండా నిద్రపోయినందుకు వారు తమను తామే నిందించుకోవలసి వస్తుంది."

ప్రవక్త (సఅసం) నిద్రించేముందు మామూలుగా వుజూ చేసుకునేవారు. ఒకవేళ స్నానం చెయ్యడం అవశ్యమైన పరిస్థితి ఏర్పడినప్పుడు నిద్రపోవాలనిపిస్తే అపరిశుభ్రంగా ఉన్న శరీర భాగాన్ని కడుక్కొని ఉజూచేసి మరీ పడుకునేవారు.

9. నిద్రించేముందు బయటి తలుపును మూసుకోవాలి. భోజన పానీయాల పాత్రలపై మూతలు పెట్టుకోవాలి. దీపం, లాంతరు మొదలైనవి ఆర్పివేయాలి. ఒకవేళ పొయ్యి మండుతూ ఉంటే దాన్ని ఆర్పి వేయాలి. ఒకసారి మదీనాలో రాత్రివేళ ఒకరింటికి నిప్పు అంటుకుంది. అప్పుడు ప్రవక్త (సఅసం) బోధించారు, "అగ్ని మీ శత్రువు. నిద్రించేవేళ దాన్ని ఆర్పివేయండి."

ఆయన మరోసారి ఇలా అన్నారు : "సంధ్యాసమయంలో చిన్న పిల్లల్ని బయటకు వెళ్ళనివ్వరాదు. ఎందుకంటే ఆ సమయంలో షైతానులు భూమిపై సంచరిస్తూ ఉంటారు. కొంత సమయం గడిచిన తరువాత పిల్లల్ని బయటకు వెళ్ళనివ్వవచ్చు. తలుపులు మూసుకొనేవేళ బిస్మిల్లాహ్ అనాలి. అలాగే బిస్మిల్లాహ్ అంటూ దీపాన్ని ఆర్పివేయాలి. నీళ్ళు, వంటపాత్రలపైనా బిస్మిల్లాహ్ అంటూనే మూతలు పెట్టాలి. మూయడానికి మూతలు లేకపోతే వేరే వస్తువుల్ని ఉపయోగించవచ్చు." (సిహాహ్‌సిత్తా - హిస్నేహిసీన్)

10. నిద్రకు ఉపక్రమించే సమయంలో త్రాగే నీళ్ళు, గ్లాసు, చెంబు, కర్ర, అగ్గిపెట్టె, లేక టార్చిలైటు, మిస్వాక్ (పల్లు తోముకునే పుల్ల) తువాలు మొదలయినవి తప్పకుండా దగ్గర ఉంచుకోవాలి. బంధువుల ఇంటికి వెళితే ఆ ఇంటివారిని అడిగి మరుగుదొడ్డి మొదలయినవి ఎక్కడున్నాయో తెలుసుకోవాలి.

బహుశ రాత్రి అవసరం కలుగవచ్చు. ప్రవక్త (సఅసం) విశ్రాంతి తీసుకుంటు న్నప్పుడు ఆయన వద్ద ఏడు వస్తువులు ఉండేవి. (1) నూనె సీసా (2) దువ్వెన (3) సుర్మా డబ్బి (4) కత్తెర (5) మిస్వాక్ (6) అద్దం (7) ఒక చిన్న కర్ర.

11. నిద్రించేటప్పుడు కాళ్ళజోళ్ళు, దుస్తులు మొదలైనవి దగ్గరలోనే ఉంచుకోవాలి. మేల్కొన్న తరువాత వాటిని వెతుక్కునే అవసరం ఉండరాదు. లేవగానే జోళ్ళలో కాలు పెట్టకూడదు, అలాగే దులపకుండా దుస్తులు ధరించరాదు. జోళ్ళల్లో లేక దుస్తుల్లో విషకీటకం ఉండవచ్చు. అది మీకు బాధ కలిగించవచ్చు.

12. నిద్రించేముందు పడకను బాగా దులుపుకోవాలి - ఒకవేళ అవసర నిమిత్తం మధ్యలో లేచినా మళ్ళీ పడుకోబోయే ముందు పడక దులిపి పడుకోవాలి. ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు : "రాత్రి పడకనుండి లేచి మళ్ళీ పడకమీదికి పోయేవారు, (తువ్వాలు) లేక తమ లుంగీ అంచులతో మూడుసార్లు పడకను దులుపుకోవాలి. ఎందుకంటే లేచిన తరువాత ఆ పడకపైకి ఏదయినా ప్రాకి ఉంటే వారికి తెలియదు కదా !" (తిర్మిజి)

13. నిద్రపోవడానికి ముందు ఈ దుఆ చదవాలి. మహాప్రవక్త (సఅసం) శయనించే ముందు ఈ దుఆ చదివేవారని హజ్రత్ అనస్ (రజి) ఉల్లేఖించారు :

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِىْ اَطْعَمَنَا وَسَقَانَا وَكَفَانَا وَاٰوَانَا فَكَمْ مِّمَّنْ لَّا
كَافِىَ لَهٗ وَلَا مُؤْوِىَ (شمائل ترمذی)

అల్ హమ్దు లిల్లాహిల్లజీ అత్ అమనా వ సఖానా వ కఫానా వ ఆవానా ఫకమ్ మిమ్మల్లా కాఫియలహూ వలాముఏయ

"అల్లాహ్ కే స్తోత్రాలు. ఆయనే అన్న పానీయాలను ప్రసాదించాడు, మా పనుల్లో పూర్తి సహాయం చేశాడు, నివసించడానికి ఇల్లుయిచ్చాడు - ప్రపంచంలో ఎందరో ఏ సహాయకుడూ లేకుండా, ఏ ఆశ్రయమిచ్చేవాడూ లేకుండా ఉన్నారు." (షిమాయిలె తిర్మిజి)

14. నిద్రించేముందు దివ్యఖుర్ఆన్‌లోని కొన్ని ఆయత్‌లయినా తప్పనిసరిగా చదవాలి. ప్రవక్త (సఅసం) నిద్రబోయేముందు పవిత్ర ఖుర్ఆన్‌నుండి కొంత భాగాన్ని చదివేవారు.

ప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు. నిద్రించే సమయంలో దైవ గ్రంథంలోని ఒక సూరాను చదివిన వ్యక్తివద్దకు దేవుడు ఒక దూతను పంపిస్తాడు. నిద్రనుండి మేల్కొనేంతవరకు ఏ ఆపద రాకుండా అతనిని ఆ దైవదూత కాపాడుతాడు. ఆయన (సఅసం) ఇంకా ఇలా అన్నారు. 'మనిషి పడుకోటానికి వెళ్ళే సమయంలో ఒక దైవదూత, మరొక షైతాన్ అతని వద్దకు వచ్చి ఇలా అంటారు, 'నీ పనులన్నీ శుభంతో పూర్తిచెయ్యి' అని దైవదూత అంటే, 'నీ పనులన్నీ చెడుతో పూర్తిచెయ్యి' అని షైతాన్ అంటాడు. ఆ మనిషి దేవుడిని స్మరిస్తూ నిద్రిస్తే దైవదూత రాత్రంతా అతన్ని రక్షిస్తుంటాడు.

హజ్రత్ ఆయిషా (రజి) ఇలా అన్నారు : 'మహాప్రవక్త (సఅసం) నిద్రకు ఉపక్రమించేముందు రెండు చేతులెత్తి ఈ మూడు సూరాలను పఠించేవారు. "ఖుల్‌హు అల్లాహు అహద్," "ఖుల్ ఆవుజు బిరబ్బిల్ ఫలక్," "ఖుల్ ఆవుజు బిరబ్బిన్నాస్", ఆ తరువాత తల భాగంనుండి మొదలెట్టి చేతులు ఎంతవరకు వెళ్ళగలవో అంతవరకు తన దేహంపై తడుముకొనేవారు. అలా మూడుసార్లు చేసేవారు. (తిర్మిజి)

15. నిద్రకుపక్రమించేటప్పుడు కుడి చేతిని, కుడి చెంపక్రింద పెట్టుకొని కుడివైపు తిరిగి పడుకోవాలి.

హజ్రత్ బరా (ర) ఇలా అన్నారు, "ప్రవక్త (సఅసం) నిద్రపోవడానికి ఉపక్రమిస్తే తమ కుడిచేతిని కుడి చెంపక్రింద పెట్టి ఇలా ప్రార్థించేవారు.

'ఓ దేవా ! నీవు నీ దాసుల్ని మళ్ళీ బ్రతికించి నీ సమక్షంలో నిలబెట్టే దినాన నరకంనుండి నన్ను రక్షించు. "హిస్నె హసీన్"లో ప్రవక్త (సఅసం) పై పదాల్ని మూడుసార్లు పఠించేవారని ఉల్లేఖించబడింది.'

16. బోర్లా పడుకోవడం, ఎడమవైపు తిరిగి నిద్రకుపక్రమించడం మానివేయాలి. హజ్రత్ మఈష్ (రజి) తండ్రి తఖ్‌ఖతల్ గిఫారీ ఇలా అన్నారు, "నేను మస్జిద్‌లో బోర్లాపడుకొని ఉన్నా. ఎవరో తన కాలితో నన్ను కదిలించారు. ఇలా పడుకోవడం దేవునికి ఇష్టంలేదు అని అన్నారు. తీరాచూస్తే ఆయన ఎవరోకాదు, మహాప్రవక్త." (అబూదావూద్)

17. నిద్రించడానికి తాజా గాలివచ్చే ప్రదేశం కావాలి. గాలి వీయకుండా మూయబడిన గదిలో నిద్రించరాదు.

18. నిద్రించే సమయంలో ముఖం కప్పుకోరాదు; కప్పుకుంటే ఆరోగ్యంపై

చెడు ప్రభావం పడుతుంది. నిద్రించే సమయంలో ముఖం కనబడుతూ ఉండాలి. అలా ఉంటేనే మీరు తాజా గాలి పీల్చే అవకాశం లభిస్తుంది.

19. (పారాపెట్ వాల్) గోడలులేని, ఇంటి కప్పుమీద పడుకోవడం మానుకోవాలి. ఇంటిపై నుండి క్రిందకు దిగే సమయంలో జాగ్రత్తగా ఉండాలి. మెట్లపై కాలు పెట్టకముందు దీపం వెలిగించుకోవాలి. ఒక్కొక్కప్పుడు స్వల్పమయిన అజాగ్రత్తవల్ల పెద్దగా బాధపడాల్సి వస్తుంది.

20. ఎంత విపరీతమైన చలిగాలివీస్తున్నప్పటికీ మూసిన గదిలో కుంపటి మండించిగాని, లాంతరు వెలిగించి గాని నిద్రపోరాదు. మూయబడిన గదిలో వెలిగే దీపంనుండి వచ్చేవాయువు ఆరోగ్యానికి చాలా ప్రమాదకరమైంది. ఒక్కొక్కప్పుడు దానితో ప్రాణాపాయం కలుగుతుంది కూడా.

21. పడుకొనేముందు ఈ దుఆ కూడా చదువుకోవాలి. ప్రవక్త(సఅసం) నిద్రించేముందు ఈ దుఆ చదివేవారని హజ్రత్ అబూ హురైరా(రజి) ఉల్లేఖించారు.

ఓ ప్రభూ ! నీ నామ స్మరణంతోనే శయ్యపై పడుకోబోతున్నా, నీ సహాయంతోనే నిద్రనుండి మేల్కొంటాను. ఒకవేళ నీవు రాత్రి నిద్రలోనే నా ప్రాణాన్ని తీసుకొన్నట్లయితే నీవే నన్ను కరుణించాలి. అలా కాకుండా నీవు వదలివేసి ఇంకా(సజీవంగా ఉండే) అవకాశమిచ్చినట్లయితే నీ ఉత్తమ దాసులను ఎలా కాపాడుతావో అలాగే నన్ను రక్షించు.

ఒకవేళ ఆ దుఆ జ్ఞాపకం లేకపోతే ఈ దుఆ చదవండి -

اَللّٰهُمَّ بِاسْمِكَ اَمُوْتُ وَاَحْيٰى (بخاری، مسلم)

అల్లాహుమ్మ బిఇస్మిక అమూతు వ అహ్యా

"ఓ దేవా ! నేను నీ నామ స్మరణంతోనే మృత్యువు ఒడిలో ఒదిగి పోతాను- నీ పేరు పలుకుతూ బ్రతికి లేస్తాను." (బుఖారి, ముస్లిమ్)

22. రాత్రి చివరి భాగంలో లేచే అలవాటు చేసుకోవాలి. మనో నిగ్రహం తోపాటు, దైవంతో సంబంధం పెంపొందించుకోడానికి ఆ సమయం మంచి సమయం. దైవప్రేమకు పాత్రులయిన వారు రాత్రుల్లో లేచి తాము చేసిన పాపాలను క్షమించమని తలలు వంచి దైవాన్ని వేడుకొంటారు. మహాప్రవక్త (సఅసం) రాత్రి మొదటి భాగంలో నిద్రించి, రాత్రి చివరి భాగంలో మేల్కొని దైవారాధనలో నిమగ్నులయ్యేవారు.

23. నిద్రనుండి మేల్కొనగానే ఈ దుఆ చదవాలి -

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِیْ اَحْیَانَا بَعْدَ مَآ اَمَاتَنَا وَاِلَیْهِ النُّشُوْرُ (بخاری، مسلم)

అల్ హమ్దు లిల్లాహిల్లజీ అహ్యానా బాద మా అమాతనా వ ఇలైహిన్నుషూర్

"సకల స్తోత్రాలకు, కృతజ్ఞతలకు అర్హుడు ఆ స్వామి. ఆయనే మమ్మల్ని నిర్జీవావస్థకు గురిచేసి తిరిగి జీవంపోసినవాడు. ఆయన సమక్షంలోనే మేము తిరిగి లేచి నిలబడవలసినవారము. (బుఖారి, ముస్లిమ్)

24. నిద్రలో మంచి కలకన్నప్పుడు దేవునికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి. దాన్ని మీరు శుభసూచకంగా భావించాలి. ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు -

'ఇప్పుడు ప్రవక్తగా నాకు శుభసూచనలు తప్ప ఇంకేమి లేవు'. శుభసూచనలు అంటే ఏమిటని ప్రజలడుగగా-'మంచి కల' అని ప్రవక్త(సఅసం) జవాబిచ్చారు.(బుఖారి)

ఆయన (సఅసం) ఇంకా ఇలా అన్నారు - 'మీలో ఎవరు ఎంత ఎక్కువ సత్యవంతులో వారి స్వప్నం కూడా అంతే ఎక్కువ సత్యమైనదిగా ఉంటుంది. మంచి కల చూసినప్పుడు దేవుణ్ణి స్తుతించాలి, ఆ స్వప్నం గురించి మీ మిత్రులతో చెప్పాలి' అని ప్రవక్త(సఅసం) హితవు చేశారు. కలగన్నప్పుడు ప్రవక్త(సఅసం) తన సహచరులతో చెప్పేవారు. 'మీరు కూడా మీరు కన్న కలల ప్రస్తావన చేయండి. నేను వాటి అర్థాన్ని వివరిస్తాను' అని ఆయన తన సహచరులతో అనేవారు.(బుఖారి)

25. దురూద్(ప్రవక్తపై మంచి పలుకులు) పలుమార్లు చదవండి. ప్రవక్త (సఅసం)ను దర్శించే మహాభాగ్యం మీకు దేవుడు కలుగజెయ్యవచ్చు. హజ్రత్ మౌలానా ముహమ్మద్ అలీ మొంగేరీ (రహ్) ఒకసారి హజ్రత్ ఫజల్ రహ్మాన్ గంజ్ మురాదాబాదీని మహాప్రవక్త (సఅసం)ను స్వప్నంలో సందర్శించే భాగ్యాన్ని కలుగజేసే ఒక ముఖ్యమైన దురూద్‌ను తెలుపండి అని కోరారు. అందుకాయన 'అలాంటి ముఖ్యమైన దురూద్ అంటూ లేదు. కేవలం చిత్తశుద్ధి కల మనస్సు కావాలి' అని జవాబిచ్చారు. అయితే కొంతసేపు ఆగి, తర్వాత హజ్రత్ సయ్యద్ హసన్(రహ్)కు ఈ దురూద్ వల్ల ప్రయోజనం కలిగింది అని అన్నారు.

"ఓ దేవా! నీ కరుణాకటాక్షాన్ని ముహమ్మద్(సఅసం)పైన, వారి సంతతి వారిపైనా - ప్రపంచంలోని వస్తువులన్నింటి సంఖ్య నీకు తెలిసినదే - వాటికి సమానంగా ప్రసరింపజెయ్యి.

ప్రవక్త (సఅసం) ఇలా ప్రకటించారు – 'ఎవరైతే నన్ను స్వప్నంలో చూశారో, వారు నిజంగానే నన్ను చూశారు. ఎందుకంటే షైతాన్ నా రూపంలో రాలేడు'! (తిర్మిజి)

హజ్రత్ యజీద్ ఫార్సి (రహ్) పవిత్ర ఖుర్ఆన్ ప్రతులు వ్రాస్తూవుండేవారు– ఒకసారి ఆయనకు స్వప్నంలో దైవప్రవక్త (సఅసం) దర్శనభాగ్యం లభించింది. అప్పట్లో మహాప్రవక్త సహచరుల్లో ఒకరైన హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) జీవించే ఉన్నారు. హజ్రత్ యజీద్ తన స్వప్నాన్ని గూర్చి ఆయనతో చెప్పారు. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) ఆయనకు ఈ ప్రవక్త (సఅసం) ప్రవచనాన్ని వినిపించారు.

"ఏ వ్యక్తి స్వప్నంలో నన్ను చూశాడో అతడు నిజంగా నన్నే చూశాడు– ఎందుకంటే షైతాన్ నా స్వరూపంలో రాలేడు. అయితే నీవు స్వప్నంలో చూచిన వ్యక్తి ఆకారం ఎలా ఉందో చెప్పగలవా?" అని అడుగగా హజ్రత్ యజీద్ ఫార్సి ఇలా చెప్పారు. "వారి (సఅసం) దేహం, వారి పొడ్డూ పొడవు పొందికగా ఉంది. తెలుపు కలిసిన బాదామి రంగు కలిగి ఉన్నారు. మిల మిల మెరిసే నేత్రాలు, నవ్వుతూ అందంగా ఉన్న గుండ్రని ముఖం, పూర్తి ముఖాన్ని ఆవరించి నిండుగా ఉన్న గడ్డం." ఆపై హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) ఇలా అన్నారు : 'ఒకవేళ నీవు ప్రవక్త (సఅసం)ను ఆయన బ్రతికి ఉండగా చూసి ఉంటే ఇంతకంటే ఎక్కువగ ఆయన ఆకారం గూర్చి చెప్పేవాడివి కాదు.' (షిమాయిలె తిర్మిజి)

26. ఎప్పుడైనా అప్రియమైన, భయంకరమైన కలను కన్నట్లయితే ఏ పరిస్థితిలోనూ ఇతరులకు చెప్పకండి. ఆ కలలోని చెడు ఫలితంనుండి దైవం శరణుకోరండి. దైవం తలిస్తే దాని చెడునుండి మిమ్మల్ని రక్షించవచ్చు.

హజ్రత్ అబూ సల్మా (రజి) అన్నారు. నేను అప్రియమైన స్వప్నాలవల్ల ఎప్పుడూ రోగాలకు గురి అవుతూ ఉండేవాణ్ణి. ఒకసారి నేను అబూ ఖతాదా (రజి) కు నా బాధ ఏకరువు పెట్టాను. అప్పుడాయన నాకు మహాప్రవక్త (సఅసం) వారి ఈ ప్రవచనం వినిపించారు. 'మంచి కలలు దైవంద్వారా కలుగుతాయి. ఒక వేళ మీలో ఎవరయినా మంచి కలలుకంటే మీ ప్రేమ పాత్రుడయిన మిత్రునికి తప్ప మరింకెవ్వరికీ చెప్పకూడదు. ఒకవేళ అప్రియమయిన కలకంటే దాన్ని అసలు ఎవ్వరికి చెప్పకూడదు. మేల్కొనగానే – అవుజుబిల్లాహి మినష్షైతానిర్రజీమ్" పఠించి మూడుసార్లు ఎడమవైపు తుప్పివేసి మరో ప్రక్కకు ఒరిగి పడుకోవాలి. అప్పుడావ్యక్తి ఆ కలలోని చెడునుండి రక్షింపబడతాడు.'

(రియాజుస్సాలిహీన్, ముస్లిం)

27. కలలు కన్నట్టు కల్పించి చెప్పరాదు. హజ్రత్ అబ్దుల్లా ఇబ్ను అబ్బాస్ (రజి) ప్రవక్త (సఅసం) ఇలా బోధించారని చెప్పారు -

"కలను కనకుండా కల్పించి చెప్పే వారికి రెండు 'జౌ' గింజలకు ముడి వేయాలన్న శిక్ష వేయబడుతుంది. అది వారు ఎన్నటికీ చేయజాలరు."(ముస్లిమ్)

ప్రవక్త (సఅసం) ఇంకా ఇలా అన్నారు - 'మనిషి తన కళ్ళతో చూడని దాన్ని చెప్పడం అనేది మహాపరాధం.' (బుఖారి)

28. మీ మిత్రుడు మీకు తన కలను వినిపిస్తే దానికి మంచి భావాన్ని చెప్పండి. ఒకసారి ఒక వ్యక్తి మహాప్రవక్త (సఅసం) కు తన కలను వినిపించాడు. ప్రవక్త (సఅసం) అది విని ఇలా అన్నారు - చాలా మంచి కల కన్నావు. మేలే కలుగుతుంది - మహాప్రవక్త (సఅసం) సాధారణంగా ఫజర్ నమాజ్ తర్వాత కూర్చొని, ఎవరు ఎటువంటి కల కన్నారో చెప్పండని ప్రజల్ని అడిగేవారు - కల వివరాలు వినేముందు ఈ పదాన్ని పలికేవారు. "ఈ స్వప్నం యొక్క శుభం నీకు కలుగుగాక, దాని చెడునుండి నీవు రక్షించబడుదువుగాక. మాకు శుభాలు, మా శత్రువుకు అశుభం కలుగుగాక ! సర్వలోకాల ప్రభువైన ఆ దైవానికే సకల స్తోత్రాలు, కృతజ్ఞతాభివందనాలు."

29. ఎప్పుడయినా కలలో భయపడినా, లేక భయంకరమైన కల కని, ఆందోళన చెందినా, భయం, ఆందోళన దూరం కావడానికి దిగువనిస్తున్న దుఆ పఠించాలి. పిల్లలకు కూడా వీలయితే ఈ దుఆ నేర్పించాలి. హజ్రత్ అబ్దుల్లా ఇబ్నె అమ్ర్ బిన్ ఆస్ (రజి) ఇలా ఉల్లేఖించారు - ఎవరయినా కలలో భయపడినా లేక ఆందోళన చెందినా ఆ భయాందోళనలు దూరం కావడానికి ప్రవక్త (సఅసం) ఈ దుఆ పఠించమని హితవు చేసేవారు.

أَعُوْذُ بِكَلِمَاتِ اللهِ التَّامَّةِ مِنْ غَضَبِهِ وَعِقَابِهِ وَشَرِّ عِبَادِهِ وَمِنْ هَمَزَاتِ

الشَّيَاطِيْنِ وَاَنْ يَّحْضُرُوْنِ۔ (ابوداؤد، ترمذی)

**"అవుజు బికలిమాతిల్లాహి త్తామ్మతి మిన్ గజబిహి, వ ఇఖాబిహి వ షర్రి ఇబాదిహి వ మిన్ హమజాతి షయాతీన్. వ అంయ్యహ్‌జారూన్."**

**"నేను దేవుని సంపూర్ణ వచనాల శరణు వేడుతున్నాను. ఆయన కోపతాపాలనుండి, ఆయన శిక్షనుండి, ఆయన దాసులయిన మనుషులు కల్పించే చెడునుండి, షైతానులు కల్పించే కుశంకలనుండి, అవన్నీ నా వద్దకు రాకుండా ఉండటానికి శరణు వేడుకుంటున్నాను."**

# 6. బాట – బాటసారి

1. దారిన నడిచేటప్పుడు సవ్యంగా నడవాలి. అంటే ప్రజలు అపహసించేరీతిలో గబగబా నడవకూడదు, అలా అని రోగిలా నెమ్మదిగా కాళ్ళీడ్చుకుంటూ కూడా నడువరాదు. మహాప్రవక్త (సఅసం) పెద్ద అంగలు వేసేవారు. పాదాలు రాస్తూ ఎప్పుడూ నడిచేవారు కాదు.

2. హుందాగా, అయితే వినమ్రతతో, క్రింది చూపుతో నడవాలి – దారిలో అటూ ఇటూ కనబడ్డ ప్రతి వస్తువునూ చూసుకుంటూ నడవరాదు. అలా చేయడం వినమ్రత, సభ్యత సంస్కారం కానేరదు – ప్రవక్త (సఅసం) నడుస్తున్నప్పుడు తమ దేహాన్ని ముందుకు వంచి మెట్టనుండి పల్లానికి దిగుతున్నట్లు నడిచేవారు. ఆయన (సఅసం) తొందరగానడిచినా హుందాతనం ఆయన నడకలో ఉట్టిపడేది. మరుకుగా ఒదిగి అటు ఇటూ చూడకుండా నడిచేవారు.

3. అహంభావం గర్వం కనబరుస్తూ నడవరాదు. మీరు మీ కాలిజోరుతో భూమిని చీల్చివేయలేరు, గర్వంతో విర్రవీగి పర్వత శిఖరాల్ని అధిగమించనూ లేరు. మరి గర్వపడటం దేనికి?

4. ఎల్లప్పుడు కాళ్ళకు జోళ్ళు తొడుక్కొని నడవాలి – వట్టి కాళ్ళతో నడవడం మానుకోండి. జోళ్ళవల్ల ముళ్ళు, రాళ్ళు మొదలయిన హానికరమైన వాటినుండి మీ కాళ్ళు సురక్షితమవటమే కాక విష కీటకాలనుండి రక్షణ లభిస్తుంది. మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు–"ఎప్పుడూ జోళ్ళు తొడుక్కొనే నడవండి. కాళ్ళకు జోళ్ళు తొడుక్కున్నవాడు కూడా ఒక రకమైన స్వారీ చేసేవాడే."

5. దారిన నడిచేటప్పుడు సంస్కారాన్ని సభ్యతను హుందాను దృష్టిలో వుంచుకోవాలి. జోళ్ళు లేకపోతే రెండు జోళ్ళూ లేకుండానే నడవాలి. ఒక కాలుకు జోడు తొడుక్కొని నడవడం ఎంత హాస్యాస్పదమైన విషయం! "ఒక జోడు తొడుక్కొని ఎవరూ నడవరాదు, రెండు జోళ్ళు తొడుక్కొనిగాని, లేక రెండూ వదలిగాని నడవాలి" అని మహాప్రవక్త (సఅసం) ఉపదేశం. (తిర్మిజి)

6. నడిచే సమయంలో దుస్తులు గాలిలో ఎగరకుండా జాగ్రత్తపడాలి. మహాప్రవక్త (సఅసం) నడిచేటప్పుడు తమ లుంగీని కొద్దిగా లేపి పట్టుకునేవారు.

7. ఎల్లప్పుడు మిత్రులతో హాయిగా కలిసి మెలిసి నడవండి. అందరికంటే ముందు నడుస్తూ మీ గొప్పతనాన్ని ప్రదర్శించకండి – మిత్రులతో నడుస్తున్నప్పుడు అప్పుడప్పుడు ఉల్లాసంగా మిత్రుని చేతిలో చెయ్యివేసి కూడా నడవాలి. మహాప్రవక్త (సఅసం) తమ సహచరులతో కలిసి నడుస్తున్నప్పుడు తన ఉన్నత మైన గౌరవస్థానాన్ని ఎప్పుడూ ప్రదర్శించేవారు కాదు. అప్పుడప్పుడు ఆయన తమ సహచరుల (రజి) వెనుకనే నడిచేవారు - ఇంకొకప్పుడు స్వేచ్ఛగా తన అనుచరుని చెయ్యిపట్టుకొని కూడా నడిచేవారు.

8. దారిలో నడిచే నియమాలను పాటించాలి. దారిలో నిలబడికాని, కూర్చొనికాని వచ్చిపోయే వారిని చూస్తూ ఉండటం అసభ్యకరం. ఒకవేళ దారిలో నిలిచిపోవడం తప్పనిసరి అయినప్పుడూ లేక దారిన నడుస్తూ ఉన్నప్పుడూ ఈ దిగువ నిచ్చిన ఆరు మాటల్ని దృష్టిలో ఉంచుకోవాలి.

☆ క్రింది చూపుతో నిలవాలి.

☆ ఇతరుల్ని బాధపెట్టే వస్తువుల్ని దారినుండి తొలగించాలి.

☆ సలామ్‌కు ప్రతి సలామ్ చేయాలి.

☆ మంచిని బోధిస్తూ చెడు విషయాలనుండి వారించాలి.

☆ దారి తప్పిన వారికి దారి చూపించాలి.

☆ కష్టాల్లో ఉన్నవారికి సహాయపడాలి.

☆ నిత్యం మంచివారితో కలిసి నడవాలి. చెడ్డవారితో కలిసి నడవడం మానుకోవాలి.

10. స్త్రీ పురుషులు కలిసి నడవకూడదు. స్త్రీలు దారి మధ్యనుండి నడవకుండా ఓరగా నడవాలి. పురుషులు వారికి ఎడంగా నడవాలి. మహాప్రవక్త (సఅసం) ఉపదేశానుసారం, మురికి బురదలో మునిగిన పందిని ముట్టుకోవడమైనా సహించవచ్చుకాని, పురుషుని భుజం పరస్త్రీని తాకడం మాత్రం సహింపరానిది.

11. మహిళలు ఏదైనా అవసర నిమిత్తం దారిన నడిచేటప్పుడు బురఖా లేక దుప్పటితో తమ శరీరాన్ని, దుస్తుల్ని, అలంకరణను కప్పుకుని ముఖాలపై ముసుగు వేసుకొని మరీ నడవాలి.

12. స్త్రీలు బజారున నడిచేటప్పుడు సవ్వడిచేసే నగలను ధరించరాదు. లేక ఆ ధ్వని ఇతరులకు వినపడకుండా జాగ్రత్తగా నడవాలి.

13. మహిళలు బాగా గుబాళించే సువాసనలను రాసుకొని వీధిన నడవరాదు. అలాంటి స్త్రీల విషయంలో మహాప్రవక్త (సఅసం) అతి తీవ్రమయిన నిరసనను తెలియజేశారు.

14. ఇంటినుండి బయలుదేరినప్పుడు ఆకాశంవైపుచూచి ఈ దుఆ పఠించాలి.

بِسْمِ اللّٰهِ تَوَكَّلْتُ عَلَى اللّٰهِ اَللّٰهُمَّ اِنِّىْ اَعُوْذُبِكَ مِنْ اَنْ نَّزِلَّ اَوْنُزَلَّ
وَاَنْ نَّضِلَّ اَوْنُضَلَّ اَوْنَظْلِمَ اَوْيُظْلَمَ عَلَيْنَا اَوْ نَجْهَلَ اَوْيُجْهَلَ عَلَيْنَا۔
(مسند احمد)

"బిస్మిల్లాహి తవక్కల్‌తు అలల్లాహి అల్లాహుమ్మ ఇన్ని అఊజుబిక మిన్ అన్‌నజిల్ల ఔనుజల్లవ అన్ నజిల్ల ఔనుజల్ల ఔనజ్‌లిమ ఔయుజ్‌లమ అలైనా ఔనజ్‌హల ఔయుజ్‌హల అలైనా" (ముస్నద్ అహ్మద్)

"దైవనామంతో (నేను బయటికి వచ్చాను) ఆయనపైనే నా నమ్మకం. దేవా! మేము తప్పు చెయ్యకుండా లేక ఇతరులు మాచేత తప్పు చేయించకుండా లేక మేమే స్వయంగా మార్గం తప్పకుండా, మమ్మల్ని ఎవరూ మార్గం తప్పించకుండా, మేము స్వయంగా ఏదైనా దౌర్జన్యం చేయకుండా లేక ఇతరులు మాపై అత్యాచారానికి దిగకుండా మేము స్వయంగా వివేకరహితంగా ప్రవర్తించకుండా లేక ఇతరులు మాతో అజ్ఞానంగా ప్రవర్తించకుండా - నేను నీ శరణు వేడుకుంటున్నాను."

15. బజారుకు వెళ్ళేటప్పుడు ఈ దుఆ పఠించాలి.

بِسْمِ اللّٰهِ اَللّٰهُمَّ اِنِّىْ اَسْئَلُكَ خَيْرَ هٰذِهِ السُّوْقِ وَخَيْرَ مَا فِيْهَا وَاَعُوْذُبِكَ
مِنْ شَرِّهَا وَشَرِّ مَا فِيْهَا، اَللّٰهُمَّ اِنِّىْ اَعُوْذُبِكَ اَنْ اُصِيْبَ بِهَا يَمِيْنًا فَاجِرَةً
اَوْصَفْقَةً خَاسِرَةً۔

"బిస్మిల్లాహి అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక ఖైరహాజిహిస్సూఖి వ ఖైరమాఫీహా వ అఊజుబిక మిన్ షర్రిహా వ షర్రి మాఫీహా. అల్లాహుమ్మ ఇన్నీ అఊజుబిక అన్ ఉసీబ బిహా యమీనన్ ఫాజిరతన్ ఔసఫఖతన్ ఖాసిర."

"దైవనామంతో (నేను బజారులో ప్రవేశించాను). ప్రభూ! ఈ బజారులోని శుభాన్ని ఇక్కడ ఉండే సర్వంలోని శుభాన్నీ నేను నీనుండి ఆశిస్తున్నాను.

ఈ బజారులోని చెడునుండి ఇక్కడి సకల వస్తువుల చెడునుండి నీ శరణు వేడుకుంటున్నాను. దేవా ! నేను ఇక్కడ అసత్య ప్రమాణం చేయకుండా లేక కొనరాని వస్తువులను కొనకుండా నీ శరణు వేడుకుంటున్నాను." –

హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) మహాప్రవక్త (సఅసం) ప్రవచనాన్ని ఇలా ఉల్లేఖించారు –

"ఏ వ్యక్తి అయితే బజారులో ప్రవేశిస్తూ ఈ దుఆ పఠిస్తాడో దేవుడు అతని కర్మపత్రంలో పది లక్షల తప్పుల్ని క్షమిస్తాడు. ఉన్నత సోపానాల నెక్కిస్తాడు."

لَاۤ اِلٰهَ اِلَّا اللّٰهُ وَحْدَهٗ لَا شَرِيْكَ لَهٗ لَهُ الْمُلْكُ وَلَهُ الْحَمْدُ يُحْيِىْ وَ

يُمِيْتُ وَهُوَ حَيٌّ لَّا يَمُوْتُ بِيَدِهِ الْخَيْرُ وَهُوَ عَلٰى كُلِّ شَىْءٍ قَدِيْرٌ" (ترمذی)

లా ఇలాహ ఇల్లల్లాహు వహ్దహూ లా షరీక లహూ లహుల్ ముల్కు వలహుల్ హమ్దు యుహీ వ యుమీతు వహువ హయ్యుల్లాయమూతు బియదిహిల్ ఖైరు వహువ అలాకుల్లి షయ్యిన్ ఖదీర్. (తిర్మిజీ)

దైవం తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు, ఆయన ఒక్కడే. ఆయనకు సాటి ఇంకెవ్వరూ లేరు – ఆధిపత్యం ఆయనదే. కృతజ్ఞతలకు, స్తుతికి అర్హుడు ఆయనే. జీవన్మృత్యువులు ప్రసాదించేది ఆయనే. ఆయన నిత్యుడు, సజీవుడు, ఆయనకు మృత్యువు లేదు. సర్వ సుఖాలు ఆయన ఆధీనంలోనే ఉన్నాయి. ఆయన సర్వశక్తి సంపన్నుడు.

# 7. ప్రయాణపు నియమాలు

1. ప్రయాణం ప్రారంభించే ముందు ప్రయాణంలో తక్కువ సమయం వ్యయమయ్యేలా, నమాజ్ వేళలు తప్పిపోనివిధంగా కార్యక్రమం రూపొందించుకోవాలి. మహాప్రవక్త (సఅసం) స్వయంగా ప్రయాణానికి బయల్దేరినా లేక ఇతరుల్ని పంపినా సాధారణంగా గురువారం మంచిదని భావించేవారు.

2. ప్రయాణం ఒంటరిగా చేయరాదు. వీలయితే కనీసం ముగ్గురు వ్యక్తులు కలసి పయనించాలి. అలాచేస్తే దారిలో సామాను రక్షణ ఇతర అవసరాల సౌలభ్యం ఉంటుంది. ఇంకా ఎన్నో విపత్తులనుండి మనిషికి రక్షణ లభిస్తుంది.

"ఒంటరిగా పయనించడం వల్ల కలిగే కీడులు నాకు తెలిసినన్ని తెలిస్తే ఎవరూ ఒంటరిగా ప్రయాణం చెయ్యరు" అన్నారు మహాప్రవక్త (సఅసం) (బుఖారి).

ఒకసారి ఓ వ్యక్తి బహుదూరం పయనించి మహాప్రవక్త వద్దకు హాజరయ్యాడు. 'నీవెంట ఎవరున్నారు?' అని మహాప్రవక్త (సఅసం) అతన్ని అడిగారు. అతడు, "దైవ ప్రవక్తా ! ఎవ్వరూ లేరు" అని అన్నదానికి మహాప్రవక్త ఇలా ఉపదేశించారుః 'ఒంటరి బాటసారి షైతాన్ లాంటివాడు. ఇద్దరు బాటసారులయినా షైతాన్ లాంటివారే. కాని ముగ్గురయితే వారు నిజమయిన బాటసారులే." (తిర్మిజి)

3. స్త్రీ ఎల్లప్పుడూ ఎవరయినా 'ముహ్రం' (వరుసగీత్యా పెళ్ళికి తగనివారు) తోపాటే ప్రయాణం చెయ్యాలి. మామూలుగా ఒకరోజు ప్రయాణమయితే ఫరవాలేదు, ఒంటరిగా ప్రయాణం చేయకుండటమే శ్రేయస్కరం. మహాప్రవక్త బోధించారు : "దైవాన్ని, పరలోక జీవితాన్ని నమ్మిన మహిళ మూడు లేక అంతకంటే అధికదినాల ప్రయాణం ఒంటరిగా చెయ్యడం ధర్మసమ్మతం కాదు." ఇంతపెద్ద ప్రయాణం ఆమె చెయ్యాలంటే ఆమెతోపాటు ఆమె తండ్రి, లేక సోదరుడు, లేక భర్త, లేక కొడుకు లేక ఇతర 'ముహ్రం' ఉండటం అవసరం. (బుఖారి).

ఇంకోసారి ఆయన (సఅసం) స్త్రీ ఒక పగలు మరొకరాత్రి ప్రయాణం కూడా ఒంటరిగా చెయ్యరాదు." అని హెచ్చరించారు. (బుఖారి, ముస్లిం)

4. ప్రయాణంచేసే వాహనం బయల్దేరగానే ఈ దుఆ పఠించండిః

سُبْحٰنَ الَّذِیْ سَخَّرَلَنَا هٰذَا وَمَا كُنَّا لَهٗ مُقْرِنِیْنَ وَاِنَّآ اِلٰی رَبِّنَا لَمُنْقَلِبُوْنَ
اَللّٰهُمَّ اِنَّا نَسْئَلُكَ فِیْ سَفَرِنَا هٰذَا الْبِرَّ وَالتَّقْوٰی وَمِنَ الْعَمَلِ مَا تَرْضٰی
اَللّٰهُمَّ هَوِّنْ عَلَیْنَا سَفَرَنَا هٰذَا وَاطْوِ عَنَّا بُعْدَهٗ اَللّٰهُمَّ اَنْتَ الصَّاحِبُ
فِی السَّفَرِ وَالْخَلِیْفَةُ فِی الْاَهْلِ اَللّٰهُمَّ اِنِّیْ اَعُوْذُ بِكَ مِنْ وَعْثَآءِ السَّفَرِ
وَكَآبَةِ الْمَنْظَرِ وَسُوْٓءِ الْمُنْقَلَبِ فِی الْمَالِ وَالْاَهْلِ وَالْوَلَدِ وَالْحَوْرِ
بَعْدَ الْكَوْرِ وَدَعْوَةِ الْمَظْلُوْمِ (مسلم، ابوداؤد، ترمذی)

సుబహానల్లజీ సఖ్ఖరలనా హాజా వ మాకున్నా లహూ ముఖ్రినీన వ ఇన్నా ఇలా రబ్బినా లమున్‌కలిబూన్. అల్లాహుమ్మ ఇన్నీ అస్‌అలుక ఫీ సఫరినా హాజల్ బిర్ర వత్తఖ్వా వ మినల్ అమలి మా తర్‌జా. అల్లాహుమ్మ హవ్విన్ అలైనా సఫరనా హాజా వత్ వి అన్నా బు'దహూ, అల్లాహుమ్మ అన్తస్సాహిబు ఫిస్సఫరి వల్ ఖలీఫతు ఫిల్‌అహ్లి అల్లాహుమ్మ ఇన్నీ అఊజుబిక మిన్ వాషాయిస్సఫరి వ క'బతిల్ మంజరి వసూ ఇల్‌మున్ కలబి ఫిల్‌మాలి వల్ అహ్లి వల్ వలది వల్ హౌరి బాదల్ కౌరి వ దావతిల్ మజ్‌లూమ్. (ముస్లిమ్, అబూదావూద్, తిర్మిజి)

"పరిశుద్ధుడు, ఉన్నతుడు దేవుడు. ఆయన దీన్ని (వాహనాన్ని) మా అధీనంలో ఇచ్చాడు – లేకపోతే మేము దీన్ని అధీనపరచుకోలేక పోయేవారము. నిస్సందేహంగా మేము మా ప్రభువు వైపునకు మరలవలసిన వారమే. దేవా, మేము ఈ ప్రయాణంలో సత్కార్యాలు చేసే భయభక్తులతో మెలిగే సద్బుద్ధిని కోరుకుంటున్నాము. నీ ప్రసన్నత లభించే కార్యాల బుద్ధిని కోరుకుంటున్నాము. దేవా, ఈ ప్రయాణాన్ని మాకు సులభతరంచెయ్యి. దీని దూరాలను మాకు దగ్గర చెయ్యి. దేవా నీవే ఈ ప్రయాణంలో మా సన్నిహితుడివి. నీవే మా ఇంటి వారిని కనిపెట్టుకు ఉండేవాడివి. దేవా నేను నీ శరణుకోరుతున్నాను. ప్రయాణంలోని కష్టాలనుండి, అయిష్టకరమయిన దృశ్యాలనుండి కాపాడు. నా సంపద వ్యర్థమవకుండా, నా ఆత్మీయులకు, సంతానానికి నేను తిరిగివెళ్ళేటప్పటికి హాని కలగకుండా, మేలు కలిగిన తరువాత కీడు జరక్కుండా రక్షించు. బాధితుని శాపాన్నుండి కాపాడు."

5. ప్రయాణంలో ఇతరులకు సౌలభ్యం, విశ్రాంతి కలుగచేయాలి. సహ ప్రయాణీకుడికి కూడా హక్కు ఉంది. ఖుర్‌ఆన్‌లో ఉంది–పొరుగువానితో మంచిగా

ప్రవర్తించండి. పొరుగువాడు అంటే, ఎక్కడైనా ఎప్పుడైనా మనకు తోడుగా ఉండేవ్యక్తి అని భావం. ప్రయాణ సందర్భంలో అతి తక్కువ కాలం మీతో గడిపిన వ్యక్తితో కూడా ఉత్తమంగా ప్రవర్తించాలి. మీ చేతలతోనూ, మాటలతోనూ అతనికి శారీరకంగాను, మానసికంగాను ఎలాంటి బాధ కలుగనివ్వరాదు. ప్రవక్త (సఅసం) బోధించారు.

"జాతికి నాయకుడంటే జాతికి సేవకుడన్నమాట. ఏవ్యక్తి సేవాకార్యాల్లో ముందుంటాడో, అలాంటి వ్యక్తికన్నా పుణ్యాత్ముడు కేవలం దైవమార్గంలో వీర స్వర్గాన్ని అలంకరించినవాడే." (మిష్కాత్)

6. ప్రయాణం చేయడానికి ముందు, తిరిగి వచ్చిన తరువాత కృతజ్ఞతా పూర్వకంగా రెండు రకాతులు నఫిల్ నమాజ్ చేయాలి. ప్రవక్త (సఅసం) సంప్రదాయం ఇదే.

7. మీ బండి, బస్సు, లేక విమానం ఎత్తులు ఎక్కేటప్పుడుగానీ లేక పైకి ఎగిరే సమయంలో గాని ఈ దుఆ పఠించాలి.

اَللّٰهُمَّ لَكَ الشَّرَفُ عَلٰى كُلِّ شَرَفٍ وَّلَكَ الْحَمْدُ عَلٰى كُلِّ حَالٍ -

అల్లాహుమ్మ లక షరపు అలా కుల్లిషరఫిన్ వ లకల్‌హమ్దు అలాకుల్లిహాల్.

"అల్లాహ్ సకల ఔన్నత్యాలకు అధిపతివి నీవే. సర్వావస్థలందు సర్వస్తోత్రాలకు నీవే అర్హుడవు."

8. రాత్రి ఎక్కడయినా బసచేయవలసివస్తే సురక్షితమైన ప్రదేశంలో బస చెయ్యాలి. దొంగలు, దోపిడీదారుల బారినుండి ధనప్రాణాలు సురక్షితంగా ఉండేలా చూసుకోవాలి. విషకీటకాలవల్ల ఎలాంటి అపాయం జరగకుండా జాగ్రత్తపడాలి.

9. ప్రయాణాశయం నెరవేరగానే ఇంటికి తిరిగి రావడంలో త్వొందరపడాలి. అనవసరంగా తిరుగాడటం శ్రేయస్కరం కాదు.

10. ప్రయాణం నుండి తిరిగివచ్చిన వెంటనే కబురు చేయకుండా రాత్రిళ్ళు ఇంటికి వెళ్ళడం మంచిదికాదు. వీలయితే మొదటే కబురు చేయాలి. అలా కాకపోతే మస్జిద్‌లో రెండు రకాతులు నఫిల్ నమాజు చేయండి, తద్వారా ఇంటి వారికి సర్వం సిద్ధంచేసుకొని, మీకు స్వాగతం పలకడానికి అవకాశం లభిస్తుంది.

11. ప్రయాణంలో ఏదయినా పశువు తోడుగా ఉన్నట్లయితే దానికి కూడా విశ్రాంతిని, సౌకర్యాలను కలుగచేయాలి.

12. చలికాలంలో అవసరమైన పరుపు మొదలైనవి వెంట ఉంచుకోవాలి. మీకు ఆతిథ్యమిచ్చేవారికి అనవసర శ్రమ కలగకుండా ఉంటుంది.

13. ప్రయాణంలో పారిశుధ్యాన్ని పాటించడానికి, వుజూ, నమాజు చేసుకోడానికి, నీళ్ళు త్రాగడానికి కష్టం కలగకుండా ఉండేందుకు నీళ్లపాత్ర, జానిమాజ్ వెంట ఉంచుకోవాలి.

14. కొందరు వ్యక్తులు కలిసి ప్రయాణం చేస్తే వారు తమలో ఒకరిని తమ అమీరు (నాయకుడు)గా ఎన్నుకోవాలి. అయితే ప్రతివ్యక్తి తన టికెట్టు, అవసరమైన డబ్బు తదితర సామగ్రి తన అధీనంలోనే ఉంచుకోవడం మంచిది.

15. ప్రయాణంలో రాత్రి అయినట్లయితే ఈ దుఆ పఠించాలి.

يَا اَرْضُ ! رَبِّيْ وربُّكِ اللهُ اَعُوْذُ بِاللهِ مِنْ شَرِّكِ وَشَرِّمَا خُلِقَ فِيْكِ
وَشَرِّمَا يَدِبُّ عَلَيْكِ وَاَعُوْذُ بِاللهِ مِنْ اَسَدٍ وَّاَسْوَدَ وَمِنَ الْحَيَّةِ
وَالْعَقْرَبِ وَمِنْ شَرِّ سَاكِنِي الْبَلَدِ وَمِنْ وَّالِدٍ وَّمَا وَلَدَ (ابوداؤد)

యా అర్జు ! రబ్బీ వ రబ్బుకిల్లాహు అఊజుబిల్లాహి మిన్ షర్రికి వ షర్రిమాఖులిక ఫీకి వ షర్రిమా యదిబ్బు అలైకి వ అఊజుబిల్లాహి మిన్ అసదివ్వ అస్వద వ మినల్ హయ్యాతి వల్ అక్రబి వ మిన్ షర్రి సాకినిల్ బలది వ మివ్వాలిదివ్వమా వలద్. (అబూ దావూద్)

ఓ భూమీ ! నీకూ నాకూ ప్రభువు అల్లాహ్ ఒక్కడే. నీలోని చెడులనుండి, నీలో దైవం పుట్టించిన ప్రాణుల చెడునుండి నీ మీద సంచరించే ప్రాణుల చెడునుండి, పులి, పాము, తేలు ఇత్యాది విష కీటకాల బారినుండి ఈ పురవాసుల కీడునుండి, ఇంకా తండ్రి కొడుకుల కీడునుండి దేవుణ్ణి శరణు వేడుకుంటున్నాను.

16. ప్రయాణంనుండి ఇంటికి తిరిగి రాగానే ఈ దుఆ పఠించాలి.

اَوْبًا اَوْبًا لِّرَبِّنَا تَوْبًا لَّا يُغَادِرُ عَلَيْنَا حَوْبًا۔ (حصن حصين)

అవ్‌బన్, అవ్‌బల్లి రబ్బినా నౌబల్లా యుగాదిరు అలైనా హౌబా. (హిస్నె హసీన్)

"మరలిపోవాలి, మన ప్రభువు వద్దకే మరలి పోవాలి. మన ప్రభువు సమ్ముఖంలోనే క్షమాభిక్ష వేడుకోవాలి. అపరాధాల ప్రభావం ఏమాత్రం మిగలకుండా ఉండేవిధంగా క్షమాపణ కోరుకోవాలి."

17. ఎవరినైనా ప్రయాణానికి సాగనంపేటప్పుడు అతనికి తోడుగా కొంత దూరం పోవాలి. సాగనంపేటప్పుడు అతన్ని దుఆ చేయమని కోరాలి. మీరు కూడా ఈ దుఆ పఠిస్తూ అతన్ని సాగనంపాలి.

أَسْتَوْدِعُ اللهَ دِيْنَكَ وَأَمَانَتَكَ وَخَوَاتِيْمَ عَمَلِكَ ٭

అస్తౌదిఉల్లాహ దీనక వ అమానతక వ ఖవాతీమ అమలిక

"నేను నీ ధర్మాన్ని, నీ అమానతును, నీ కర్మల అంతాన్ని దేవుని అధీనం చేశాను." (హిస్న్ హసీన్)

18. ప్రయాణం నుండి తిరిగివచ్చిన వ్యక్తిని సాదరంగా ఆహ్వానించాలి. ప్రేమపూర్వకంగా పలకరించాలి. సమయానుకూలంగా కరచాలనం చేయడమో కౌగిలించుకోవడమో చెయ్యాలి.

# 8. ఆవేదన ఓ ఆరాధన

1. కష్టాలను ఓరిమితో సహించాలి. ధైర్యాన్ని ఎట్టి పరిస్థితిలోనూ విడనాడరాదు. కష్టాల వల్ల కలిగే దుఃఖాన్ని ఎప్పుడూ హద్దు మీరనివ్వకూడదు. ప్రపంచంలో పుట్టిన వారెవరైనా బాధలు, దుఃఖాలు, కష్టాలు, ఆపదలు, పరాజయాలు, నష్టాలను తప్పించుకుని సదా ప్రశాంతంగా మనలేరు. అయితే దైవ విశ్వాసంలేని వ్యక్తి, బాధలు, దుఃఖాల పరంపర వల్ల వ్యాకులపడి మతి పోగొట్టుకుంటాడు. నిరాశకు లోనయి పనీపాటా మానివేస్తాడు. కొన్నిమార్లు బాధలకు తట్టుకోలేక ఆత్మహత్య చేసుకుంటాడు. కాని "విశ్వాసి" ఎంత పెద్ద దుర్ఘటన సంభవించినా సహనాన్ని వదలుకోడు. సహన స్థయిర్యాలకు ప్రతీకగా, పర్వతంలా నిలబడతాడు. అతని ఆలోచనా సరళి ఈ విధంగా ఉంటుంది : 'జరిగిందంతా దైవ నిర్ణయంవల్ల జరిగింది. దైవం చేసే ఏ కార్యమయినా, ఆయన ఇచ్చే ఏ ఆదేశమయినా మర్మ హేతువులేకుండా ఉండదు. దైవం ఏదిచేసినా దాసుని మేలు కొరకే.' ఈ భావన వల్ల విశ్వాసికి ఆత్మపరమయిన శాంతి, సంతృప్తి లభిస్తాయి. తద్వారా బాధల చేదు సయితం అతనికి రుచికరమనిపిస్తుంది. అందులోనే అతనికి ఆనందం లభిస్తుంది. అదృష్టంపట్ల మనిషికి ఉండే ఈ నమ్మకం అతని కష్టాలను స్వాదిష్టంగా చేస్తుంది. దైవగ్రంథంలో ఇలా ఉంది :

ప్రపంచంలో ఎదురయ్యే కష్టాలు ,మనకు తారసిల్లే ఆపదలన్నీ మనముందు ప్రత్యక్షమవక పూర్వం ఒక గ్రంథంలో ( వ్రాయబడి, భద్రపరచబడి) ఉంటాయి. ఇలా చెయ్యడం అల్లాహ్‌కు సులువయినపనే - దీనిద్వారా మీరు మీ పరాజయాలపట్ల ఖేదపడకుండా ఉండాలి. *(అల్ హదీద్ : 22,23)*

అంటే విధిని నమ్మడంవల్ల విశ్వాసి ఎంతపెద్ద ఆపద వచ్చిపడినా దాన్ని తన విధి లిఖితమని భావించి తన బాధకు నివారణా మార్గాన్ని పొందుతాడు. దానివల్ల వ్యాకులపడడు. అతడు ప్రతి విషయంలోనూ కరుణామయుడయిన తన ప్రభువునుండి మేలే జరుగుతుందని భావించి, సహనం సంతృప్తులతో ప్రతి విషయంలోనూ తనకుగల మేలును గుర్తిస్తాడు. మహాప్రవక్త(సఅసం) అన్నారుః విశ్వాసి వ్యవహారం అన్నిటా లాభకరమయినదే. అతడు ప్రతి రూపంలోనూ మేలునే పొందుతాడు. అతడు బాధల్లో ఉన్నా, రోగగ్రస్తుడయినా, లేమికి గురైనా దాన్ని ప్రశాంతంగా సహిస్తాడు. ఆ విధంగా పరీక్ష అతని పట్ల శుభప్రదంగా పరిణమిస్తుంది. అతనికి సంతోషం, సుఖం, ఐశ్వర్యం ప్రాప్తిస్తే అల్లాహ్‌కు కృతజ్ఞుడయి మెలుగుతాడు. ఈవిధంగా సిరి కూడా అతనికి శుభప్రదమవు తుంది.(ముస్లిం)

2. విచారాన్ని, బాధను కలిగించే వార్త విన్నప్పుడుగాని, ఏదైనా కష్టం సంభవించినప్పుడుగాని, దుఃఖం, ఆవేదన కలిగినప్పుడుగానీ లేక అనుకోని ఆపదలో (దైవం రక్షించుగాక) చిక్కుకున్నప్పుడుగాని వెంటనే 'ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజిఊన్' 'మేము దైవాధీనులము, ఆయన వద్దకే తిరిగి వెళ్ళవలసిన వాళ్ళము' అనాలి. అంటే, అన్ని పరిస్థితులలోనూ దేవుని ఇష్టమే మా ఇష్టం. ఆయన చేసే ప్రతిపనిలో వివేచన, ఔచిత్యం, న్యాయం ఉంటాయి. ఆయన ఏమిచేసినా దాని వెనుక మహెూత్కృష్టమైన శుభముంటుంది. ఏ సమయంలోనూ ముఖంలో విచార రేఖలు వ్యక్తం కాకుండా ప్రయత్నించడం విశ్వసనీయుడైన సేవకుని కర్తవ్యం.

దైవవాణిలో ఉంది: "మేము తప్పకుండా మిమ్మల్ని భయానికి, ఆపదకు, ఆకలికి గురిచేసి, మీ ధనప్రాణాల, మీ సంపదల నష్టంద్వారా మిమ్మల్ని పరీక్షిస్తాము. ఎవరైతే ఆపద వచ్చినప్పుడు దాన్ని స్థయిర్యంతో సహిస్తారో, 'మేము దేవునికి చెందినవారమే, ఆయన వద్దకే తిరిగి వెళ్ళేవాళ్ళమని' అంటారో (ఓ ప్రవక్తా) వారికి శుభవార్తను తెలియజేయండి. వారిపై వారి ప్రభువు వైపునుండి గొప్ప వరాలు, కరుణ, కటాక్షాలు వర్షింపచేయబడతాయి. అటువంటివారే ఋజుమార్గంలో ఉన్నారు."

మహాప్రవక్త (సఅసం) బోధించారు, 'ఒక దాసుడు ఆపదలో ఉన్నప్పుడు, ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి.... అని పఠిస్తే దేవుడు అతని ఆపదను దూరం చేస్తాడు. అతనికి మంచి ఫలితాన్ని ప్రసాదిస్తాడు, అతనికి ఇష్టమైన ప్రతిఫలాన్ని అందుకు బదులుగా ప్రసాదిస్తాడు.' ఒకసారి ప్రవక్త (సఅసం)సమక్షంలో దీపం ఆరిపోయింది. అప్పుడాయన 'ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజిఊన్' పఠించారు. ఎవరో అన్నారు, 'దైవప్రవక్తా! దీపం ఆరిపోవడంకూడా ఆపదేనా?' అని. 'అవును. విశ్వాసికి కష్టం కలిగించే ఏ విషయమైనా ఆపదే' అని ఆయనజవాబిచ్చారు.

ఆయన ఇంకా ఇలా అన్నారు – "ఏ విశ్వాసి అయినా మానసిక ఆవేదన శారీరక బాధ, వ్యాధి, దుఃఖం, విచారాలకు లోనైనప్పుడు – చివరికి ఒక ముల్లు గుచ్చుకున్నప్పటికీ–అతను మాత్రం ఓర్పుతో భరిస్తే దేవుడు అతని అపరాధాలను క్షమిస్తాడు. (బుఖారీ, ముస్లిమ్)

హజ్రత్ అనస్ (రజి) ప్రవక్త (సఅసం) ప్రవచనాన్ని ఉల్లేఖించారు :

"ఓర్పుతో ఎంత కఠినమైన పరీక్షను, కష్టాన్ని ఎదుర్కొంటే అంత గొప్ప ప్రతిఫలం లభిస్తుంది. దైవం తాను ప్రేమించే ప్రజలను ప్రక్షాళనం చేసి, మేలిమి బంగారంలా మెరుగుపరచడానికి వారిని పరీక్షకు గురిచేస్తాడు. కాబట్టి దేవుని ఇష్టమే

తమ ధ్యేయంగా భావించిన వారిని దేవుడు తన ప్రేమపాత్రులుగా పరిగణిస్తాడు. ఎవరైతే ఈ పరీక్షలో దైవం పట్ల అయిష్టత చూపుతారో వారిని దేవుడుకూడా ఇష్టపడడు." (తిర్మిజి)

హజ్రత్ అబూ మూసా అష్అరి (రజి) ప్రవక్త (సఅసం) ఇలా బోధించారని చెప్పారు - "ఒక మనిషి సంతానం చనిపోయినప్పుడు దైవం తన దూతలతో మీరు నా దాసుని బిడ్డ ప్రాణాలు తీశారు కదా?" అని అడుగుతాడు. వారు అవునని అంటారు. అప్పుడాయన 'నా దాసుని ప్రాణసమానుని ప్రాణం తీశారు కదా?' అంటాడు, అవునని వారు జవాబు చెబుతారు - అప్పుడు దేవుడు, 'నా దాసుడేమన్నాడు' అని వారిని అడుగుతాడు. ఈ ఆపదలో అతడు మిమ్మల్ని స్తుతించాడు.

إِنَّا لِلّٰهِ وَإِنَّا إِلَيْهِ رَاجِعُوْنَ.

'ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజిఊన్' (మనమంతా అల్లాహ్‌కు చెందినవారమే. ఆయన వైపునకే మరలిపోతాము) పఠించాడు అని వారు విన్నవిస్తారు. అందుకు దేవుడు ప్రసన్నుడై వారితో అంటాడు - 'అయితే నా దాసునికి స్వర్గంలో ఒక గృహాన్ని నిర్మించండి. దానికి బైతుల్ హమ్ద్ (స్తుతి మందిరం) అని పేరు పెట్టండి." (తిర్మిజి)

3. ఒక ప్రమాదంగానీ, లేక బాధగానీ కలిగినప్పుడు విచారాన్ని వెలిబుచ్చడం స్వాభావికం అయితే భరించరాని ఆవేదనలో, దుఃఖంలో కూడా అనరాని మాట నోటరాకుండా, సహనం, దైవ కృతజ్ఞతా భావం దూరమవకుండా జాగ్రత్తపడాలి. మహాప్రవక్త (సఅసం) పుత్రుడు హజ్రత్ ఇబ్రాహీమ్ అవసాన దశలో మహాప్రవక్త ఒడిలో ఉన్నారు. గుండెలు ద్రవించిపోయే ఆ దృశ్యాన్ని చూచి ప్రవక్త (సఅసం) కళ్ళనుండి అశ్రువులు రాలాయి. ఆయన ఎంతో నిగ్రహంతో అన్నారు : 'ఇబ్రాహీమ్ ! నీ ఎడబాటు మమ్మల్ని విషాదంలో ముంచి వేసింది. కాని దేవునికి ఇష్టమయినమాటే నా నోటినుండి వస్తుంది.' (ముస్లిమ్)

4. తీవ్రమయిన విచారంలో కూడా కృతఘ్నత తెలిపే అప్రియమైన పదాలు దొర్లకుండా, అవి ఇస్లామ్ చట్టానికి (షరీఅత్‌కు) వ్యతిరేకంగా ఉండకుండా జాగ్రత్తపడాలి. గుండెలు బాదుకుంటూ రోదించడం, బట్టలు చింపుకోవడం, చెంపలేసుకోవడం, గొంతు చించుకొని అరవడం, తలపైన ఛాతిపైన బాదుకోవడం విశ్వాసికి ఏ విధంగానూ తగదు. ఏ వ్యక్తి అయితే దుస్తులు చింపుకోవడం, చెంపలపై కొట్టుకోవడం, మూఢునివలె అరవడం, ఏడ్వడం, రోదించడం లాంటి పనులు చేస్తాడో అతడు నా అనుచర సమాజం (ఉమ్మత్)లోని

వాడుకాడు అని ప్రవక్త ప్రవచించారు. (తిర్మిజి)

హజ్రత్ జాఫర్ తయ్యార్(రజి) అమరగతుల (షహీద్) య్యారు. ఆ వార్త ఆయన ఇంటివారికి అందగానే మహిళలు బిగ్గరగా ఏడ్వసాగారు. గుండెలు బాదుకున్నారు. ప్రవక్త (సఅసం) అలా చేయవద్దని చెప్పి పంపించారు. అయినా వారు వినలేదు. మళ్ళీ ఆయన రెండవసారి వారించారు. అప్పటికీ వారు వినలేదు. తుదకు ప్రవక్త(సఅసం) వారి నోళ్లను మట్టితో నింపివేయండి అని ఆజ్ఞాపించారు. (బుఖారి)

ఒకసారి ఆయన (సఅసం) ఒక మృతుని అంత్య క్రియల్లో పాల్గొనడానికి వెళ్ళారు. ఒక స్త్రీ నిప్పు పాత్రను పట్టుకొని అక్కడికి వచ్చింది. ఆయన (సఅసం) ఆమెను గట్టిగా మందలించగానే ఆమె పారిపోయింది. (సీరతున్నబి - ఆరవ భాగం)

ప్రవక్త (సఅసం) అన్నారు : "శవం వెంట నిప్పు తీసుకొని వెళ్ళడం, ఏడ్వడం తగదు". అరేబియాలో శవం వెంట వెళ్తున్నప్పుడు సంతాప సూచకంగా దుప్పటిని వదలివేయడం ఆచారం. చొక్కా మాత్రమే ఉండనిచ్చేవారు. ఒకసారి ఆయన (సఅసం) ప్రజల్ని ఆ స్థితిలో చూడగానే "మీరు మూఢాచారాన్ని ఆచరిస్తున్నారు. మిమ్మల్ని ఈ స్థితిలో చూచి, మీరూపం వికృతమయ్యేలా శపించాలని అనిపించింది" అన్నారు. ప్రజలు తక్షణమే తమ తమ దుప్పట్లను కప్పుకున్నారు. ఇంకెప్పుడూ ఆ విధంగా చెయ్యలేదు.(ఇబ్నె మాజా)

5. వ్యాధిని నిందించరాదు. దైవంపట్ల, విధిపట్ల ఎటువంటి ఫిర్యాదులు చేయకుండా సహనం, ఓర్పువహించాలి. తుది దినాన ప్రతిఫలాన్ని కాంక్షించాలి.

వ్యాధిని, బాధను ఓర్పుతో భరిస్తే విశ్వాసి పాపాలు హరించుకుపోతాయి. ఆత్మ ప్రక్షాళన జరుగుతుంది. ప్రళయ దినాన ఉత్తమమైన పుణ్యఫలం లభిస్తుంది. ప్రవక్త(సఅసం) ఇలా అన్నారు-విశ్వాసికి శారీరక బాధవల్లగాని, వ్యాధివల్ల గాని లేక మరే కారణం వల్లగాని కష్టం కలిగినట్లయితే దానికి బదులుగా, వృక్షం తన ఆకుల్ని రాల్చివేసినట్లు దేవుడు అతని పాపాలను ప్రక్షాళన చేసివేస్తాడు. (బుఖారి,ముస్లిం)

ఒకసారి ప్రవక్త(సఅసం) ఒక స్త్రీ నిలువెల్లా వణికిపోవడం చూసి అడిగారు, "ఉమ్మె సాయబ్ ! ఏం జరిగింది, నీవెందుకు ఇలా వణికిపోతున్నావ్?" దానికి ఆమె ఇలా అన్నది, "నాకు బాగా జ్వరం వచ్చింది, దాని పాడుగాను" అప్పుడు మహాప్రవక్త (సఅసం) "వద్దు, జ్వరాన్ని తిట్టకు, ఎందుకంటే ఇనుముకు పట్టిన తుప్పును నిప్పు ఎలా శుభ్రం చేస్తుందో, అలాగే మానవుల్ని పాపాలనుండి జ్వరం పరిశుద్ధం చేస్తుంది." (ముస్లిమ్)

హజ్రత్ అతా ఇబ్నె రబాహ్ (రహ్) తనకు సంబంధించిన ఓ గాధను ఇలా

వినిపించారు. "ఒకసారి కాబావద్ద హజ్రత్ అబ్బాస్ (రజి) నాతో అన్నారు, 'నీకు స్వర్గ ప్రవేశం చేసే ఒక మహిళను చూపించనా?' తప్పకుండా చూపించండి, అని నేనన్నాను. చూడు నల్లగా ఉన్న ఆ స్త్రీయే, ఆమె ఒకసారి ప్రవక్త (సఅసం) సమ్ముఖాన హాజరై, 'దైవప్రవక్తా ! నాకు మూర్ఛవస్తే ఇక స్పృహ ఉండదు. నేను ఆ స్థితిలో పూర్తిగా వివస్త్రనయిపోతాను. దైవప్రవక్తా! నా విషయంలో దైవాన్ని ప్రార్థించండి.' అని వేడుకున్నది. ప్రవక్త (సఅసం) అన్నారు : 'నీవు ఈ బాధను సహనంతో సహిస్తే దేవుడు నీకు స్వర్గాన్ని ప్రసాదిస్తాడు. నీవు కోరుకుంటే దేవుడు నీకు ఆరోగ్యం ప్రసాదించడానికి ప్రార్థిస్తాను'. అది విని ఆ స్త్రీ అన్నది: 'దైవప్రవక్తా ! నేను ఈ బాధను ఓర్పుతో భరిస్తూ ఉంటాను. కాని నేను ఆ స్థితిలో వివస్త్రనయిపోకుండా ప్రార్థన చేయండి.' ప్రవక్త (సఅసం) అలాగే ప్రార్థించారు – ఇంకా హజ్రత్ అతా ఇలా అన్నారు : 'చాలా పొడుగ్గావుండే ఆ స్త్రీ ఉమ్మె రఫ్జను నేను కాబా మెట్లపై చూశాను.'

6. ఎవరైనా చనిపోతే మూడు దినాలు మాత్రమే సంతాపాన్ని వ్యక్తపరచ వచ్చు. తమ బంధువులు చనిపోతే విషాదంగా ఉండడం, కన్నీరు కార్చడం సహజమే. కాని అది ఇస్లామ్ ప్రకారం మూడు దినాలకు మించరాదు. ప్రవక్త (సఅసం) అన్నారు : "ఒకరి మృత్యువుపట్ల మూడు దినాలకు మించి సంతా పాన్ని వెలిబుచ్చడం ఏ విశ్వాసికీ తగదు." అయితే విధవరాలికి మాత్రం సంతాప దినాలు నాలుగునెలల పది దినాలు. ఆ గడువులో ఆమె రంగుదుస్తులు ధరించ రాదు. సువాసన ద్రవ్యాలు వాడరాదు. ఇతర అలంకరణలు చేసుకోరాదు.(తిర్మిజి)

హజ్రత్ జైనబ్ బిన్తె జహష్ సోదరుడు చనిపోయాడు. నాల్గవదినాన సంతాపాన్ని తెలపడానికి కొందరు మహిళలు వచ్చారు. ఆమె అందరిముందు సువాసన (అత్తరు) పూసుకొని ఇలా అన్నది : 'ఈ తరుణంలో నేను సువాసన వాడే అవసరం లేదు, కాని ఒక ముస్లిమ్ మహిళ తన భర్త విషయంలో తప్ప ఏ బంధువు విషయంలోనూ మూడు దినాలకు మించి సంతాపం కనబరచరాదు అని మహాప్రవక్త బోధించడంవల్ల ఈ అత్తరు వాడుతున్నాను.'

7. విచారం, బాధ, కష్టాల్లో ఉన్నప్పుడు సహనంతో ఉండాలని ఒకరినొకరు హితవు చేసుకోవాలి. ప్రవక్త (సఅసం) ఉహుద్ పోరాటంనుండి తిరిగివస్తుండగా మహిళలు తమ తమ కుటుంబీకుల, బంధువుల క్షేమ సమాచారాలు తెలుసుకోడానికి హాజరయ్యారు. హజ్రత్ హమ్న బిన్తె జహష్ ప్రవక్త (సఅసం) సమ్ముఖానికి వచ్చి నప్పుడు ఆమెకు తన సోదరుని విషయంలో సహనం వహించాల్సిందిగా హితవు చేశారు. అందుకు ఆమె "ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజిఊన్" చదివి తన సోదరునికి మోక్షం ప్రసాదించమని అల్లాహ్‌ని వేడుకుంది. ఆయన (సఅసం) మీ

మామగారైన హమ్‌జా విషయంలో కూడా సహనం వహించమన్నారు. ఆమె మళ్ళీ "ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజిఊన్" పఠించి ఆయన మోక్షం కొరకు ప్రార్థించింది.

హజ్రత్ అబూ తల్హా(రజి) పుత్రుడు వ్యాధిగ్రస్తుడయ్యాడు. ఆయన ఆ అబ్బాయిని ఆ స్థితిలోనే వదిలి తన పనిమీద వెళ్ళిపోయాడు. ఆయన వెళ్ళిపోగానే పిల్లవాడు చనిపోయాడు. అబూ తల్హా (రజి) సతీమణి ఈ వార్త ఆయనకు తెలియచేయరాదని అందరికీ చెప్పింది. ఆయన సాయంకాలం ఇంటికి వచ్చిన తరువాత అబ్బాయి స్థితి ఎలా ఉందని భార్యను అడిగారు. పూర్వంకంటే అతి ప్రశాంతంగా ఉన్నాడు అని చెప్పి ఆమె అబూ తల్హా(రజి) కు భోజనం వడ్డించింది. ఆయన తృప్తిగా భోంచేసి నిద్రపోయారు. తెల్లవారగానే పుణ్యశీలియైన భార్య జ్ఞానయుక్తంగా భర్తను అడిగింది.

"ఒకరు మరొకరికి అమానతుగా ఏదైనా వస్తువును ఇచ్చి మళ్ళీ తిరిగి అడిగితే ఇవ్వకుండా అట్టే పెట్టుకునే హక్కు వారికుందా?" అబూ తల్హా (రజి) "ఆ హక్కు అసలు వారికి ఎక్కడనుండి సంక్రమిస్తుంది" అని ఎదురు ప్రశ్నవేశారు. అందుకు ఆ సహనశీలి అయిన భార్య తన పుత్రుని విషయంలో కూడా సహనం వహించమని అన్నది. (ముస్లిమ్)

8. ధర్మమార్గంలో సంభవించే ఆపదలను ధైర్యంగా సహించాలి. ఈ మార్గంలో ఏ కష్టం కలిగినా చింతించడానికి బదులు సంతోషంగా దేవునికి కృతజ్ఞతలర్పించుకోవాలి. ఎందుకంటే తన మార్గంలో మీరు త్యాగం చేయడం ఆయనకు ఇష్టకరమయినది.

హజ్రత్ అబ్దుల్లాహ ఇబ్నె జుబైర్(రజి) తల్లిగారైన హజ్రత్ అస్మా(రజి)కు తీవ్రంగా జబ్బుచేసింది. హజ్రత్ జుబైర్ (రజి) తల్లిని పరామర్శించడానికి వచ్చారు. ఆ మాతృమూర్తి, 'అబ్బాయ్, నా హృదయంలో రెండు కోరికలున్నాయి. వాటిలో ఏదో ఒకటి నా కళ్ళతో చూసేవరకు దేవుడు నన్ను సజీవంగా ఉంచా లని నా అభిలాష. అదేమంటే ఒకటి నీవు రణరంగంలో అమరగతుడివి (షహీద్) అయినా కావాలి లేదా నీవు విజయం సాధిస్తే, నిన్ను విజయునిగా చూసే భాగ్యానికి నా కళ్ళు నోచుకోవాలి.' అని అన్నారు. అయితే దేవుడు హజ్రత్ అబ్దుల్లాహ ఇబ్నె జుబైర్ (రజి) కు ఆయన తల్లి జీవించి ఉండగానే షహాదత్ ప్రసాదించాడు. మరణానంతరం హజ్జాజ్ ఆయనను ఉరికంబానికి వ్రేలాడదీశాడు. హజ్రత్ అస్మా (రజి) పండు ముసలి అయిపోయింది. చాలా బలహీనంగా ఉన్నప్పటికీ గుండె తరుక్కుపోయే ఆ దృశ్యాన్ని చూడ్డానికి వచ్చారామె. తనలోని ఓ భాగమైన బిడ్డ శవాన్ని చూసి తల బాదుకొని రోదించడానికి బదులు

హజ్జాజ్‌ను సంబోధిస్తూ 'రౌతుకు స్వారీపై నుండి దిగే సమయం ఇంకా రాలేదా?' అన్నారా సహనమూర్తి (రజి).

9. దుఃఖంలో, బాధల్లో ఒకరికొకరు తోడుగా ఉండాలి. మిత్రుల కష్టం, దుఃఖాల్లో పాలుపంచుకోవాలి - వారి కష్టాన్ని దూరం చేయడానికి అన్ని విధాలా సహాయం చేయాలి. ప్రవక్త (సఅసం) ప్రవచించారు : "ముస్లిములందరూ ఒక శరీరం వంటివారు. ఒక కన్ను బాధపడితే శరీరమంతా బాధ పడుతుంది. తల నొప్పిగా ఉంటే పూర్తి శరీరం బాధను అనుభవిస్తుంది." (ముస్లిమ్)

హజ్రత్ జాఫర్ తయ్యార్ (రజి) అమరగతులైనప్పుడు మహాప్రవక్త (సఅసం) అన్నారు : "జాఫర్ (రజి) ఇంటికి భోజనం పంపించండి, ఎందుకంటే దుఃఖంలో మునిగివున్న ఇంటివారు వంటచేసుకోలేరు. (అబూదావూద్)

హజ్రత్ అబూ హురైరా (రజి) ప్రవక్త (సఅసం) ప్రవచనాన్ని ఇలా ఉల్లేఖించారుః "కొడుకు చనిపోయిన స్త్రీని పరామర్శించిన వ్యక్తి స్వర్గంలో ప్రవేశిస్తాడు. అతనికి స్వర్గలోకపు శాలువ కప్పబడుతుంది.(తిర్మిజి)

ప్రవక్త(సఅసం) ఇలా అన్నారుః బాధల్లో ఉన్న వ్యక్తిని పరామర్శించినవారికి ఆ బాధల్లో ఉన్న వ్యక్తికి లభించే పుణ్యఫలంతో సమానమయిన పుణ్యఫలం ప్రాప్తమవుతుంది. (తిర్మిజి)

ఒకరి దుఃఖంలో పాలుపంచుకోవడం అంటే మరణించిన వారి అంత్యక్రియల్లో పాల్గొనడం కూడా అందులో చేరివుందని ప్రవక్త (సఅసం) పేర్కొన్నారు. ప్రవక్త (సఅసం) ఇలా అన్నారని హజ్రత్ అబూ హురైరా (రజి) తెలిపారు : "అంత్యక్రియల్లో పాల్గొని, నమాజ్ జనాజా కూడా చేసినవ్యక్తికి 'ఓ ఖీరాత్' దానం చేసినంత పుణ్యఫలం లభిస్తుంది. నమాజ్ జనాజా తరువాత ఖననం చేయడంలో కూడా పాల్గొన్నవారికి రెండు ఖీరాత్ దానాల పుణ్యఫలం దొరుకుతుంది." ఎవరో అడిగారు, రెండు ఖీరాత్‌లు అంటే ఎంత అని. "రెండు పర్వతాలకు సమానం" అని జవాబిచ్చారు మహాప్రవక్త.

10. కష్టాన్ని, దుఃఖాన్ని ఎదుర్కొంటున్నప్పుడు ఆంతర్యం దైవం వైపునకు మరలాలి. నమాజ్ చేసి అత్యంత వినయవినమ్రతలతో దైవాన్ని వేడుకోవాలి. ఖుర్ఆన్‌లో ఇలా ఉంది : "యా అయ్యుహల్లజీన ఆమనుస్తయీనూ బిస్సబ్రి వస్సలాత్" (అల్ బఖర)

"విశ్వాసుల్లారా! కష్టాల్లో, దుఃఖాల్లో సహనం ద్వారాను, నమాజ్ ద్వారాను సహాయం పొందండి."

దుఃఖ సమయాల్లో కన్నీరు కార్చడం, విచారించడం, మానవ నైజం. కాని తల బాదుకోవడం, బిగ్గరగా ఏడ్వడం సమంజసం కాదు. దానిని మానుకోవాలి. ప్రవక్త(సఅసం) దుఃఖిస్తున్నప్పుడు శబ్దం వచ్చేదికాదు. నిట్టూర్చేవారు, కళ్ళనుండి అశ్రుధారలు ప్రవహించేవి. గుండెనుండి నీరు కాగుతున్నట్టు లేక తిరగలి ఆడుతున్నట్లు శబ్దం వచ్చేది. ఆయన(సఅసం) స్వయంగా తన దుఃఖాన్ని ఇలావివరించారు.

"కళ్ళు అశ్రువుల్ని వర్షిస్తాయి. హృదయాన్ని విచారం అలుముకుంటుంది. అయినా ఏ మాటవలన మన ప్రభువు సంతోషిస్తాడో అదే మన నోటినుండి వెలువడాలి." ప్రవక్త(సఅసం) దుఃఖంలో ఉన్నప్పుడు ఆకాశంవైపు మాటిమాటికీ తలఎత్తి **"సుబ్‌హానల్లాహిల్ అజీమ్"** (మహోన్నతుడైన అల్లాహ్ ఎంతో పవిత్రుడు) అని, ప్రార్థనలో అధికంగా లీనం అయినప్పుడు **"యా హయ్యుయా ఖయ్యూమ్"** (నిత్యుడు, సజీవుడైన ఓ స్వామీ) అనే వారని హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖించారు. (తిర్మిజి)

11. తీవ్రమయిన బాధ, దుఃఖం, ఆందోళన, అశాంతి ఆవరించిన సమయాల్లో ఈ దుఆ పఠించాలి. హజ్రత్ సాద్ ఇబ్నె అబీ వక్కాస్(రజి) ప్రవక్త (సఅసం) ఇలా బోధించారని తెలిపారు : "జున్నూన్, అంటే హజ్రత్ యూనుస్ (అ.స) చేప కడుపులో ఉన్నప్పుడు తన ప్రభువును వేడుకున్న దుఆ ఇది :

لَآ اِلٰهَ اِلَّآ اَنْتَ سُبْحٰنَكَ اِنِّيْ كُنْتُ مِنَ الظّٰلِمِيْنَ ۝

"లా ఇలాహ ఇల్లా అన్త సుబ్‌హానక ఇన్నీ కున్తు మినజ్జాలిమీన్"

"నీవు తప్ప వేరే ఆరాధ్య దైవం లేనే లేడు. నీవు దోషరహితుడవు. వాస్తవానికి నాపై నేనే అత్యాచారం చేసుకున్నాను."

అంటే దుఃఖం, బాధల్లో ఈ దుఆ పఠించే విశ్వాసిని అల్లాహ్ తప్పకుండా మన్నిస్తాడు అని మహాప్రవక్త (సఅసం) భావం. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) ప్రవక్త(సఅసం) బాధ, విచారంలో ఉన్నప్పుడు ఈ దుఆ పఠించేవారని చెప్పారు.

لَآ اِلٰهَ اِلَّا اللّٰهُ رَبُّ الْعَرْشِ الْعَظِيْمِ، لَآ اِلٰهَ اِلَّا اللّٰهُ رَبُّ السَّمٰوٰتِ وَرَبُّ الْاَرْضِ رَبُّ الْعَرْشِ الْكَرِيْمِ (بخاری، مسلم)

"లా ఇలాహ ఇల్లల్లాహు రబ్బుల్ అర్షిల్ అజీమ్. లా ఇలాహ ఇల్లల్లాహు రబ్బుస్సమావాతి వ రబ్బుల్ అర్జి వ రబ్బుల్ అర్షిల్ కరీమ్."

(బుఖారి, ముస్లిమ్)

"అల్లాహ్ తప్ప వేరే ఆరాధ్యుడు లేడు. మహోన్నతమైన అధికార సింహాసనానికి యజమాని, అల్లాహ్ తప్ప వేరే ఆరాధ్యుడు లేడు. ఆయనే భూమ్యాకాశాల ప్రభువు, గౌరవనీయమైన సింహాసన ప్రభువు."

హజ్రత్ అబూ మూసా (ర.అ) ఉల్లేఖించినదాని ప్రకారం మహనీయ ముహమ్మద్(సఅసం) ఈ వచనాన్ని తొంభయితొమ్మిది రోగాల నివారిణి అని, దీన్ని చదివేవాడు బాధలనుండి దుఃఖాన్నుండి భద్రంగా ఉంటాడని అన్నారు.

لَاحَوْلَ وَلَاقُوَّةَ اِلَّابِاللّٰهِ وَلَامَلْجَامِنَ اللّٰهِ اِلَّآ اِلَيْـهِ

లా హౌల వలా ఖువ్వత ఇల్లా బిల్లాహి వలా మల్జాఅ మినల్లాహి ఇల్లా ఇలైహ్.

"పాపానికి దూరంగా ఉండే శక్తినీ, సదాచరణకు సద్బుద్ధినీ, ప్రసాదించేవాడు కేవలం అల్లాహ్ మాత్రమే. ఆయన ఆగ్రహాన్నుండి తప్పించుకునేందుకు ఆయన తప్ప మరే శరణమూ లేదు."

అంటే ఆయన కారుణ్యచ్ఛాయను వెదికేవానికేతప్ప మరెవరికీ ఎక్కడా ఆయన ఆగ్రహాన్నుండి కాపాడే చోటు దొరకదు అన్నమాట.

హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉపదేశించారు : ఏ వ్యక్తికయినా బాధకలిగితే లేదా కష్టం సంభవిస్తే అతను ఈ క్రింది దుఆ చెయ్యాలి. దైవం అతని బాధను, కష్టాన్ని దూరంచేసి ఆనందాన్ని అనుగ్రహిస్తాడు.

اَللّٰهُمَّ اِنِّیْ عَبْدُكَ وَابْنُ عَبْدِكَ وَابْنُ اَمَتِكَ نَاصِيَتِیْ بِيَدِكَ مَاضٍ فِیَّ حُكْمُكَ ، عَدْلٌ فِیَّ قَضَاءُكَ اَسْئَلُكَ بِكُلِّ اسْمٍ هُوَلَكَ سَمَّيْتَ بِهِ نَفْسَكَ اَوْاَنْزَلْتَهُ فِیْ كِتَابِكَ اَوْعَلَّمْتَهُ اَحَدًا مِّنْ خَلْقِكَ اَوِاسْتَأْثَرْتَ بِهِ فِیْ عِلْمِ الْغَيْبِ عِنْدَكَ اَنْ تَجْعَلَ الْقُرْاٰنَ الْعَظِيْمَ رَبِيْعَ قَلْبِیْ ، وَنُوْرَ بَصَرِیْ وَجَلَآءَ حُزْنِیْ وَذَهَابَ هَمِّیْ (احمد، ابن حبان، حاکم بحوالہ حصن حصین)

అల్లాహుమ్మ ఇన్నీ అబ్దుక, వబ్ను అబ్దిక, వబ్ను అమతిక, నాసియతీ బియదిక, మాజిన్ ఫియ్య హుక్ముక, అద్లున్ ఫియ్యఖజాఉక, అస్అలుక బికుల్లిస్మిన్ హువలక సమ్మైత బిహీ నఫ్సక, ఔ అన్జల్తహూ ఫీ కితాబిక, ఔ అల్లమ్తహూ అహదమ్ మిన్ ఖల్కిక, అవిస్తా తర్తబిహీ ఫీ ఇల్మిల్ గైబి ఇన్దక అన్ తజ్ అలల్ ఖుర్ఆనల్ అజీమ రబీఅకల్బీ వనూరబసరీ, వ జలాఅ హుజ్నీ వ జహాబ హమ్మీ (అహ్మద్, హిస్నుహిసీన్)

"దేవా నేను నీ దాసుణ్ణి, నా తండ్రి నీ దాసుడే, నా తల్లి కూడా నీ దాసీయే, నా జుట్టు నీ హస్తగతమయి ఉంది, నీ ఆదేశమే నాకు వర్తిస్తుంది, నాకు నీవు ఇచ్చే ఆదేశం పూర్తిగా న్యాయమయింది. నీవు నీకు పెట్టుకున్న పేరుమీదుగా, లేదా నీ గ్రంథంలో పేర్కొన్న (నీ పేరు మీదుగా) లేక నీ సృష్టిలో ఎవరికయినా నీవు నేర్పిన (నీ పేరు మీదుగా, లేదా నీ వద్దనే అజ్ఞాత నిధిలోనే దాచి ఉంచిన) నీ పేరుమీదుగా నిన్ను అర్థిస్తున్నాను – దివ్య ఖుర్ఆన్ ని నా మనోవసంతంగా, నా కంటివెలుగుగా, నా బాధల నివారిణిగా, నా ఆందోళనకు పరిష్కారంగా చెయ్యి."

12. జీవితమే దుర్భరమైపోయే కష్టాలూ, ఆపదలు వచ్చిపడినా, అంతా అంధకారం అలుముకున్నట్లు దుఃఖం, బాధ భీకరరూపం దాల్చినా మరణాన్ని కోరుకోరాదు. చేతులారా జీవితాన్ని సర్వనాశనం చేసుకోవడంలాంటి అత్యంత ఏహ్యమైన నేరాన్నీ చేయరాదు. అది పిరికితనం, మహాపాతకం. ఒకవిధంగా నమ్మకద్రోహం కూడా. (దైవం అప్పజెప్పిన జీవితాన్ని దైవానికి అనిష్టకరమైన పంథాలో అంతం చెయ్యడం వల్ల) ఇటువంటి అశాంతిలో ఆందోళనకరమైన సమయాల్లో మన ఆంతర్యం తప్పకుండా దైవ సమ్ముఖానికి మరలాలి. ఆయన్నే ఇలా వేడుకుంటూ ఉండాలి.

اَللّٰهُمَّ اَحْيِنِىْ مَاكَانَتِ الْحَيٰوةُ خَيْرًالِّىْ وَتَوَفَّنِىْ اِذَاكَانَتِ الْوَفَاةُ خَيْرًالِّىْ - (بخاری مسلم)

అల్లాహుమ్మ అహ్యినీ మాకాన తిల్ హయాతు ఖైరఁల్లీవ తవఫ్ఫనీ ఇజా కానతిల్ వఫాతు ఖైరఁల్లీ. (బుఖారి, ముస్లిమ్)

దేవా జీవించి ఉండటం నాకు శ్రేయస్కరమయినంత కాలం నన్ను బ్రతకనివ్వు. నాకు మరణమే శ్రేయస్కరమయినప్పుడు నాకు మృత్యువునే ఇవ్వు.

13. ఎవరినయినా ఆపదల్లో చూసినప్పుడు ఈ దుఆ పఠించండి. హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహోదయులు (సఅసం) ఇలా బోధించారు: "ఎవరయితే ఇతరుల్ని ఆపదలో చూసి ఈ దుఆ పఠిస్తారో, దైవచిత్తమయితే అతను ఆ ఆపదనుండి భద్రంగా ఉంటాడు."

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِىْ عَافَانِىْ مِمَّا ابْتَلَاكَ اللّٰهُ بِهٖ وَفَضَّلَنِىْ عَلٰى كَثِيْرٍ مِّمَّنْ خَلَقَ تَفْضِيْلًا (ترمذی)

అల్ హమ్దు లిల్లాహిల్లజీ ఆఫానీ మిమ్మబ్ తలాకల్లాహు బిహీవ ఫజ్జలనీ అలా కసీరిమ్మిమ్మన్ ఖలక తఫ్జీలా. (తిర్మిజి)

దైవానికి కృతజ్ఞతలు, నీవు లోనయి ఉన్న ఆపదకు నేను గురికాకుండా కాపాడాడు, ఆయన తన సృష్టిరాసిలో అనేకసృష్టితాలకంటే నాకు ఘనతనిచ్చాడు.

# 9. భయం ఆవహించినప్పుడు

1 ధర్మ విరోధులు చేసే హత్యా దౌర్జన్యాలు, అత్యాచారాలు, క్రూరత్వపు కల్లోలాలయినా, సృష్టివైపరీత్యాలైనా ఎలాంటి భయాందోళనల వాతావరణమయినా సరే వాటి నిజ కారణాల్ని కనుగొనాలి. అదే ఒక నిజమయిన ముస్లిమ్ కర్తవ్యం. తాత్కాలికమైన ఉపాయాలపైనే ఆధారపడక ఖుర్‌ఆన్ హదీసుల వెలుగులో శాశ్వత నివారణోపాయాలపైన తమ శక్తినంతా కేంద్రీకరించాలి. దివ్య ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది :

“మీకు తారసిల్లే కష్టాలు మీ కృత్యాల ఫలితమే. దైవం మీరు చేసే అపరాధాలను అనేకం మన్నిస్తూవుంటాడు కూడా”. దీనికి దివ్య ఖుర్‌ఆన్‌లోనే పరిష్కారం కూడా చూపడం జరిగింది. (అష్షూరా *30*)

“విశ్వాసులారా! మీరందరూ కలసి దైవం వైపునకు మరలండి, అప్పుడే మీరు సాఫల్యం పొందగలరు.”

మరలడం అంటే, పాపపంకిలంలో పడ్డ మానవులు, తమ అపరాధాల పట్ల పశ్చాత్తాపంతో కళ్ళనుండి ఒలికే అశ్రువులతో దైవసన్నిధిలో విధేయతా భావం ప్రకటించి, తమ అపరాధాల మలినాన్ని క్షాళన చేసుకుని దైవంపైన తమ విశ్వాసాన్ని పునఃస్థాపితం చేసుకునే పరిస్థితిని దివ్య ఖుర్‌ఆన్ ‘తౌబా’ అంటుంది- అదే మరలడం అంటే. ఈ ‘మరలడమే’ సకల విపత్తులనుండి, కలతలనుండి, భయాందోళనలనుండి విముక్తి పొందే నిజమయిన మార్గం.

2. మతోన్మాదులు, దౌర్జన్యపరులు రేకెత్తించే కల్లోలాలు, హింస, అత్యాచారాలకు భయపడి వారిని క్షమాభిక్ష పెట్టమని కోరే తత్వంతో మన సామాజిక జీవితానికి కళంకం తెచ్చిపెట్టరాదు. అలాంటి బలహీనతను ఎదుర్కొని, సాహసంతో, దౌర్జన్యపరులకు వ్యతిరేకంగా నిలబడాలి. బలహీనత చూపిన మీలో పిరికితనం ఉత్పన్నమవుతుంది. ధర్మ విరోధులు మిమ్మల్ని ఇంకా హింసించి సర్వనాశనం చేయడానికి పన్నాగాలు పన్నుతారు. వినాశచర్యలకు సాహసిస్తారు. మహాప్రవక్త (సఅసం) ప్రబోధానుసారం భయానికి రెండు కారణాలున్నాయి.

☆ ఇహలోక కాంక్ష.

☆ మృత్యువుపట్ల భయం

మీరు కేవలం వ్యక్తిగతంగా మాత్రమే కాకుండా సమాజ జీవితంనుండి ఈ రుగ్మతల్ని దూరం చేసేందుకు సమాయత్తమయి, ఆ తరువాతే విశ్రాంతి తీసుకునే కృతనిశ్చయులు కావాలి. ప్రవక్త(సఅసం) ఒకప్పుడు ఇలా అన్నారు. "ఆకలిగొన్నవారు వడ్డించివున్న భోజనంమీద ఎలా విరుచుకుపడతారో ఆ విధంగా ఇతర జాతులు నా అనుచర సమాజంపైన విరుచుకుపడే కాలం రానున్నది."

అప్పుడు ఒకరు అడిగారు, "ఓ దైవప్రవక్తా! ఆ సమయంలో మీ అనుచర సమాజం ఇతర జాతులు మ్రింగివేయగలిగేటంత అల్ప సంఖ్యలో ఉంటుందా?"

"లేదు, ఆ సమయంలో అల్ప సంఖ్యలో ఉండరు. కాని మీరు ప్రవాహంలో కొట్టుకుపోయే గడ్డిపరకల్లా బలహీనులై ఉంటారు. శత్రువుల గుండెల్లో మీరంటే భయం సమసిపోతుంది, మీ గుండెల్లో పిరికితనం గూడు కట్టుకుంటుంది."

అప్పుడొక వ్యక్తి అడిగాడు, "ఓ దైవ ప్రవక్తా! పిరికితనం ఏ కారణంచేత వస్తుంది?" "కారణం ప్రపంచ వ్యామోహం, మృత్యువుపట్ల భయం" అని వారు (సఅసం) జవాబిచ్చారు. (అబూదావూద్)

3. ప్రాపంచిక వ్యామోహం, వ్యభిచారం, స్త్రీ లోలత్వం లేకుండా సమాజాన్ని కాపాడుకోవాలి. సమాజంలో ఐకమత్యంద్వారా బలం సాధించుకోవాలి. ఈ శక్తిద్వారా సమాజంలో కలిగే అరాచకాన్ని విధ్వంసకాండను భగ్నం చేస్తూ, మిల్లత్ (ముస్లిమ్ సముదాయం)లోని వ్యక్తులలో ధైర్యస్థయిర్యాలు కలిగించి సమాజాన్ని ఉత్తేజపరచాలి.

మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు, "మీ పాలకులు నీతిపరులైతే, మీలోని ధనవంతులు దానధర్మాలు చేసేవారయితే, మీ సామాజిక సమస్యలు సలహాసంప్రదింపులతో పరిష్కార మౌతుంటే మీ బ్రతుకు మీ చావుకన్నా మేలైనది. అలాకాక మీ పాలకులు అవినీతిపరులైతే, మీ సమాజంలోని సంపన్నులు ధనకాంక్షాపరులై వారిని పిసినారితనం ఆవహిస్తే, మీ సామాజిక సమస్యల పరిష్కారం గృహిణుల హస్తగతమయితే మీరు ఈ భూమిపైన బ్రతకటం కన్నా చావే మేలైనది. (తిర్మిజి)

4. భయానక పరిస్థితులలో కూడా సత్యాన్ని, ధర్మాన్ని సమర్థించడంలో వెనుకంజవేయరాదు. అధర్మంగా లజ్జావిహీనంగా జీవితం గడపడంకంటే సత్యంకోసం ప్రాణాన్ని ధారబోయడానికి సిద్ధపడడం ఎంతో ఉత్తమమయిన మార్గం. కఠిన పరీక్షా సమయాలలో అతి భయానక పరిస్థితులలో కూడా, సత్యాన్ని, ధర్మాన్ని విడనాడరాదు. ఎవరైనా చంపివేస్తామని భయపెట్టినా ధర్మపాలనలో ఖాతరుచేయరాదు. దైవమార్గంలో ప్రాణాలు (షహాదత్) త్యాగం చేసే అవకాశం లభిస్తే ఉత్సాహంతో, సంతోషంగా మృత్యువును ఆహ్వానించాలి. ప్రవక్త (సఅసం) ఇలా ప్రబోధించారు.

"ఇస్లామ్ తిరగలి పరిభ్రమిస్తుంది. దివ్య ఖుర్ఆన్ ఏవైపు ఉందో ఆవైపే మీరూ తిరగండి. అప్రమత్తులై ఉండండి. త్వరలో ఖుర్ఆన్, అధికారం వేరు వేరు అయిపోతాయి. జాగ్రత్త! మీరు ఖుర్ఆన్ వదలకండి, ఇకముందు, మిమ్మల్ని పాలిస్తూ మీ విషయంలో తీర్పులనిచ్చే వారికి మీరు విధేయులై ఉంటే వారు మిమ్మల్ని ఋజుమార్గంనుండి తప్పిస్తారు. ఒకవేళ మీరు వారికి అవిధేయులుగా ఉంటే మిమ్మల్ని వారు చంపివేస్తారు. ఒక అనుచరుడు, "అప్పుడు మేమేమి చేయాలి?" అని అడిగినదానికి ఆయన, "అప్పుడు మీరు హజ్రత్ ఈసా (అస్సలాం) అనుచరుల పంథాను అనుసరించండి, వారు రంపాలతో కోయబడ్డారు. ఉరికంబాలపై వ్రేలాడదీయబడ్డారు. దేవుని అవిధేయతతో జీవనం గడపడం కంటే, దేవుని ఆజ్ఞల ననుసరిస్తూ ప్రాణాలు వదలడమే అత్యుత్తమం."

5. ఏ సామాజిక రుగ్మతల పర్యవసానంగా, సమాజంపైన భయాందోళనా మేఘాలు అలుముకుంటాయో వాటికి వ్యతిరేకంగా నిరంతర పోరాటం సలపండి. బీదరికం, కరువు కాటకాలు, రక్తపాతం సమాజంలో సాధారణమైపోతే, దుష్టశక్తుల అధికారంలో జాతి బాధపడుతూ ఉంటే, ఈ రుగ్మతల్ని సమాజంనుండి నిర్మూలించడానికి అవిరళకృషి చేయాలి.

హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్నె అబ్బాస్ (రజి) ఇలా అన్నారు, "ఏ జాతిలో అధర్మం, అసత్యం ప్రబలిపోతుందో, దైవం ఆ జాతి వారిలో శత్రు భీతిని, భయాన్ని కలుగజేస్తాడు. ఏ జాతిలోనయితే వ్యభిచారం అంటువ్యాధిలా వ్యాపించిపోతుందో ఆ జాతి సర్వనాశనం అయిపోతుంది. ఏ సమాజంలో తూనికలు కొలతల్లో మోసం చెయ్యడం మామూలు అయిపోతుందో ఆ సమాజం

తప్పనిసరిగా కరువు కాటకాలకు గురవుతుంది. ఎక్కడైతే న్యాయంగా తీర్పులు చేయబడవో అక్కడ విధిగా రక్తపాతం హెచ్చయిపోతుంది. ఆడినమాట తప్పే జాతులపైన శత్రువులకు ఆధిక్యత లభిస్తుంది. (మిష్కాత్)

6. శత్రు భయం ఆవహిస్తే ఈ దుఆ పఠించాలి.

اَللّٰهُمَّ اِنَّا نَجْعَلُكَ فِىْ نُحُوْرِهِمْ وَنَعُوْذُبِكَ مِنْ شُرُوْرِهِمْ (ابوداؤد، نسائی بحوالہ حصن حصین)

"అల్లాహుమ్మ ఇన్నా నజ్‌అలుక ఫీ నహూరిహిమ్ వ నఊజుబిక మిన్ షురూరిహిమ్". (అబూదావూద్, నసాయి, హిస్నె హసీన్)

"దేవా ! ఈ శత్రువులకు వ్యతిరేకంగా నిన్నే మేము మా రక్షణ కవచంగా చేసుకున్నాము. వారు చేసే దుశ్చర్యలనుండి, అత్యాచారాలనుండి రక్షణకై నీ శరణే వేడుకుంటున్నాము."

7. శత్రువులు పన్నిన వ్యూహంలో చిక్కుకుపోతే ఈ దుఆ చదవాలి.

اَللّٰهُمَّ اسْتُرْ عَوْرَاتِنَا وَاٰمِنْ رَوْعَاتِنَا (احمد بحوالہ حصن حصین)

"అల్లాహుమ్మస్తుర్ ఔరాతిన వ ఆమిన్ రౌఆతిన".

(అహ్మద్, హిస్నె హసీన్)

"దేవా ! నీవు మా గౌరవ ప్రతిష్ఠల్ని కాపాడు. భయాందోళనల్ని పార ద్రోలి ప్రశాంతతను ప్రసాదించు."

8. తుఫాను చెలరేగి మేఘాలు ఆవరించినప్పుడు ఆందోళన చెందటం, భయపడటం సహజం. హజ్రత్ ఆయిషా (రజి) అన్నారు : "ప్రవక్త (సఅసం) నోరు విప్పి పకపకా నవ్వడం నేను చూడలేదు. ఆయన చిరునవ్వు మాత్రమే ప్రదర్శించేవారు. తుఫాను చెలరేగినప్పుడు, మబ్బులు పట్టినప్పుడు ఆయన (సఅసం) ఆందోళన చెందేవారు. దుఆ చేస్తుండేవారు. వ్యాకులతతో లేస్తూ, కూర్చుంటూ ఉండేవారు. వర్షం కురిసే వరకు ఆయన స్థితి అలాగే ఉండేది. ఒకసారి నేను అడిగాను, 'దైవప్రవక్తా ! మబ్బులను చూసి ప్రజలు వర్షం పడుతుందని సంతోషిస్తారు, అయితే మబ్బులు చూసినప్పుడు మీ ముఖంలో విచారం, ఆందోళన ద్యోతకమవుతాయేమిటి?' అని. అప్పుడు ప్రవక్త (సఅసం)

ఇలా అన్నారు. "ఆయిషా (రజి) ! నేను భయపడకుండా ఎలా ఉండగలను? ఈ మబ్బుల్లో దైవాగ్రహం ఉండదా? ఆద్ జాతిని తుఫాన్ గాలులు లేచి ఘోరమైన శిక్షకు గురిచేయలేదా? ఆద్ జాతి ఆ మబ్బులు చూచినప్పుడు, ఈ మబ్బులు మా కొరకు వర్షాన్ని తెస్తాయని సంబరపడింది." (బుఖారి, ముస్లిమ్)

అలాంటి సందర్భాల్లో ఈ దుఆ పఠించాలి.

اَللّٰهُمَّ اجْعَلْهَا رِيَاحًا وَلَا تَجْعَلْهَا رِيْحًا اَللّٰهُمَّ اجْعَلْهَا رَحْمَةً وَلَا تَجْعَلْهَا عَذَابًا - (طبرانی)

"అల్లాహుమ్మజ్ అల్‌హా రియాహన్ వలా తజ్‌అల్‌హా రీహన్, అల్లాహుమ్మజ్ అల్‌హా రహ్మతన్ వలాతజ్ అల్‌హా అజాబా" (త్రిబాని)

"దేవా ! ఈ గాలిని మాకు చెడు కాకుండా మేలుగా చెయ్యి. దాన్ని మాకు కారుణ్యంగా చెయ్యి. శిక్షగా చెయ్యకు."

ఒకవేళ గాలి దుమారంతో పాటు గాఢమైన చీకటి కూడా అలుముకుంటే "ఖుల్ అఊజుబిరబ్బిల్ ఫలఖ్" మరియు "ఖుల్ అఊజుబిరబ్బిన్నాస్" సూరాలు కూడా పఠించాలి. (అబూదావూద్)

హజ్రత్ ఆయిషా (రజి) అన్నారు : ప్రవక్త (సఅసం) గాలి దుమారం లేచినప్పుడు ఈ దుఆ పఠించేవారు :

"اَللّٰهُمَّ اِنِّیْ اَسْئَلُكَ خَيْرَهَا وَخَيْرَ مَا فِيْهَا وَخَيْرَ مَآ اُرْسِلَتْ بِهٖ وَاَعُوْذُبِكَ مِنْ شَرِّهَا وَشَرِّ مَا فِيْهَا وَشَرِّ مَآ اُرْسِلَتْ بِهٖ - (مسلم، ترمذی)

"అల్లాహుమ్మ ఇన్నీ అస్‌అలుక ఖైరహా వ ఖైర మాఫీహా వఖైర మ ఉర్‌సిలత్ బిహీ వ అఊజుబిక మిన్ షర్రిహా వ షర్రి మాఫీహా వ షర్రి మ ఉర్‌సిలత్ బిహ్" (ముస్లిం, తిర్మిజి)

"ఓ దేవా ! ఈ గాలిదుమారంలోని మేలును, దానిలోని శుభాన్ని నిన్ను అర్థిస్తున్నాను. ఏ ఆశయంతో ఇది పంపించబడిందో దానిలోని మేలును కోరుకుంటున్నాను. ఈ గాలి దుమారపు చెడునుండి, దానిలోని అశుభాన్నుండి ఇది ఏ ఉద్దేశ్యంతో పంపబడిందో దాని చెడునుండి నీ శరణు వేడుకుంటున్నాను.'

9. అధిక వర్షంవల్ల నష్టం కలిగే అనుమానం ఉంటే ఈ దుఆ చేయాలి

اَللّٰھُمَّ حَوَالَيْنَا لَا عَلَيْنَا اَللّٰھُمَّ عَلَى الْاٰكَامِ وَالظِّرَابِ وَبُطُوْنِ الْاَوْدِيَةِ وَمَنَابِتِ الشَّجَرِ۔ (بخاری،مسلم)

"అల్లాహుమ్మ హవాలైనా లా అలైనా అల్లాహుమ్మ అలల్ ఆకామి వజ్జిరాబి వ బుతూనిల్ ఔదియతి వ మనాబితిష్షజరి" (బుఖారి, ముస్లిమ్)

"దేవా! మాపైన కాదు, మా చుట్టుప్రక్కల వర్షింపచెయ్యి. దేవా! పర్వతాలపైన, ఎత్తయిన ప్రదేశాలపైన, లోయల్లో, పొలాల్లో, వృక్షాలు పెరిగే ప్రదేశాల్లో కురిపింపచెయ్యి."

10. మేఘాలు గర్జించేటప్పుడు పిడుగుపడేటప్పుడు సంభాషణల్ని ఆపివేసి పవిత్ర ఖుర్‌ఆన్‌లోని ఈ ఆయత్ పఠనం ప్రారంభించాలి.

وَيُسَبِّحُ الرَّعْدُ بِحَمْدِهٖ وَالْمَلٰٓئِكَةُ مِنْ خِيْفَتِهٖ۔ (الرعد ۱۳)

"వయుసబ్బిహుర్రాఅదు బిహమ్‌దిహీ వల్ మలాయికతు మిన్ ఖీఫతిహీ". (అర్రఅద్ - 13)

"పిడుగులు దేవుణ్ణి స్తుతిస్తూ, జపిస్తూ ఉంటాయి. దైవదూతలు కూడా ఆయన భీతితో కంపించిపోతూ ఆయన పవిత్రతను, ఔన్నత్యాన్ని ప్రకటిస్తూ ఉంటారు."

"హజ్రత్ అబ్దుల్లాహ ఇబ్నె జుబైర్(రజి) మేఘగర్జన వింటే మాట్లాడటం మానివేసి పై ఆయత్‌ను పఠిస్తుండేవారు." (అల్ అదబుల్ ముఫ్రద్)

హజ్రత్ కాబ్(రజి) అన్నారు. "ఉరుములు ఉరిమేటప్పుడు ఈ ఆయత్‌ను మూడుసార్లు పఠించిన వ్యక్తి ఆపదనుండి రక్షింపబడతాడు." (తిర్మిజి)

ప్రవక్త (సఅసం) ఉరుములను, పిడుగులను విన్నప్పుడు ఈ దుఆ పఠించేవారు.

"اَللّٰھُمَّ لَا تَقْتُلْنَا بِغَضَبِكَ وَلَا تُهْلِكْنَا بِعَذَابِكَ وَعَافِنَا قَبْلَ ذٰلِكَ۔ (الادب المفرد)

"అల్లాహుమ్మ లా తఖ్‌తుల్నా బి గజబిక వలా తుహ్‌లిక్‌నా బి అజాబిక వ ఆఫినా ఖబ్ల జాలిక్". (అల్ అదబుల్ ముఫ్రద్)

"ఓ దేవా! నీవు నీ క్రోధంతో మమ్మల్ని నాశనం చేయకు. నీ శిక్షద్వారా మమ్మల్ని నిర్మూలించకు. ఆ తరుణం రాకముందే నీ రక్షణలో కాపాడు."

11. నిప్పు అంటుకున్నప్పుడు దాన్ని ఆర్పివేయడానికి పూర్తి ప్రయత్నంతోపాటు "అల్లాహు అక్బర్" అంటూ స్మరిస్తూ ఉండాలి. ప్రవక్త (సఅసం) ప్రవచనమేమిటంటే, "నిప్పు అంటుకోవడం చూస్తే 'అల్లాహు అక్బర్' అనండి. ఈ తక్బీర్ అగ్నిని ఆర్పివేస్తుంది."

12. భయభీతులు ఆవహించినప్పుడు ఈ దుఆ పఠించాలి. దైవం సంకల్పిస్తే భీతి దూరం అవుతుంది. తృప్తి, ప్రశాంతత లభిస్తాయి. హజ్రత్ బరా ఇబ్నె ఆజిబ్ (రజి) ఇలా తెలిపారు : భీతావహ వాతావరణంలో ఈ దుఆ పఠించమని మహాప్రవక్త (సఅసం) ఒక వ్యక్తికి ఉపదేశించారు. అతడు ఈ దుఆను పలుమార్లు చదివాడు. దేవుడు అతని హృదయంనుండి భయాన్ని దూరం చేశాడు. (మోజ్జముల్ తిబ్రాని)

ఆ దుఆ ఇది :

سُبْحَانَ اللهِ الْمَلِكِ الْقُدُّوْسِ رَبِّ الْمَلَائِكَةِ وَالرُّوْحِ جَلَّلْتَ السَّمٰوٰتِ وَالْاَرْضَ بِالْعِزَّةِ وَالْجَبَرُوْتِ۔

"సుబ్‌హానల్లాహిల్ మలికిల్ ఖుద్దూసి, రబ్బుల్ మలాఇకతి వర్రూహి జల్లల్‌త స్సమావాతి వల్ అర్జ బిల్ ఇజ్జతి వల్ జబ్రూత్".

"అల్లాహ్ పవిత్రుడు, ఉన్నతుడు, నిజమైన సార్వభౌముడు, దోషరహితుడైన పరిశుద్ధుడు. దేవదూతలకు, జిబ్రయీల్‌కు ప్రభువైన వాడా! నీ అధికారం, నీ శక్తి సర్వం ఆకాశాల్లోనూ, భూమిపైనా వ్యాపించిఉంది."

# 10. ఆనంద తరంగాలలో...

1. సంతోష సమయాలలో తప్పకుండా ఆనందం ప్రదర్శించాలి. సంతోషం మానవుడి స్వభావసిద్ధ విషయం, సహజావసరం కూడా. ధర్మం సహజావసరాల్ని గుర్తించి, కొన్ని మేలైన హద్దులు, షరతులతో ఆ అవసరాలు తీర్చుకునేందుకు ప్రోత్సహిస్తుంది. మీరు కృత్రిమమయిన హుందాతనం, తెచ్చిపెట్టుకున్న గాంభీర్యం, నిత్య మనఃక్లేశాలతో, దిగులుతో మీ వ్యక్తిత్వంలోని ఆకర్షణనిరూపుమాపడాన్ని ధర్మం ఎంత మాత్రం సమ్మతించదు. ధర్మసమ్మతంగా సంతోషకరమైన సందర్భాలలో ఆనందించే పూర్తి హక్కునిస్తుంది ధర్మం. అది మనల్ని ఎప్పుడూ ఉన్నత సంకల్పాలతో, నిత్య నూతనోత్సాహంతో, ప్రఫుల్ల భావాలతో, హమేషా హుషారుగా ఉండగోర్తుంది. ధర్మ సమ్మతమైన సందర్భాలలో సయితం సంతోషం వ్యక్తపరచకపోవడం, ఆనందప్రదర్శన ధార్మిక గాంభీర్యానికి వ్యతిరేకమని భావించడం సరయిన ధర్మావగాహన లేకపోవడాన్ని సూచిస్తుంది.

మీకు ఏదైనా ధార్మిక విధి నిర్వహించే భాగ్యం లభించినప్పుడు, మీరుగాని, మీ మిత్రుడుగాని విద్యాసముపార్జన విషయంలో ఉన్నతస్థానం పొందిన సందర్భంలో, దైవం మీకు ధన సంపదల్ని అనుగ్రహించిన వేళ, మీరేదైనా దీర్ఘ యాత్రానంతరం ఇల్లు చేరినప్పుడు, మీ మిత్రుడెవరైనా సుదూర ప్రాంతంనుండి వచ్చిన రోజు, మీ ఇంటికి ఎవరైనా గౌరవనీయుడైన అతిథి ఏతెంచిన సందర్భంలో, మీ ఇంట వివాహంకాని, శిశు జననంకానీ జరిగినప్పుడు, ఆప్తుడి ఆరోగ్యం, క్షేమ సమాచారం అందినవేళ, ఇస్లామ్ కార్యకర్తల విజయ వార్త విన్న సందర్భాన, ఏదైనా పండుగ రోజున ఇటువంటి సందర్భాలన్నింటిలో సంతోషించడం, వేడుక జరుపుకోవడం మీ స్వాభావికమైన హక్కు. ఇస్లామ్ ఇలా వేడుక చేసుకునేందుకు అనుమతించడమేకాక దాన్ని నిజమయిన ధర్మ పరాయణతగా పరిగణిస్తుంది.

హజ్రత్ కఅబ్ బిన్ మాలిక్ (రజి) ఇలా తెలిపారు : "అల్లాహ్ నా తౌబా (పశ్చాత్తాపం) ని అంగీకరించినప్పుడు, నాకా శుభవార్త తెలిసిన వెంటనే మహాప్రవక్త (సఅసం) సమక్షంలో హాజరయ్యాను. సలాముచేసి ఆయనగారి వైపు చూశాను. అప్పుడు ప్రియప్రవక్త (సఅసం) వదనంలో సంతోషం వెల్లివిరియసాగింది.

వారికెప్పుడయినా సంతోషం కలిగినప్పుడు వారి ముఖవర్చస్సు సంతోషాతిశయంతో చంద్రబింబంలా కళకళలాడేది ! మేము, ఆయన వదనంలో కళ, తేజస్సు చూసి ఇప్పుడు ఆయన అంతులేని ఆనందంలో ఉన్నారని గ్రహించేవాళ్ళం." (రియాజుస్సాలిహీన్)

2. పండుగ సందర్భంలో హాయిగా సంతోషంగా వేడుక జరుపుకోవాలి. మనస్సును కాస్త స్వేచ్ఛగా వదలాలి. మహాప్రవక్త (సఅసం) మదీనాకు అరుదెంచినప్పుడు ఇలా సెలవిచ్చారు. "మీరు సంవత్సరంలో రెండు రోజులు వేడుక చేసుకునేవారు. ఇప్పుడు అల్లాహ్ మీకు అంతకంటే మేలైన రెండు రోజులిచ్చాడు". అంటే 'ఈదుల్‌ఫిత్ర్' 'ఈదుల్ అజ్‌హా'. కాబట్టి సంవత్సరంలోని ఈ రెండు ఇస్లామీయ పండుగలలో సుఖసంతోషాల్ని స్వేచ్ఛగా వ్యక్తపరుచుకోండి. కలసి మెలసి స్వేచ్ఛా హృదయంతో సహజరీతిలో కాలక్షేపం చెయ్యండి. అందుకోసమే ఈ రెండు పండుగలలో రోజా ఉండటం నిషిద్ధం.

"ఇవి, హాయిగా తిని అన్యోన్యంగా ఆనంద మాధుర్యాన్ని గ్రోలే, దైవాన్ని సంస్మరించే రోజులు" అని ప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. (షర్‌హ్ మఆని ఉల్ ఆసార్). పండుగ రోజున స్నానం, శుచీ శుభ్రతను పాటించండి. స్తోమతకు తగ్గట్టుగా మంచి దుస్తులు ధరించండి. సుగంధద్రవ్యాలు (అత్తరు) పూసుకోండి. చక్కని భోజనం భుజించండి. పిల్లలకు ధర్మబద్ధమైన కాలక్షేపానికి, ఆటలతో ఉల్లాసంగా గడుపుకునేందుకు అవకాశమివ్వండి.

హజ్రత్ ఆయిషా (రజి) ప్రవచించారు, "ఆరోజు పండుగ దినం. కొందరు దాసీలు కూర్చొని గేయాలు ఆలపిస్తున్నారు. ఔస్, ఖజ్‌రజ్ అనే రెండు తెగల మధ్య జరిగిన ప్రముఖ యుద్ధాన్ని 'బుఆస్' యుద్ధం అని అంటారు. ఆ యుద్ధానికి సంబంధించిన గేయాలవి. అప్పుడే హజ్రత్ అబూబకర్ (రజి) వచ్చి "మహాప్రవక్త (సఅసం) ఇంట గానా బజానాలా?" అన్నారు. దానికి మహాప్రవక్త (సఅసం), "అబూబక్ర్, ఫరవాలేదు, ప్రతిజాతికి పండగ రోజొకటి ఉంటుంది. ఈ రోజు మన పండుగరోజు" అని ఆయన్ని శాంతపరిచారు.

ఓసారి పండుగ రోజున, కొందరు అబిసీనియా (ఇథియోపియా) యోధులు సైనిక విన్యాసాలు ప్రదర్శిస్తుండగా ఆయన (సఅసం) స్వయంగా చూడ్డమేకాకుండా హజ్రత్ ఆయిషా (రజి) గారిని కూడా తన చాటున నిలబెట్టి చూపారు. ఆయన యోధుల విన్యాసాలను ప్రశంసిస్తూ ఉండేవారు కూడా. హజ్రత్ ఆయిషా (రజి) చూస్తూ చూస్తూ అలసిపోగా, 'సరే వెళ్ళు' అన్నారు. (బుఖారి)

3. సంతోషం వ్యక్తం చెయ్యడంలో ఇస్లామీయ అభిరుచిని, ఇస్లామీయ హితవులను, మర్యాదలను తప్పకుండా పాటించాలి. ఎప్పుడయినా సంతోషం కలిగినప్పుడు సంతోషం కలుగజేసిన స్వామికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి. ఆయన ముందు కృతజ్ఞతా భావంతో మోకరిల్లాలి. ఆనందాతిశయంలో ఇస్లామీయ అభిరుచికి, మర్యాదలకు భిన్నంగా ఉండే పనులుగాని, ప్రవర్తనగానీ అవలంబించరాదు. సంతోషాన్ని వ్యక్తం చేయవలసిందే. కాని అదుపును దృష్టిలో ఉంచుకోవాలి. ఆనందాన్ని ప్రదర్శించడంలో గర్వం, అహంభావం వ్యక్తంఅయ్యేలా హద్దులు మీరకండి – వినమ్రత వినయవిధేయతా భావాలు అణగారిపోయేలా ప్రవర్తించకండి. ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది –

"దేవుడిచ్చిన వరాలు పొంది గర్వపడకండి. దేవుడు అహంభావాన్ని, గొప్పలు చాటుకునేవారిని ఇష్టపడడు." *(అల్ హదీత్ : 30)*

దేవుణ్ణి మరచిపోయేంతగా సంతోషంలో మునిగిపోరాదు. సంతోషం ప్రసాదించిన స్వామిని ఇంకా ఎక్కువగా స్మరించడం ఆయన ముందు కృతజ్ఞతతో మోకరిల్లడం, మాటలు, చేతల ద్వారా దేవుని కరుణాకటాక్షాలు, ఔన్నత్యం, శక్తిసామర్థ్యాలను కొనియాడడమే విశ్వాసికి ఆనందం.

రమజాన్‌లో నెలంతా ఉపవాసాలు పాటించి, రాత్రిళ్ళల్లో ఖుర్‌ఆన్ పఠించి, తరావీహ నమాజులు చేసి, పండుగనాటి చంద్రుణ్ణి చూసినప్పుడు దైవ కృపవల్ల ఆయన ఆజ్ఞల్ని పాలించడంలో కృతార్థులయినందుకు మీరు సంతోషంతో ఊగిపోతారు. వెంటనే మీ సంపదనుంచి సోదరులైన బీదల అనాథల భాగాన్ని వారికి అందజేస్తారు – తద్వారా మీ ఆరాధనలో ఏవైనా లోటు పాట్లుంటే దూరమవ్వాలని. ఇంకా దేవుని దాసులైన పేదప్రజలు కూడా పండుగ సంబరాల్లో పాలుపంచుకొని సామూహికంగా సంతోషాన్ని ప్రకటించుకోగలగాలి. ఆ తరువాత దేవుడు మీకు ఈ సద్బుద్ధి కలుగజేసినందుకు మీరు కృతజ్ఞతా పూర్వకంగా రెండు రకాతుల పండుగ నమాజ్ చేసి మీ నిజమైన సంతోషాన్ని ప్రదర్శిస్తారు. ఈదుల్ అజ్‌హా నాడు హజ్రత్ ఇబ్రాహీం (అలైహిస్సలామ్), హజ్రత్ ఇస్మాయీల్ (అలైహిస్సలామ్) చేసిన మహోన్నతమైన, నిరుపమానమైన త్యాగానికి (ఖుర్బాని) జ్ఞాపకార్థం ఉత్సవం జరుపుకొని త్యాగభావంతో మీ హృదయాలు ఉప్పొంగిపోతుంటే కృతజ్ఞతతో మీ స్వామి ముందు మోకరిల్లుతారు. మీరు నివసించే ప్రతి బస్తీ, ప్రతి వీధి, ప్రతి బాటా దేవుని ఔన్నత్యాన్ని కీర్తించే

ధ్వని ప్రతిధ్వనులతో మార్మోగిపోతాయి. మీరు దైవాదేశం ప్రకారం పండుగరోజున మంచి భోజనం చేసి, చక్కని దుస్తులు ధరిస్తారు. సంతోషాన్ని వెలిబుచ్చడానికి ధర్మ బద్ధమైన పద్ధతుల్ని పాటిస్తారు. అప్పుడు మీ ఈ కార్యకలాపాలన్నీ దైవ సంస్మరణగా రూపొందుతాయి.

4. మీ సంతోషంలో ఇతరుల్ని చేర్చుకోండి. అలాగే ఇతరుల సంతోషంలో కూడా స్వయంగా పాల్గొని వారి ఆనందాన్ని ఇనుమడింపచేయండి. సంతోష సమయాల్లో శుభాకాంక్షలు కూడా తెలుపుకోండి.

హజ్రత్ కఅబ్ బిన్ మాలిక్ (రజి) గారి తౌబా (పశ్చాత్తాపం) అంగీకరించ బడినప్పుడు ఆ సంగతి తెలిసిన వారు గుంపులు గుంపులుగా ఆయన్ను అభినం దించడానికి రాసాగారు. సంతోషం వ్యక్తపర్చసాగారు. అందులో హజ్రత్ తల్హా (రజి) గారు శుభాకాంక్షలు తెలియచేస్తూ వ్యక్తపర్చిన ఆనందం హజ్రత్ కఅబ్ (రజి)గార్ని ఎంతో ఆకర్షించింది. ఆ విషయం ఆయనకు జీవితాంతం జ్ఞప్తికి వచ్చేది. ఆయన వృద్ధాప్యంలో తన కుమారుడు అబ్దుల్లాకు తాను ఎదుర్కొన్న పరీక్ష ఆ తరువాత 'తౌబా' (పశ్చాత్తాపం) వృత్తాంతం తెలియజేస్తూ, హజ్రత్ తల్హా (రజి) ఆనందం వ్యక్తపర్చిన తీరును ప్రత్యేకించి చెప్తూ, "తల్హా (రజి) అభినం దన, ఆ ఉప్పొంగే సంతోషం ఎన్నటికీ మరువలేను." అన్నారు.

మహాప్రవక్త (సఅసం) కూడా, హజ్రత్ కఅబ్ చేసిన తౌబా అంగీకరించబడిన శుభవార్త పట్ల ఆనందం వ్యక్తపరుస్తూ, "కఅబ్! ఈ రోజు నీ జీవితంలో అన్నిం టికన్నా ఆనందభరితమైన రోజు" అన్నారు. (రియాజుస్సాలిహీన్)

ఒకరి ఇంట వివాహం జరిగినా, శిశు జననం అయినా ఇటువంటి శుభవార్త వింటే ఆ ఆనందంలో పాలుపంచుకోండి. శుభాకాంక్షలతో అభినందించండి.

హజ్రత్ అబూ హురైరా (రజి) ఇలా తెలియజేస్తున్నారు.

"దైవప్రవక్త (సఅసం) ఎవరినైనా వివాహ సందర్భంలో అభినందించే టప్పుడు, ఇలా పలికేవారు.

بَارَكَ اللهُ لَكَ وَبَارَكَ عَلَيْكُمَا وَجَمَعَ بَيْنَكُمَا فِيْ خَيْرٍ - (ترمذی)

"బారకల్లాహులక, వ బారక అలైకుమా, వజమఅ బైనకుమా ఫీఖైర్" (తిర్మిజి)

"దైవం మీకు సంతోషమయమయిన జీవితం ప్రసాదించుగాక! మీ ఇద్దరి పైన శుభాలు కురిపించుగాక! మీరిద్దరు ఉత్తమ రీతిలో అన్యోన్యంగా జీవింతురుగాక"!

శిశుజనన సందర్భంలో అభినందించే తీరును తెలియజేస్తూ ఒకసారి హజ్రత్ హుసైన్ (రజి) ఇలా పలికారు.

"దైవం ఈ బహుమతిలో శుభశ్రేయమొసగుగాక ! కృతజ్ఞతతో మెలిగే సుగుణం ప్రసాదించుగాక ! బాలుడికి యౌవన వసంతం అనుభవించే అవకాశం ప్రసాదించుగాక ! ఈ బాలుడు మీ పట్ల వినయ విధేయతలతో మెలుగుగాక !"

5. మీ బంధువు లేక ఎవరైనా పరిచయస్తుడు దూర ప్రయాణంచేసి వస్తే అతనికి స్వాగతం పలకండి, అతను క్షేమంగా తిరిగి వచ్చినందుకు అతని ఆశయం నెరవేరినందుకు సంతోషాన్ని వ్యక్తపరచండి. అతను క్షేమంగా తిరిగి వచ్చినందుకు ఏదైనా విందుచేస్తే దానికి తప్పకుండ హాజరు కావాలి. మీరు కూడా ఏదైనా ప్రయాణం చేసి శుభంగా స్వస్థలం చేరుకున్న ఆనందంలో ఏదైనా విందు ఏర్పాటు చేస్తే దానికి మీ చుట్టు ప్రక్కల వారిని ఆహ్వానించండి. అయితే అనవసరమైన ఖర్చులు, లేనిపోని ఆడంబరాలకు దూరంగా ఉండాలి. తలకు మించిన ఖర్చును చేయకూడదు. ప్రవక్త (సఅసం) తబూక్ రంగం నుండి తిరిగి వచ్చినప్పుడు ముస్లిమ్ పురుషులు, పిల్లలు ఆయనకు స్వాగతం పలకడానికి సనియ్యతుల్ వదా వరకు వెళ్ళారు. (అబూదావూద్)

మక్కానుండి మదీనాకు విచ్చేసి దక్షిణ దిక్కునుండి నగర ప్రవేశం చేస్తున్న సమయంలో కూడా ముస్లిమ్ స్త్రీ, పురుషులు, బాలురు, బాలికలు అందరు ఆయనకు స్వాగతం పలకడానికి బయలుదేరారు. అన్సారుల బాలికలు సంతోషంతో ఈ గానం ఆలాపించారు.

తలఅల్ బద్రు అలైనా
మిన్ సనియ్యాతిల్ వదాయి
వజ బష్షుక్రు అలైనా
మాదఆ లిల్లాహి దాయి
అయ్యుహల్ మబ్ఊసు ఫీనా
జి'త బిల్ అమ్రిల్ ముతాయి

"నేడు సనియ్యతుల్ వదా కొండల్లో నుండి పున్నమి చంద్రుడు మాకై ఉదయించాడు. కృతజ్ఞతలు తెలుపుకోవడం మా విధి. ఎందుకంటే, సందేశహరుడు

దేవుని వైపునకు మమ్మల్ని బోధన, శిక్షణల కొరకు పిలిచాడు. మా మధ్య ప్రభవించిన ఓ ప్రవక్తా ! మీరు తీసుకువచ్చిన ధర్మం మాకు శిరోధార్యం."

ఒకసారి ప్రవక్త(సఅసం) ఒక పర్యటన ముగించుకొని మదీనాకు చేరారు. ఆయన అప్పుడు ఒక జంతువును జిబహ్ చేసి ప్రజలకు విందు చేశారు.

(అబూదావూద్)

6. వివాహ సమయాలను కూడా ఆనందంగా గడపాలి. ఈ ఆనందంలో తమ బంధువులను, మిత్రులను కూడా ఆహ్వానించి భాగం పంచుకోనివ్వాలి. ఇలాంటి సమయంలో మంచి పాటలు పాడడానికి, డప్పు వాయించడానికి ప్రవక్త (సఅసం) అనుమతించారు. అందువల్ల ఆనందభావాల తృప్తి, వివాహం అవుతున్న బహిరంగ ప్రకటన జరుగుతాయి. హజ్రత్ ఆయిషా (రజి) తన బంధువైన ఒక మహిళ వివాహం ఒక అన్సారీతో చేశారు. ఆమెను సాగనంపినప్పుడు ప్రవక్త (సఅసం), వారి వెంట డప్పు వాయిస్తూ పాటలు పాడే ఒక సేవికను ఎందుకు పంపించడం లేదు? అని సెలవిచ్చారు. (బుఖారి)

హజ్రత్ రబీ బిన్తె మ అవ్వజ్(రజి) నికాహ్ జరిగినప్పుడు ఆమెవద్ద కొందరు బాలికలు కూర్చొని డప్పు వాయిస్తున్నారు. బద్ర్ యుద్ధంలో అమరగతులైన (షహీద్) తమ పెద్దల్ని కీర్తిస్తూ కవితలు పాడుతున్నారు. ఒక బాలిక పాడింది, "రేపు జరగబోయే విషయాలేమిటో తెలిసిన ప్రవక్త మన మధ్య ఉన్నారు." మహాప్రవక్త (సఅసం) ఇది వినగానే, 'దీన్ని వదిలేయండి ముందు పాడుతున్నదే పాడండి' అని పలికారు. (బుఖారి)

7. వివాహోత్సవ సందర్భంలో తన తాహతు ప్రకారం బంధువులకు స్నేహితులకు అన్న పానీయాలు ఏర్పాటు చేయాలి. ప్రవక్త(సఅసం) స్వయంగా తన వివాహమైనప్పుడు వలీమా విందు చేశారు. ఇతరుల్ని అలా చేయమని బోధించారు. ఆయన (సఅసం) ఇలా అన్నారు, 'వేరేమీ లేకపోయినా కనీసం ఒక మేకను జిబహ్ చేసి విందుచేయాలి.' (బుఖారి)

వివాహంలో పాల్గొనే అవకాశం లేకపోతే కనీసం శుభాకాంక్షల సందేశం తప్పనిసరిగా పంపించాలి. పెళ్ళి పేరంటాల్లో కానుకలు ఇస్తే సంబంధాలు మెరుగవుతాయి. పటిష్ఠమవుతాయి. ప్రేమ ఉత్తేజమయి అధికమవుతుంది. అయితే కానుకలు తమ శక్తికనుగుణంగా ఇవ్వాలి. లేనిపోని గొప్పకి, ప్రదర్శనా బుద్ధికి పోకుండా నిజస్థితిని తప్పనిసరిగా బేరీజు వేసుకుంటూ ఉండాలి.

# 2

# ఆరాధనానందం

## 1. మస్జిద్ మర్యాదలు

1. దైవదృష్టిలో అన్నింటికన్నా శ్రేష్ఠమైన భూభాగం, మస్జిద్ నిర్మించబడిన భూమి. దైవం పట్ల ప్రేమ ఉన్నవారు మస్జిద్‌ను కూడ ప్రేమిస్తారు. అదే దైవ ప్రేమకు గుర్తు. తుది దినాన (ఖియామత్) ఎక్కడా నిలువనీడ ఉండదు. దైవం ఆరోజున ఇటువంటి మస్జిద్ అభిమానులకు తన సింహాసనం (అర్ష్) నీడలో స్థానమిస్తాడు. మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు :

"మస్జిద్ అభిమాని అయిన ఆ వ్యక్తి దైవ సింహాసనం నీడలో ఉంటాడు."
(బుఖారి)

2. మస్జిద్‌ల నిర్వహణా సేవలో పాల్గొనండి. వాటిని నమాజ్ చేసేవారితో కళకళలాడేలా చెయ్యండి. ఇది విశ్వాసానికి చిహ్నం. దైవాదేశం ఏమంటే "దైవం పట్ల, తుది దినంపట్ల విశ్వాసం కలవారే మస్జిదుల్ని నమాజ్ చేసేవారితో కళకళలాడేలా చేస్తారు.

3. ఫర్జ్ (విధిగా చేయవలసిన) నమాజ్‌ను ఎల్లప్పుడు మస్జిద్‌లో సామూహికంగా (జమాఅత్‌తో పాటు) చేయండి. మస్జిద్‌లో అజాన్ (నమాజ్‌కై పిలుపు), జమాఅత్ వేళలు నిర్ణీతమై ఉండాలి. మస్జిద్ నమాజ్ వేళల దృష్ట్యా మీ పూర్తి జీవితాన్ని కట్టుదిట్టం చేయండి. విశ్వాసి జీవితమంతా పూర్తి "మస్జిద్" చుట్టూ పరిభ్రమిస్తుంది.

దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు :

"ముస్లిమ్‌లలో కొందరు మస్జిద్‌లలోనే గుమికూడి ఉంటారు. అక్కడినుంచి కదలరు. దైవదూతలు ఇటువంటివారి వెంట ఎప్పుడూ ఉంటారు. వీరు మస్జిద్‌లో కానరాకపోతే దైవదూతలు వీరినే వెదుకుతూ తిరుగుతారు. వీరు రోగగ్రస్తులైతే, దైవదూతలు వీరిని పరామర్శిస్తారు. వీరేదైనా పనిలో నిమగ్నులైతే, దైవదూతలు వీరికి సాయం చేస్తారు. మస్జిద్‌లో కాలం గడిపేవారు దైవ కారుణ్యానికి అర్హులవుతారు." (ముస్నద్ అహ్మద్)

4. మస్జిద్‌లో నమాజ్ కొరకు ఉత్సాహంతో వెళ్ళండి. మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు : "ఉదయం సాయంత్రం నమాజ్ కొరకు మస్జిద్‌కు వెళ్ళడం 'జిహాద్' కొరకు వెళ్ళడం లాంటిది." మసక చీకటిలో మస్జిద్‌కు వెళ్ళేవారివెంట తుదిదినం నాడు వెలుగు ఉంటుంది. సామూహిక ప్రార్థన కొరకు మస్జిద్‌కు వెళ్ళేవారి ప్రతి అడుగు ఒక పుణ్యకార్యానికీ, ఒక పాప పరిహారానికి దోహదపడుతుంది. (ఇబ్నె హబ్బాన్)

5. మస్జిద్‌ను పరిశుభ్రంగా ఉంచండి. మస్జిద్‌లోపల చీపురుతో ఊడ్వండి, సువాసన వత్తులు వెలిగించండి. ప్రత్యేకించి శుక్రవారం నాడు అంతా సువాసనతో ఆహ్లాదకరంగా ఉండేలా ప్రయత్నం చేయండి. దైవప్రవక్త (సఅసం) ఉపదేశం ప్రకారం మస్జిద్‌ని తుడవడం పరిశుభ్రంగా ఉంచడం కసువు వగైరా ఎత్తి బయట పారేయటం సువాసన ద్రవ్యాలు వాడటం ప్రత్యేకించి శుక్రవారం మస్జిద్‌ను సువాసనలతో ముంచెత్తడం, ఇవన్నీ స్వర్గంలో ప్రవేశింపచేసే కార్యాలు.

(ఇబ్నుమాజా)

మహాప్రవక్త (సఅసం) సెలవిచ్చారు: "మస్జిద్ కసువును ఊడ్వడం స్వర్గంలో అందమైన కళ్ళుగల హూర్‌కు చెల్లించే మహర్‌లాంటిది". (తిబ్రాని)

6. మస్జిద్‌లోనికి భయభక్తులతో 'అస్సలాము అలైకుమ్' అని పలుకుతూ ప్రవేశించండి. నిశ్శబ్దంగా కూర్చొని భయభక్తులు గలవారై దైవసంస్మరణ చేయండి. నవ్వుతూ మాట్లాడుకుంటూ నిర్లక్ష్య భావంతో మస్జిద్‌లో ప్రవేశించడం, దైవభక్తిలేని, శ్రద్ధా సక్తులులేని వారిపని. కొందరు నమాజ్ ప్రారంభమయిపోతే ఇమాంతోపాటు రకాత్‌లో చేరేందుకు మస్జిద్‌లో పరుగు తీస్తారు. ఇది కూడా మస్జిద్ గౌరవానికి తగనిది. రకాత్ అందినా అందకపోయినా నెమ్మదిగా, హుందాగా భక్తితో మస్జిద్‌లో ప్రవేశించాలి. ఉరుకులు పరుగులు మానాలి.

7. మస్జిద్‌లో ప్రశాంతంగా కూర్చోండి. మస్జిద్‌లో గోలచేయడం, పరిహాసాలాడటం, బజారు ధరలు అడగటం, చెప్పటం మస్జిద్‌ని అగౌరవపరచినట్లే. మస్జిద్ దైవారాధనాగృహం. అందులో దైవారాధనయే చేయండి.

8. మస్జిద్‌లో మరీ చిన్న పిల్లల్ని, మస్జిద్ గౌరవం ఎరుగని వారిని తీసుకెళ్ళకండి. వారు మస్జిద్‌లో మూత్ర విసర్జనకాని, ఉమ్మివేయడంకాని చేసే ప్రమాదముంటుంది.

9. మస్జిద్‌ను వచ్చిపొయ్యేమార్గంగా చేసుకోకండి. మస్జిద్ ద్వారంలో ప్రవేశించాక, నమాజు చేయడమో, కూర్చుని గ్రంథ పఠనం చేయడమో జరగాలి. ఇది మస్జిద్ హక్కు.

10. ఒకవేళ మీరు ఏదైనా వస్తువు పోగొట్టుకుంటే ఆ విషయాన్ని మస్జిద్‌లో బిగ్గరగా ప్రకటించరాదు. ప్రవక్త (సఅసం) మస్జిద్‌లో ఎవరయినా అలాంటి ప్రకటన చేస్తే అయిష్టాన్ని వ్యక్తం చేసేవారు. ఇంకా ఇలా అనేవారు: "నీవు పోగొట్టుకున్న వస్తువు దైవం నీకు దొరకకుండా చేయుగాక".

11. మస్జిద్‌లో ప్రవేశిస్తున్నప్పుడు ముందు కుడికాలు పెట్టాలి. ప్రవక్త (సఅసం)కు దురూద్, సలాం పఠించాలి. ఈ దుఆ పఠించాలి. ప్రవక్త (సఅసం) అన్నారు: "మీలో ఎవరయినా మస్జిద్‌లోనికి రాగానే మొదట ప్రవక్త (సఅసం)కు దురూద్ చదవాలి. తరువాత ఈ దుఆ పఠించాలి.

اَللّٰهُمَّ افْتَحْ لِيْ اَبْوَابَ رَحْمَتِكَ مُسلم

'అల్లాహుమ్మఫ్‌తహ్‌లీ అబ్‌వాబ రహ్‌మతిక్". (ముస్లిమ్)

"దేవా ! నాకై నీ కరుణా కటాక్షాల ద్వారాలు తెరువు."

మస్జిద్‌లో ప్రవేశించిన తరువాత రెండు రకాతుల నఫిల్ నమాజు చెయ్యడం పుణ్యప్రదం. వాటిని తహియ్యతుల్ మస్జిద్ అంటారు. అలాగే ఎప్పుడైనా ప్రయాణం నుంచి తిరిగి వచ్చినప్పుడు మొట్టమొదట మస్జిద్‌కు వెళ్ళి రెండు రకాతులు నఫిల్ నమాజ్ చేసుకోవడం మంచిది. ప్రవక్త (సఅసం) ఎప్పుడూ ప్రయాణంనుంచి తిరిగి వచ్చిన తరువాత మొదట మస్జిద్‌కు వెళ్ళి నఫిల్ నమాజ్ చేసేవారు. తరువాత ఇంటికి వెళ్ళేవారు.

12. మస్జిద్ నుండి వెలుపలికి వెళ్ళే సమయంలో ఎడమకాలు బయట పెట్టాలి. ఈ దుఆ పఠించాలి.

اَللّٰهُمَّ اِنِّیْٓ اَسْئَلُكَ مِنْ فَضْلِكَ (مسلم)

"అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక మిన్ ఫజ్లిక్" (ముస్లిమ్)

"దేవా! నేను నీ దాతృతను అనుగ్రహాన్ని అర్థిస్తున్నాను."

13. మస్జిద్‌లో నియమానుసారంగా అజాన్, జమాఅత్‌తోటి నమాజ్ జరిగే సక్రమమయిన ఏర్పాట్లు చేయాలి. ధర్మం, నీతి నడవడిక రీత్యా అందరికంటే ఉత్తమంగా ఉండేవారినే ముఅజ్జిన్, ఇమామ్‌గా నియమించాలి. ప్రతిఫలం తీసుకోకుండా అజాన్ ఇచ్చేవారు, ఇమామ్ విధులను నిర్వహించేవారిని, తుది దినాన పుణ్యఫలం, సాఫల్యం పొందేందుకు సంతోషంతో ఆ బాధ్యతలను నిర్వహించేవారిని నియమించడానికి ప్రయత్నించాలి.

14. అజాన్ అయిన తరువాత ఈ దుఆ పఠించాలి. ప్రవక్త (సఅసం) ఇలా బోధించారు : "ఏ వ్యక్తి అయితే అజాన్ విన్న తరువాత ఈ దుఆను పఠిస్తాడో ప్రళయం రోజు అతను నా సిఫారసుకు అర్హుడు అవుతాడు." (బుఖారి)

اَللّٰهُمَّ رَبَّ هٰذِهِ الدَّعْوَةِ التَّآمَّةِ وَالصَّلٰوةِ الْقَآئِمَةِ اٰتِ مُحَمَّدَانِ الْوَسِيْلَةَ
وَالْفَضِيْلَةَ وَابْعَثْهُ مَقَامًا مَّحْمُوْدَانِ الَّذِیْ وَعَدْتَّهٗ (بخاری)

"అల్లాహుమ్మ రబ్బ హాజిహి ద్దావతి త్తామ్మతి వస్సలాతిల్ ఖాయిమతి, ఆతి ముహమ్మదనిల్ వసీలత వల్ ఫజీలత వబఅస్‌హు మకామమ్మ హ్మూద నిల్లజీ వఅద్‌త్తహూ." (బుఖారి)

"దేవా! ఈ పరిపూర్ణ సందేశానికీ, ఇప్పుడు చెయ్యబోయే నమాజ్‌కీ ప్రభువా ! ముహమ్మద్ (సఅసం)కు నీ సాన్నిధ్యాన్ని, ఘనతను ఔన్నత్యాన్ని ప్రసాదించు. నీవు ఆయనకు ఇచ్చిన మాట ప్రకారం ఆయనకు మహాత్మ్యాశ్రేష్ఠమైన స్థానాన్ని ప్రసాదించు."

15. ముఅజ్జిన్ అజాన్ (పిలుపు) ఇస్తున్నప్పుడు అతని వాక్యాలు వింటూ మీరు కూడా వాటి పునరుచ్చరణ చెయ్యండి. అయితే అతడు "హైయ్య అలస్సలాహ్, హైయ్య అలల్ ఫలాహ్" అన్నప్పుడు దానికి జవాబుగా :

"لَاحَوْلَ وَلَا قُوَّةَ اِلَّا بِاللّٰهِ الْعَلِيِّ الْعَظِيْمِ"

"లా హౌల వలా ఖువ్వత ఇల్లా బిల్లా హిల్ అలియ్యిల్ అజీమ్" అని, ఫజర్ అజాన్‌లో ముఅజ్జిన్ "అస్సలాతు ఖైరుమ్ మినన్నౌమ్" అన్నప్పుడు జవాబుగా

صَدَقْتَ وَ بَرَرْتَ

'సదక్త వ బరర్త' అని పలకాలి. (నిజం చెప్పి నీ బాధ్యత తీర్చుకున్నావు).

16. తక్బీర్ చెప్పేవారు "ఖద్ ఖామతిస్సలాత్" అన్నప్పుడు వినేవారు జవాబుగా ఈ పదాలు పలకాలి.

اَقَامَهَا اللّٰهُ وَ اَدَامَهَا-

"అఖామహల్లాహు వ అదామహా"

"దేవుడు దాన్ని స్థాపించి ఎల్లప్పుడూ స్థిరంగా ఉంచుగాక".

17. మహిళలు మస్జిద్‌లకు వెళ్ళడానికి బదులు ఇంట్లోనే నమాజ్‌లు చేసుకోవాలి. ఒకసారి హజ్రత్ అబూ హమీద్ సాఅదీగారి భార్య ప్రవక్త(సఅసం)తో "ఓ దైవప్రవక్తా! నాకు మీతో కలిసి నమాజ్ చేయాలన్న కుతూహలం కలుగుతోంది" అని విన్నవించింది. అందుకు ఆయన (సఅసం) ఇలా అన్నారు. "నాకు నీ కుతూహలం తెలుసు. కానీ నీవు వసారాలో నమాజ్ చేసేకంటే గదిలోనే చేయడం ఉత్తమం. ఆవరణలో నమాజ్ చేయడంకంటే వసారాలో నమాజ్‌చేయడం ఉత్తమం. అయితే మహిళలు మస్జిద్ అవసరాలు తీర్చడంపట్ల శ్రద్ధ వహిస్తే మంచిది. నీళ్ళ ఏర్పాటు, చాపలు, సువాసనలు మస్జిద్‌కు పంపించే ఏర్పాట్లు చేయాలి, ఈ విధంగా మస్జిద్‌తో అనుబంధం పెంచుకుంటే అదే ఉత్తమం.

18. జ్ఞానం వచ్చిన పిల్లల్ని మస్జిద్‌కు తీసుకువెళ్ళాలి. తల్లులు తమ పిల్లలకు ఉత్సాహం కలిగిస్తూ మస్జిద్‌కు వెళ్ళడానికి ప్రోత్సహించాలి. మస్జిద్‌లో వారితో అత్యంత ప్రేమతో, నమ్రతతో, వాత్సల్యంతో ప్రవర్తించాలి. వారు ఏదైనా పొరబాటుచేసినా, అల్లరిగా ప్రవర్తించినా గద్దించడానికి బదులు ప్రేమతో నచ్చజెప్పాలి. మంచిపనులు చేయమని హితవుచేయాలి.

# 2. చక్కని నమాజ్

1. నమాజ్ చేయడంలో శుచిని శుభ్రతను పూర్తిగా పాటించాలి. వుజూ చేస్తున్నప్పుడు మిస్వాక్ చేయడం మంచిది. ప్రవక్త(సఅసం) ఇలా బోధించారుః "ప్రళయంలో నా అనుచర సమాజపు (ఉమ్మత్) గుర్తు ఏమిటంటే దాని నుదురు, వుజూ చేసే ఇతర అంగాలు కాంతిమంతంగా మెరిసిపోతూ ఉంటాయి. కాబట్టి తమ ముఖకాంతిని ఇనుమడింప చేసుకోవాలనుకునే వారు అలా చేసుకోగలరు."

2. సభ్యత, సంస్కారం, వినయం ఉట్టిపడే పొందికైన, పరిశుభ్రమైన దుస్తులు ధరించి నమాజ్ చేయాలి. దివ్యఖుర్ఆన్‌లో ఇలా ఉంది ః

"ఓ ఆదం బిడ్డలారా ! ప్రతి నమాజ్ సమయంలోనూ హుందాగా అలంకరించుకోండి."

3. సమయానుక్రమంగా నమాజ్ చేసుకోవాలి. "విశ్వాసులకు, సమయాన్ని నిర్ధారించి నమాజ్ చేయడం విధిగా నిర్ణయించబడింది." (ఖుర్ఆన్)

హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్నె మస్ఊద్ (రజి) ఒకసారి ప్రవక్త (సఅసం)ను ఇలా అడిగారు, "దైవప్రవక్తా ! దేవునికి అన్నింటికంటే ప్రీతికరమైన ఆచరణ ఏది?" దానికి ఆయన(సఅసం) "నమాజ్‌ను నిర్ణీత సమయంలో చేయడం" అని అన్నారు. ఆయన ఇలా కూడా అన్నారు ః "దేవుడు ఐదువేళల నమాజ్‌లను విధిగా చేశాడు. ఏ వ్యక్తి అయితే నిర్ణీత సమయాల్లో సరిగా వుజూ చేసి, భయభక్తులతో చిత్తశుద్ధితో నమాజ్ చేస్తాడో అతనికి దైవంమీద హక్కు ఏర్పడుతుంది. దానికనుగుణంగా దైవం అతన్ని క్షమిస్తాడు. నమాజ్‌లలో అజాగ్రత్త, అశ్రద్ధ చూపే వారి విముక్తికిగాని వారిని క్షమించడానికిగాని దేవుడు బాధ్యుడు కాడు. వారికి నరకంలోకి పంపివేయనూ వచ్చు, లేదా మన్నించనూ వచ్చు." (మాలిక్)

4. నమాజ్ ఎల్లప్పుడూ జమాఅత్‌తోటే చేయాలి. ఒకవేళ జమాఅత్ అందకపోయినప్పటికి ఫర్జ్ నమాజ్‌లు మస్జిద్‌లోనే చేయడానికి ప్రయత్నించాలి. అయితే సున్నత్ నమాజ్‌లు ఇంట్లో చేయడంకూడా మంచిదే. ప్రవక్త(సఅసం)ఇలా అన్నారు ః "నలభై దినాల వరకు జమాఅత్‌తోపాటు 'తక్బీరె ఊలా'☆తో నమాజ్ చేసిన వ్యక్తి నరకం, కాపట్యం రెండింటినుండీ కాపాడబడతాడు." (తిర్మిజి)

☆ ప్రారంభంలో చేసే తక్బీర్.

మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు. ప్రజలకు జమాఅత్‌తోటి చేసే నమాజ్‌లోని మేళ్ళు, పుణ్యఫలం ఏమిటో తెలిస్తే వేయి అడ్డంకులున్నా జమాఅత్‌కై పరుగెత్తుకుంటూ వచ్చేవారు. జమాఅత్ మొదటి వరుస దైవదూతల వరుస వంటిది. ఒక్కరే నమాజ్ చేయడం కంటే ఇద్దరు వ్యక్తుల జమాఅత్ ఉత్తమమయినది. ఎంత ఎక్కువ మంది ఉంటే ఈ జమాఅత్ అంతే అధికంగా దేవునికి ప్రీతికరమవుతుంది. (అబూదావూద్)

5. నమాజ్ శాంతంగా చెయ్యాలి. రుకూ, సజ్దాలు నెమ్మదిగ తృప్తితో చెయ్యాలి. రుకూనుండి లేచిన తరువాత సరిగ్గా నిలబడాలి. ఆ తరువాతే సజ్దా చేసుకోవాలి. అలాగే రెండు సజ్దాల మధ్య కొంచెం సమయం వుంచాలి. ఆ రెండు సజ్దాల మధ్యకాలంలో ఈ దుఆ చదవాలి.

اَللّٰهُمَّ اغْفِرْلِيْ وَارْحَمْنِيْ وَاهْدِنِيْ وَاجْبُرْنِيْ وَعَافِنِيْ وَارْزُقْنِيْ (ابوداؤد)

"అల్లాహుమ్మగ్‌ఫిర్‌లీ, వర్‌హమ్‌నీ, వహ్‌దినీ, వజ్‌బుర్‌నీ, వ ఆఫినీ, వర్ జుక్‌నీ." (అబూదావూద్)

"దేవా ! నన్ను క్షమించు, నన్ను కరుణించు, నాకు రుజుమార్గం చూపు. నా దీనావస్థను దూరంచెయ్యి. నాకు నెమ్మదిని ప్రసాదించు, నాకు ఉపాధిని అనుగ్రహించు."

ప్రవక్త (సఅసం) ఇలా పలికారు "నమాజ్‌ను తృప్తికరంగా నిర్వర్తించిన వ్యక్తిని 'నీవు నన్ను ఎలా కాపాడావో అలాగే దేవుడు నిన్ను కూడా రక్షించాలి' అని నమాజ్ ఆశీర్వదిస్తుంది."

ప్రవక్త (సఅసం) ఇలా పలికారు: ఇంకా ఇలా అన్నారు : "నమాజ్‌ను దొంగిలించడం అత్యంత దుష్టమైన దొంగతనం". ప్రజలు అడిగారు, "దైవప్రవక్తా! నమాజ్‌ను ఎవరైనా ఎలా దొంగిలిస్తారు" అని. దానికి "రుకూ, సజ్దాలు అసంపూర్తిగా చేసి" అని జవాబిచ్చారు మహాప్రవక్త (సఅసం).

6. అజాన్ వినగానే నమాజ్ చేయడానికి సిద్ధమవ్వాలి. వుజూ చేసుకొని ముందుగా మస్జిద్‌కు వెళ్ళిపోవాలి. మౌనంగా వరుసలో కూర్చుండి జమాఅత్‌కై వేచి ఉండాలి. అజాన్‌ను విని సోమరితనంతో కాలయాపన చేయడం, అయిష్టంగా నమాజ్‌కు వెళ్ళడం కాపట్యానికి చిహ్నం.

7. అజాన్‌ను శ్రద్ధా భక్తులతో పలకాలి. ప్రవక్త (సఅసం)ను ఒక వ్యక్తి ఇలా అడిగాడు, "దైవప్రవక్తా ! నన్ను స్వర్గంలోకి తీసుకువెళ్ళగల ఆచరణ ఒకటి చెప్పండి". అందుకు ఆయన (సఅసం) "నమాజ్‌కై అజాన్ పిలుపునిస్తూ ఉండమ"ని ఉపదేశించారు. ఆయన (సఅసం) ఇంకా ఇలా అన్నారు, "ముఅజ్జిన్

పిలుపు(అజాన్)ధ్వని వెళ్ళినంత మేరకూ, అతని పిలుపు విన్నవారు ప్రళయంలో ముఅజ్జిన్ పక్షాన సాక్ష్యమిస్తారు ; అడవిలో మేకలుకాస్తూ ఉండి కూడా, అజాన్ సమయం రాగానే బిగ్గరగా అజాన్(పిలుపు)నిచ్చిన వ్యక్తి శబ్దం వెళ్ళినంతవరకు ప్రళయం రోజున ఆ వస్తువులన్నీ అతని పక్షాన సాక్ష్యమిస్తాయి." (బుఖారి)

8. ఒకవేళ మీరు ఇమామ్‌గా ఉంటే సర్వ మర్యాదలను, నియమాలను పాటిస్తూ నమాజ్ చేయించాలి. నమాజ్‌లు చేసేవారి (ముఖ్తదీల) సౌకర్యాన్ని దృష్టిలో పెట్టుకుని ఇమామ్ బాధ్యతలను నిర్వహించాలి. ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు :

"ఏ ఇమామ్ అయితే తన వెనుక నమాజ్ చేసే వారి నమాజ్‌కు తనను బాధ్యునిగా భావించుకుని శ్రద్ధతో నమాజ్ చేయిస్తాడో, ఆ ఇమామ్‌కి వెనుక నమాజ్ చేసే వారి నమాజ్‌యొక్క పుణ్యఫలం కూడా లభిస్తుంది. వీరి (ముఖ్తదీల) పుణ్యఫలం ఏమాత్రం తగ్గించబడదు." (తిబ్రాని)

9. ఒకవైపున దేవుని ఘనత, ఔన్నత్యం మరోవైపున భీతి, ప్రశాంతత హృదయాన్ని ఆవహించి ఉండేవిధంగా చిత్తశుద్ధితో నమాజ్ చేయాలి. నమాజ్‌లో అనవసరంగా కాళ్ళు, చేతులు కదపడం, గోక్కోవడం, గడ్డాన్ని దువ్వుకోవడం, ముక్కులో వ్రేళ్ళు పెట్టుకోవడం, దుస్తులు సరిచేసుకోవడం అత్యంత అమర్యాదకరమైన చేష్టలు. వాటిని కచ్చితంగా విసర్జించాలి.

10. నమాజ్ ద్వారా దేవునికి సన్నిహితమవ్వాలి. దైవాన్ని మీరు చూస్తున్నట్లుగా తలంచి నమాజ్ చేయాలి. లేదా కనీసం దైవం మిమ్మల్ని చూస్తున్నట్లుగానయినా భావించాలి.

మహాప్రవక్త (సఅసం)ఏమన్నారో గమనించండిః

"దేవుని సమ్ముఖాన దాసుడు సజ్దా చేసే తరుణంలో అతనికి దైవసామీప్యం ప్రాప్తమవుతుంది. అందుచేత మీరు సజ్దాచేసేటప్పుడు దుఆ చేయాలి."

(ముస్లిం)

11. నమాజ్‌ను అత్యంత శ్రద్ధాభక్తులతో ఆసక్తితో చేయాలి. అదేదో లాంఛన వ్యవహారమనుకొని చేసే నమాజ్ వాస్తవానికి నమాజ్ కాజాలదు. ఒక నమాజ్ చేసిన తరువాత రెండవ నమాజ్‌కై ఆతురతతో ఆసక్తితో వేచి ఉండాలి. ఒకరోజు మగ్రిబ్ నమాజ్ తర్వాత కొందరు ఇషా నమాజ్‌కై వేచి ఉండగా ప్రవక్త (సఅసం) వడివడిగా నడిచివచ్చారు. ఆ కారణంగా ఆయాసపడ్డారు. అప్పుడాయన ఇలా అన్నారు : "ప్రజలారా ! సంతోషించండి. మీ ప్రభువు అంబరంలో ఒక

ద్వారాన్ని తెరచి, దేవదూతల ముందుంచి వారితో సగర్వంగా ఇలా అన్నాడుః "చూడండి, నా దాసులు ఒక నమాజ్ చేశారు. రెండవ నమాజ్‌కై ఎదురు చూస్తున్నారు"అని అన్నారు. (ఇబ్నెమాజా)

12. భక్తిలేని శ్రద్ధాహీనులవలె గబగబా నమాజ్ చదివి తలమీది బరువును దించివేయరాదు. సచేతనాహృదయంతో దేవుని స్మరించాలి. మనస్సు, మేధ, భావోద్రేకాలు, ఆలోచనలు, అభిప్రాయాలు అన్నింటికి అతీతంగా ఉండి, పూర్తిగ దేవుని వైపు మరలి పరిపూర్ణంగా ఏకాగ్రతతో, దీక్షతో, ధ్యానంతో నమాజ్ చేయాలి. దేవుని సంస్మరణ నిండిన నమాజ్ మాత్రమే నిజమైన నమాజ్. కపటులు చేసే నమాజుల్లో దైవసంస్మరణ మృగ్యమై ఉంటుంది.

13. నమాజ్ తరువాత కూడా నమాజ్ బాధ్యతల్ని నెరవేర్చాలి. నమాజ్‌కు అద్దంపట్టేలా జీవిత రంగాలన్నింటినీ తీర్చిదిద్దాలి. ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది :

"నమాజ్ లజ్జావిహీనతని, అవిధేయతని రూపుమాపుతుంది." మహాప్రవక్త (సఅసం) అత్యంత ప్రభావపూరితమయిన ఒక ఉపమానంతో ఆ వాస్తవాన్ని ఇలా వివరించారు.

ఆయన (సఅసం) ఒక ఎండిన కొమ్మను బాగా ఊపారు. అలా ఊపడం వల్ల కొమ్మకు ఉన్న ఎండిన ఆకులన్నీ రాలిపోయాయి. అప్పుడు అన్నారు, 'ఈ ఎండిన కొమ్మ ఆకులు ఎలా రాలిపోయాయో అదేవిధంగా నమాజ్ చేసేవారి పాపాలు సమసిపోతాయి' తర్వాత ఆయన ఖుర్‌ఆన్‌లోని ఈ ఆయత్‌ను పఠించారు.

"నమాజును ప్రాతఃకాలాన, సంధ్యవేళలోను, కొంతరాత్రి గడిచిన తర్వాత స్థాపించండి. నిస్సంశయంగా ఉత్తమ ఆచరణలు (నీతి నడవడికలు) చెడులను అంతం చేస్తాయి. హితవు పొందగోరే వారికి ఇది హితవు." (నసాయి)

14. నమాజ్ చేస్తున్నప్పుడు నెమ్మదిగా ఆగుతూ ఆగుతూ ఖుర్‌ఆన్ చదవాలి. నమాజ్‌లో పఠించే ఇతర స్మరణలు కూడ నెమ్మదిగా పూర్తి శ్రద్ధతో, ఏకాగ్రచిత్తంతో చదవాలి. భావాన్ని గ్రహిస్తూ చదువుతూ ఉంటే ఉత్సాహం పెంపొందుతుంది. అదే వాస్తవమయిన నమాజ్.

15. నమాజ్‌ను నియమబద్ధంగా చెయ్యాలి. ఎప్పుడూ నాగా వేయవద్దు. విశ్వాసుల ప్రధాన గుణం ఏమిటంటే వారు నియమానుసారం నాగా వేయకుండా నమాజ్ చేస్తారు. "తమ నమాజ్‌లను నియమబద్ధంగా చేసేవారే వాస్తవానికి

నమాజ్ చేసేవారు."

16. ఫర్జ్‌లను ఆచరించడంతోపాటు నఫిల్ (అదనపు) నమాజ్‌లను కూడా పాటించాలి. నఫిల్ నమాజ్‌లను ఇతోధికంగా చెయ్యడానికి ప్రయత్నించాలి. ప్రవక్త (సఅసం) అన్నారు, ఫర్జ్ నమాజులే కాకుండా పగలు, రాత్రిళ్ళలో పన్నెండు రకాతులు* చేసేవారికి స్వర్గంలో ఒక గృహం నిర్మించబడుతుంది అని. (ముస్లిమ్)

17. సున్నత్, నఫిల్ అప్పుడప్పుడు ఇంట్లో కూడా చేసుకోవాలి. ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు, "మస్జిద్‌లో నమాజ్ చేసిన తర్వాత ఇంట్లో కూడా కొన్ని నమాజులు చేయండి. దేవుడు నమాజ్ ద్వారా మీ ఇళ్ళల్లో శుభాలను అనుగ్రహిస్తాడు." (ముస్లిమ్)

ప్రవక్త (సఅసం) స్వయంగా సున్నత్, నఫిల్ నమాజులు ఎక్కువగా ఇంట్లోనే చేసేవారు.

18. ఫజర్ నమాజుకు ఇంటినుండి బయలుదేరే సమయంలో ఈ దుఆ చేసుకోవాలి :

"దేవా! నా హృదయాన్ని జ్యోతిర్మయం చెయ్యి, నా కన్నుల్లో, నా వీనుల్లో, నా కుడివైపున, నా ఎడమ వైపున, నా వెనుక, నా ముందు అంతటా వెలుగు నింపు. నా నరాల్లో, నా కండరాల్లో నా రక్తంలో నా రోమ రోమంలో, నా చర్మంలో నా నోటిలో, నా ఆంతర్యం అంతటా కాంతిమయం చెయ్యి, నాకు మహత్తర కాంతిని ప్రసాదించు. నన్ను నిలువెల్లా ప్రకాశవంతం చెయ్యి. నాపై నా, నా క్రిందా కాంతినింపు. దేవా, నాకు ప్రకాశాన్నే ప్రసాదించు!."

19. ఫజర్, మగ్రిబ్ నమాజులు చేసిన తరువాత వేరే మాటలు పలుకక ముందు ఏడుసార్లు ఈ దుఆ పఠించాలి.

"అల్లాహుమ్మ అజిర్నీ మినన్నార్" "దేవా! నన్ను నరకాగ్ని నుండి కాపాడు." ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు :

"ఫజర్, మగ్రిబ్ తర్వాత ఎవరితోనూ సంభాషించకుండా ఏడుసార్లు ఈ దుఆ పఠించిన వారు ఆ రోజున లేక ఆ రాత్రి చనిపోయినట్లయితే వారు నరకంనుండి విముక్తి పొందుతారు." (మిష్కాత్)

20. ప్రతి నమాజ్ తర్వాత మూడుసార్లు "అస్తగ్ ఫిరుల్లాహ్" అనాలి.

---

* అంటే ఫరజ్ నమాజ్‌తోపాటు చేసే సున్నతులు: ఫజర్‌లో *2*, జుహర్‌లో *6*, మగ్‌రిబ్‌లో *2*, ఇషాలో *2*.

తరువాత ఈ దుఆ పఠించాలి.

اَللّٰهُمَّ اَنْتَ السَّلَامُ وَمِنْكَ السَّلَامُ تَبَارَكْتَ يَاذَاالْجَلَالِ وَالْاِكْرَامِ۔ (مسلم)

"అల్లాహుమ్మ అంతస్సలాము వ మిన్‌కస్సలాము తబారక్త యా జల్ జలాలి వల్ ఇక్రామ్." (ముస్లిమ్)

"దేవా ! నీవు శాంతిమయుడవు. శాంతి సౌఖ్యాలు నీ ద్వారానే లభిస్తాయి. నీవు శ్రేయోమూర్తివి. ఓ మహోన్నతమైన స్వామీ ! దయానిధీ!!"

దీన్ని గురించి హజ్రత్ సౌబాన్ (రజి), "ప్రవక్త (సఅసం) నమాజ్ పూర్తి అయిన తరువాత మూడుసార్లు అస్తగ్‌ఫిరుల్లాహ్ అని ఈ దువా పఠించేవారు" అని తెలిపారు. (ముస్లిమ్)

21. సామూహిక నమాజులో వరుసలను చక్కగా తీర్చిదిద్దుకోవాలి. ఆ పద్ధతిని పూర్తిగా పాటించాలి. భుజానికి భుజం కలిపి మధ్యలో స్థలం వదలకుండా నిలబడాలి. ముందు వరుసలు పూర్తికానిదే వెనుకటి వరుసలు తీర్చరాదు. ఒకసారి సామూహిక నమాజులో ఒకవ్యక్తి ఛాతీ విరుచుకుని నిలబడ్డాడు. ప్రవక్త (సఅసం) అది చూసి అతన్ని వారించారు : "దేవుని దాసులారా! మీ వరుసలను తీర్చిదిద్దుకోవడాన్ని కచ్చితంగా పాటించండి. అలా చేయకపోతే దేవుడు మిమ్మల్ని పరస్పరం విరోధులుగా చేసివేస్తాడు. (ముస్లిమ్)

ఇంకొక సమయంలో ఆయన (సఅసం) ఇలా అన్నారు : "నమాజు వరుసను ఇతరులతో కలిపి సరిచేసే వ్యక్తిని ఇతరులతో కలుపుతాడు. వరుసను చీల్చి వేసేవారిని దేవుడు ఇతరుల నుంచి వేరు చేస్తాడు." (అబూదావూద్)

22. చిన్న పిల్లల వరుస పెద్దల వరుస వెనుక ఉండాలి. పెద్దలతో పాటు వీరిని నిలబెట్టకూడదు. అయితే ఈద్‌గాహ్ మొదలైన ప్రదేశాల్లో వరుసలు వేరు వేరుగా ఉంచడం వీలుకాదు. పిల్లలు తప్పిపోవడం సంభవం. అక్కడ పిల్లల్ని వెనుకకు పంపించనవసరం లేదు. తమ వెంట నిలబెట్టుకోవచ్చును. మహిళల వరుసలు అందరికంటే వెనుక ఉండాలి. లేక వేరుగా ఉండాలి. మస్జిద్‌లో వారికి వేరేచోటు ఏర్పరచగలిగితే బావుంటుంది. ఈద్‌గాహ్‌లోనూ మహిళలకు వేరేస్థలం ఏర్పాటు చేయాలి.

# 3. ఖుర్‌ఆన్ పారాయణ మాధురి

1. దివ్య ఖుర్‌ఆన్ పఠనం శ్రద్ధాభక్తులతో మనస్ఫూర్తిగా చేయాలి. ఖుర్‌ఆన్‌తో సంబంధం దేవునితో అనుబంధమని నమ్మండి. మహాప్రవక్త(సఅసం) ఇలా బోధించారు :

"నా సమాజానికి (ఉమ్మత్‌కు) ఖుర్‌ఆన్ పఠనమే అత్యుత్తమమైన ఆరాధన."

2. ఎక్కువ సమయం ఖుర్‌ఆన్ పఠనంలో గడపాలి. పఠన సమయంలో ఎప్పుడూ చికాకు పడకూడదు.

అల్లాహ్ ఆదేశాన్ని దైవప్రవక్త ఇలా తెలిపారు :

"ఖుర్‌ఆన్ పఠనంలో నిమగ్నమై ఉన్నందువల్ల నన్ను వేడుకునే అవకాశం లభించని దాసునికి, అతడు అర్థించే అవసరం లేకుండానే అర్థించే వారికంటే అధికంగా నేను ప్రసాదిస్తాను." (తిర్మిజి)

ప్రవక్త (సఅసం) ఇంకా ఇలా అన్నారు :

"దాసుడు ఖుర్‌ఆన్ పఠనం ద్వారానే దైవానికి మరింత చేరువవుతూ ఉంటాడు." (తిర్మిజి)

వారు (సఅసం) ఖుర్‌ఆన్ పఠనాన్ని ప్రోత్సహిస్తూ ఇలా కూడా అన్నారు:

"ఖుర్‌ఆన్‌ను అభ్యసించి ప్రతిరోజూ పారాయణం చేసే వ్యక్తి నలుదిశలా సువాసనలు వెదజల్లే కస్తూరితో నిండిన భాండం వంటివాడు. ఖుర్‌ఆన్‌ను నేర్చుకొని కూడా దాన్ని పఠనం చేయని వ్యక్తి బిరడా బిగించివున్న కస్తూరి సీసావంటివాడు." (తిర్మిజి)

3. ఖుర్‌ఆన్ పఠనం కేవలం హితబోధను గ్రహించడానికి చేయాలి. ప్రజలు తమను గౌరవించాలని, తమ వైదుష్యాన్ని ఇతరులకు చూపాలనే ఆకాంక్షను, తమ ధార్మిక జీవితాన్ని ప్రపంచానికి ప్రదర్శించాలనే అభిలాషను పూర్తిగా విసర్జించాలి. ఇవి అత్యంత నీచమైన ఉద్దేశాలు. ఈ లక్ష్యాలున్నవారు ఖుర్‌ఆన్ ప్రబోధించే హితవును పొందలేరు.

4. ఖుర్‌ఆన్ పఠనానికి ముందు పారిశుధ్యాన్ని, పవిత్రతను పూర్తిగా పాటించాలి. వుజూ లేకుండా ఖుర్‌ఆన్‌ను ముట్టరాదు. పరిశుభ్రమైన స్థలంలో కూర్చొని పవిత్ర గ్రంథాన్ని పఠనం చేయాలి.

5. పఠన సమయంలో ఖిబ్లా వైపు తిరిగి మోకాళ్ళు పరచి కూర్చోవాలి. అత్యంత శ్రద్ధా భక్తులతో, ఏకాగ్రచిత్తంతో క్రమమైన పద్ధతిలో అధ్యయనం చేయాలి. అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు :

"మీ వద్దకు పంపించబడిన గ్రంథం శుభప్రదమయినది. ప్రజలు దాన్ని గురించి చింతన, పరిశీలన చేయాలని, బుద్ధికుశలత కలవారు దీనిద్వారా హితవును పొందాలని (మా ఉద్దేశ్యం)."

6. ఉచ్చారణను (తజ్వీద్), క్రమ పద్ధతిని (తర్తీల్) కూడా సాధ్య మైనంతవరకు పాటించాలి. పదాలను చక్కగా పలకాలి. నెమ్మదిగా ఆగుతూ చదవాలి. ప్రవక్త (సఅసం) ఇలా ఆదేశించారు : 'మీ స్వరంతో పఠనాపద్ధతితో ఖుర్‌ఆన్‌ను తీర్చిదిద్దండి. శ్రావ్యంగా ఆలాపించండి'. (అబూదావూద్) ప్రవక్త (సఅసం) ఒక్కొక్క అక్షరాన్ని స్పష్టంగా పలుకుతూ ఒక్కొక్క ఆయత్‌ను విడదీసి చదివేవారు.

ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు,- ఖుర్‌ఆన్ పఠించేవారిని ప్రళయంరోజున ఇలా ఆదేశించడం జరుగుతుంది : "ఇహలోకంలో నీవు ఎంత నిశ్చలంగ శ్రవణానందంగా ఖుర్‌ఆన్ చదివే వాడివో అలాగే ఖుర్‌ఆన్ చదువుతూ ఒక్కొక్క ఆయత్ పఠనంతో ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ పై పైకి వెళ్ళు. నీవు పఠించే తుది ఆయత్ వద్ద నీ స్థానముంది." (తిర్మిజి)

7. బిగ్గరగాగాని లేక చాలా మెల్లగాగానీ చదువకూడదు - మధ్యస్థంగా చదవాలి.

దేవుని హితవు ఏమిటంటే -

"నమాజులో అంత బిగ్గరగాను పఠించకండి, మరీ మెల్లగానూ పఠించకండి. మధ్యేమార్గాన్ని అనుసరించండి."

8. అవకాశం లభించినప్పుడల్లా పారాయణం చేయాలి. కాని ప్రాతఃకాలాన, తహజ్జుద్ నమాజ్‌లో ఎక్కువగా ఖుర్‌ఆన్ పఠించడానికి ప్రయత్నించాలి. ఇలా రాత్రిళ్ళు ఖుర్‌ఆన్‌పఠించడం ఉత్తమమైన మార్గం. కాబట్టి ఖుర్‌ఆన్ పారాయణంలో

ఉన్నతమైన స్థానాన్ని పొందడానికి విశ్వాసి అభిలషిస్తూ ఉండాలి.

9. మూడు దినాలకంటే తక్కువ వ్యవధిలో దివ్య ఖుర్ఆన్ పఠనాన్ని పూర్తి చేయడానికి ప్రయత్నించరాదు. ప్రవక్త (సఅసం) అన్నారు : "మూడు రోజులకంటే తక్కువ సమయంలో ఖుర్ఆన్ పఠించిన వారు అసలు ఖుర్ఆన్‌ను అర్థం చేసుకోనే లేదన్నమాట."

10. ఖుర్ఆన్ ఘనతను, ఔన్నత్యాన్ని గ్రహించాలి. ఏవిధంగానైతే బాహ్య పారిశుధ్యాన్ని, పవిత్రతను పాటించారో అలాగే హృదయాన్ని చెడుతలంపుల నుండి, అపవిత్రమయిన ఉద్దేశ్యాలనుండి పరిశుభ్రం చేసుకోవాలి. ఏ హృదయమైతే చెడు భావాలతో, హేయమైన ఉద్రేకాలతో నిండి ఉంటుందో అందులో పవిత్ర ఖుర్ఆన్ ఘనత, ఔన్నత్యం చోటు చేసుకోజాలదు. ఆ హృదయం ఖుర్ఆన్ మేళ్ళను, లోతుల్ని గ్రహించజాలదు. హజ్రత్ ఇక్రమ (రజి) దివ్య ఖుర్ఆన్ తెరువగానే ఎన్నోసార్లు స్పృహ కోల్పోయేవారు. "ఇది ఘనతగల, మహోన్నతుడయిన నా ప్రభువు వాణి" అని అనేవారు.

11. ఈ భూమిపైన మానవునికి హితవు కేవలం ఈ గ్రంథం ద్వారానే లభిస్తుందనే లక్ష్యంతోనే పఠనం చేయాలి. ఆ భావంతోనే అందులో చింతన, పరిశోధన, పరిశీలన చేయాలి. అందులోని యదార్థాలను ఆజ్ఞలను గ్రహించడానికి యత్నించాలి. గడగడ చదివేయకుండా, భావార్థాన్ని తెలుసుకుంటూ చదవడం అలవాటు చేసుకోవాలి. అందులో ఆలోచన, పరిశీలన చేయడానికి ప్రయత్నించాలి. హజ్రత్ అబ్దుల్లా ఇబ్నె అబ్బాస్ (రజి) అంటూ ఉండేవారు. "నేను, 'అల్ ఖారియహ్', 'అల్‌ఖద్ర్' వంటి చిన్న చిన్న సూరాలను భావం గ్రహిస్తూ చదవడాన్నే 'అల్ బఖర', 'ఆలి ఇమ్రాన్' వంటి పెద్ద పెద్ద సూరాలను ఏమీ గ్రహించకుండా గడగడ చదవటంకంటే ఉత్తమమని భావిస్తాను."

మహాప్రవక్త (సఅసం) ఒకరోజు రాత్రంతా ఈ ఒక్క ఆయత్‌నే మళ్ళీ మళ్ళీ పఠించారు.

"ఓ దేవా ! వారిని నీవు శిక్షిస్తే వారు నీ దాసులే. నీవు వారిని అనుగ్రహిస్తే ప్రభూ ! నీవు మహాశక్తి సంపన్నుడవు, గొప్ప వివేకవంతుడవు."

12. మనం ఖుర్ఆన్ ఆదేశాల ప్రకారంగా మన జీవితాల్ని మార్చుకోవాలనీ, దీని హిత బోధల కాంతిలో జీవితాన్ని తీర్చిదిద్దుకోవాలని నిశ్చయించుకొని ఖుర్ఆన్ పఠనం చేయాలి. అందులో లభించే ఆజ్ఞల కనుగుణంగా

మన జీవితాల్ని మలచుకోవడానికి, లోటుపాట్లు దూరం చేసుకొని జీవితాల్ని ప్రక్షాళనం చేసుకోవడానికి నిరంతరం ప్రయత్నించాలి. ఖుర్ఆన్ అద్దంవలె మన ఒక్కొక్క మచ్చను ఒక్కొక్క బలహీనతను మనకు తేటతెల్లం చేస్తుంది. అప్పుడు మచ్చల్ని, ఆ మలినాలను పరిశుభ్రం చేసుకోవడం మన కర్తవ్యం.

13. పఠనం చేస్తున్న సమయంలో ఖుర్ఆన్ ఆయత్‌ల ప్రభావాన్ని గ్రహించడానికి కూడా యత్నించాలి. కరుణ, మన్నింపు, స్వర్గ సుఖం ప్రస్తావనలు చదివితే సంతోషంతో, ఆనందంతో ఊగిపోవాలి. దైవాగ్రహం, నరకయాతన వంటి భయంకర విషయాల ప్రస్తావనలు చదివినప్పుడు శరీరం వణికిపోవాలి. కళ్ళు అశ్రువుల్ని వర్షించాలి. హృదయం పశ్చాత్తాపంతో ఆర్ద్రమవ్వాలి. విశ్వాసుల, సత్పురుషుల సాఫల్యాలు విజయాల వివరాలు చదివితే ముఖవర్చస్సు కళకళలాడాలి. జాతుల వినాశం సంభవించిన ఉదంతాలు వస్తే ముఖంలో విచారం అలముకోవాలి. హెచ్చరికలు, అభిశాపాలు గల ఆయత్‌లు చదివి గడగడ వణికిపోవాలి. శుభ సందేశాల ఆయత్‌లు పఠించినప్పుడు మన ఆత్మ కృతజ్ఞతా భావంతో వినమ్రమవ్వాలి.

14. పఠనం తరువాత దుఆ చేసుకోవాలి. హజ్రత్ ఉమర్ (రజి) ఈ పదాల్లో దుఆ చేసేవారు.

"దేవా ! నీ గ్రంథంనుండి నేను పఠించిన దాని గురించి ఆలోచించే, చింతన చేసే బుద్ధిని అనుగ్రహించు. దేవా! నాకు దాని పరిజ్ఞానాన్ని ప్రసాదించు. నాకు దాని అర్థాన్నీ, భావాన్నీ తెలుసుకునే శక్తిని కటాక్షించు. దాని అద్భుతాలను అందుకునే దృష్టిని ప్రసాదించు. నేను జీవించి ఉన్నంతకాలం దీని ప్రకారం ఆచరించేందుకు శక్తిని అనుగ్రహించు. వాస్తవానికి, సర్వశక్తిమంతుడవు నీవే."

# 4. జుమా (శుక్రవారం) నమాజ్ ప్రత్యేకతలు

1. జుమా రోజు శుచి, శుభ్రత, స్నానాదులు, అలంకరణలను పూర్తిగా పాటించాలి. హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్నె ఉమర్ (రజి) ప్రవక్త (సఅసం) ఇలా బోధించారని తెలిపారు : "జుమా నమాజు చేసుకోవడానికి వచ్చే వారు స్నానం చేసి మరీ రావాలి." (బుఖారి, ముస్లిమ్)

అబూ హురైరా (రజి), ప్రవక్త (సఅసం) ఇలా అన్నారని ఉల్లేఖించారు:

"కనీసం ప్రతివారం స్నానం చేయడం ప్రతి ముస్లిమ్‌కీ ఉన్న బాధ్యత, తలకూ, ఒంటికీ స్నానం చేయాలి."

హజ్రత్ అబూ సయీద్ (రజి) ప్రవక్త (సఅసం) ప్రవచనాన్ని విశదీకరించారు.:

"ప్రాజ్ఞతగల ప్రతి యువకుడు తప్పనిసరిగా జుమా రోజు స్నానం చేయాలి, మిస్వాక్ చేయాలి, లభ్యమైతే సువాసన కూడా వాడాలి."

(బుఖారి, ముస్లిమ్)

హజ్రత్ సల్మాన్ (రజి) ప్రవక్త (సఅసం) ప్రవచనాన్ని ఇలా వివరించారు:

"జుమానాడు స్నానం చేసి పారిశుధ్యాన్ని, పరిశుభ్రతను తన శక్తిమేరకు పాటించాలి. నూనె రాసుకుని, సువాసన పూసుకుని, మధ్యాహ్నం మస్జిద్‌కు వెళ్ళాలి. వరుసలో కూర్చున్న ఏ ఇద్దరు వ్యక్తుల్నీ ఆటంకపరచకుండా కూర్చోవాలి. తన చేతనైనంత నమాజులు చేసుకోవాలి. ఇమామ్ మింబరు ఎక్కినప్పుడు మౌనంగా కూర్చుని ఖుత్‌బా ప్రసంగం వినాలి. ఇలాంటి వ్యక్తివల్ల గత జుమానుండి ఈ జుమా వరకూ జరిగిన అపరాధాలన్నీ క్షమించబడతాయి."

(బుఖారి)

2. ముఖ్యంగా జుమా రోజున దైవనామ సంస్మరణ, ఖుర్‌ఆన్ పఠనం దుఆ, దాన ధర్మాలు (సద్‌ఖా), రోగులను పరామర్శించడం, ఇతరుల సుఖదుఃఖాల్లో పాల్గొనడం, శ్మశానవాటికను దర్శించడం తదితర సత్కార్యాలు ఇతోధికంగా చేయడం పుణ్యప్రదం.

హజ్రత్ అబూ హురైరా (రజి) ప్రవక్త (సఅసం) ఇలా అన్నారని తెలిపారు:

"సూర్యుడు ఉదయించే రోజుల్లోకెల్ల మహాత్కృష్టమైనది జుమారోజు.

ఆరోజు ఆదం(అలై)జన్మించారు. ఆదినమే ఆయన స్వర్గంలో ప్రవేశించారు. జుమా రోజే స్వర్గంనుండి బయటకు రప్పించబడి ఖలీఫాగా(దేవుని ప్రతినిధిగా) నియమించబడినారు. జుమా రోజే ప్రళయం సంభవిస్తుంది." (ముస్లిం)

హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ(రజి) ప్రవక్త(సఅసం) ప్రవచనాన్ని ఇలా ఉల్లేఖించారుః

"ఐదు క్రియల్ని ఒకే దినం ఆచరించే వ్యక్తి స్వర్గ ప్రవేశం చేసేవారిలో చేరుతాడు.

1. రోగులను పరామర్శించడం.

2. జనాజా అంత్యక్రియల్లో పాల్గొనడం.

3. ఉపవాసం పాటించడం.

4. జుమా నమాజ్ చెయ్యటం.

5. బానిసకు స్వేచ్ఛ నివ్వటం. (ఇబ్ను హిబ్బాన్)

అయితే ఇది (ఈ ఐదు క్రియల్ని) ఆచరించడం జుమా నాడే సాధ్య పడటంపైన ఆధారపడి ఉంది. హజ్రత్ అబూ సయీద్(రజి) ప్రవక్త(సఅసం) తెలిపిన మరో ప్రవచనాన్ని ఇలా వివరించారుః

"ఏ వ్యక్తిఅయితే జుమా రోజున 'కహఫ్' సూరా పఠిస్తాడో, అతనికోసం రెండు జుమాల మధ్య జ్యోతి వెలుగుతూ ఉంటుంది. (నసాయి)

హజ్రత్ అబూ హురైరా(రజి) ప్రవక్త(సఅసం) ఇలా అన్నారని తెలిపారుః "ఏ వ్యక్తిఅయితే జుమా రాత్రి 'దుఖాన్' సూరా పఠిస్తాడో అతని ముక్తి కొరకు డెబ్భయివేల మంది దూతలు ప్రార్థిస్తారు. అతని అపరాధాలన్నీ క్షమించబడతాయి." (తిర్మిజి)

మహాప్రవక్త(సఅసం) ఇలా అన్నారు. "జుమా రోజున ఒక శుభ గడియ ఉంది. ఆ తరుణంలో దాసుడు చేసిన ప్రతి ప్రార్థనా స్వీకరించబడుతుంది." (బుఖారి)

అయితే మరి ఆ గడియ ఏది? వేరే ఉల్లేఖనాలను బట్టి రెండు సమయాలు దీనికి వర్తిస్తాయని తెలుస్తోంది. ఒకటి - ఇమామ్ ఉపన్యసించడానికి (ఖుత్బా చెయ్యడానికి) వేదిక(మింబరు) మీదకు వచ్చినప్పటినుండి నమాజు పూర్తి అయ్యేవరకు. రెండవది - జుమా రోజున సూర్యుడు అస్తమించేముందు

ఆసన్నమయ్యే సమయం. ఈ రెండు సమయాలను అత్యంత వినయ విధేయతలతో, ప్రార్థనలో, నివేదనలో గడపడం ఉత్తమం.

ఆ సందర్భంలో వేరే దుఆలతోపాటు ఈ దుఆ కూడా చేయండి : "దేవా! నీవే నా ప్రభువు. నీవు తప్ప మరో దైవం లేడు. నీవు నన్ను పుట్టించావు. నేను నీ దాసుణ్ణి. వీలైనంతవరకు నీతో చేసిన వాగ్దానాలను పాటిస్తున్నాను. నీవు నాకు ప్రసాదించిన నీ వరప్రసాదాలను, మహోపకారాలను, నేను ఒప్పుకొంటున్నాను. నా అపరాధాలనూ ఒప్పుకుంటున్నాను. నన్ను మన్నించు. నీవు తప్ప అపరాధాలను మన్నించేవాడెవడూ లేడు. నా చేష్టల చెడుగునుండి నీ శరణు వేడుతున్నాను." (బుఖారి, నసాయి)

3. జుమా నమాజును శ్రద్ధా భక్తులతో చెయ్యాలి. జుమా నమాజు ప్రతి యుక్తవయస్కుడు, ఆరోగ్యవంతుడు, స్థానికుడు (ప్రయాణంలో లేనివాడు) ప్రాజ్ఞుడైన ప్రతి ముస్లిమ్ పురుషునికీ విధించబడింది. ఒక ప్రదేశంలో ఇమామ్ కాక ఇద్దరు వ్యక్తులున్నా చాలు జుమా నమాజు తప్పనిసరిగా చేసుకోవాలి. ప్రవక్త (సఅసం) ఇలా అన్నారుః

"ప్రజలు తప్పనిసరిగా జుమా నమాజ్‌ను శ్రద్ధతో చేయాలి. అలా చేయకపోతే దేవుడు వారి హృదయాలను మూసి వేస్తాడు. (ఋజుమార్గాన్ని కోల్పోయి) వారు అలక్ష్యపరుల్లో చేరిపోతారు." (ముస్లిమ్)

ప్రవక్త (సఅసం) ప్రవచనాన్ని హజ్రత్ అబూ హురైరా (రజి) ఇలా ఉల్లేఖించారుః.

"ఒకవ్యక్తి స్నానంచేసి జుమా నమాజ్ చేసుకోడానికి మస్జిద్‌కు వచ్చి చేతనయినన్ని రకాతులు సున్నత్ నమాజ్ చేసి మౌనంగా కూర్చుని, ఖుత్‌బా పూర్తి అయ్యేవరకు విని, తరువాత ఇమాంతోపాటు ఫర్జ్‌ను పూర్తి చేసుకుంటే గత జుమానుండి ఆ జుమా వరకు అతనివల్ల జరిగిన అపరాధాలు మన్నించ బడతాయి – అదనంగా మరి మూడు రోజుల పాపాలు కూడా."

హజ్రత్ యజీద్ ఇబ్నె మరియమ్ (రజి) ఇలా అంటారుః

"నేను జుమా నమాజుకు వెళ్తుండగా దారిలో హజ్రత్ ఉబాయా బిన్ రిఫాఅ (రజి) కలిశారు. ఆయన 'నీవు ఎక్కడికి వెళ్తున్నావ'ని అడిగారు. జుమా నమాజు చేసుకోడానికి వెళ్తున్నాను అన్నాను. అప్పుడాయన అన్నారు, 'నీకు

శుభం కలుగుగాక ! నీవు ఇలా నడవడం దైవమార్గంలో నడవడంతో సమానం."

ప్రవక్త (సఅసం) ఇలా అన్నారుః

"ఏ దాసుని కాళ్ళనిండా దైవమార్గంలో దుమ్ము ధూళి పేరుకు పోతుందో వాటిని నరకాగ్ని ముట్టుకోజాలదు."

4. జుమా అజాన్ వినీవినగానే మస్జిద్‌కు వెళ్ళడానికి త్వరపడాలి. వ్యాపారం, ఇతర కార్యకలాపాలు వెంటనే నిలిపివేయాలి. పూర్తి ఏకాగ్రతతో ఖుత్‌బా వినాలి. నమాజు చేసుకోవడంలో నిమగ్నమవ్వాలి. జుమా పూర్తయ్యాక తిరిగి వ్యాపార కార్యకలాపాల్లో పాల్గొనవచ్చు. పవిత్ర ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది ః

"విశ్వాసులారా ! జుమానాడు నమాజుకు అజాన్ ఇచ్చినప్పుడు వెంటనే దైవసంస్మరణ వైపునకు పరుగిడండి. వ్యాపార కార్యకలాపాలు వదిలివేయండి. మీరు గ్రహించగలిగినట్లయితే మీకు ఇదే ఉత్తమమయినది. నమాజు పూర్తి అయిన తరువాత మీ మీ కార్యకలాపాల కొరకు భువిపై సాగిపోండి. దేవుని అనుగ్రహాన్ని వెదకడంలో నిమగ్నులయిపోండి. దేవుణ్ణి ఎక్కువగా స్మరించండి. తద్వారా మీకు సాఫల్యం ప్రాప్తమయ్యే అవకాశం ఉంది." *(జుమా ః 9,10)*

ఈ ఆయత్‌లలో విశ్వాసి పొందే కొన్ని హితవులున్నాయి ః

(i) విశ్వాసి పూర్తి చైతన్యంతో దీక్షతో జుమా నమాజు చేయాలి. అజాన్ పిలుపు వినగానే అన్నింటిని వదిలేసి మస్జిద్ వైపునకు పోవాలి.

(ii) అజాన్ విన్న తరువాత వ్యాపార వ్యవహారంలోనో లేక ప్రాపంచిక కార్యకలాపాలలోనో మనిషి నిమగ్నమవటం దైవాన్ని విస్మరించిన వానిలా వ్యవహరించడంతో సమానం. ఇది ధర్మసమ్మతం కాదు.

(iii) విశ్వాసి దేవుని దాసునిగా, బానిసగా జీవించాలి. దేవుని వైపునుండి పిలుపు వచ్చినప్పుడు అతడు విశ్వాసపాత్రునిగా, వినయ విధేయతలుగల బానిసగా తన సర్వకార్యకలాపాలను విడనాడి సర్వప్రాపంచిక లాభాలు, సుఖాలు త్యజించి దేవుని పిలుపువైపు పరుగెత్తాలి. ఇదే విశ్వాసికి సాఫల్య రహస్యం. మనిషి ధార్మిక విధుల నిర్వహణలో ఇహలోక సుఖాలు, లాభాలు త్యజించడం అసఫలత కాదని, అసలైన నిష్ఫలత, పరాజయాలు మనిషి ప్రపంచ సౌఖ్యాలను పొందే చింతలో ధర్మాన్ని నాశనం చేసుకోవడమేనని మనిషి తన మాటల ద్వారా చేతల ద్వారా ప్రకటించాలి.

(iv) మనిషి ఈ లోకంవైపు చూడకుండా కళ్ళు మూసుకొని, ఈ ప్రపంచంలో తాను ఒక అసమర్థుడుగా రుజువు చేసుకొని, ధార్మిక జీవనపరుడై పోవాలనే దృక్పథం కూడా సరియైనదికాదు. ఈ సందర్భంలో ఖుర్‌ఆన్ హితవు ఏమంటే "నమాజు చేసుకున్న తరువాత భూమి మీద విస్తరించండి." దేవుడు తన పృధ్విలో ఆహారాన్వేషణకై ఏ యే మార్గాలు ఏర్పరచాడో వాటివలన పూర్తిగా లాభం పొందండి. మీ శక్తి సామర్థ్యాలను పూర్తిగా వినియోగించి అన్వేషించండి. విశ్వాసి తన అవసరాల నిమిత్తం ఇతరులపై ఆధారపడటం తన కుటుంబీకుల అవసరాలు తీర్చడంలో వారు, ఆందోళన, నిరాశ, నిస్పృహలకు లోనయ్యేలా వ్యవహరించడం సరయిన పంథా కానేకాదు.

(v) ముఖ్యమయిన చివరిమాట ఏమిటంటే విశ్వాసి తన దైవాన్ని మరచిపోయి ప్రపంచ కార్యకలాపాల్లో ఇరుక్కుపోకూడదు. తన జీవన సంపత్తి నిజమయిన జీవనసారం దైవ సంస్మరణే అని జ్ఞాపకముంచుకోవాలి. హజ్రత్ సయీద్ ఇబ్నె జుబైర్(రజి) ప్రకారం, దైవనామ స్మరణ అంటే కేవలం నోటితో స్మరణ, స్తుతి, స్తోత్రం చెయ్యడంకాదు. వ్యక్తి అనునిత్యం దైవాజ్ఞల ప్రకారం తన జీవన వ్యవస్థను మలచుకుంటూ పురోగమించటమే నిజమైన దైవ సంస్మరణ.

5. జుమా నమాజు కొరకు సాధ్యమయినంత త్వరగా మస్జిద్‌కు వెళ్ళడానికి యత్నించాలి. ముందుగా వెళ్ళి మొదటి వరుసలో స్థలాన్ని పొందడానికి ప్రయత్నించాలి. హజ్రత్ అబూ హురైరా(రజి), ప్రవక్త (సఅసం) ఈ విధంగా అన్నారని చెప్పారుః

"అత్యంత శ్రద్ధతో పారిశుధ్యం పాటించడానికి సక్రమంగా స్నానం చేసి జుమా రోజున అందరికంటే ముందు మస్జిద్ చేరిన వ్యక్తికి లభించే పుణ్యం ఒక ఒంటెను ఖుర్‌బానీ చేసిన దానితో సమానం. ఆ తరువాత వచ్చిన వ్యక్తికి ఆవు లేక గేదెను ఖుర్‌బానీ చేసిన దానితోనూ, ఆ తరువాత వచ్చిన వ్యక్తికి కొమ్ములు గల గొర్రెను ఖుర్‌బానీ చేసిన దానితోనూ, ఆపైన వచ్చిన వ్యక్తికి దైవమార్గంలో గ్రుడ్డును దానం చేసినదానితోనూ సమానమైన ప్రతిఫలం లభిస్తాయి. ఇక ఖతీబ్ ఖుత్బా ప్రారంభించడానికి వచ్చినపుడు దైవదూతలు మస్జిద్ ద్వారాన్ని వదలి ఖుత్బా వినడానికి, నమాజ్ చేసుకోడానికి మస్జిద్‌లోకి వచ్చి కూర్చుంటారు."

(బుఖారీ, ముస్లిమ్)

హజ్రత్ అర్‌బాజ్ బిన్ సారియ(రజి) ప్రకారం ప్రవక్త(సఅసం), "మొదటి

వరుసలో ఉన్నవారి క్షమాపణ కొరకు మూడుసార్లు దుఆ చేసేవారు, కానీ, రెండవ వరుసలో ఉన్నవారి కొరకు ఒక్కసారే." (ఇబ్నెమాజ, నసాయి)

హజ్రత్ అబూ హురైరా (రజి) తెలిపారుః "మొదటి వరుసకు పుణ్యఫలమేమిటో ప్రజలకు తెలియదు. ఒకవేళ పుణ్యఫలం తెలిస్తే ప్రజలు మొదటి వరుస కోసం పోటీపడి లాటరీ వేసి మరీ కూర్చునేవారు." (బుఖారి, ముస్లిమ్)

6. జుమా నమాజు జామె మస్జిద్‌లో చేయాలి. ఎక్కడ స్థలం దొరికితే అక్కడే కూర్చోవాలి. ప్రజల తలలూ భుజాలపై నుండి దాటుతూ వెళ్ళడానికి ప్రయత్నించరాదు. అలా చేయడం వల్ల ప్రజలకు శారీరకంగానూ, మానసికంగానూ బాధకలుగుతుంది. వారి ప్రశాంతతకు, ఏకాగ్రతకు, శ్రద్ధకు భంగం వాటిల్లుతుంది.

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) ప్రవక్త (సఅసం) ప్రవచనాన్ని ఇలా ఉల్లేఖించారుః "తన సోదరుడైన విశ్వాసికి బాధ కలిగించకుండా ఉండడానికి మొదటి వరుసను వదలి రెండవ వరుసలో నిలబడిన వ్యక్తికి దైవం మొదటి వరుసలో ఉన్న వారికంటే రెండింతలు అధికంగా పుణ్యఫలం ప్రసాదిస్తాడు."(తిబ్రాని)

హజ్రత్ సల్మాన్ (రజి) ప్రవక్త (సఅసం) ప్రవచనాన్ని ఇలా ఉల్లేఖించారుః "ఏ వ్యక్తి అయితే జుమా రోజు స్నానం చేసి తన శక్తి కొద్ది పవిత్రతను, పారిశుధ్యాన్ని పాటించి, నూనెరాసుకొని సువాసన పూసుకొని మధ్యాహ్న సమయానికి మస్జిద్‌కు వెళ్ళి ఇద్దరు వ్యక్తుల మధ్యదూరి వారిని వేరుచేస్తూ పోకుండా (అంటే వారి తలలు, భుజాలపై నుండి దాటి వరుసలను చీల్చుకొని వెళ్ళకుండా లేక ముందే కూర్చున్న వ్యక్తుల మధ్యలో కూర్చునేందుకు ప్రయత్నించకుండా) ఎక్కడ చోటు దొరికితే అక్కడే మౌనంగా కూర్చుని వీలైనంత సున్నత్ నమాజ్ మొదలైనవి చేసుకొని, ఖతీబ్ వేదికపై రాగానే మౌనంగా ఖుత్‌బా వింటాడో ఆ వ్యక్తి గత జుమా నుండి ఈ జుమావరకు చేసిన అపరాధాలన్నీ క్షమించబడతాయి." (బుఖారి)

7. ఎల్లప్పుడు ఖుత్‌బా ప్రసంగం నమాజువలె కాకుండా క్లుప్తంగా చెయ్యాలి. ఎందుకంటే ఖుత్బా అసలు ఒక విధమయిన సంస్మరణ. అందులో మీ అందరినీ దేవుని దాస్యానికి, ఆరాధనకు ప్రోత్సహించడం జరుగుతుంది. అయితే నమాజ్ ఆరాధనేకాదు, అన్నింటినీ మించిన మహోత్కృష్టమైన ఆరాధన. అందుచేత "ఖుత్‌బా"ను బాగా పొడిగించి నమాజును త్వర త్వరగా క్లుప్తంగా చేసుకోవడం సమంజసం కాదు.

మహాప్రవక్త(సఅసం) అన్నారుః "నమాజ్‌ను పొడిగించటం(ఎక్కువసేపు చేసుకోవడం) ఖుత్‌బాను క్లుప్తం చేయడం "ఖతీబ్" వివేకవంతుడనటానికి తార్కాణం కాబట్టి మీరు నమాజ్‌ను పొడిగించి, ఖుత్‌బాను క్లుప్తంగా చేసుకోండి." (ముస్లిమ్)

8. ఖుత్‌బాను మౌనంగా, శ్రద్ధతో ఏకాగ్రతతో, ఆచరించే సంకల్పంతో వినాలి. దైవం, దైవప్రవక్త ఆదేశించిన విషయాలను చిత్తశుద్ధితో ఆచరించడానికి ప్రయత్నించాలి. ప్రవక్త (సఅసం) అన్నారుః "స్నానంచేసి, జుమా నమాజ్ చేసుకోవడానికి మస్జిద్‌కు వచ్చి తనకు తోచినన్ని సున్నత్ నమాజ్‌లు చేసుకొని, ఖతీబ్ ఖుత్‌బాను పూర్తి చేసేవరకు మౌనంగా శ్రద్ధతో, ఏకాగ్రతతో విని ఇమామ్‌తో ఫర్జ్ నమాజ్ చేసుకున్న వ్యక్తి ఒక జుమా నుండి రెండవ జుమా వరకు చేసిన అపరాధాల మన్నింపు పొందుతాడు, ఆ పైన ఇంకా మూడు రోజులు చేసిన తప్పులు కూడా క్షమించబడతాయి." (ముస్లిమ్)

ఇంకొక హదీసులో ఇలా ఉంది: "ఖతీబ్ ఖుత్‌బా ఇవ్వడానికి వచ్చినప్పుడు నమాజ్ చేసుకోవడంగాని మాట్లాడడంగాని మంచిది కాదు."

9. రెండవ ఖుత్‌బా అరబ్బీలోనే చెయ్యాలి. కానీ మొదటి ఖుత్‌బాలో నమాజ్‌కు వచ్చిన వారికి, దైవం ఆయన ప్రవక్త (సఅసం) బోధించిన కొన్ని ఆజ్ఞల్ని సమయానుకూలంగా నీతి బోధలు, హితవులను వారి మాతృ భాషలో కూడా బోధించడం ఉత్తమం.

ప్రవక్త (సఅసం) తాను ఇచ్చిన ఖుత్‌బాలలో పరిస్థితులను అనుసరించి విశ్వాసులకు కొన్ని బోధనలు, హితవులు ఉపదేశించారన్న విషయం తెలుస్తుంది. ఉపన్యాసకుడు శ్రోతల భాషలో ప్రసంగించినప్పుడే ఈ లక్ష్యం నెరవేరుతుంది.

10. జుమా ఫర్జ్ నమాజ్‌లో అల్ ఆలా, అల్ గాషియా లేక అల్ మునాఫికూన్, అల్ జుమా సూరాలు పఠించడం ఉత్తమమైనది. ప్రవక్త(సఅసం) అధికంగా ఈ సూరాలనే జుమాలో పఠించేవారు.

11. జుమానాడు ఇతోధికంగా ప్రవక్త (సఅసం) పేరున దరూద్ పఠించాలి. ప్రవక్త(సఅసం) ప్రవచనం ఇలా వుందిః "జుమా రోజు, నా పేరున అధికంగా దరూద్‌పఠించండి. ఆనాడు దరూద్‌పఠనంలో మీతో పాటు దైవదూతలు కూడా పాల్గొంటారు. ఆ దరూద్ నాకు అందజేయబడుతుంది." (ఇబ్నెమాజా)

# 5. జనాజా నమాజ్ – నియమాలు

1. జనాజా నమాజ్‌లో పాల్గొనడం అలవరచుకోవాలి. జనాజా నమాజ్ వాస్తవానికి మృతుని కోసం క్షమాభిక్ష వేడుకునే దుఆ. ఇది మృతునిపట్ల మనకు ఉన్న బాధ్యత. ఒకవేళ వుజూ చేసేలోపు జనాజా నమాజ్ ముగిసే పరిస్థితి ఉంటే తయమ్ముమ్ చేసుకొని నమాజ్ చేయవచ్చు. ప్రవక్త (సఅసం) ప్రవచనం చూడండిః

"జనాజా నమాజ్ చేయాలి. బహుశ ఈ నమాజ్‌లో పాల్గొనడంవల్ల మిమ్మల్ని దుఃఖం ఆవరించవచ్చు. దుఃఖంలో ఉన్న మనిషి దేవుని నీడలో ఉంటాడు. దుఃఖంలో ఉన్న వ్యక్తి ప్రతి పుణ్యకార్యాన్ని చేస్తుంటాడు." (హాకిమ్)

ప్రవక్త (సఅసం) ఇలా కూడా అన్నారు ః

"ఒక మృతుని జనాజా నమాజ్‌లో మూడు వరుసల మనుషులు సమకూరితే మృతునికి తప్పనిసరిగా స్వర్గప్రవేశం లభిస్తుంది." (అబూదావూద్)

2. జనాజా నమాజ్ కొరకు శవపేటిక (డోలా) ను తల ఉత్తరం వైపు, కాళ్ళు దక్షిణం వైపు ఉండేలా ఉంచాలి. శవపేటికకు ఎదురుగా ఖిబ్లాకు అభిముఖంగా నిలబడాలి.

3. జనాజా నమాజ్ చేయిస్తున్నవారు (ఇమామ్ అయినవారు) మృతుని ఛాతికి ఎదురుగా నిలబడాలి.

4. జనాజా నమాజ్‌లో వరుసలు బేసి సంఖ్యలో ఉండాలి. కొద్దిమంది ఉంటే ఒక వరుస చాలు. ఎక్కువమంది ఉంటే మూడు,* ఐదు, ఏడు, లేక చాలా వరుసలు బేసి సంఖ్యలో ఉండవచ్చు.

5. జనాజా నమాజ్ ప్రారంభించేటప్పుడు అత్యంత కరుణామయుడయిన దైవం ఈ మృతుని క్షమించడానికి జనాజా నమాజ్ చేస్తున్నామని నియ్యత్ (సంకల్పం) చేసుకోవాలి. ఇమామ్, ఆయన వెనుక నమాజు చేసేవారు కూడా ఇదే విధంగా సంకల్పం చేసుకోవాలి.

6. జనాజా నమాజ్‌లో ఇమాం పఠించేదే వెనుక నమాజ్ చేసే వారు (ముఖ్తదీలు) కూడా పఠించాలి. వీరు మౌనంగా ఉండరాదు. అయితే ఇమామ్ తక్బీర్లు కొంచెం బిగ్గరగా పలకాలి, వెనుక నమాజ్ చేసేవారు మెల్లగా అనాలి.

7. జనాజా నమాజ్‌లో నాలుగు తక్బీర్లు పలకాలి. మొదటి తక్బీరులో చేతులు చెవుల వరకు ఎత్తి తరువాత కట్టుకోవాలి. ఈ దుఆ పఠించాలిః

---

* ఇమామ్‌కాక ఆరుగురు ఉన్నట్లయితే మూడు వరసలు చేసుకోవడం ఉత్తమం. మొదటి వరుసలో ముగ్గురు, రెండవదానిలో ఇద్దరు, మూడవ దానిలో ఒక్కరు.

سُبْحٰنَكَ اللّٰهُمَّ وَبِحَمْدِكَ وَتَبَارَكَ اسْمُكَ وَتَعَالٰى جَدُّكَ وَجَلَّ ثَنَاءُكَ وَلَآ اِلٰهَ غَيْرُكَ ۔

"సుబ్ హానకల్లాహుమ్మ వబిహమ్దిక వతబారకస్ముక వతఆలా జద్దుక వజల్ల సనాఉక వలాఇలాహ గైరుక".

"దేవా, నీవు పవిత్రుడవు! నీకే సకల స్తోత్రాలు. నీ నామం శుభప్రదమైనది. నీ ఘనత ఉన్నతమైనది. నీ స్తోత్రం మహాత్మ్యపూర్ణమైనది. నీవు తప్ప వేరే ఆరాధ్యుడు లేడు". ఆ తరువాత రెండవ తక్బీర్ లో చేతులుకాని, తలకాని ఎత్తనవసరంలేదు. రెండవ తక్బీర్ తరువాత దరూద్ షరీఫ్ చదవాలి.

اَللّٰهُمَّ صَلِّ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰٓى اٰلِ مُحَمَّدٍ كَمَا صَلَّيْتَ عَلٰٓى اِبْرَاهِيْمَ وَعَلٰٓى اٰلِ اِبْرَاهِيْمَ اِنَّكَ حَمِيْدٌ مَّجِيْدٌ ۔ اَللّٰهُمَّ بَارِكْ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰٓى اٰلِ مُحَمَّدٍ كَمَا بَارَكْتَ عَلٰٓى اِبْرَاهِيْمَ وَعَلٰٓى اٰلِ اِبْرَاهِيْمَ اِنَّكَ حَمِيْدٌ مَّجِيْدٌ ۔

"అల్లాహుమ్మ సల్లిఅలా ముహమ్మదిన్ వఅలా ఆలి ముహమ్మదిన్ కమా సల్లయిత అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్మజీద్. అల్లాహుమ్మ బారిక్ అలా ముహమ్మదిన్ వ అలా ఆలి ముహమ్మదిన్ కమా బారక్త అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్మజీద్."

"దేవా! ఏ విధంగానయితే నీవు ఇబ్రాహీమ్ (అలైహిస్సలాం)ను, ఆయన అనుచరుల్నీ కరుణించావో అలాగే ముహమ్మద్ (సఅసం)ను ఆయన అనుచరుల్ని కరుణించు. నిస్సందేహంగా నీవు మహత్తర గుణసంపత్తి, ఘనతగల వాడవు. దేవా! ఎలాగయితే నీవు ఇబ్రాహీమ్ (అలై)కు, ఆయన అనుచరులకు శుభాలను ప్రసాదించావో అలాగే ముహమ్మద్ (సఅసం)కు ఆయన అనుచరులకు శుభాలను అనుగ్రహించు. నిస్సందేహంగా నీవు మహత్తరమైన గుణసంపత్తి, ఘనతగల వాడవు."

ఇప్పుడు చేతులు ఎత్తకుండా మూడవ తక్బీర్ అనాలి. మృతునికోసం మస్నూన్ దుఆ చేయాలి. తర్వాత నాల్గవ తక్బీర్ పలికి ఇరువైపుల సలామ్ పఠించాలి.

8. ఒకవేళ చనిపోయినవారు ప్రాజ్ఞులయిన పురుషుడు లేక స్త్రీ అయితే మూడవ తక్బీర్ తర్వాత ఈ దుఆ పఠించాలి:

اَللّٰهُمَّ اغْفِرْ لِحَيِّنَا وَمَيِّتِنَا وَشَاهِدِنَا وَغَائِبِنَا وَصَغِيْرِنَا وَكَبِيْرِنَا وَ ذَكَرِنَا وَ اُنْثَانَا ، اَللّٰهُمَّ مَنْ اَحْيَيْتَهٗ مِنَّا فَاَحْيِهٖ عَلَى الْاِسْلَامِ وَمَنْ تَوَفَّيْتَهٗ مِنَّا فَتَوَفَّهٗ عَلَى الْاِيْمَانِ ۔

"అల్లాహుమ్మగ్‌ఫిర్ లిహయ్యినా వ మయ్యితినా వ షాహిదినా వ గాయిబినా వ సగీరినా వ కబీరినా వ జకరినా వ ఉన్‌సానా, అల్లాహుమ్మ మన్ అహ్‌యైతహూ మిన్నా ఫఅహ్‌యిహి అలల్ ఇస్లామ్, వమన్ తవఫ్ఫయ్‌తహూ మిన్నా ఫతవఫ్ఫహూ అలల్ ఈమాన్."

"ఓ దేవా ! మమ్మల్ని, మాలో జీవించి ఉన్నవారిని, మరణించిన వారిని, ఇక్కడ ఉన్నవారిని, ఇక్కడ లేనివారిని, చిన్నవారిని, పెద్దవారిని, పురుషులను, స్త్రీలను క్షమించు. దేవా ! మాలో ఎవరిని జీవించనిస్తావో వారిని ఇస్లామ్ కొరకు జీవించేలా చెయ్యి. ఎవరికి మృత్యువునిస్తావో వారిని ఈమాన్ (విశ్వాసం)గల వారిగా మృత్యువునివ్వు."

ఒకవేళ మరణించినవాడు ప్రాజ్ఞతకు చేరని బాలుడయితే ఈ దుఆ పఠించాలి:

اَللّٰهُمَّ اجْعَلْهُ لَنَا فَرَطًا وَّاجْعَلْهُ لَنَآ اَجْرًا وَّذُخْرًا وَّاجْعَلْهُ لَنَا شَافِعًا وَّمُشَفَّعًا

"అల్లాహుమ్మజ్ అల్‌హు లనా ఫరతన్ వ్వజ్ అల్‌హు లనా అజ్ రన్ వ్వ జుఖ్ రన్ వ్వజ్ అల్‌హు లనా షాఫిఅన్ వ్వముష్ఫఅ".

"ఓ దేవా ! ఈ బాలుని మా విముక్తికి కారణభూతునిగా జేయి. ఇతన్ని మాకు శుభప్రదంగాను, అంతిమ దిన సంపత్తిగాను చేయి. ఇతన్ని స్వీకరించబడే సిఫారసుగా చేయి."

ఒకవేళ బాలిక అయితే ఈ దుఆ పఠించాలి. ఈ దుఆ భావార్థం కూడ పిల్లవానికి పఠించే దుఆ లాంటిదే అని గ్రహించాలి.

اَللّٰهُمَّ اجْعَلْهَا لَنَا فَرَطًا وَّاجْعَلْهَا لَنَآ اَجْرًا وَّذُخْرًا وَّاجْعَلْهَا لَنَا شَافِعَةً وَّمُشَفَّعَةً

"అల్లాహుమ్మజ్ అల్‌హాలనా ఫరతన్ వజ్ అల్‌హా లనా అజ్ రన్ వ్వజుఖ్ రన్ వ్వజ్ అల్‌హా లనా షాఫిఅతన్ వ్వ ముష్ఫఅతన్."

"ఓ దేవా! ఈ బాలికను మా విముక్తికి కారణంగా చేయి. ఈమెను మాకు శుభప్రదంగానూ, అంతిమదిన సంపత్తిగానూ చేయి. ఈమెను స్వీకరింపబడే సిఫారసుగా చేయి.

9. ఖనన క్రియల్లో పాల్గొంటే దానివల్ల కలుగబోయే పుణ్యఫలాన్ని గురించి ఆలోచిస్తూ ఉండాలి. ఎలాగైతే ఈనాడు ఒకరిని సమాధి చేయబోతున్నామో ఖచ్చితంగా అలాగే ఒకనాడు ఇతరులు మమ్మల్ని తీసుకెళ్తారనే యోచన రావాలి. దీని వలన కొంత సమయమైనా అంతిమదిన భావనలో, చేసిన అపరాధాలకు పశ్చాత్తాపంతో క్రుంగిపోయి సత్కార్యానికి నోచుకుంటారు. ప్రాపంచిక విషయాలనుండి చిక్కు సమస్యల జంఝాటం నుండి రక్షించబడతారు.

# 6. మృతులపట్ల మర్యాద

1. మృత్యువు ఆసన్నమైన వారివద్దకు వెళ్ళినప్పుడు కొంచెం బిగ్గరగా 'లా ఇలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్ రసూలుల్లాహ్' వాక్యం పఠిస్తూ ఉండాలి. ఆ వ్యక్తిని ఇది పఠించమని అనకూడదు. ప్రవక్త (సఅసం) అన్నారుః

"మరణించిన వారివద్ద కూర్చున్నప్పుడు కలిమా పఠిస్తూ ఉండాలి"

(ముస్లిమ్)

2. అవసానదశ (నజా)లో యాసీన్ సూరాను చదవాలి. ప్రవక్త (సఅసం) ప్రవచనం ఏమంటే, "మరణించే వారివద్ద యాసీన్ సూరాను చదవాలి."

*(ఆలంగీరి, పేజి 100, 1వ భాగం)*

అయితే చనిపోయిన తరువాత శవానికి గుసుల్ (స్నానాదులు) చేయించనంతవరకు అక్కడ కూర్చొని పవిత్ర ఖుర్ఆన్ పఠించకూడదు. స్నానం చేయడం అవశ్యమైనవారు, బహిష్టువల్లనూ, ప్రసూతివల్లనూ పరిశుద్ధంగాలేని స్త్రీలు కూడ శవం వద్దకు వెళ్ళరాదు.

3. మరణవార్త విన్నప్పుడు "ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్" "మేమంతా దైవం కొరకే, మేమందరమూ ఆయన వైపునకు మరలవలసిన వారమే" అని చదవాలి. ప్రవక్త (సఅసం) అన్నారుః ఏ వ్యక్తిఅయితే కష్టకాలంలో ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజిఊన్ పఠిస్తాడో ఆ వ్యక్తికి మూడు పుణ్య ఫలాలు లభిస్తాయి. ☆ మొదటిది : అతనికి దైవం నుండి కరుణ, శుభం ప్రాప్తిస్తుంది.☆ రెండవది : అతనికి సత్యాన్వేషణ, ధర్మ చింతన వల్ల పుణ్యం లభిస్తుంది. ☆ మూడవది : అతనికి కలిగిన నష్టం భర్తీ చేయబడుతుంది. అతడు పోగొట్టుకున్న వస్తువుకు బదులు మంచి ప్రతిఫలం ఇవ్వబడుతుంది. (త్రిబాని)

4. మృతుని దుఃఖంలో బిగ్గరగా ఏడ్వడం, రోదించడం మానుకోవాలి. అయితే దుఃఖంలో అశ్రువులు రావడం సహజం. ప్రవక్త (సఅసం) కుమారుడు హజ్రత్ ఇబ్రాహీమ్ మరణించినప్పుడు వారి (సఅసం) కళ్ళనుండి అశ్రువులు ప్రవహించాయి. అలాగే వారి (సఅసం) మనుమడు ఇబ్నె జైనబ్ (రజి) మరణించి నప్పుడు వారి (సఅసం) కళ్ళు అశ్రుధారలు వర్షించాయి. 'ఓ దైవ ప్రవక్తా! ఇదేమిట'ని అడిగితే వారు (సఅసం) అన్నారుః "దేవుడు తన దాసుల హృదయాల్లో ఉంచిన కరుణ ఇది. ఏ దాసులైతే ఇతరులపై కరుణిస్తారో దేవుడు ఆ దాసులను కరుణిస్తాడు."

వారు (సఅసం) ఇలా కూడా అన్నారుః "ఎవరైతే నోరు బాదుకుంటారో, దుస్తులు చింపుకుంటారో అజ్ఞానంతో రోదిస్తారో వారితో మాకు ఏలాంటి సంబంధం లేదు."

5. ప్రాణంపోయిన తరువాత శవం కాళ్ళు చేతులు తిన్నగా ఉంచాలి. కళ్ళు మూసివేయాలి. ఒక వెడల్పయిన గుడ్డతో దవడల క్రిందిభాగం నుండి తీసి తలమీద కట్టివేయాలి. కాళ్ళ రెండు బొటనవ్రేళ్ళను కలిపి సన్నని త్రాడుతో కట్టివేయాలి. దుప్పటి కప్పాలి. తరువాత 'బిస్మిల్లాహి వ ఆలా మిల్లతి రసూలిల్లాహి'- అంటే,

'దేవుని నామంతో, దైవప్రవక్త సమాజం కోసం' అని పఠిస్తుండాలి. ప్రజలకు మరణవార్త తెలియపరచాలి. సమాధి చేస్తున్నప్పుడు కూడా ఈ దుఆయే చేయాలి.

6. మృతుని మంచి గుణాలను చెప్పుకోవాలి. చెడులను చెప్పుకోరాదు. ప్రవక్త (సఅసం) అన్నారుః 'తమ మృతుల గురించిన మంచి విషయాలను చెప్పుకుంటూ ఉండాలి. వారి చెడులను గూర్చి నోరు విప్పరాదు.' (అబూదావూద్)

వారు (సఅసం) ఇలా కూడ అన్నారు : "ఒక వ్యక్తి మరణిస్తాడు. అతని పొరుగున ఉన్న నలుగురు అతడు మంచివాడని సాక్ష్యమిస్తే అప్పుడు దేవుడంటాడు, "నేను మీ సాక్ష్యాన్ని స్వీకరించాను. ఏ విషయాలైతే మీకు తెలియవో వాటిని నేను క్షమించాను." (ఇబ్నె హిబ్బాన్)

ఒకసారి దైవప్రవక్త (సఅసం) సమ్ముఖంలో ఆయన అనుచరులు ఒక మృతుణ్ణి పొగిడారు. అప్పుడు వారు (సఅసం) అన్నారు, "అతనికి స్వర్గం విధిగా ప్రాప్తించింది. ప్రజలారా ! మీరు భూమిపై, దేవుని సాక్షులు, మీరు ఎవరిని మంచివారంటారో వారిని దేవుడు స్వర్గంలో ప్రవేశింపచేస్తాడు. మీరు ఎవరిని చెడ్డవారంటారో దేవుడు వారిని నరకంలో పడవేస్తాడు." (బుఖారి, ముస్లిమ్)

వారు (సఅసం) ఇంకా ఇలా అన్నారు, "ఒక రోగిని పరామర్శించడానికి వెళ్ళినా లేక ఒకరి అంత్య క్రియల్లో పాల్గొన్నా ఎల్లప్పుడు శుభకరమైన పదాలనే పలుకుతూ ఉండాలి. ఎందుకంటే మీ పదాలకు దూతలు "ఆమీన్" (తథాస్తు) అంటూ ఉంటారు." (ముస్లిమ్)

7. ఎల్లప్పుడు మరణం పట్ల ఓర్పు, స్థిమితం ప్రదర్శించాలి. ఎప్పుడు ఏలాంటి కృతఘ్నతా పదాలు పలుకకూడదు. ప్రవక్త (సఅసం) అన్నారుః

"ఒక వ్యక్తి తన పుత్రుని మరణానికి ఓర్పువహించినప్పుడు ప్రభువు దూతలతో, 'మీరు నా దాసుని పిల్లవాని ప్రాణం తీసివేశారా?' అని అడుగుతాడు. ప్రభూ! మీ ఆజ్ఞను మేము పాటించామని దూతలు సమాధానమిస్తారు. దేవుడు, 'మీరు నా దాసుని ప్రాణ సమానుని ప్రాణం తీశారు కదూ!' అని మళ్ళీ అడుగుతాడు. 'అవును' అని వారంటారు. అప్పుడాయన అయితే నా దాసుడేమన్నాడని అడుగగా 'ఈ ఆపదలో అతడు మిమ్మల్ని స్తుతించాడు. ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజిఊన్ చదివాడు' అని జవాబిస్తారు. అప్పుడు దేవుడు వారితో చెప్తాడు, "అయితే నా ఈ దాసునికి స్వర్గంలో ఒక గృహం నిర్మించండి. దానికి బైతుల్ హమ్ద్ (కృతజ్ఞతా మందిరం) అని పేరు పెట్టండి." (తిర్మిజి)

8. శవానికి స్నానం చేయించడంలో జాగు చేయరాదు. స్నానపు నీళ్ళలో రేగు ఆకులువేసి కొంచెం వేడి చేయడం మంచిది. శవాన్ని పరిశుభ్రమైన బల్లపైన పడుకోబెట్టాలి. దుస్తులు తీసివేసి లుంగీ కప్పాలి. చేతికి గుడ్డను చుట్టుకొని ఇస్తింజా చేయించాలి. (మలమూత్రాలు వెడలునట్లు చేయాలి). ఇది చేసేటప్పుడు లుంగీని కప్పి ఉంచడం మరచిపోకూడదు. తర్వాత వుజూ చేయించాలి. ఆ సమయంలో నోటిలో, ముక్కులో నీళ్ళు పోయనవసరం లేదు. స్నానం చేయిస్తున్నప్పుడు చెవుల్లో, ముక్కులో నీళ్ళు పోకుండా దూదిపెట్టాలి. తలను సబ్బుతోగాని, కుంకుడు కాయతోగాని శుభ్రంగా కడగాలి. తర్వాత కుడివైపు ఒత్తిగిల పడుకోబెట్టి తలనుంచి కాళ్ళవరకు నీళ్ళు పోయాలి. అలాగే ఎడమవైపుకు పడుకోబెట్టి తలనుండి కాళ్ళవరకు నీళ్ళుపోయాలి. ఇప్పుడు తడి లుంగీని తీసివేసి పొడిలుంగీ కప్పివేయాలి. తర్వాత కఫన్‌లో పడుకోబెట్టాలి.

ప్రవక్త (సఅసం) అన్నారు :

"శవానికి స్నానం చేయించి, దాని దోషాలను కప్పిపుచ్చిన దాసుని నలభయి మహాపరాధాలను (గునాహె కబీరాను) దైవం క్షమిస్తాడు. శవాన్ని సమాధిలో దింపిన వ్యక్తి మృతునికి తీర్పుదినం వరకు ఉండటానికి గృహసౌకర్యం కల్పించినట్లే. (తిబ్రాని)

9. శవానికి సాధారణమైన తెల్లనివస్త్రం కఫన్‌గా ఉపయోగించాలి. మరీ అంత ఖరీదయినదిగానీ మరీ అంత చౌకబారు వస్త్రంగానీ వాడరాదు. పురుషులకు కఫన్‌లో మూడు వస్త్రాలుండాలి. ఒకటి దుప్పటి, ఒకటి లుంగీ, వేరొకటి (కఫన్) చొక్కా. దుప్పటి పొడవు శవం ఎత్తుకంటే ఎక్కువగా ఉండాలి. ఎందుకంటే తల,

కాళ్ళు రెండు వైపులు కట్టివేయడానికి వీలుగా ఉంటుంది.

శవాన్ని బాగా కప్పివేయడానికి వీలుగా వెడల్పు కూడ ఎక్కువ ఉండాలి. స్త్రీలకు ఈ వస్త్రాలే కాకుండా తలకు కట్టడానికి ఒక గజం కంటే కొంచెం తక్కువ వెడల్పు, ఒక గజం కంటే ఎక్కువ పొడవుగల వస్త్రం (సర్‌బంద్) చంకలనుండి చీల మండలం వరకు ఒక వస్త్రం(సీనాబంద్) ఉండాలి. ప్రవక్త(సఅసం)అన్నారుః

"శవానికి వస్త్రం (కఫన్) ధరింపచేసిన వారికి దైవం స్వర్గంలో పరిమళ భరితమైన మిరుమిట్లు గొలిపే కాంతిగల వస్త్రాలు ధరింపచేస్తాడు." (హాకిమ్)

10. జనాజాను ఖననవాటికకు తీసుకువెళ్ళేటప్పుడు కాస్త తొందరగా అడుగులు వేయాలి. అంత్యక్రియలకు త్వరపడాలి. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) ప్రవక్త(సఅసం)ను అడిగారు, "ఓ దైవప్రవక్తా ! శవాన్ని ఎంత తొందరగ తీసుకువెళ్ళాలి?" "గబ గబా పరుగెత్తే వేగం కంటే కొంచెం తక్కువ. ఒకవేళ మృతుడు ఉత్తముడయితే అతన్ని ఉత్తమ పథానికి త్వరగ చేర్చండి. ఒకవేళ దుర్నీతిపరుడయితే ఆ దుర్నీతిని మీ నుండి త్వరగా దూరం చేయండి." అన్నారు మహాప్రవక్త. (అబూ దావూద్)

11. జనాజాతో పాటు నడిచి వెళ్ళాలి. ప్రవక్త (సఅసం) ఒకసారి ఒకరి జనాజాతో పాటు నడిచివెళ్ళారు. అక్కడ ఆయన కొందరు వ్యక్తులు స్వారీ చేయడం చూశారు. ఆయన (సఅసం) వారితో 'మీకు సిగ్గు వేయడం లేదా? దేవుని దూతలు నడుస్తూ ఉంటే మీరు జంతువుల వీపులపైన స్వారీ చేస్తారా?' అన్నారు. అయితే అంత్యక్రియల తర్వాత వాహనాన్ని ఉపయోగించవచ్చును. ప్రవక్త (సఅసం) అబూ వాహిది అంత్య క్రియలకు నడిచేవెళ్ళారు. తిరిగి వచ్చేటప్పుడు గుర్రంపైన స్వారీ చేస్తూ వచ్చారు.

12.జనాజాను తీసుకువెళ్తున్నప్పుడు మీరు చూస్తే నిలబడాలి. దానివెంట వెళ్ళే ఉద్దేశ్యం లేకపోయినట్లయితే జనాజా కొంచెం ముందుకు వెళ్ళే వరకు నిలబడాలి. ప్రవక్త (సఅసం) అన్నారు :

"జనాజా వెళ్తున్నప్పుడు మీరు చూస్తే నిలబడండి. జనాజాలో పాల్గొన్నవారు జనాజాను క్రిందపెట్టేవరకు కూర్చోకూడదు."

13. జనాజా నమాజ్ శ్రద్ధతో చేయాలి. జనాజాతో పాటు వెళ్ళాలి. జనాజాకు భుజం అందించడంలో కూడా శ్రద్ధ వహించాలి. ప్రవక్త (సఅసం) అన్నారు, "ఒక విశ్వాసిపై మరో విశ్వాసికి ఉన్న హక్కు ఒకటి జనాజాతో పాటు

వెళ్ళడం." వారు (సఅసం) ఇలా కూడా అన్నారు, "జనాజాలో పాల్గొని, జనాజా నమాజ్ చేసిన వ్యక్తికి కేరెట్‌కు సమానంగా పుణ్యం లభిస్తుంది. నమాజ్ తర్వాత ఖనన క్రియల్లో పాల్గొంటే అతనికి రెండు కేరెట్‌ల పుణ్యం ప్రాప్తిస్తుంది."

ఎవరో "రెండు కేరెట్‌లు అంటే ఎంత?" అని అడిగారు. రెండు పర్వతాలకు సమానమని జవాబిచ్చారు మహాప్రవక్త (సఅసం). (బుఖారి, ముస్లిమ్)

14. సమాధిని ఉత్తర దక్షిణంగా త్రవ్వించాలి. శవాన్ని సమాధిలో దించేటప్పుడు ముఖం ఖిబ్లావైపు ఉంచి దింపాలి. ఒకవేళ శవం తేలికగా ఉంటే దింపడానికి ఇద్దరు వ్యక్తులు చాలు. అలా కాకపోతే అవసరంకొద్ది ముగ్గురు లేక నల్గురు వ్యక్తులు దింపవచ్చును. దించిన తరువాత శవం ముఖాన్ని ఖిబ్లావైపునకు త్రిప్పి వస్త్రం ముడులు విప్పి వేయాలి.

15. స్త్రీ అయితే సమాధిలో దించేటప్పుడు 'పర్దా'ను పాటించాలి.

16. సమాధి పూడ్చే సమయంలో తల వైపునుండి మట్టి వేయడం ఆరంభించాలి. ప్రతివ్యక్తి రెండు చేతులనిండా మట్టి తీసుకొని మూడుసార్లు వేయాలి.

మొదటిసారి మట్టివేస్తున్నప్పుడు ఇలా పఠించాలి :

مِنْهَا خَلَقْنٰكُمْ

"మిన్‌హా ఖలఖ్‌నాకుమ్" (ఈ మట్టితోనే మేము మిమ్మల్ని పుట్టించాము).

రెండవసారి మట్టి వేస్తున్నప్పుడు ఇలా పఠించాలి :

وَفِيْهَا نُعِيْدُكُمْ

"వ ఫీహా నుయీదుకుమ్" ( దానిలోకే మళ్ళీ మేము మిమ్మల్ని పంపిస్తున్నాము)

మూడవసారి మట్టి వేస్తున్నప్పుడు ఇలా పఠించాలి :

وَمِنْهَا نُخْرِجُكُمْ تَارَةً اُخْرٰى

"వ మిన్‌హా నుఖ్‌రిజుకుమ్ తారతన్ ఉఖ్‌రా" (దానినుండే మేము తిరిగి మిమ్మల్ని లేపుతాము).

17. సమాధిని ఎక్కువ ఎత్తుగా కాని, చతురస్రాకారంగా కాని కట్టకూడదు. తవ్వితే ఎంతమట్టి వస్తుందో అదే మట్టితో సమాధిచేయాలి. ఖననం చేసిన తరువాత సమాధిపైన కొంచెం నీరు చల్లాలి.

18. ఖననం చేసిన తర్వాత కొంతసేపు సమాధివద్ద ఉండాలి. మృతుని క్షమించమని దైవాన్ని ప్రార్థించాలి. ఖుర్‌ఆన్ కొంతభాగం పఠించి, అలా లభించే పుణ్యఫలాన్ని మృతునికి ప్రాప్తింపచేయాలి. ఇతరులను కూడా ప్రార్థించమని ప్రోత్సహించాలి. మహాప్రవక్త (సఅసం) మృతుని ఖననం చేసిన తరువాత దైవ క్షమాపణ కొరకు స్వయంగా దుఆ చేసేవారు. అలా చేయమని ఇతరులకు కూడా చెప్పేవారు. 'ఇది సమాధానం చెప్పుకునే సమయం. మీ సోదరుని స్థైర్యం కొరకు ప్రార్థించండి. అతని మోక్షం కొరకు వేడుకొనండి." (అబూదావూద్)

19. తమ సంబంధీకులు బంధువులు లేక పొరుగువారు ఎవరైనా మరణిస్తే ఒకటి, రెండు పూటలు భోజనం వారికి పంపించాలి. ఎందుకంటే వారు దుఃఖంలో ఉంటారు. జామె తిర్మిజి వివరణలో ఉంది, "హజ్రత్ జాఫర్ (రజి) అమరగతిపొందారని వార్త అందగానే ప్రవక్త (సఅసం) అన్నారుః 'జాఫర్ (రజి) ఇంటివారికోసం భోజనం సిద్ధంచేయండి. వారు ఈ రోజు దుఃఖంలో ఉన్నారు".

20. మూడు దినాలకు మించి మృతుని సంతాపం చేయరాదు. అయితే భర్త చనిపోయిన స్త్రీ నాలుగు నెలల పది దినాలవరకు సంతాపం పాటించాలి.

విశ్వాసుల మాతృమూర్తి (ఉమ్ముల్ మోమినీన్) హజ్రత్ ఉమ్మె హబీబ (రజి) తండ్రి అబూ సుఫియాన్ దివంగతులైనప్పుడు, బీబీ జైనబ్ (రజి) పరామర్శించడానికి ఆమె వద్దకు వెళ్ళారు. హజ్రత్ ఉమ్మె హబీబ సువాసనను (అత్తరును) తెప్పించారు. దానిలో జాఫ్రానీ రంగు మిళితమై ఉంది. మాతృమూర్తి ఆ సువాసనను తన సేవికకు రాశారు. తనూ కొంచెం రాసుకున్నారు. తర్వాత అన్నారు, "దేవుడే సాక్షి, నాకు సువాసన అవసరం లేదు. కాని ప్రవక్త (సఅసం) ఇలా అనడం నేను విన్నానుః 'ఏ మహిళ అయితే దైవాన్ని, పరలోక దినాన్ని విశ్వసిస్తుందో ఆమె ఏ మృతుని సంతాపమూ మూడు దినాలకు మించి పాటించరాదు. అయితే భర్త సంతాపం మాత్రం నాలుగు నెలల పది దినాలు."

(అబూ దావూద్)

21. మృతునికోసం శక్తికొలది దానధర్మాలు కూడా చేయాలి. అయితే ఈ విషయంలో షరీఅత్ అనుమతించని ఆచారాలకు దూరంగా ఉండాలి.

# 7. మౌనవాటికలో

1. అంత్యక్రియల్లో పాల్గొనడంతోబాటు శ్మశానికి కూడా వెళ్ళాలి. శవ ఖననంలో పాల్గొనాలి. అప్పుడప్పుడు శ్మశానానికి వెళ్తూ ఉండాలి. అందువల్ల అంతిమదినం జ్ఞాపకం తాజా అవుతూ ఉంటుంది. మరణానంతర జీవితానికి సిద్ధంగా ఉండడానికి ప్రేరణ కలుగుతుంది.

ప్రవక్త(సలసం) ఒక జనాజాతో పాటు శ్మశానానికి వెళ్ళారు. అక్కడ ఒక సమాధివద్ద కూర్చుని చాలా దుఃఖించారు. అశ్రువులతో నేల తడిసిపోయింది. తరువాత తన అనుచరులను ఉద్దేశించి,

"మిత్రులారా ! ఈ దినం కొరకు సన్నద్ధులవ్వండి" అని అన్నారు.

(ఇబ్నుమాజా)

ఇంకొకసారి ఒక సమాధివద్ద కూర్చుని ఆయన(సలసం) ఇలా అన్నారు,

"సమాధి ప్రతిరోజూ అత్యంత భయంకరమైన ధ్వనితో పిలుస్తుంది. "ఓ ఆదం సంతానమా ! నీవు నన్ను మరచిపోయావా? నేను ఏకాంత గృహాన్ని. నేను అపరిచిత స్థలాన్ని, భయానక స్థానాన్ని. నేను క్రిమికీటకాలకు స్థావరాన్ని. నేను బాధలతో నిండిన ఇరుకయిన చోటును. ఎవరికోసం దేవుడు నన్ను పెద్దగాను, విశాలంగా చేస్తాడో ఆ అదృష్టవంతులకు తప్ప, సర్వ మానవులకు నేను కష్టాన్నే కలిగిస్తాను."

ఆయన (సలసం) ఇంకా అన్నారు, "సమాధి నరకకూపాలలో ఒకటి లేదా కర్మలనుబట్టి స్వర్గపు ఉద్యానవనాల్లోని ఒక వనం." (తిబ్రాని)

2. శ్మశానానికి వెళ్ళి గుణపాఠం నేర్చుకోవాలి. భావాలను కేంద్రీకరించి మరణానంతర జీవితంపట్ల ఆలోచించే, పరిశీలించే అలవాటు చేసుకోవాలి.

ఒకసారి హజ్రత్ అలీ (రజి) శ్మశాన వాటికకు వెళ్ళారు. ఆయన వెంట హజ్రత్ కమీల్(రజి) కూడా ఉన్నారు. శ్మశానానికి వెళ్ళి ఆయన సమాధుల్ని ఒక సారి చూశారు. తర్వాత సమాధివాసుల్ని ఉద్దేశించి ఇలా అన్నారుః

"ఓ సమాధివాసుల్లారా ! శిధిలాల్లో నివసించే వారలారా !! భయంకరమైన ఏకాంత వాసులారా !!! మీకు వస్తున్న శుభవార్తలేమిటో చెప్పండి. మీ సంపత్తిని పంచివేసుకున్నాము. మీ బిడ్డలు అనాధలై పోయారు. మీ భార్యలు ఇతర భర్తలను చేసుకున్నారు. ఇదీ ఇక్కడి పరిస్థితి. ఇప్పుడు మీరు కూడా మీ శుభవార్తల్ని

వినిపించండి." కొంతసేపు ఆయన మౌనం వహించారు. తర్వాత హజ్రత్ కమీల్ (రజి) వైపు చూసి అన్నారు, "కమీల్ ! ఒకవేళ ఈ సమాధి నివాసులకు చెప్పడానికే అనుమతి ఉంటే వారు ఇలా చెప్పేవారు : "ఉత్తమ ప్రయాణ నేస్తాలు భయభక్తులు" అంటూ రోదించసాగారు. అలా చాలాసేపు విలపించి అన్నారు, 'కమీల్! సమాధి కర్మల పేటిక. ఈ విషయం మరణసమయంలో తెలిసిపోతుంది."

3. శ్మశాన వాటికలో ప్రవేశించేటప్పుడు ఈ దుఆ పఠించాలి:

اَلسَّلَامُ عَلَيْكُمْ اَهْلَ الدِّيَارِ مِنَ الْمُؤْمِنِيْنَ وَالْمُسْلِمِيْنَ وَاِنَّا اِنْ شَآءَ اللّٰهُ بِكُمْ لَاحِقُوْنَ اَسْأَلُ اللّٰهَ لَنَا وَلَكُمُ الْعَافِيَةَ۔

"అస్సలాము అలైకుమ్ అహ్లద్దియారి మినల్ మూమినీన వల్ ముస్లిమీన వ ఇన్నా ఇన్ షా అల్లాహు బికుమ్ లాహి ఖూన అస్అలుల్లాహ లనా వ లకుముల్ ఆఫియ"

ఈ బస్తీలో నివసించే దైవ విధేయులైన ఓ విశ్వాసులారా ! మీపై శాంతి నెలకొనుగాక! దైవం తలిస్తే మేము కూడ అతి త్వరలో మిమ్మల్ని కలుసు కుంటాము. దైవం తన శిక్షనుండి, ఆగ్రహాన్నుండి రక్షించాలని మేము మా కొరకు, మీ కొరకు ఆయన్ని వేడుకుంటున్నాము.

4. శ్మశాన వాటికలో అజాగ్రత్త పరులవలె అలక్ష్యపరులవలె నవ్వడం, పరిహాసాలాడటం, ప్రాపంచిక విషయాలు ముచ్చటించుకోవడం తప్పు. సమాధి ప్రళయదిన ద్వారం. ఆ ద్వారాన్ని చూసి అక్కడి ఆలోచనల్లో మునిగిపోయి విలపించాలి. దైవప్రవక్త (సఅసం) ఇలా అన్నారు :

"నేను మునుపు మిమ్మల్ని శ్మశాన వాటికకు వెళ్ళకుండా వారించాను (మీ హృదయాల్లో ఏకేశ్వరోపాసన పటిష్టం కావాలని). అయితే ఇప్పుడు మీరు వెళ్ళాలని అనుకుంటే వెళ్ళవచ్చు. ఎందుకంటే సమాధులు ప్రళయదిన జ్ఞాపకాన్ని తాజా చేస్తాయి." (ముస్లిమ్)

5. సమాధులను పక్కా కట్టడంలా నిర్మించడం, అలంకరించడం మానుకోవాలి. మహాప్రవక్త (సఅసం)కు అంతిమ గడియలు ఆసన్నమైనప్పుడు నొప్పివల్ల ఎంతో వ్యాకులపడుతున్నారు. ఒక్కోసారి ముఖంపై దుప్పటి కప్పుకుంటూ, ఇంకోసారి తీసివేస్తూ ఉన్నారు. ఇలాంటి అసాధారణమైన ఆందోళనలో ఆయన పవిత్రమైన నోటినుండి ఈ పలుకులు వెలువడగా

హజ్రత్ ఆయిషా (రజి) విన్నారు :

"యూదులకూ, క్రైస్తవులకూ దేవుని శాపం ! వారు తమ ప్రవక్తల సమాధులను ఆరాధనాలయాలుగా మార్చుకున్నారు."

6. శ్మశాన వాటికకు వెళ్ళి మృతులకు "ఈసాలెసవాబ్" పుణ్యకార్యం చేసి దాని పుణ్యఫలం మృతులకు చెందేలా (ప్రార్థించడం) చేయండి. దేవునితో క్షమాభిక్షకై ప్రార్థన చేయాలి. హజ్రత్ సుఫ్యాన్ (రజి) అన్నారు. జీవమున్న మానవునికి ఏ విధంగానయితే అన్నపానీయాల అవసరం ఉంటుందో అలాగే మృతులకూ క్షమాభిక్ష కోసం ప్రార్థన అంతే అవసరం.

తిబ్రాని హదీసు గ్రంథంలో ఒక హదీసు ఉంది. "దేవుడు స్వర్గంలో సజ్జనుడైన దాసుని స్థానాన్ని ఉన్నతం చేస్తాడు. అప్పుడు దాసుడు అడుగుతాడు.

'ప్రభూ! ఈ స్థానం నాకు ఎలా లభించింది?' దేవుడంటాడు -

"నీ పుత్రుని వల్ల. అతడు నీ కొరకు క్షమాభిక్ష వేడుకుంటూ ఉండేవాడు."

# 8. సూర్య, చంద్ర గ్రహణాలు

1. సూర్యచంద్ర గ్రహణాల సమయంలో దేవుణ్ణి స్మరిస్తూ ఉండాలి. దుఆలు వేడుకుంటూ ఉండాలి. దైవనామాన్ని పఠిస్తూ దాన, ధర్మాలు చేయాలి. ఈ సత్కార్యాల వల్ల దేవుడు ఆపదలు, కష్టాలూ దూరం చేస్తాడు.

హజ్రత్ ముగైర బిన్ షఅబ (రజి.అన్.) ప్రకారం మహాప్రవక్త (సఅసం) అన్నారుః "సూర్యుడు, చంద్రుడు రెండు దేవుని గుర్తులు. ఒకవ్యక్తి చనిపోవడం, జన్మించడం వల్ల గ్రహణాలు పట్టవు. గ్రహణం పట్టినట్లు మీరు చూస్తే మాత్రం దేవుణ్ణి స్మరించాలి. గ్రహణాలు తొలగిపోయేంతవరకు నమాజు, దుఆ చేస్తూ ఉండాలి. (బుఖారి, ముస్లిమ్.)

2. సూర్య గ్రహణం పట్టినప్పుడు మస్జిద్‌లో సామూహిక నమాజుచేయాలి, కానీ ఆ నమాజు కోసం అజాన్ పిలుపు, ఇఖామత్ అవసరంలేదు. ప్రజల్ని కలుసుకుని వారిని సమీకరించాలి. చంద్రగ్రహణ సమయంలో నవాఫిల్ నమాజులు చేయాలి. సామూహిక నమాజు అవసరంలేదు.

3. సూర్యగ్రహణం పట్టినప్పుడు సామూహికంగా రెండు రకాత్‌ల నమాజు చేసే సమయాన ఖిరాత్‌ను పొడిగించాలి. గ్రహణం వీడి సూర్యుడు స్పష్టంగా కనబడే వరకు నమాజులో నిమగ్నమైపోవాలి, ఖిరాత్ బిగ్గరగా చదవాలి. ప్రవక్త (సఅసం) జీవితకాలంలో ఒకసారి సూర్యగ్రహణం పట్టింది. ఆరోజే ఆయన (సఅసం) పసి కందు హజ్రత్ ఇబ్రాహీమ్ (రజిఅన్) చనిపోయారు. ఇంకేముంది హజ్రత్ ఇబ్రాహీమ్ బిన్ ముహమ్మద్(సఅసం) చనిపోయినందువల్లే సూర్యగ్రహణం పట్టిందని ప్రజలు చెప్పుకోవడం ప్రారంభించారు. అప్పుడు ప్రవక్త(సఅసం) ప్రజల్ని సమీకరించారు. రెండు రకాత్‌ల నమాజుచేశారు, ఈ నమాజులో ఆయన (సఅసం) దీర్ఘంగా ఖిరాత్ చదివారు, దివ్య ఖుర్ఆన్‌లోని బఖర సూరాను పఠించారు. దీర్ఘమైన రుకూ, సజ్దా చేశారు, నమాజు పూర్తయ్యాక సూర్యగ్రహణం తొలగిపోయి సూర్యుడు స్పష్టంగా కనబడుతున్నాడు. తర్వాత ఆయన (సఅసం) అన్నారు. సూర్యుడు, చంద్రుడు రెండూ దేవుని చిహ్నాలు. ఒకరి మరణంవల్ల గాని, జననం వల్లగాని గ్రహణాలు సంభ వించవు. ప్రజలారా! మీకు ఇలాంటి సంఘటనలు ఎదురైతే మీరు దేవుని స్మరణలో లీనమైపోవాలి. దుఆ వేడుకోవాలి. దేవుని నామాన్ని బిగ్గరగా పఠించాలి. నమాజ్ చేయాలి. దాన ధర్మాలు ఇవ్వాలి. (బుఖారి, ముస్లిమ్)

హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ సమ్ర (రజిఅన్) అంటారుః మహా ప్రవక్త (సఅసం) శుభప్రదమైన కాలంలో ఒకసారి సూర్యగ్రహణం సంభవించింది. నేను మదీనాకు ఆవల విలువిద్య అభ్యసిస్తున్నాను. నేను వెంటనే విల్లంబుల్ని విసిరివేశాను. ఈ సమయాన మహాప్రవక్త (సఅసం) ఏమి చేస్తారో చూడాలన్న ఉత్సుకతతో ప్రవక్త (సఅసం) వద్దకు వెళ్ళాను. ఆయన (సఅసం) తన రెండు పవిత్ర హస్తాలను ముందుకు చాపి దేవుని స్తోత్రం చేస్తూ, ఆయన నామాన్ని పఠిస్తూ దుఆలో మునిగిపోయారు. తర్వాత ఆయన (సఅసం) నమాజ్‌చేశారు. ఆ నమాజ్‌లో రెండు దీర్ఘమైన సూరాలను చదివారు. సూర్యుడు స్పష్టంగా కనిపించే వరకు ఆ కార్యంలో నిమగ్నులయ్యారు. మహాప్రవక్త (సఅసం) సహచరులు (రజి.అన్) కూడ ఇలాంటి సమయాల్లో నమాజు చేసేవారు. ఒకసారి మదీనాలో గ్రహణం పట్టిన సమయాన హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ (రజిఅన్) నమాజు చేశారు. ఇంకోసారి గ్రహణం సమయాన హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి.అన్) ప్రజలను సమీకరించి సామూహిక నమాజు చేశారు.

4. గ్రహణం సమయాన చేసే నమాజుల మొదటి రకాత్‌లో ఫాతిహా సూరా తర్వాత అన్‌కబూత్ సూరా చదవాలి. రెండవ రకాత్‌లో రూమ్ సూరా చదవాలి. ఈ సూరాలను చదవడం మహాప్రవక్త (సఅసం) ఆచారం, అయితే అవే సూరాలు చదవనవసరంలేదు, ఇతర సూరాలను కూడ చదువవచ్చు.

5. గ్రహణం సమయాన చేసే సామూహిక నమాజులో పాల్గొనాలని మహిళలు అభిలషిస్తే, అలా పాల్గొనేందుకు సదుపాయం ఉంటే, మహిళలు నమాజు చేయవచ్చు. పిల్లల్ని కూడ అందుకు ప్రోత్సహించాలి. అందువల్ల బాల్యం నుండే ఏకేశ్వర భావన వారి హృదయాల్లో నాటుకుపోయి, తద్వారా బహుదైవారాధన భావాలు చోటుచేసుకోకుండా ఉంటాయి.

6. షరిఅత్ నమాజు నిషేధించిన సమయాల్లో, అంటే సూర్యోదయం, మిట్ట మధ్యాహ్నం, సూర్యాస్తమయం సమయాల్లో, సూర్యగ్రహణం సంభవిస్తే నమాజు చేయరాదు. అయితే దైవస్మరణ, స్తోత్రం చేయవచ్చు. పేదలకు, అగత్యపరులకు దానధర్మాలు చేయాలి. సూర్యోదయమయి, ప్రొద్దెక్కిన తరువాత కూడా గ్రహణం అలానే ఉంటే నమాజు కూడా చేసుకోవచ్చు.

# 9. శుభప్రదమైన రమజాన్

1. శుభప్రదమైన రమజాన్ మాసానికి ఘనస్వాగతం పలకడానికి షాబాన్ మాసంనుండే అన్ని విధాలా సంసిద్ధంగా ఉండాలి. షాబాన్ 15వ తేదీకి ముందు వీలయినంత అధికంగా ఉపవాసాలు ఉండాలి. హజ్రత్ ఆయెషా (రజి.అన్) అంటారు. మహాప్రవక్త (సఅసం) అన్ని మాసాల్లో కంటే షాబాన్ మాసంలోనే అధికంగా ఉపవాసాలు ఉండేవారు.

2. శ్రద్ధాసక్తితో శుభప్రదమైన రమజాన్ నెలవంకను చూడ్డానికి ప్రయత్నించాలి. నెలవంకను చూశాక ఈ దుఆ చేయాలి :

اَللّٰهُ اَكْبَرُ اَللّٰهُمَّ اَهِلَّهٗ عَلَيْنَا بِالْاَمْنِ وَالْاِيْمَانِ وَالسَّلَامَةِ وَالْاِسْلَامِ وَالتَّوْفِيْقِ لِمَا تُحِبُّ وَتَرْضٰى۔ رَبُّنَا وَرَبُّكَ اللّٰهُ۔

"అల్లాహు అక్బర్, అల్లాహుమ్మా అహిల్లహు అలైన బిల్ అమ్ని వల్ ఈమాని వస్సలామతి వల్ ఇస్లామి వత్తౌఫీఖి లిమాతుహిబ్బు వ తర్ జా రబ్బునా వ రబ్బుకల్లాహు".

"దేవుడు అందరికంటే గొప్పవాడు. దేవా! ఈ చంద్రుణ్ణి, మా పట్ల శాంతి, విశ్వాసం గల శ్రేయస్కరమైన ఇస్లామ్ చంద్రునిగా ఉదయింపచేయి. నీకు అభీష్టమైన, ప్రీతికరమైన కార్యాలు చేసేందుకు మమ్మల్ని కటాక్షించు. ఓ చంద్రుడా! మా ప్రభువూ, నీ ప్రభువూ అల్లాహ్‌యే". (తిర్మిజి, ఇబ్ను హిబ్బాన్)

ప్రతీమాసంలోనూ క్రొత్త చంద్రుణ్ణి చూసినప్పుడు ఈ దుఆ చేయవచ్చు.

3. రమజాన్ మాసంలో ఆరాధనల పట్ల ప్రత్యేక శ్రద్ధాసక్తులు చూపాలి. విధిగా చేసే నమాజులే కాకుండా నవాఫిల్ పట్ల కూడ ప్రత్యేక శ్రద్ధచూపాలి. అత్యధికంగా పుణ్యఫలం ప్రాప్తించే కార్యాలు చేయడానికి సిద్ధంగ ఉండాలి. ఇది దేవుని కరుణా, కటాక్షాలు వర్షింపచేసే మాసం. షాబాన్ మాసం చివరి తేదీలో మహాప్రవక్త (సఅసం) రమజాన్ చంద్రుణ్ణి చూస్తూ అన్నారు. ప్రజలారా! మీరు శుభప్రదమైన ఉత్కృష్టమాసాన్ని చూస్తారు. ఈ మాసంలోని ఒక్క రాత్రి వేయి మాసాలకంటే కూడా ఉత్తమమైనది. దేవుడు ఈ మాసంలో ఉపవాసాలు పాటించడాన్ని విధిగా నిర్ణయించాడు. రాత్రి పూట జాగరణ (తరావీహ కోసం) నఫిల్‌గా అభివర్ణించాడు. ఈ మాసంలో సహృదయంతో స్వయంగా ఒక సత్కార్యం చేసిన వ్యక్తి ఇతర మాసాల్లో "విధి"కి లభించే పుణ్యఫలాన్ని పొందుతాడు. ఈ మాసంలో

ఒక విధిని నిర్వహిస్తే ప్రతిఫలంగా దేవుడు వానికి ఇతర మాసాల్లో ప్రాప్తించే 70 విధులకు సమానమైన పుణ్యఫలాల్ని ప్రసాదిస్తాడు.

4. మాసమంతా పాటించే ఉపవాసాల్ని అత్యంత శ్రద్ధాసక్తులతో భక్తి ప్రపత్తులతో పాటించాలి. ఒకవేళ అనారోగ్య తీవ్రత లేక షరీఅత్ అనుమతించిన కారణంగా ఉపవాసాలు పాటించలేకపోయినా శుభదాయకమైన రమజాన్ పట్ల గౌరవసూచకంగా బహిరంగంగా భుజించకూడదు. ఈ పద్ధతిని కఠినంగా పాటించాలి. అంటే ఉపవాసం లేనివారు కూడా ఉపవాస దీక్షలో ఉన్నట్లుగానే ప్రవర్తించాలి.

5. ఖుర్ఆన్ పఠనాన్ని ప్రత్యేకంగా పాటించాలి. దివ్య ఖుర్ఆన్‌కూ ఈ మాసానికీ ప్రత్యేకమైన అనుబంధం ఉంది. దివ్య ఖుర్ఆన్ ఈ మాసంలోనే అవతరించింది. ఇంకా ఇతర కొన్ని దైవగ్రంథాలు కూడ ఈ మాసంలోనే అవతరించాయి. హజ్రత్ ఇబ్రాహీమ్(అలై.స) కు ఈ మాసంలోని మొదటి లేక మూడవ తేదీన పవిత్రగ్రంథం ప్రసాదించబడింది. హజ్రత్ దావూద్ (అలై.స)కు ఈ మాసంలోని 12 లేక 18వ తేదీన జబూర్ గ్రంథం ఇవ్వబడింది. హజ్రత్ మూసా (అలై.స) కూ ఈ మాసం 6వ తేదీన తౌరాత్ గ్రంథం అవతరించింది. హజ్రత్ ఈసా (అలై.స)కు కూడా ఈ శుభప్రదమైన మాసంలోనే 12 లేక 13వ తేదీన బైబిల్ గ్రంథం ప్రసాదించబడింది. అందువల్ల ఈ మాసంలో ఇతోధికంగా ఖుర్ఆన్‌ను పఠించడానికి ప్రయత్నించాలి. హజ్రత్ జిబ్రయీల్ (అలై.స) ప్రతీ సంవత్సరం రమజాన్‌లో మహాప్రవక్త(సఅసం)కు సంపూర్ణ ఖుర్ఆన్ వినిపించేవారు, వినేవారు. ఆయన (అలై.స)ఆఖరు సంవత్సరంలో మహాప్రవక్త (సఅసం)తో పాటు రెండుసార్లు పరిపూర్ణ పఠనం గావించారు.

6. దివ్య ఖుర్ఆన్‌ను నెమ్మదిగా, అవగాహన చేసుకుంటూ చదవడానికి ప్రయత్నించాలి. ఇతోధిక పఠనంతో పాటు, అర్థం చేసుకునేందుకు ప్రత్యేకశ్రద్ధ వహించాలి.

7. తరావీహ నమాజ్‌లో ఖుర్ఆన్‌ను పూర్తిగా వినేందుకు ప్రయత్నించాలి, రమజాన్‌లో కనీసం ఒకసారి పూర్తి ఖుర్ఆన్‌ను వినడం మహాప్రవక్త (సఅసం) ఆచారం.

8. తరావీహ నమాజ్ శ్రద్ధాభక్తులతో, చిత్తశుద్ధితో, వినయవిధేయతలతో చేసుకోవాలి, ఎలాగో 20 రకాత్‌లు పూర్తిచేయడానికి ప్రయత్నించరాదు, నమాజ్‌ను నమాజ్‌లా చేయాలి. ఎందుకంటే మీ జీవితాల మీద దాని ప్రభావం పడి తీరాలి. దేవునితో మీ అనుబంధం పటిష్టతరమైపోవాలి. దేవుడు కరుణిస్తే, తహజ్జుద్ నమాజ్ కూడా పాటించాలి.

9. దాన, ధర్మాలు చేయాలి. పేదలు, విధవల్ని, అనాధల్ని మిక్కుటంగా ఆదరించాలి. నిరుపేదలకు సహ్రీ, ఇఫ్తార్ సదుపాయం కల్పించాలి. మహాప్రవక్త (సఅసం) అన్నారు. ఇది ఆదరణ, సానుభూతి చూపేమాసం, హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి.అన్) ఇలా అంటారుః

"మహాప్రవక్త (సఅసం) ధర్మగుణ సంపన్నులు, ఉదారబుద్ధిగలవారు. అయితే రమజాన్ మాసంలో ఆయన (సఅసం) దానగుణం ఇంకా ఎక్కువయ్యేది. హజ్రత్ జిబ్రయీల్ ప్రతిరాత్రి ఆయన (సఅసం) వద్దకు వచ్చేవారు. దివ్య ఖుర్ఆన్ పఠించేవారు, వినేవారు. అయితే ఈ రోజుల్లో ప్రవక్త (సఅసం) వేగంగా వీచే గాలివలె అమితంగా దాన ధర్మాలు చేసేవారు.

10. షబెఖదర్‌లో అధికంగా నవాఫిల్ నమాజులు పాటించాలి. ఖుర్ఆన్ పఠనంచేయాలి. దివ్య ఖుర్ఆన్ ఈ రాత్రిలోనే అవతరించిందన్న ప్రాధాన్యత ఖుర్ఆన్‌లో ఉందిః

"మేము ఖుర్ఆన్‌ను ఈ షబెఖదర్ లోనే అవతరింపచేశాము. షబెఖదర్ అంటే మీకు ఏమి తెలుసు! షబెఖదర్ వేయి మాసాల కంటే ఉత్తమమైనది. ఈ రాత్రి దూతలు, హజ్రత్ జిబ్రయీల్ విశ్వప్రభువు ఆజ్ఞమేరకు ప్రతి పనినీ నిర్వహించేందుకు దిగివస్తారు. ఉదయం అయ్యే వరకు శుభాశీస్సులు ప్రాప్తిస్తాయి."

(అల్‌ఖద్ర్)

హదీసు ప్రకారం షబెఖద్ర్ రమజాన్ నెల చివరి పదిరోజుల్లోని బేసి సంఖ్యగల రాత్రిళ్ళల్లో ఏదో ఒకటై వుంటుంది. ఆ వేళ ఈ దుఆ చదవండిః

اَللّٰهُمَّ اِنَّكَ عَفُوٌّ تُحِبُّ الْعَفْوَ فَاعْفُ عَنِّيْ (حصن حصين)

"అల్లాహుమ్మ ఇన్నక అఫువ్వున్ తుహిబ్బుల్ అఫ్వఫఅఫుఅన్ని"

(హిస్నెహసీన్)

"దేవా! నీవు అమితంగా క్షమించేవాడివి. క్షమించడం నీకు ప్రీతికరమైనది. నీవు నన్ను క్షమించు."

హజ్రత్ అనస్ (రజి.అన్.) అంటారుః

ఓ సంవత్సరం, రమజాన్ రాగానే మహాప్రవక్త (సఅసం) అన్నారుః 'మీ కోసం ఒక మాసం వచ్చింది. అందులో ఒకరాత్రి ఉంది. ఆ రాత్రి వేయిమాసాలకంటే ఔన్నత్యం గలది. ఆ రాత్రిని కోల్పోయిన వ్యక్తి సర్వపుణ్యాలను కోల్పోయిన వాడవుతాడు. ఆ రాత్రిలోని శుభాలను దౌర్భాగ్యుడైన వ్యక్తే కోల్పోతాడు.'

(ఇబ్నెమాజా)

11. రమజాన్ ఆఖరు పదిరోజుల్లో ఎతెఖాఫ్ చేయండి. మహాప్రవక్త (సఅసం) రమజాన్ చివరి పది రోజుల్లో ఎతెఖాఫ్ ఉండేవారు. హజ్రత్ ఆయెషా (రజి.అన్) అంటారు: 'రమజాన్ ఆఖరు భాగం రాగానే ప్రవక్త (సఅసం) రాత్రుల్లో అధిక సమయం మేల్కొని ఆరాధన చేసేవారు. తన సతీమణుల్ని కూడ మేల్కొల్పేవారు. శ్రద్ధాసక్తులతో, ఏకాగ్రతతో దేవుని ఆరాధనలో నిమగ్నులయ్యేవారు.'

12. రమజాన్‌లో ప్రజల పట్ల అత్యంత అనురాగం, వాత్సల్యం చూపాలి. పనివాళ్ళు, నౌకర్లకు అమితంగా సౌకర్యాలు కల్పించాలి. విశాల హృదయంతో వారి అవసరాల్ని తీర్చాలి. కుటుంబ సభ్యుల పట్ల కూడా ప్రేమ, దయ, జాలి, ఔదార్యం చూపాలి.

13. అత్యంత వినయం, విధేయత, శ్రద్ధాసక్తులతో ఎక్కువగా దుఆ చేయాలి. దుర్రెమన్సూర్ అనే గ్రంథంలో ఉంది: శుభప్రదమైన రమజాన్ రాగానే మహాప్రవక్త(సఅసం) పరిస్థితే మారిపోయేది. నమాజుల సంఖ్య అధికమయిపోయేది. దుఆ వేడుకోడంలో వినయ వినమ్రతలు ఉట్టిపడుతుండేవి. దైవభీతి అమితంగా ఆవరించిపోయేది.

హదీసులో ఇలా ఉంది: 'దేవుడు రమజాన్‌లో దైవసింహాసనాన్ని మోసే దూతలను ఆజ్ఞాపిస్తాడు. మీ ఆరాధనలు ఆపండి. ఉపవాసాలు పాటించేవారు దుఆలు చేస్తూ ఉంటే మీరు "ఆమీన్" అంటూ ఉండండి అని.

14. సద్ఖ, ఫిత్రాలు సహృదయంతో ఇవ్వాలి. పండుగ నమాజ్‌కు ముందే ఇవ్వాలి. ఇంకా చాలా ముందుగా ఇస్తే మంచిది. ఎందుకంటే పేదలు, అనాధలు తమకు గల సౌకర్యంతో పండుగ అవసరాల్ని తీర్చుకోడానికి వీలవుతుంది. అందరితో పాటు వారు కూడా ఈద్‌గాహ్‌కి చేరుకుంటారు. పండుగ సంతోషాల్లో వారు కూడా పాల్గొనగలుగుతారు. హదీసులో ఉంది: "మహాప్రవక్త(సఅసం) సద్ఖ, ఫిత్రాను ఉమ్మత్ (సమాజం)కు అవసరమైనదిగా ఎందుకు ఖరారు చేశారంటే - ఉపవాసదీక్షలో ఉన్నవారు పొరపాటున పలికిన అశ్లీల పదాలకు ప్రతిగా లభించే చెడుఫలితాలు ప్రక్షాళనమైపోతాయి. అలా నిరుపేదలు, అనాధలకు ఆహారం సమకూరుతుంది." (అబూదావూద్)

15. శుభప్రదమైన రమజాన్ రోజుల్లో మీరు ఎక్కువగా పుణ్యఫలం పొందడానికి చేసే ప్రయత్నంతోపాటు ఇతరులను కూడ వాత్సల్యం, ప్రేమ, సానుభూతులతో, ఉపాయంతో పుణ్యకార్యాలు చేయడానికి ప్రోత్సహించాలి. అలా పూర్తి వాతావరణమంతా దైవభక్తి, శుభశ్రేయస్సుల అభిలాష, సత్కార్యాలతో విరాజిల్లేలా చేయాలి. ఈ విధంగా సమాజం రమజాన్ అమూల్య శుభాలు, శ్రేయస్సులతో అమితంగా ప్రయోజనం పొందాలి.

# 10. నిష్ఠానిగ్రహాల సమగ్రరూపం రోజా

1. ఉపవాసం మహత్తును, దాని పుణ్యఫలాన్ని, దాని మహోన్నతమైన లాభాల్ని దృష్టిలో ఉంచుకొని శ్రద్ధతో, నిష్టగా ఉపవాసం పాటించాలి. ఈ ఉత్తమ ఆరాధనకు ఇతర ఏ ఆరాధనా సమానం కాజాలదు. ఈ కారణం చేతనే ప్రతి ముస్లిమ్ సమాజానికి (ఉమ్మత్‌కు) ఉపవాసం విధిగా నిర్ణయించబడింది. దైవాజ్ఞ ఏమంటే :

"విశ్వాసులారా ! పూర్వం ప్రజలకు ఉపవాసం యెలా విధించబడిందో అలాగే మీకూ విధించబడింది. తన్మూలంగా మీరు దైవభీతి కలవారుగా ధర్మపరాయణులుగా రూపొందాలని."

ప్రవక్త (సఅసం) ఈ ఉపవాసం ఉన్నత లక్ష్యాన్ని ఇలా వివరించారు:

"ఉపవాసం పాటించీ అబద్ధం పలికి, అబద్ధాన్ని ఆచరించిన వ్యక్తి ఆకలిదప్పులతో పడి ఉండటం దేవునికి ఏమాత్రం ఇష్టంలేదు." (బుఖారి)

ఆయన (సఅసం) ఇంకా ఇలా అన్నారు : "ఏ వ్యక్తిఅయితే సంపూర్ణ విశ్వాసంతో, ఆత్మవిమర్శతో రమజాన్ ఉపవాసం పాటిస్తాడో పూర్వం అతడు చేసిన పాపాలను దేవుడు క్షమిస్తాడు." (బుఖారి)

2. రమజాన్ ఉపవాసాలు పూర్తి నిష్ఠతో పాటించాలి. తీవ్రంగా జబ్బుగాని, లేదా షరీఅత్ ప్రకారం అనుమతిగాని లేకపోతే ఉపవాసం పాటించటం మానుకోరాదు.

ప్రవక్త (సఅసం) అన్నారు - ఒక వ్యక్తి జబ్బుగాని, లేక షరీఅత్ అనుజ్ఞగాని లేకుండా రమజాన్‌లో ఒక్క ఉపవాసం అయినా వదిలివేస్తే, అతను జీవితాంతం ఉపవాసాలు పాటించినా అవి ఆ ఒక్క ఉపవాసం లోపాన్ని పూర్తిచేయజాలవు. (తిర్మిజి)

3. ఉపవాసం పాటించే సమయంలో ప్రదర్శనా బుద్ధినుండి తప్పించుకోవటానికి ఎప్పటిలాగే ఉత్సాహంగా, చురుకుగా తమ పనుల్లో నిమగ్నులై ఉండాలి. ప్రవర్తన ద్వారా, ఉపవాసంవల్ల కలిగే బలహీనతను, నీరసాన్ని ప్రదర్శించరాదు.

హజ్రత్ అబూ హురైరా (రజి) అన్నారు, "మనిషి ఉపవాసమున్నప్పుడు ఎప్పటివలె తలకు నూనె రాసుకోవాలి. అలా చేయడంవల్ల ఉపవాసఫలితంగా ఏర్పడే ప్రభావాలు కనబడవు.

4. ఉపవాసమున్నప్పుడు అత్యంత నిష్ఠతో ప్రతి చెడునుండి దూరంగా ఉండటానికి ప్రయత్నం చేయాలి. ఎందుకంటే పూర్తి జీవితాన్ని పరిశుద్ధం, పవిత్రం చేయడమే ఉపవాస లక్ష్యం.

ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు : ఉపవాసం ఒక డాలు లాంటిది. మీరు ఉపవాసం ఉన్నప్పుడు లజ్జావిహీనమైన మాటలు పలుకరాదు. అల్లరి, గందరగోళాలు సృష్టించకూడదు. ఒకవేళ ఎవరైనా తిడితే లేదా, పోట్లాడితే – నేను ఉపవాసంలో ఉన్నాను, చెడు ఎలా బదులివ్వగలను ఎలా పోట్లాడగలను అని ఆలోచించాలి. (బుఖారి, ముస్లిమ్)

5. ప్రవక్త (సఅసం) ప్రవచనాల్లో ఈ విధంగా ఉంది : "ఉపవాసానికి ఏ మహత్తర పుణ్యఫలం ప్రకటించబడిందో దాన్ని మనసారా కోరుకోండి". ముఖ్యంగా ఇఫ్తార్ సమయంలో దేవుణ్ణి ఇలా వేడుకోవాలి, "దేవా ! నా ఉపవాసాన్ని స్వీకరించు. నీవు ఏ పుణ్యఫలాన్ని ప్రసాదిస్తానని సెలవిచ్చావో దాన్ని నాకు ప్రసాదించు."

ప్రవక్త (సఅసం) అన్నారు – "ఉపవాసకులు స్వర్గంలో ఒక ప్రత్యేకమైన ద్వారం గుండా ప్రవేశిస్తారు. ఆ ద్వారం పేరు 'రయ్యాన్'. ఉపవాసకులు ప్రవేశించిన తరువాత ఆ ద్వారం మూసివెయ్యబడుతుంది. మరెవ్వరూ ఆ ద్వారం గుండా వెళ్ళజాలరు" (బుఖారి)

ఆయన ఇంకా ఇలా అన్నారు, "ఉపవాసం పాటించేవాని ఎడల ఆ ఉపవాసం తుదిదినాన దైవానికి ఇలా సిఫారసు చేస్తుంది:

"దేవా ! దినమంతా ఈ వ్యక్తి అన్నపానీయాలకు, ఇతర రుచులకూ దూరంగా వున్నాడు. దేవా ! ఈ వ్యక్తి విషయంలో నా సిఫారసును స్వీకరించు." దేవుడు కూడా దాని సిఫారసును స్వీకరిస్తాడు. (మిష్కాత్)

ప్రవక్త(సఅసం) ఇలా కూడా అన్నారు, 'ఇఫ్తార్ సమయంలో ఉపవాసకుడు ఏ అర్థింపు చేసినా అది స్వీకరించబడుతుంది. తిరస్కరింపబడదు. (తిర్మిజి)

6. ఉపవాసంవల్ల కలిగే ఇబ్బందుల్ని సంతోషంగా భరించాలి. ఆకలిదప్పుల తీవ్రతను, బలహీనతను ఇతరులతో చెప్తూ ఉపవాసాన్ని అగౌరవపరచరాదు.

7. ప్రయాణంలో ఉన్నప్పుడు లేక జబ్బు తీవ్రంగా ఉన్నప్పుడు ఉపవాసం ఉండలేకపోతే వదలివేయవచ్చు. వేరే రోజుల్లో వాటి 'ఖజా' పూర్తి చేయాలి. ఖుర్ఆన్‌లో ఇలా ఉంది :

"జబ్బుగా ఉన్నా లేక ప్రయాణం చేస్తున్నా వారు ఇతర దినాల్లో ఉపవాసాలు పూర్తిచేయాలి." (బఖరా)

హ(జత్ అనస్ (రజి) ఉల్లేఖించారుః "మేము ప్రవక్త (సఅసం)తో రమజాన్‌లో ప్రయాణం చేస్తున్నప్పుడు కొందరు ఉపవాసం ఉండేవారు. మరికొందరు ఉండేవారు కాదు. అయితే ఉపవాసం ఉన్నవారు లేనివారిని విమర్శించేవారు కాదు – ఉపవాసం లేనివారుకూడా ఉన్నవారిని విమర్శించేవారు కాదు. (బుఖారి)

8. ఉపవాసం ఉన్నప్పుడు చాడీలు చెప్పడం, చెడు చూపు చూడడం లాంటి వాటికి దూరంగా ఉండడానికి సరియైన జాగ్రత్తలు పాటించాలి –

ప్రవక్త (సఅసం) అన్నారు, ఉపవాసకుడు చాడీలు చెప్పకుండా ఉంటే ఉదయంనుండి సాయంత్రం వరకు దైవారాధనలో ఉన్నట్టే– అతను ఎవరిమీదనైనా చాడీలు చెప్పినప్పుడు వెంటనే అతని ఉపవాసంలో పగులు ఏర్పడుతుంది.

9. ధర్మంగా ఉపాధిని సంపాదించాలి. అక్రమ మార్గంలో సంపాదించిన సొమ్ముతో పోషించబడే శరీరం చేసే ఏ ఆరాధన కూడా స్వీకరించబడదు.

ప్రవక్త(సఅసం) అన్నారు – "అధర్మంగా సంపాదించిన ధనంతో పెరిగిన శరీరం నరకానికే తగు." (బుఖారి)

10. సహ్‌రీ తప్పకుండా భుజించాలి. అందువల్ల ఉపవాసం సులభసాధ్యమౌతుంది. బలహీనత, నీరసం కలుగదు.

ప్రవక్త(సఅసం) అన్నారు – సహ్‌రీ భుజించండి. ఎందుకంటే అందులో ఎంతో శుభం ఉంది. (బుఖారి)

ప్రవక్త(సఅసం) ఇంకా ఇలా అన్నారు, సహ్‌రీ భుజించడంలో శుభముంది. ఏమీ లేకపోతే కొన్ని మంచినీళ్ళయినా త్రాగండి. దైవదూతలు సహ్‌రీ భుజించేవారికి "సలామ్" అందజేస్తారు. (అహ్మద్)

ప్రవక్త (సఅసం) ఇంకా ఇలా అన్నారు – మధ్యాహ్నం వేళలో కొంచెం విశ్రాంతి తీసుకొని తద్వారా రాత్రి జాగరణ చేసేటప్పుడు సౌలభ్యాన్ని పొందండి– సహ్‌రీ భుజించి, తద్వారా పగలు ఉపవాసం పాటించటానికి శక్తిని సంపాదించండి. (ఇబ్నెమాజ)

సహీ ముస్లిమ్‌లో ఉంది – "మనకు, గ్రంథం కలవారికీ ఉపవాసాల్లో ఉన్న భేదం సహ్‌రీ భుజించడంలోనే ఉంది" అని ప్రవక్త (సఅసం) అన్నారు.

11. సూర్యుడు అస్తమించిన తర్వాత ఇఫ్తార్ చేయడంలో జాప్యం చేయకండి – ఎందుకంటే విధేయతా భావాన్ని జనింపచేసేందుకే ఉపవాసం అసలు ఉద్దేశించబడింది. అంతేకాని ఆకలిదప్పులతో ఉంచడం ఉద్దేశ్యం కాదు.

ప్రవక్త (సఅసం) ప్రవచనం – "ఇఫ్తార్ త్వరగా చేస్తున్నంతకాలం

ముస్లింలు మంచి పరిస్థితిలో ఉంటారు". (బుఖారి)

12. ఇఫ్తార్ సమయంలో ఈ దుఆ పఠించాలి.

اَللّٰھُمَّ لَکَ صُمْتُ وَعَلٰی رِزْقِکَ اَفْطَرْتُ (مسلم)

"అల్లాహుమ్మ లకసుమ్తు వ అలా రిజ్ఖిక అఫ్తర్తు." (ముస్లిం)

"దేవా ! నేను నీ కోసమే ఈ రోజాను పాటించాను, నీవు ప్రసాదించిన దాని ద్వారానే విరమిస్తున్నాను".

ఇఫ్తార్ చేసిన తరువాత ఈ దుఆ చదవాలి.

ذَھَبَ الظَّمَأُ وَابْتَلَّتِ الْعُرُوْقُ وَثَبَتَ الْاَجْرُ اِنْ شَآءَ اللّٰہُ (ابوداؤد)

జహబజ్ జమ్అ వబ్తల్లతిల్ ఉరూఖు వసబతల్ అజ్రు ఇన్షాఅల్లాహ్ (అబూదావూద్)

'దాహం తీరింది. నరాలకు సత్తువ చేకూరించి. దైవం తలిస్తే ప్రతిఫలం కూడా లభిస్తుంది.'

13. ఎవరి ఇంట్లోనైనా ఇఫ్తార్ చేసినట్లైతే ఈ దుఆ పఠించాలి.

اَفْطَرَ عِنْدَکُمُ الصَّآئِمُوْنَ وَاَکَلَ طَعَامَکُمُ الْاَبْرَارُ وَصَلَّتْ عَلَیْکُمُ الْمَلٰٓئِکَةُ ۔ (ابوداؤد)

అఫ్తర ఇన్దకుముస్సాయిమూన వ అకల తా'మకుముల్ అబ్రారు వ సల్లత్ అలైకుముల్ మలాయిక (అబూదావూద్)

'మీ ఇంట్లో రోజా పాటించే వారు విరివిగా ఇఫ్తార్ చేయుగాక. దైవదూతలు మీకు కారుణ్యం ప్రసాదించేందుకు దుఆ చేయుగాక.'

14. ఇతరులకు ఇఫ్తార్ చేయించే ఏర్పాటుకూడా చేయాలి. దానికి గొప్ప పుణ్యఫలముంది. మహాప్రవక్త ముహమ్మద్(సఅసం) ఇలా అన్నారు - ఏ వ్యక్తి అయితే రమజాన్లో ఒకరికి ఇఫ్తార్ చేయిస్తాడో దేవుడు అతని పాపాల్ని క్షమిస్తాడు, అతన్ని నరకాగ్ని నుండి రక్షిస్తాడు. ఇఫ్తార్ చేయించిన వ్యక్తికి ఉపవాసం ఉన్నవ్యక్తికి సమానంగా పుణ్యం ప్రాప్తిస్తుంది, ఉపవాసం ఉండే వ్యక్తి పుణ్యంలో ఎలాంటి తగ్గుదలా ఉండదు - ప్రజలు అడిగారు, దైవప్రవక్తా ! ఉపవాసకులకు ఇఫ్తార్ చేయించి భోజనం పెట్టించేటంత సొమ్ము మాలో అందరి వద్ద ఎక్కడుంది?

"కేవలం ఒక ఖర్జూరఫలంతో లేక గ్రుక్కెడుపాలతో, కనీసం నీళ్ళతోనయినా ఇఫ్తార్ చేయిస్తే చాలు" అని మహాప్రవక్త(సఅసం) జవాబిచ్చారు. (ఇబ్నె ఖజీమ)

# 11. వారి హక్కు, వీరి బాధ్యత

1. దైవమార్గంలో ఏది దానం చేసినా కేవలం దేవుని ప్రీతిపాత్రులవటానికే చేయాలి. వేరొక ఉద్దేశంతో ఇచ్చి ఈ సత్‌క్రియను వ్యర్థంచేసుకోరాదు. ఎవరికైతే మీరు ఇస్తారో వారు మీకు కృతజ్ఞులుగా ఉండాలని, మిమ్మల్ని పొగడాలని, మీ గొప్పతనాన్ని ఒప్పుకోవాలని కాంక్షించడం తప్పు. విశ్వాసి (మోమిన్) తన ఆచరణకు ప్రతిఫలం తన దైవం వద్దనే కోరుకుంటాడు. పవిత్ర ఖుర్‌ఆన్‌లో విశ్వాసుల భావాలను ఈ విధంగా వ్యక్తం చేయడం జరిగింది:

"మేము స్వార్థరహితంగా కేవలం దేవుని కొరకే మీకు భోజనం పెడుతున్నాము. మీనుండి ప్రతిఫలంగాని, మీరు కృతజ్ఞులుగ ఉండాలనిగానీ వాంఛించడంలేదు."

2. ప్రదర్శనా బుద్ధికి దూరంగా ఉండాలి. ప్రదర్శనాబుద్ధి గొప్ప సత్కార్యాన్ని కూడా మట్టిలో కలిపేస్తుంది.

3. జకాత్‌ను మాత్రం బహిరంగంగా ఇవ్వాలి. ఎందుకంటే ఇది చూసి ఇతరుల్లోకూడా విధిని నిర్వహించే సద్భావం ఉప్పొంగి రావాలి. అయితే సద్‌ఖాలు (ఇతర దానాలు) మాత్రం చాటుగానే ఇవ్వాలి. అలా చేయడం వల్ల ఇలోధికంగా సంకల్పశుద్ధి జనిస్తుంది. చిత్తశుద్ధితో చేసిన క్రియే దేవుని దృష్టిలో విలువైనది. ప్రళయ దినపు భయంకరమైన మైదానంలో ఎక్కడా నీడ దొరకనప్పుడు, "కుడి చేతితో చేసిన దానం ఎడమచేతికి తెలియకుండా అతి రహస్యంగా దైవమార్గంలో ఖర్చు చేసిన దాసులకు దైవం తన సింహాసన ఛాయలో చోటిస్తాడు." (బుఖారి)

4. దైవమార్గంలో దానం చేసిన తర్వాత ఆ మేలును మాటిమాటికీ చాటుకోరాదు. ఎవరికైతే మీరు ఇస్తున్నారో వారిని దుఃఖపెట్టరాదు. దానంచేసి పేదల అనాధల పట్ల దురుసుగా ప్రవర్తించడం వారి ఆత్మాభిమానాన్ని కించపరచటం మీరు చేసిన మేలుకు వారు మీ ముందు లొంగిఉండాలని, మీ గొప్పతనాన్ని చెప్పుకోవాలని తలంచడం అత్యంత అసహ్యకరమైన భావాలు. మోమిన్ హృదయం అటువంటి భావాలకు బహుదూరంగా ఉండాలి. దైవాదేశం ఇది :

"విశ్వాసులారా ! చేసిన మేలును మాటిమాటికి చెప్పుకుంటూ బీదల మనసు నొప్పించి కేవలం ఇతరులకు చూపించడానికి ఖర్చు చేసే వ్యక్తివలె సదకాలను వ్యర్థం చేసుకోకండి."

5. దైవమార్గంలో ఇచ్చివేసిన తర్వాత అహంభావం ప్రదర్శించడంగాని, గర్వించడంగాని తగదు. ప్రజలలో తమ గొప్పతనం చెప్పుకోరాదు. దానికి బదులుగా దేవునివద్ద ఈ సదకా స్వీకరించబడిందో లేదో అనే విషయాన్ని ఆలోచిస్తూ దానిపట్ల ఆందోళన చెందుతూ ఉండాలి. దేవుని ఆదేశం ఇలా ఉంది:

"వారు దైవమార్గంలో దానం చేస్తారు. తాము తిరిగి దైవం వైపునకే మరలవలసి ఉందనే భావంవల్ల వారి హృదయాలు కంపిస్తూ ఉంటాయి."

6. యాచకులు నిరుపేదలపట్ల జాలి, దయ కల్గి మెలగాలి. వారిని గద్దించడంగాని, వారిపై తమ ప్రతిష్టను, గొప్పతనాన్ని ప్రదర్శించడంగాని తగదు. యాచకులకు ఇవ్వడానికి ఏమీ లేకపోయినప్పటికీ, అత్యంత మృదువుగా మంచితనంతో లేదని చెప్పాలి. తద్వారా వారు ఏమీ పొందనప్పటికీ దుఆ చేస్తూ సంతోషంగా వెళ్ళిపోతారు.

ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది : "మీరు వారికి ఇవ్వలేని స్థితిలో ఉంటే మీ ప్రభువు కటాక్షంపై నమ్మకముంచి వారితో మృదువుగా మాట్లాడండి." ఇంకా ఇలా ఉంది: "అర్థించేవారిని గద్దించకండి."

7. దైవమార్గంలో విశాల హృదయంతో ఉత్సాహంతో ఖర్చుచేయాలి. సంకుచిత బుద్ధితో బాధపడుతూ బలవంతంగా దండుగ అని తలచి ఖర్చుచేయడం తప్పు. లోభత్వం, సంకుచిత భావం కాఠిన్యంవంటి భావాలకు దూరంగా హృదయాన్ని శుద్ధిగా ఉంచుకున్నవారే సాఫల్యం, మోక్షాలకు అర్హులు.

8. దైవమార్గంలో ధర్మసమ్మతమైన (హలాల్) సంపదనే ఖర్చు చేయాలి. దేవుడు కేవలం పరిశుద్ధమైన సంపదనే స్వీకరిస్తాడు. ఏ విశ్వాసి దైవమార్గంలో ఖర్చుచేసే తహ తహ కలిగి ఉంటాడో, అతడు తన సంపాదనలో అపరిశుద్ధమయిన (హరామ్) సంపద చేరడాన్ని ఎలా అంగీకరిస్తాడు? దేవుని బోధన ఇది :

"విశ్వాసులారా! దైవమార్గంలో మీ పరిశుద్ధ సంపాదనను ఖర్చు చేయండి."

9. దైవమార్గంలో ఉత్తమ సంపదను ఖర్చుచేయండి. ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది, "మీకు ప్రియమైనదాన్ని దైవమార్గంలో ఇవ్వనంతవరకు మీరు అసలు మంచిని పొందలేరు." (ఆలి ఇమ్రాన్)

సదకాలో ఇచ్చిన ధనం పరలోకంలో శాశ్వత జీవితం కొరకు కూడబెట్టబడుతుంది. విశ్వాసి తన శాశ్వత జీవితం కొరకు చెడిపోయిన నిరుపయోగమైన సంపదను కూడబెట్టాలని ఎలా ఆలోచిస్తాడు?

10. జకాత్ విధి అవగానే ఆలస్యంచేయకుండా వెంటనే చెల్లించివేయడానికి ప్రయత్నించాలి. మీపై ఎలాంటి భారం ఉండకుండా పొరపాటు జరగకుండా సరిగ్గా లెక్కలు వేసుకొని మరీ చెల్లించండి. జకాత్ చెల్లింపులను సామూహికంగా కూడబెట్టాలి. దానిని ఖర్చుచేయడానికి కూడా సామూహికంగానే ఏర్పాట్లు చేయాలి. ముస్లిమ్ ప్రభుత్వాలు లేనిచోట ముస్లిం సంస్థలు 'బైతుల్‌మాల్' స్థాపించి దాన్ని సవ్యంగా నిర్వహించాలి.

# 12. హజ్–దాస్యభావానికి పరాకాష్ఠ

1. హజ్ చేయడంలో ఆలస్యం చేయరాదు. సాకులు చెప్పి తప్పుకోవడం ఇంకా తప్పు. ఈ శుభప్రదమైన విధిని నెరవేర్చడానికి దైవం తగినంత సంపత్తి ప్రసాదించినప్పుడు ప్రథమ అవకాశంలోనే ప్రయాణమైపోవాలి. ఈ విధిని నిర్వహించడానికి ఈ సంవత్సరం నుంచి వచ్చే సంవత్సరానికి నెట్టివేయడానికి జీవితంపైన నమ్మకముంటే కదా ! ఖుర్ఆన్‌లో ఉంది : "ప్రజలపైన దేవుని హక్కు ఏమంటే – ఎవరికైతే ఆయన గృహం వద్దకు వెళ్ళే తాహతు (శక్తిసామర్థ్యాలు, సంపత్తి) ఉందో వారు హజ్ చేయాలి. ఆయన ఆజ్ఞల్ని పాటించకుండా తిరస్కరిస్తే దేవుడు సర్వలోకాలకు అతీతుడని వారు గ్రహించాలి. దేవుడు మానవునికి అతీతుడుగాను, ఎలాంటి సంబంధం లేకుండాను ఉంటే ఇంతకు మించిన దురదృష్టం, వినాశనం మానవునికి ఇంకేది కాగలదు?

ప్రవక్త (సఅసం) ప్రవచనంలో ఇలా ఉంది : "హజ్ చేయాలని నిశ్చయించుకున్న వ్యక్తి హజ్ చేయడానికి త్వరపడాలి. ఎందుకంటే అతనికి జబ్బు చేయవచ్చు – ఒంటె తప్పిపోవచ్చు. ఇంకా ఇతర కారణాలవల్ల హజ్ చేయడం సాధ్యపడకపోవచ్చు." (ఇబ్నెమాజా)

భావమేమిటంటే అవకాశముండి కూడా, అనవసరంగా సాకులు చెప్పి తప్పించుకోరాదు. ముందు ముందు ఈ మార్గాలు సంపత్తి సౌకర్యాలు ఉండవచ్చు, ఉండకపోవచ్చు. అంతేకాకుండా మనిషి బైతుల్లాహ్‌కు పోయి హజ్ చేసే అవకాశమే కోల్పోవచ్చు. దేవుడు ఈ అవకాశాన్ని కోల్పోనీయకుండా ప్రతి విశ్వాసిని రక్షించుగాక! ప్రవక్త (సఅసం) అటువంటి వారిని తీవ్రమైన ధోరణిలో హెచ్చరించారు : "జబ్బు వల్లనో, అతి ముఖ్యమైన అవసరం వల్లనో, లేక దౌర్జన్యపరుడు, క్రూరుడైన రాజ్యాధినేత నిరోధించడం వల్లనో తప్ప హజ్ చేయకపోతే అతడు యూదునిగానో లేక నస్రానీగానో మరణించవచ్చు.

(సునన్ కుబ్రా 4వ సంపుటం)

హజ్రత్ ఉమర్ (రజి) సూక్తి : ఎవరయితే హజ్ చేయడానికి శక్తి సామర్థ్యాలు ఉండికూడా హజ్ చేయరో వారిపై "జిజ్‌య" విధించాలని నాకు అనిపిస్తుంది. వారు విశ్వాసులుకారు, వారు విశ్వాసులు కారు." (అల్‌మున్తఖా)

2. దైవగృహ సందర్శనకార్యమే ఈ హజ్. దీన్ని కేవలం దైవ ప్రసన్నతకోసం చేయాలి. అంతేకాని ప్రాపంచిక లాభాపేక్షతో పవిత్రమైన లక్ష్యాన్ని మలినపరచరాదు. ఖుర్ఆన్‌లో ఉంది : "ఎవరయితే తమ దేవుని కటాక్షాన్ని, సంతోషాన్ని అన్వేషిస్తూ పవిత్ర గృహంవైపు వెళ్తున్నారో వారిని ఆటంకపరచకండి." *(అల్‌మాయిదా : 2)*

హజ్‌ను, ఉమ్రాను కేవలం దైవ సంతోషం కొరకు పూర్తిచేయండి.

*(అల్ బఖర : 196)*

ప్రవక్త (సఅసం) అన్నారు : చిత్తశుద్ధితో చేసిన హజ్‌కు ప్రతిఫలం స్వర్గంకంటే తక్కువ కాజాలదు. (ముస్లిమ్)

3. హజ్‌కు వెళ్ళే విషయం ప్రకటించుకోవడం తగదు. మౌనంగా వెళ్ళిరావాలి. ఆడంబర ప్రదర్శనలు, పటాటోపాల ఛాయలు వ్యక్తమయ్యే ఆచారవ్యవహారాలను ఖచ్చితంగా విసర్జించాలి. ప్రతిపని పుణ్యప్రదమయిన క్రియ, అంగీకారయోగ్యమయిన ఆచరణ అవడానికి అది కేవలం దైవం కోసమే ఆచరించబడాలి. అణుమాత్రం కూడ అందులో ఇతరవాంఛ మిళితమై ఉండరాదు. ముఖ్యంగా హజ్‌లో ఈ విషయంపట్ల అధిక శ్రద్ధవహించడం అవసరం. ఎందుకంటే ఇది మనోపరివర్తనకు, ఆధ్యాత్మిక ప్రగతికి, నైతిక పరిశుద్ధతకు చివరి ఉపాయం. ఒక మానసిక రోగి ఇంతటి సమగ్రమైన పరిపూర్ణమైన చికిత్సతో కూడా స్వస్థత పొందకపోతే మరే చికిత్సవల్లనయినా ఆరోగ్యవంతుడవుతాడన్నది శూన్యం.

4. హజ్ చేయడానికి తాహతు లేకపోయినప్పటికీ దైవగృహాన్ని సందర్శించే అభిలాష, మహాప్రవక్త (సఅసం) పవిత్ర సమాధి సమ్ముఖంలో నిలబడి సలాం పఠించాలనే ఆకాంక్ష, హజ్‌వల్ల ఉత్పన్నమయ్యే హజ్రత్ ఇబ్రాహీమ్ అనుభూతులతో హృదయాన్ని కాంతిమయం జేసుకోవాలనే తపన అంతరంగంలో నిండిఉండాలి. ఈ భావాలు ఆవేదనలు లేకుండా ఏ హృదయం కూడా విశ్వాసి హృదయం కాజాలదు. అది ఒక జీర్ణించిన శిధిలం.

ప్రవక్త (సఅసం) అన్నారు : "హజ్, ఉమ్రాకు వెళ్ళేవారు దేవుని ముఖ్య అతిధులు, వారు దేవుణ్ణి వేడుకుంటే దేవుడు ఆ వేడుకోలును స్వీకరిస్తాడు. క్షమాభిక్షను అర్థిస్తే క్షమిస్తాడు." (తిబ్రాని)

5. హజ్ కొరకు ఉత్తమ ప్రయాణపు సామగ్రిని వెంట ఉంచుకోవాలి. అత్యుత్తమమయిన ప్రయాణపు సామగ్రి భయభక్తులే. ఈ పవిత్రమైన ప్రయాణంలో

దేవుని ఆజ్ఞలను ఉల్లంఘించరాదు. దైవగృహ యాత్రలో లభించే శుభాలతో సర్వావస్థల్లో దేవుని ఎడల భయభక్తులు కల దాసుడే ఎక్కువగా లాభం పొందుతాడు. ఆయన ప్రసన్నత బడయటానికి అనుపమాన భావావేశం కలిగి ఉంటాడు.

ఖుర్ఆన్‌లో ఇలా ఉంది :

"హజ్ ప్రయాణంలో ఉత్తమ సామగ్రిని వెంట ఉంచుకోవాలి. అన్నిటికంటె ఉత్తమమయిన సామగ్రి దేవునిపట్ల భయభక్తులు."

6. హజ్‌కు వెళ్ళాలని సంకల్పించుకోగానే ఏకాగ్రచిత్తంతో అన్నీ సిద్ధం చేసుకోవడం ప్రారంభించాలి. హజ్ చరిత్రను పునశ్చరణ చేసుకోవాలి. హజ్‌కు సంబంధించిన ఒక్కొక్క అంశంలోని అర్థాన్ని, మర్మాన్ని తెలుసుకోవాలి. దైవధర్మం కోరేదేమిటో హజ్ ద్వారా విశ్వాసి హృదయంలో ఏ ఉద్వేగాలు జనింపజేయాలని అది ఆశిస్తుందో వాటిని అవగాహన చేసుకోడానికి ప్రయత్నించాలి. చైతన్యవంతుడైన విశ్వాసివలె పూర్తి విజ్ఞతతో హజ్ నియమాలను నిర్వహించి వాటి మర్మ హేతువుల్ని గ్రహించి, ఆప్రకారం జీవితంలో నైతిక పరివర్తన తీసుకురావడానికి కృషిచేయాలి. ఆ కారణంచేతనే దేవుడు విశ్వాసులకు హజ్‌ను విధించాడు. దేవుడు ఇలా అన్నాడు :

"దేవుని ఏ విధంగా స్మరించమని హితవు చేయబడిందో ఆ విధంగానే మీరు స్మరించండి. ఇంతకుపూర్వం మీరు అత్యాచారంలో పడి ఉన్నారన్నది యథార్థం." ఈ లక్ష్యసాధనకై హజ్ ప్రాముఖ్యతను, యథార్థాన్ని, హజ్‌వల్ల ఉత్పన్నమయ్యే పవిత్ర సద్భావాలను తెలిపే ఖుర్ఆన్‌లోని భాగాలను అతి శ్రద్ధతో అధ్యయనం చేయాలి. హజ్ చరిత్రను, హజ్ నియమాలను స్పష్టంగా తెలియపరచిన ప్రవక్త(సఅసం) ప్రవచనాల (హదీసుల) గ్రంథాల అధ్యయనంవల్ల కూడ ప్రయోజనం కలుగుతుంది.

7. హజ్ సమయంలో, హదీసు గ్రంథాల్లో ప్రవక్త నేర్పిన దుఆలను జ్ఞాపకముంచుకోవాలి. దైవప్రవక్త దైవాన్ని అర్థించిన వాటినే ప్రవక్త (సఅసం) పలుకుల్లో దేవుణ్ణి అర్థించాలి.

8. హజ్‌ను జాగ్రత్తగా కాపాడుకోండి. మీరు చేసే హజ్ లౌకిక వాంఛాపరుల హజ్‌వలె కాకుండా జాగ్రత్తవహించండి. వారికి అంతిమ దినాన ఏమీ లభించదు. వారు అంతిమదినం విషయంలో కళ్ళు మూసుకొని సర్వస్వం ఇహలోకంలోనే లభించాలని కోరుకుంటారు. 'బైతుల్లాహ్' (దైవగృహం) చేరుకున్నప్పుడు వారి

దుఆ ఇలా ఉంటుంది:

رَبَّنَآ اٰتِنَا فِی الدُّنْیَا وَمَا لَهٗ فِی الْاٰخِرَةِ مِنْ خَلَاقٍ ۝ (البقرہ)

రబ్బనా ఆతినా ఫిద్దున్యా వమాలహూ ఫిల్ ఆఖిరతి మిన్ ఖలాఖ్

"ఓ దేవా! మాకు ఏదయినా ఇస్తే అది ఈ లోకంలోనే ఇవ్వు!" ఇటు వంటి వారికి అంతిమ దినాన ఏమీ ఉండదు." (అల్ బఖర)

మీరు హజ్ ద్వారా ఇహపరలోకాల్లోని ఉత్తమ స్థానాన్ని, విజయాన్ని కోరుకోండి, "ప్రభూ ! నీ సమ్ముఖానికి వచ్చాను. నీవు ఇహపరలోకాల రెండు జీవితాల్లోనూ జయం ప్రసాదించి కృతార్థుణ్ణి గావించు" అని దేవుణ్ణి వేడుకోవాలి. ఈ దుఆ పఠించాలి:

رَبَّنَآ اٰتِنَا فِی الدُّنْیَا حَسَنَةً وَّفِی الْاٰخِرَةِ حَسَنَةً وَّقِنَا عَذَابَ النَّارِ (البقرہ)

"రబ్బనా ఆతినా ఫిద్దున్యా హసనతవ్వఫిల్ ఆఖిరతి హసనతం వ్వఖినా అజాబన్నార్." (అల్ బఖర)

"ఓ దేవా! మాకు ఈ లోకంలోకూడా శుభాన్ని ప్రసాదించు, పర లోకంలోనూ శుభాన్ని అనుగ్రహించు. మమ్మల్ని నరకాగ్ని నుండి కాపాడు."

9. హజ్ సమయంలో దేవుని ఆజ్ఞల్ని అతిక్రమించకుండా జాగ్రత్తతో, మెలకువతో ఉండాలి. హజ్ ప్రయాణం అంటే దైవగృహానికి ప్రయాణం. మీరు దేవుని అతిథులుగా వెళ్ళారు. ఆయన పట్ల మీ దాస్యభావనను తాజా చేయడానికి వెళ్ళారు. హజ్రె అస్వద్ మీద చేయి పెట్టడం ఒక విధంగా దేవుని ఎదుట విశ్వాసప్రమాణం చేయడం లాంటిది. దాన్ని ముద్దాడితే దైవగృహాన్ని ముద్దాడిన వారవుతారు. మాటిమాటికీ దైవాన్ని కీర్తిస్తూ, దైవనామ సంకీర్తన (తక్బీర్) చేస్తూ ఆయనకు విధేయులమని ప్రకటిస్తారు. అలాంటి వాతావరణంలో ఒక సామాన్యమయిన అపచార మాలిన్యం కూడ ఎంతో భయంకరమైనది ! దేవుడు తన దర్బారులో హాజరయ్యే దాసులను హెచ్చరించాడు.

"దేవుని పట్ల అవిధేయత కాగల విషయాలు తగవు."

10. హజ్ సమయంలో ఘర్షణ, అలజడులవంటి విషయాలను పూర్తిగా విసర్జించాలి. ప్రయాణంలో ప్రతిచోట జనం క్రిక్కిరిసి వుంటారు. కష్టాలు కలుగుతాయి. అడుగడుగున అడ్డంకులు ఎదురవుతాయి. అడుగడుగునా భావనలకు ఆటంకాలు ఏర్పడి బాధకలుగుతున్నప్పుడు దేవుని అతిథులు విశాల

హృదయం, త్యాగబుద్ధితో మెలగాలి. ప్రతివారిని క్షమిస్తూ, మన్నిస్తూ మంచిగా ప్రవర్తించాలి. నౌకర్లను గద్దించడం కూడ మానుకోవాలి. దేవుడు అన్నాడు :

"(హజ్‌లో) ఘర్షించుకోవడం, పోట్లాడుకోవడం తగదు."

11. హజ్‌సమయంలో లైంగిక విషయాలనుండి పూర్తిగా దూరముండాలి. ప్రయాణ కాలంలో ఉద్రేకాలు ఉప్పొంగుతూ, చూపుస్వేచ్ఛగా విహరించే అవకాశం ఎక్కువగా ఉంటుంది. మనిషి అత్యంత అప్రమత్తతతో మెలగాలి. మనసు అదుపు తప్పకుండా షైతాన్ చేసే మోసాలకు లొంగకుండా తనను తాను రక్షించుకోవడానికి గట్టి ప్రయత్నం చేయాలి. భార్యాభర్తలు తోడుగా ఉండేవారు కేవలం ప్రత్యేక సంబంధాలు కలిగి ఉండకపోవడమే కాక, లైంగిక ఉద్రేకాలు ప్రజ్వలింపజేసే పనులనుండి కూడా సంకల్పికంగా దూరంగా ఉండాలి.

దేవుడు హెచ్చరిస్తూ ఇలా అన్నాడు :

"హజ్ మాసాలు అందరికీ తెలిసినవే. ఈ నిర్ణీత మాసాల్లో హజ్ చేయాలని సంకల్పించుకున్న వ్యక్తి హజ్ కాలంలో లైంగిక విషయాలకు దూరంగా ఉండాలి. (*అల్ బఖర : 197*) ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు :

"దైవగృహాన్ని దర్శించడానికి ఇక్కడికి వచ్చి, లజ్జావిహీనమైన పనులనుండి లైంగిక విషయాలనుండి, నీతి బాహ్యమైన కార్యకలాపాలనుండి దూరంగా ఉండే వ్యక్తి ఏ విధంగానైతే తల్లి గర్భం నుండి పరిశుద్ధంగ పుట్టాడో ఆ విధంగా పరిశుద్ధుడై తిరిగి వెళ్తాడు." (*బుఖారి, ముస్లిమ్*)

12. దైవ చిహ్నాల గౌరవంలో ఏ లోటూ రానీయకూడదు. ఒకానొక ఆధ్యాత్మిక విషయాన్ని లేదా భావయుక్తమయిన విషయాన్ని వాటి వాస్తవికతను గుర్తు చేయించడానికి దేవుడు ఏ పదార్థాలనైతే చిహ్నాలుగా ఏర్పరచాడో వానిని "షయీరా" అంటారు. "షిఆయిర్" దానికి బహువచనం. దాన్నే మనం చిహ్నాలుగా చెప్పుకుంటున్నాము. హజ్‌లోని అన్ని వస్తువులూ దైవభక్తికి సంబంధించిన ఏదో ఒక నిజాన్ని బోధపరచడానికి గుర్తులుగ ఏర్పాటు చేయబడ్డాయి. వాటినన్నింటినీ గౌరవించాలి. ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ అన్నాడు :

"ఓ విశ్వాసులారా! దైవభక్తి చిహ్నాలను అగౌరవపరచకండి. గౌరవనీయమైన మాసాలను సయితం అగౌరవపరచకండి. ఖుర్బానీ జంతువులను బాధపెట్టకండి. దేవుని పేర సమర్పణకి గుర్తుగా మెడలో పట్టీలున్న జంతువులపైన చేయిచేసుకోకండి. తమ ప్రభువు కటాక్షం, ఆయన కారుణ్యాన్వేషణలో గౌరవప్రదమైన

గృహం(కాబా) వైపు వెళ్ళేవారి మార్గంలో అవరోధాలు కల్పించకండి."(మాయిదా)

హజ్ సూరాలో ఇలా ఉంది :

'దైవం నియమించిన దైవభక్తి గుర్తులను గౌరవించడం హృదయాల్లో ఉన్న భయభక్తులకు తార్కాణం.'

13. హజ్ ప్రధాన విధుల్ని ఆచరిస్తూ దైవం ఎదుట అత్యంత వినమ్రతను, దీనత్వాన్ని, అశక్తతను వ్యక్తం చేయాలి. ఎందుకంటే దేవునికి తన దాసుని వినమ్రత, దీనత్వమే అత్యధికంగా ఇష్టం.

ప్రవక్త (సఅసం) ను ఎవరో అడిగారు 'హాజీ' అంటే ఎవరు? అని.

"ఎవరి వెంట్రుకలు సంస్కారరహితంగా ఉంటాయో, ఎవరు ధూళి నిండి ఉంటారో (అంటే దైవప్రేమలో తన శరీర సౌఖ్యాలపై శ్రద్ధచూపని) వారు" అని జవాబిచ్చారు.

14. ఇహ్రామ్ కట్టుకున్న తర్వాత, ప్రతి నమాజ్ తర్వాత, ప్రతి ఎత్తును ఎక్కుతున్నప్పుడు, ప్రతి పల్లంలో దిగుతున్నప్పుడు, యాత్రికుల బృందంతో కలుస్తున్నప్పుడు ప్రతి ఉదయం నిద్ర మేల్కొన్నప్పుడు బిగ్గరగా ఈ సద్వచనాన్ని పఠించాలి:

لَبَّيْكَ اَللّٰهُمَّ لَبَّيْكَ لَبَّيْكَ لَا شَرِيْكَ لَكَ لَبَّيْكَ اِنَّ الْحَمْدَ وَالنِّعْمَةَ

لَكَ وَالْمُلْكَ لَا شَرِيْكَ لَكَ۔ (مشكوٰة)

"లబ్బైక అల్లాహుమ్మ లబ్బైక్, లబ్బైక లా షరీకలక లబ్బైక్ ఇన్నల్ హమ్ద వన్నీ'మత లక వల్ ముల్క లా షరీకలక్." (మిష్కాత్)

"నేను హాజరయ్యాను స్వామీ, నేను హాజరయ్యాను. నీకు సమానులెవ్వరూలేరు. నేను హాజరయ్యాను. నిస్సందేహంగా సకల స్తోత్రాలు నీకే. సకల వరాలు ఇచ్చినది నీవే. సార్వభౌమత్వమూ నీదే. నీకు సమానులు ఎవ్వరూలేరు."

15. అర్ఫాత్ మైదానంలో హాజరైనప్పుడు క్షమాభిక్షను మన్నింపును అత్యధికంగా అర్థించాలి.

ఖుర్ఆన్ హితవు చేస్తోంది:

" ప్రజలందరు ఎక్కడినుండి అయితే మరలుతారో అక్కడినుండే మీరు కూడా (మక్కావాసులారా!) మరలండి, దైవాన్ని క్షమాభిక్ష కొరకు వేడుకోండి.

నిస్సందేహంగా అల్లాహ్ ఎక్కువగా క్షమించేవాడు. అధికంగా కరుణించేవాడు."

మహాప్రవక్త (సఅసం) అన్నారు :

"దేవుని వద్ద అర్ఫా దినం అన్ని దినాలకంటే ఉత్తమమైనది. ఆనాడు దేవుడు ఈ లోకాన్ని ప్రత్యేకంగా వీక్షిస్తూ తన హాజీ దాసులు కనబరచే వినమ్రత, దీనస్థితులపైన దూతల ముందు గర్విస్తూ వారితో, "దూతలారా ! చూడండి నా దాసులు ఎంత వ్యాకులతతో ఎండలో ఎలా నా ముందు నిలబడ్డారో! వీరు చాలా దూరాల నుండి ఇక్కడికి వచ్చారు. వీరు నా నరకాన్ని చూడనప్పటికీ నా కారుణ్యం పొందే ఆకాంక్ష వీరిని ఇక్కడికి రప్పించింది." అని అంటాడు. ఆ తర్వాత ప్రజలకు నరకబాధనుండి విముక్తి ప్రసాదించబడుతుంది. అర్ఫా దినాన క్షమించబడేంతటి భారీ సంఖ్యలో మరేనాడు కూడా మనుషులు క్షమాభిక్షను పొందలేరు. (ఇబ్నె హిబ్బాన్)

16. మినా చేరుకున్న తరువాత ఏ భావాలతో దైవమిత్రుడు హజ్రత్ ఇబ్రాహీమ్ (అలైహి) తన ప్రియపుత్రుని కంఠంపైన కత్తిని ఉంచాడో ఆ భావాలతోనే ఖుర్బాని ఇవ్వాలి. జీవన రంగాలన్నింటిలో మీరు త్యాగనిరతిని కనబరచడానికి సిద్ధంగా ఉన్నారని తెలిపే భావాలను మీ మనో మస్తిష్కాలపై శాశ్వతంగా నిలుపుకోవాలి. వాస్తవానికి జీవితం, మీరు తీసుకున్న ఆ నిర్ణయానికి క్రియాత్మక రూపులా మారాలి, అంటే :

إِنَّ صَلَاتِي وَنُسُكِي وَمَحْيَايَ وَمَمَاتِي لِلَّهِ رَبِّ الْعٰلَمِيْنَ لَا شَرِيكَ لَهُ

"ఇన్న సలాతీ వ నుసుకీ వ మహ్యాయ వ మమాతీ లిల్లాహి రబ్బిల్ ఆలమీన, లా షరీక లహూ"

"నిస్సందేహంగా నా నమాజ్, నా ఖుర్బానీ, నా జీవన్మరణాలు అల్లాహ్ కొరకే, ఆయన సర్వలోకాల ప్రభువు. ఆయనకు సాటి ఎవ్వరూ లేరు."

17. హజ్ దినాల్లో నిరంతరం దైవస్మరణలో నిమగ్నమై పోవాలి. ఏ సమయంలోను మనస్సు దైవనామ సంస్మరణ విస్మరించకుండా జాగ్రత్తపడాలి. దైవస్మరణయే ఆరాధనలన్నిటి సారం. దైవసూక్తి : "లెక్కించదగ్గ ఈ కొన్ని దినాల్లో దైవస్మరణలో నిమగ్నులవండి." (అల్‌బఖర)

మరోచోట :

"హజ్ లాంఛనాలు అన్నీ పూర్తిచేసుకున్న తరువాత మునుపు ఏ విధంగానైతే తమ పూర్వీకుల్ని స్మరించుకునేవారో అలాగే ఇప్పుడు దైవాన్ని స్మరించండి. ఇంకా అంతకంటే అధికంగా కూడా!"

హజ్‌లోని లాంఛనాల లక్ష్యం ఒక్కటే, ఆ రోజుల్లో మీరు నిరంతరం దైవస్మరణలో విలీనమయిపోవాలి. నిరంతరం సాగే జీవన సమరంలో ఏ విషయమూ మిమ్మల్ని ఆయన సంస్మరణపట్ల ఉపేక్షా భావం కనబరచకుండా కాపాడటానికిగాను ఈ దినాల్లో ఆయన సంస్మరణ మీ హృదయాంతరాళాల్లో ఇమిడిపోవాలి. అజ్ఞాన యుగంలో ప్రజలు హజ్ ప్రధానాంశాలను పాటించిన తరువాత తమ తండ్రి తాతల గొప్పతనాన్ని చెప్పుకొనే వారు, డంబాలు పలికే వారు. అయితే ఈ దినాలను దైవనామ స్మరణలో గడపాలని దేవుడు బోధించాడు. ఆయన గొప్పతనాన్ని గుర్తించండి, వాస్తవానికి సర్వోన్నతుడు ఆయనే.

18. దైవగృహానికి అత్యంత ప్రేమానురాగాలతో, భక్తిభావంతో ఆరాధనతో తవాఫ్ (ప్రదక్షిణం)చేయాలి. దేవుడు ఇలా అన్నాడు :

"బైతుల్లా (దైవగృహం) తవాఫ్ (ప్రదక్షిణ) చేయాలి."

దైవప్రవక్త (సఅసం) అన్నారు :

"దేవుడు ప్రతి దినం తన హజ్‌దాసుల కొరకు నూట ఇరవై కారుణ్యా అవకాశాలను అనుగ్రహిస్తాడు. వాటిలో అరవై అంశాలు దైవగృహాన్ని తవాఫ్ చేసేవారికి కేటాయించబడతాయి. నలభై అక్కడ నమాజ్‌చేసే వారికి, ఇరవై కేవలం కాబాను చూస్తున్న ప్రజలకు" (బైహఖీ)

ప్రవక్త (సఅసం) ఇంకా ఇలా అన్నారు : "యాభైసార్లు బైతుల్లాహ తవాఫ్ చేసిన వారు, తమ తల్లి ఈ రోజే జన్మనిచ్చినట్లుగా తమ పాపాల ప్రక్షాళన చేసుకున్నారు." (తిర్మిజి)

# 3
# సుందర సమాజం

## 1. తీరని రుణానుబంధం

1. తల్లిదండ్రులపట్ల మంచిగా ప్రవర్తించాలి. ఈ సత్ప్రవర్తనను ఇహపరలోకాల్లో శుభదాయకంగా భావించాలి. దేవుని తర్వాత మానవుని మీద ఎక్కువ హక్కు గలవారు తల్లిదండ్రులే. ఖుర్‌ఆన్‌లో అనేకచోట్ల తల్లిదండ్రుల హక్కును దేవుని హక్కుతోబాటు ప్రకటించడం జరిగింది. దైవానికి కృతజ్ఞులయి ఉండాలన్న హితవుతో బాటు తల్లిదండ్రుల పట్ల కూడా కృతజ్ఞత కలిగి ఉండాలని హితవు చేయబడింది. దీనిద్వారా తల్లిదండ్రుల స్థానం, ప్రాముఖ్యత, ఔన్నత్యం ఎలాంటిదో గ్రహించవచ్చు.

"నీవు దైవాన్ని తప్ప ఇంకెవరిని ఆరాధించరాదని, తల్లిదండ్రులపట్ల సత్ప్రవర్తన కలిగి ఉండాలని నీ ప్రభువు తీర్మానించాడు." (బనీ ఇస్రాయీల్)

హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్నె మస్‌ఊద్ (రజి) అన్నారు : "నేను ప్రవక్త (సఅసం) ను అడిగాను, ఏ ఆచరణ దేవునికి అన్నిటికంటే ప్రీతికరమైనది?" అని.

ప్రవక్త (సఅసం) అన్నారు :

"నియమితకాలంలో చేసిన నమాజు".

"మళ్ళీ అడిగాను, దాని తరువాత ఏ పని దేవునికి ఎక్కువ ప్రీతికరమైనది"?

"తల్లిదండ్రులపట్ల సత్ప్రవర్తన" అని అన్నారు. "దాని తర్వాత ఏమిటని"

అడగగా, "దేవుని మార్గంలో జిహాద్(నిరంతరకృషి) చేయడం" అని జవాబిచ్చారు.
(బుఖారి, ముస్లిమ్)

హ[జత్ అబ్దుల్లాహ్ (రజి) ఇలా ఉల్లేఖించారుః

"ఒక వ్యక్తి ప్రవక్త (సఅసం) సన్నిధిలోకి వచ్చి, నేను మీ చేతిపైన ప్రమాణంచేసి హి[జత్, జిహాద్ చేయడానికి ప్రతిజ్ఞ చేస్తున్నాను. దైవమే దాని పుణ్యఫలం ఇవ్వాలని కోరుతాను" అని పలికాడు. ప్రవక్త (సఅసం) అతన్ని అడిగారు.

"నీ తల్లిదండ్రుల్లో ఎవరైనా ఒకరు జీవించి ఉన్నారా?" అందుకా వ్యక్తి, "ఉన్నారండి, దేవుని కృపవల్ల ఇద్దరూ సజీవంగా ఉన్నారు" అని జవాబిచ్చాడు.

"అయితే నీవు నిజంగా హి[జత్, జిహాద్ లాంటి మహత్కార్యాల ప్రతిఫలాన్ని దైవం నుండి కోరుతున్నావా?"

"అవును నేను దైవాన్నే పుణ్యఫలం కొరకు అర్థిస్తాను" అన్నాడా వ్యక్తి.

అప్పుడు మహాప్రవక్త (సఅసం) అన్నారు, "అయితే వెళ్ళు, నీ తల్లిదండ్రులతో ఉంటూ వారి పట్ల సత్ప్రవర్తనతో మెలుగు." (ముస్లిమ్)

హ[జత్ అబూ ఉమామ (రజి) అన్నారు : "ఒకవ్యక్తి ప్రవక్త (సఅసం)తో విన్నవించాడు, "దైవప్రవక్తా ! తల్లిదండ్రులకు సంతానంపైన ఉన్న హక్కు ఏమిటి?" అని.

"తల్లిదండ్రులే మీ స్వర్గం, తల్లిదండ్రులే మీ నరకం" అన్నారాయన.
(ఇబ్నెమాజ)

అంటే, వారిపట్ల సత్ప్రవర్తన కలిగిఉంటే మీరు స్వర్గప్రాప్తికి అర్హులౌతారు. వారి హక్కుల్ని హరించివేస్తే నరకాగ్నికి ఆహుతి అవుతారు అని అర్థం.

2. తల్లిదండ్రులకు కృతజ్ఞులుగా ఉండాలి. మేలుచేసిన వారికి కృతజ్ఞులుగా ఉండడం. ప్రత్యుపకారం చేయడం సజ్జనుల ప్రధాన లక్షణం. వాస్తవమేమంటే మన ఉనికికి కారణభూతులు – తల్లిదండ్రులు. అంతేకాకుండా తల్లిదండ్రుల పెంపకంలో వారి సంరక్షణలో మనం పెరిగి పెద్దవారమౌతాము. వారు అనన్యమైన త్యాగం, అనుపమానమైన ఔదార్యం, అసాధారణమైన కృషితో మనల్ని పోషిస్తారు. తమ ప్రాణాలకు సమానంగా మనల్ని సంరక్షిస్తారు. అందుకు మన హృదయం విశ్వాసంతో కృతజ్ఞతతో గౌరవంతో, ప్రేమానురాగాలతో ఉప్పొంగిపోవాలి.

మన గుండెల్లోని అణువణువు కృతజ్ఞతా భావంతో నిండిపోవాలి. ఈ కారణంచేతనే దైవం తనకు కృతజ్ఞత అర్పించడంతోబాటు వారిపట్ల కూడా కృతజ్ఞత కలిగి ఉండాలని హితవు చేశాడు.

"నాకు కృతజ్ఞతలు అర్పించాలని, తమ తల్లిదండ్రులపట్ల కృతజ్ఞతతో మెలగాలని మేము హితవు చేశాము." (లుఖ్మాన్)

3. ఎల్లప్పుడు తల్లిదండ్రులను సంతోషపరచడానికి ప్రయత్నించాలి. వారి ఇష్టానికి, స్వభావానికి వ్యతిరేకంగా వారికి బాధకలిగేలా మాట్లాడకూడదు. ముఖ్యంగా వృద్ధాప్యంలో వారు ప్రతిదానికి విసుక్కుంటూ ఉంటారు. వారికప్పుడు ఏమీ తోచదు. వారు మన ఆలోచనలకు విరుద్ధంగా ఏదేదో కోరుతూ ఉంటారు. వారు చెప్పిందే కావాలని పట్టుపడతారు. ఆ సమయంలో కూడా వారి ప్రతిమాటను సంతోషంతో సహించాలి. వారన్న మాటలకు చికాకుపడి వారికి బాధకలిగించేలా, వారి మనసును నొప్పించే విధంగా మాట్లాడరాదు.

"వారిలో ఒకరు కాని ఇద్దరుకానీ వృద్ధాప్యానికి చేరుకున్నప్పుడు మీరు వారిని 'అబ్బ' అని కూడా అనరాదు, వారిని ఈసడించుకోరాదు."

(బనీ ఇస్రాయీల్)

అసలు వృద్ధాప్యంలో మాటను భరించడం కష్టం. బలహీనతవల్ల తమ ప్రాముఖ్యతాభావం అధికమైపోతుంది. అందుచేత ప్రతి చిన్న మాటకూడా కొండంతగా గోచరిస్తుంది. కాబట్టి వారి ఈ సున్నిత పరిస్థితిని దృష్టిలో పెట్టుకొని మరీ మెలగాలి. తమ ప్రవర్తనవల్లను, మాటలవల్లను తల్లిదండ్రులకు బాధ కలిగే అవకాశం ఇవ్వరాదు.

హజ్రత్ అబ్దుల్లాహ ఇబ్నె అమ్ర్ (రజి) ప్రవక్త (సఅసం) ఇలా అన్నారని ఉల్లేఖించారు : "దేవుని ప్రేమానురాగాలు తండ్రి ప్రేమానురాగాల్లోవున్నాయి. దేవుని అయిష్టత తండ్రి అయిష్టతలో ఉంది." (తిర్మిజి, ఇబ్నె హిబ్బాన్, హాకిమ్)

అంటే ఒకవ్యక్తి తన దైవాన్ని సంతోషపెట్టాలని అభిలషిస్తే అతడు తన తండ్రిని సంతోషపెట్టాలి. తండ్రిని బాధపెట్టి దైవాన్ని సంతోషపెట్టలేము. ఎవరయితే తండ్రిని బాధపెడ్తారో వారు దైవాగ్రహాన్ని ప్రేరేపిస్తారు.

హజ్రత్ అబ్దుల్లాహ మరోసారి అన్నారు, "ఒకవ్యక్తి తన తల్లిదండ్రులు దుఃఖిస్తుండగా వారిని వదలివేసి హిజ్రత్ కొరకు ప్రతిజ్ఞచేయడానికి ప్రవక్త

(సఅసం) వద్దకు వచ్చాడు. అప్పుడు ప్రవక్త (సఅసం) వెళ్ళు, నీ తలిదండ్రుల వద్దకు తిరిగి వెళ్ళు. వారికి ఏ విధంగానైతే దుఃఖం కలిగించి వచ్చావో అలాగే వారిని సంతోషపెట్టి రా" అని అన్నారు. (అబూదావూద్)

4. హృదయపూర్వకంగా తల్లిదండ్రులకు సేవచేయాలి. మీకు దైవం ఆ అవకాశం ప్రసాదించాడంటే మీరు స్వయంగా స్వర్గప్రవేశానికి అర్హులు అయ్యేందుకు సద్బుద్ధినిచ్చాడన్నమాట. ఆ విధంగా మీరు దైవ ప్రసన్నత పొందగలుగుతారు. తల్లిదండ్రుల సేవ చేయడం వల్లనే ఇహపరలోకాల్లో శుభం, గౌరవం, ఉన్నతి లభిస్తాయి. మనిషి ఉభయ లోకాల్లోని ఆపదల నుండి రక్షణపొందుతాడు. ప్రవక్త (సఅసం) అన్నారని హజ్రత్ అనస్ (రజి) తెలిపారుః

"తన వయస్సు పెరగాలని, సంపాదన పెంపొందాలని ఆశించేవాడు తన తల్లిదండ్రులకు మేలు చేస్తూ, వారి ఎడల దయతో ప్రవర్తించాలి." (అల్ తర్‌గీబ్ వల్ తర్‌హీబ్)

ప్రవక్త (సఅసం) ఒకసారి ఇలా అన్నారు : "ఆ మనిషి నీచుడై పోవుగాక! నీచుడై పోవుగాక! నీచుడై పోవుగాక!" అక్కడున్నవారు "దైవప్రవక్తా! ఏ మనిషి" అని అడగ్గా, "తల్లిదండ్రు లలో ఇద్దర్ని లేక ఒకర్ని వృద్ధాప్యంలో చూసి కూడా (వారి సేవ) చేసి స్వర్గ ప్రవేశం చేయలేని మనిషి" అని ఆయన సెలవిచ్చారు. (ముస్లిమ్)

ఒక సందర్భంలో తల్లిదండ్రుల సేవను జిహాద్‌లాంటి మహోన్నతమైన ఆరాధన కంటె గొప్పదిగా ప్రశంసించారు ప్రవక్త (సఅసం). ఒక అనుచరుణ్ణి జిహాద్‌కు వెళ్ళకుండ ఆపి తల్లిదండ్రుల సేవ చేయమని హితవు చేశారు. హజ్రత్ అబ్దుల్లాహ ఇబ్నె ఉమర్ (రజి) అన్నారుః ఒక వ్యక్తి జిహాద్‌లో పాల్గొనే ఉద్దేశ్యంతో ప్రవక్త (సఅసం) వద్దకు వచ్చాడు. నీ తల్లిదండ్రులు జీవించి ఉన్నారా అని అడిగారు ఆయన (సఅసం). "అవునండి ఉన్నారు" అని ఆ వ్యక్తి జవాబిచ్చాడు. "అయితే వెళ్ళు వారికి సేవ చేస్తూ ఉండు. ఇదే నీ జిహాద్" అని ఆయన (సఅసం) బోధించారు. (బుఖారి, ముస్లిమ్)

5. తల్లిదండ్రులపట్ల మర్యాద, గౌరవం కలిగి మెలగాలి. వారి గౌరవానికి భంగంకలిగేలా ఎలాంటి మాటగాని, పనిగాని చేయకూడదు. ఖుర్‌ఆన్‌లో ఇలా ఉందిః

"వారితో మర్యాదగా సంభాషించండి" (బనీ ఇస్రాయీల్ : 23)

ఒకసారి హజ్రత్ అబ్దుల్లాహ ఇబ్నె ఉమర్ (రజి) హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి)ను అడిగారు.

"నీవు నరకానికి దూరంగా ఉండాలని, స్వర్గంలో ప్రవేశించాలనీ కోరుకుంటున్నావా?"

దానికి హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి), "సందేహమెందుకు? దేవుని సాక్షిగ ఇదే నేను కోరుకునేది." అన్నారు.

హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) అడిగారు :

"నీ తల్లిదండ్రులు జీవించే ఉన్నారా?"

"ఆ ! నా తల్లి సజీవంగా ఉంది".

"నీవు ఆమెతో మృదువుగా మాట్లాడి, ఆమె ఆహారపానీయాల విషయంలో శ్రద్ధవహిస్తే తప్పకుండా స్వర్గంలో ప్రవేశిస్తావు. అయితే నీవు మహాపాతకాలు చేయకుండా ఉండాలి." (అల్ అదబుల్ మఫ్రద్)

హజ్రత్ అబూ హురైరా (రజి) ఒకసారి ఇద్దరు వ్యక్తుల్ని చూశారు. వారిలో ఒకరిని "ఈ రెండవ వారు నీకు ఏమౌతారు?" అని అడిగారు.

అతడు "ఈయన మా నాన్నగారు" అని చెప్పాడు. అప్పుడాయన అన్నాడు, "ఆయన్ని పేరుపెట్టి పిలువకూడదు, ఆయనకు ముందు ముందుగా ఎప్పుడూ నడవరాదు. ఆయన కంటెముందు కూర్చోరాదు."(అదబుల్ మఫ్రద్)

6. తల్లిదండ్రులపట్ల సౌమ్యంగా, వినయంగా ప్రవర్తించాలి.

వారి ముందు వినయంతో వినమ్రులయి మెలగండి. (బనీ ఇస్రాయీల్)

అంటే అనుక్షణం వారి ఉన్నత స్థానాన్ని గుర్తుంచుకోవాలి. వారి ముందు ఎప్పుడు మీ గొప్పతనాన్ని చాటుకోకూడదు. వారి గౌరవానికి భంగం కలిగేలా మాట్లాడకూడదు.

7. తల్లిదండ్రులను ప్రేమించాలి. ఈ ప్రేమను శుభప్రదమయినదిగా, పరలోకాన పుణ్యప్రదమైనదిగా భావించాలి. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) ఉల్లేఖించారు : ప్రవక్త (సఅసం) అన్నారు, "మంచి నడవడిగల సంతతి తమ తల్లిదండ్రులను ప్రేమాభిమానాలతో ఒక్కసారి చూస్తే దానికి బదులుగా దైవం ఒక హజ్‌కు సమానమైన పుణ్యఫలం ప్రసాదిస్తాడు."

"దైవప్రవక్తా ! ఒక దినంలో వందసార్లు అలాగే ప్రేమతో, కారుణ్యంతో చూస్తేనో" అని ప్రజలు అడగ్గా ఆయన (సఅసం) సెలవిచ్చారు : "అవును,

వందసార్లు అలాచేసినప్పుడు కూడా. ఎందుకంటే దైవం (మీ భావనలకన్నా) ఎంతో గొప్పవాడు, (సంకుచితుడుకాడు) ఎంతో పవిత్రుడు." (ముస్లిమ్)

8. తల్లిదండ్రుల పట్ల మనస్ఫూర్తిగా విధేయత కలిగి ఉండాలి. వారు కొన్ని విషయాల్లో ఒత్తిడి చేసినప్పటికి సంతోషంతో భరించాలి. వారు చేసిన మహోన్నతమైన ఉపకారాలను దృష్టిలో ఉంచుకొని మీ అభిరుచి, మీ స్వభావం భరించలేని వారి కోరికలను కూడ సంతోషంగా నెరవేర్చాలి. అయితే ఆ కోరికలు దైవధర్మానికి విరుద్ధమైనవయి వుండరాదు.

హజ్రత్ అబూ సయీద్ (రజి) ఉల్లేఖించారు : "ఒక యమన్ దేశపు పౌరుడు ప్రవక్త (సఅసం) సమ్ముఖంలో హాజరయ్యాడు. ప్రవక్త (సఅసం) అతన్ని అడిగారు, "యమన్‌లో మీవారెవరయినా ఉన్నారా? "ఔనండి, నా తల్లిదండ్రులున్నార"ని అతడు జవాబిచ్చాడు, ప్రవక్త (సఅసం) అడిగారు, "వారు నిన్ను అనుమతించారా?" "లేదండి, నేను వారి అనుమతి తీసుకోలేదు" అని జవాబిచ్చాడా వ్యక్తి. అప్పుడు ప్రవక్త (సఅసం) అన్నారు, "సరే, నీవు తిరిగి వెళ్ళు, నీ తల్లిదండ్రుల అనుమతి తీసుకో. వారు అనుమతి ఇస్తేనే జిహాద్‌లో పాల్గొను. లేక పోతే వారి సేవలో ఉంటూ వారిపట్ల సత్ప్రవర్తన కలిగి ఉండు"

(అబూ దావూద్)

తల్లిదండ్రులపట్ల విధేయత కలిగి ఉండడం ఎంత అవసరమో దీనిద్వారా గ్రహించవచ్చు. ఒక వ్యక్తి ఎన్నో వందల మైళ్ళదూరం నుండి వచ్చి మహాప్రవక్త (సఅసం) సహచర్యంలో దైవధర్మ సంస్థాపనార్థం జిహాద్‌లో పాల్గొనాలని అభిలషిస్తాడు. ఆ వ్యక్తిని ప్రవక్త (సఅసం) తిరిగి పంపించివేస్తారు. నీ తల్లిదండ్రులు ఇద్దరూ అనుమతి ఇస్తేనే తప్ప నీవు జిహాద్‌లో పాల్గొనలేవు అని అంటారు.

హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) ప్రవక్త (సఅసం) ప్రవచనాన్ని ఉల్లేఖించారు:

"తల్లిదండ్రుల సేవకై దేవుడు బోధించిన హితవులు, ఆజ్ఞలను నిర్వర్తిస్తూ ఏ వ్యక్తి అయితే రాత్రంతా గడుపుతాడో, ఆ వ్యక్తి కొరకు ఆ రోజు ఉదయం రెండు స్వర్గద్వారాలు తెరచుకుంటాయి. ఒకవేళ తల్లిదండ్రులలో ఒకరే ఉంటే ఒక స్వర్గద్వారం తెరచి ఉంటుంది. అలాగే ఏ వ్యక్తి అయితే తల్లిదండ్రుల విషయంలో నిర్లక్ష్యంచేసి రాత్రంతా గడుపుతాడో ఆ వ్యక్తి కొరకు ఉదయం రెండు నరకద్వారాలు తెరిచి ఉంటాయి. ఒకవేళ తల్లిదండ్రులలో ఒకరే ఉంటే ఒక నరకద్వారం తెరచి ఉంటుంది" అప్పుడు ఒక వ్యక్తి అడిగాడు:

"దైవప్రవక్తా ! ఒకవేళ తల్లిదండ్రులే కఠినవైఖరి అవలంబిస్తే అప్పుడు కూడానా?"

"అవును, కఠినవైఖరి అవలంబించినప్పుడు కూడా" అని ప్రవక్త ముహమ్మద్ పలికారు. (మిష్కాత్)

9. తల్లిదండ్రులు మీ సంపాదనకు యజమానులని గ్రహించాలి. వారి కొరకు విశాల హృదయంతో ఖర్చు చేయాలి.

"మేము ఏ ఖర్చు చేయాలి? అని ప్రజలు మిమ్మల్ని అడుగుతారు. మీరు ఖర్చుచేసే సంపదకు ప్రధాన హక్కుదారులు తల్లిదండ్రులేనని జవాబివ్వండి." (అల్ బకర)

ఒకసారి ప్రవక్త(సఅసం) వద్దకు ఒకవ్యక్తి వచ్చి తన తండ్రి ఎప్పుడుపడితే అప్పుడు తన సంపాదనను తీసుకుంటాడని ఫిర్యాదు చేశాడు. ప్రవక్త (సఅసం) ఆ వ్యక్తి తండ్రిని పిలిపించారు. బలహీనుడైన ఒక వృద్ధుడు (ఆ వ్యక్తి తండ్రి) చేతి కర్ర ఊతంతో హాజరయ్యాడు. వారు (సఅసం) ఆ వృద్ధుని అడిగి తెలుసుకోగా అతడు చెప్పనారంభించాడు.

"దైవప్రవక్తా ! ఇతడు (తన కొడుకు) ఒక కాలంలో బలహీనుడుగా, అశక్తుడుగా ఉన్నప్పుడు నాలో బలముండేది. అప్పుడు నేను ధనవంతుణ్ణి. ఇతడు ఖాళీ చేతుల్తో ఉండేవాడు. నా సంపాదనను ఇతడు తీసుకుంటే నేను ఎప్పుడూ వారించలేదు. ఈ రోజు నేను బలహీనుణ్ణి. ఇతడు ఆరోగ్యవంతుడు. బలవంతుడు కూడా. నేను శూన్యహస్తాలతో ఉన్నాను. ఇతడు ధనవంతుడయ్యాడు. ఇప్పుడు ఇతడు తన సంపాదనను నా నుండి దాచిపెడ్తాడు."

వృద్ధుని ఈ మాటలు విని కారుణ్యమూర్తి(సఅసం) బాధపడ్డారు. వృద్ధుని కొడుకును ఉద్దేశించి అన్నారు, "నీవూ, నీ సంపదఅంతా నీ తండ్రిదే."

10. తల్లిదండ్రులు ఒకవేళ ముస్లిమేతరులయినాసరే వారిపట్ల సత్ప్రవర్తన కలిగి ఉండాలి. గౌరవమర్యాదలతో వారి సేవ చేస్తూ ఉండాలి. అయితే వారు బహుదైవారాధన, దుర్నీతిపనులు చేయాలని ఒత్తిడి తెస్తే మాత్రం వెంటనే నిరాకరించాలి. ఈ విషయంలో వారి ఆజ్ఞలను శిరసావహించరాదు.

"ఒకవేళ తల్లిదండ్రులు నాకు సమానులుగా మరొకరిని ఆరాధించమని బలవంతం చేస్తే మీకు ఏ విషయంలోనైతే జ్ఞానం లేదో, ఆ విషయంలో వారిమాటలు ఒప్పుకోకండి. లోకంలో వారిపట్ల సత్ప్రవర్తన కలిగి ఉండండి."
(లుఖ్మాన్)

హజ్రత్ అస్మా (రజి) ఉల్లేఖించారు. "ప్రవక్తగారి శుభప్రదమైన కాలంలో నా వద్దకు నా తల్లి వచ్చింది. అప్పుడామె బహుదైవారాధకురాలు, నేను ప్రవక్త (సఅసం)తో 'నా వద్దకు మా అమ్మగారు వచ్చారు. నేను ఆమెపట్ల ఎలా ప్రవర్తించాలి' అని అడిగాను. అందుకు ఆయన (సఅసం) నీవు తల్లిపట్ల దయార్ద్ర హృదయంతో ప్రవర్తించు" అని సెలవిచ్చారు. (బుఖారి)

11. తల్లిదండ్రుల కొరకు తప్పకుండ దుఆ చేస్తూ ఉండాలి. వారు చేసిన మేళ్ళను మననం చేసుకుంటూ దేవుని సమక్షాన రోదించాలి. అత్యంత హృదయావేదనతో, ప్రేమోద్రేకాలతో వారికి కరుణ, దయ కటాక్షించమని దైవాన్ని వేడుకోవాలి.

దైవం నేర్పిన దుఆ ఏమంటే :

رَّبِّ ارْحَمْهُمَا كَمَا رَبَّيٰنِىْ صَغِيْرًا ۝

*రబ్బిర్‌హమ్‌హుమా కమా రబ్బయానీ సగీరా.*

"ఓ ప్రభూ ! ఏ విధంగానైతే వీరిద్దరు నన్ను చిన్నతనంలో పోషించారో ఆ విధంగా నీవు వీరిద్దర్ని కరుణించు."

అంటే, ఓ ప్రభూ ! పసితనపు బలహీనతల్లో వీరు నన్ను కరుణతో, ప్రేమతో ప్రాణసమానంగా, శ్రమకోర్చి పోషించారు. నా గురించి వారు తమ సుఖాల్ని కోర్కెల్ని త్యాగం చేశారు. ఓ ప్రభూ ! ఇప్పుడు వీరు వృద్ధాప్య బలహీనతతో అశక్తులై ఉన్నారు. నాకంటే ఎక్కువగా వీరికి కరుణ దయ అవసరం. ఓ దేవా ! నేను వారికి ఎటువంటి ప్రతిఫలం ఇవ్వలేను. నీవే వారిని కటాక్షించు వారి దీనావస్థపై నీ కారుణ్యాన్ని వర్షింపజెయ్యి.

12. తల్లి సేవలో ప్రత్యేకశ్రద్ధ వహించాలి. తల్లి స్వాభావికంగా ఎక్కువ బలహీనంగావుంటుంది. అభిమానం కలిగి ఉంటుంది. మీరు ఆమె సేవ చెయ్యడం ఎంతో అవసరం. మీ అవసరం కూడా ఆమెకు ఉంటుంది. అంతేకాదు, ఆమె చేసిన ఉపకారాలు, త్యాగాలు తండ్రి కంటే ఎక్కువ. అందుచేత

దైవధర్మం తల్లి హక్కును అధికంగా ప్రస్తావించింది. తల్లిపట్ల ఎలా ప్రవర్తించాలో ఆ నడవడికను ప్రత్యేకంగ పేర్కొన్నది.

పవిత్ర ఖుర్ఆన్‌లో ప్రబోధించబడింది: "తల్లిదండ్రులకు మేలు చేయమని మేము మానవునికి హితవు చేశాము. వాని తల్లి ఎంతో కష్టాన్ని ఓర్చి, అతన్ని తన గర్భంలో మోస్తూ తిరిగింది. ఎంతో కష్టంతో కన్నది. కడుపులో ఉంచుకొని మోసి, పాలు త్రాగించే ఈ (అతికష్టమైన) గడువు రెండున్నర సంవత్సరాలు."

(అల్ అహ్ఖాఫ్)

ఖుర్ఆన్, తల్లిదండ్రులిద్దరిపట్ల సత్ప్రవర్తన కలిగి ఉండాలని హితవు చేస్తూ ప్రత్యేకంగా తల్లి అనుభవించే బాధను, పడే కష్టాన్ని స్పష్టంగా విశదీకరించింది. అత్యంత అద్భుతంగా ఎంతో హృద్యంగా అసలు సత్యంవైపు మార్గాన్ని చూపించింది, ప్రాణత్యాగం చేసే తల్లి, తండ్రి కంటే అధికంగా మీ అనురాగానికి అర్హురాలు. ఈ యదార్థాన్నే దైవప్రవక్త కూడ అతి విపులంగా విశదీకరించారు. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖించారు. "ఒకవ్యక్తి ప్రవక్త (సఅసం) సమ్ముఖంలో హాజరయి అడిగాడు, 'దైవప్రవక్తా ! నా అనురాగానికి ఎక్కువ అర్హులు ఎవరు?' ఆయన, 'నీ తల్లి' అని పలికారు.

అతను మళ్ళీ అడిగాడు 'ఆ తరువాత ఎవరు?' అని.

'నీ తల్లి'

'తర్వాత ఇంకెవరు?'

'నీ తల్లి'.

'ఆ తర్వాత'

'నీ తండ్రి' అని ఆయన (సఅసం) అన్నారు. (అల్ అదబుల్ మఫ్రద్)

హజ్రత్ జాహిమ (రజి) ప్రవక్త (సఅసం) సమ్ముఖంలో హాజరై 'దైవప్రవక్తా! నేను మీతో జిహాద్‌లో పాల్గొనాలని నిశ్చయించుకున్నాను. మీతో సంప్రదించాలని వచ్చాను. మీ ఆజ్ఞ ఏమిటో చెప్పండి' అని అర్థించారు. మహాప్రవక్త (సఅసం) అడిగారు, 'నీ తల్లి జీవించి ఉందా?' 'ఔనండి, జీవించే ఉంది' అని హజ్రత్ జాహిమా (రజి) బదులు చెప్పారు. అప్పుడు ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు. 'అయితే వెళ్ళు, ఆమె సేవలో నిమగ్నమైపో. ఆమె పాదాల క్రిందే స్వర్గం ఉంది.'

(ఇబ్నె మాజ, నసాయి)

హజ్రత్ ఉవైస్ (రహ) ప్రవక్త (సఅసం) సమకాలికులు. కాని ఆయన

ప్రవక్త(సఅసం)ను సందర్శించలేక పోయారు. ఆయన తల్లి వృద్ధురాలు, పగలు, రాత్రి ఆమె సేవలోనే గడిపేవారు. ప్రవక్త (సఅసం) దర్శనం చేసుకోవాలని ఆయనకు కొండంత ఆశ ఉండేది. వారి(సఅసం) దర్శనభాగ్యంతో తన కళ్ళల్లో జ్యోతులు వెలిగించుకోవాలని ఏ విశ్వాసికి ఉండదూ! కనుకనే ఉవైస్ (రహ్) ప్రవక్త వద్దకు వెళ్ళాలని నిశ్చయించుకున్నారు. కాని ప్రవక్త(సఅసం) వారించారు. హజ్ విధిని కూడ పూర్తిచేయాలని ఆయన మనస్సులో ఎంతో అభిలాష ఉండేది. కాని ఆయన తల్లి ఏకాకిగా ఉండిపోతుందనే ఉద్దేశ్యంతో హజ్‌చేయలేకపోయారు. ఆమె మృతిచెందిన తర్వాతనే ఆయన ఈ ఆశ నెరవేరింది.

13. పాలిచ్చిన తల్లిపట్ల కూడ సత్ప్రవర్తన కలిగి ఉండాలి.

హజ్రత్ అబూ తుఫైల్ (రజి) ఇలా తెలిపారు: 'నేను 'జఅరాన' అనే ప్రదేశంలో ప్రవక్త(సఅసం)ను చూశాను. ఆయన మాంసం పంచిపెడుతున్నారు. అప్పుడు ఒక స్త్రీ వచ్చి ప్రవక్త (సఅసం) కు చాలా దగ్గరకు వెళ్ళింది. ఆయన ఆమె కోసం తన దుప్పటిని పరిచారు. ఆమె దానిపై కూర్చుంది. నేను 'ఈమె ఎవరు?' అని అడిగాను. 'ఈమె ప్రవక్త (సఅసం) కు పాలు త్రాగించిన తల్లి' అని ప్రజలు తెలిపారు. (అబూ దావూద్)

14. తల్లిదండ్రులు మరణించిన తర్వాత కూడ వారిని ఆదరించాలి. వారిపట్ల సత్ప్రవర్తన కలిగి ఉండటానికి ఈ క్రింది విషయాలను పాటించాలి.

i) తల్లిదండ్రుల మోక్షానికి తప్పకుండ దుఆ చేస్తూ ఉండాలి.

పవిత్ర ఖుర్ఆన్ విశ్వాసులకు ఈ దుఆ నేర్పింది :

رَبَّنَا اغْفِرْ لِي وَلِوَالِدَيَّ وَلِلْمُؤْمِنِينَ يَوْمَ يَقُومُ الْحِسَابُ -

"రబ్బనగ్‌ఫిర్‌లి వలివాలిదయ్య వలిల్ మూమినీన యౌమ యఖూముల్ హిసాబ్,"

"ప్రభూ ! నన్ను క్షమించు, నా తల్లిదండ్రుల్ని, సమస్త విశ్వాసుల్ని కూడా లెక్కచూసే తీర్పు దినంనాడు క్షమించు."

హజ్రత్ అబూ హురైరా (రజి) వివరించారు. చనిపోయిన తర్వాత మృతుని అంతస్తులు ఉన్నతమౌతాయి. అప్పుడు అతను ఆశ్చర్యంతో "ఎలా జరిగింది?" అంటాడు. దేవునివైపు నుండి అతనికి తెలియజేయబడుతుంది :

"నీ సంతానం నీ క్షమాపణకై దుఆ చేస్తూ ఉండేది. దేవుడు దాన్ని అంగీకరించాడు." హజ్రత్ అబూ హురైరా (రజి)యే ప్రవక్త (సఅసం) ఇలా అన్నట్లు వివరించారు:

"మనిషి మరణించినప్పుడు అతని ఆచరణా వ్యవధి అంతమైపోతుంది. మూడు విషయాలు మాత్రం చనిపోయిన తర్వాత కూడ అతనికి లాభాన్ని చేకూరుస్తూ ఉంటాయి.

ఒకటి నిరంతరం కొనసాగే 'సద్ఖా', రెండవది ప్రజాప్రయోజనం కోసం అతడు వ్యాపింపచేసిన విజ్ఞానం (విద్య), మూడవది, అతని క్షమాపణ కోసం దుఆ చేసే ఉత్తమ సంతానం.

ii) తల్లిదండ్రులు చేసిన వాగ్దానాలు, ప్రమాణాలు, వీలునామాను నెరవేర్చాలి. తల్లిదండ్రులు తమ జీవిత కాలంలో ఎంతో మందికి ఎన్నో వాగ్దానాలు చేసి ఉండవచ్చు. దైవంతో కూడ ఏదైనా ప్రమాణంగాని, మొక్కుబడిగాని చేసుకొని ఉండవచ్చు. ఎవరికైనా పైకం ఇస్తానని మాట ఇచ్చి ఉండవచ్చు. ఎవరి అప్పు అయినా తీర్చవలసిన బాధ్యత ఉండవచ్చు. మరణించే సమయంలో ఏదయినా వాజ్మూలం చెప్పి ఉండవచ్చు. అంచేత మీరు శాయశక్తులా వాటిని పూర్తిచేయాలి.

హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) అన్నారు : "హజ్రత్ సాద్ బిన్ ఉబాద (రజి) ప్రవక్త (సఅసం)తో ఇలా విన్నవించారు. ఓ దైవప్రవక్తా ! నా తల్లి మొక్కుబడి చేసుకొన్నది. కాని దాన్ని పూర్తి చేయకముందే చనిపోయింది. నేను ఆమె తరపున ఆ మొక్కుబడిని పూర్తిచేయవచ్చా? ప్రవక్త ఇలా అన్నారు : 'ఎందుకు చేయకూడదు, నీవు ఆమె తరపున ఆ మొక్కుబడి తప్పకుండ నెరవేర్చాలి."

iii) సంతానం తమ తండ్రి స్నేహితుల పట్ల, తల్లి స్నేహితురాండ్రపట్ల కూడ సత్ప్రవర్తన కలిగి ఉండాలి. వారిని గౌరవించాలి. వారిని పెద్దలుగా భావించి సలహాలకై వారిని కూడా సంప్రదించాలి. వారి సలహాలను, అభిప్రాయాలను గౌరవించాలి. ఒక సందర్భంలో ప్రవక్త (సఅసం) అన్నారు : "అన్నింటినీ మించిన సత్ప్రవర్తన ఏమంటే, మనిషి తన తండ్రి స్నేహితులకు మేలు చేయడం." ఒకసారి అబూదర్దా (రజి) జబ్బున పడ్డారు. వ్యాధి రోజు రోజుకు అధికమౌతూనే ఉంది. ఇక జీవించే ఆశపోయింది. హజ్రత్ యూసుఫ్ ఇబ్నె అబ్దుల్లాహ్ (రజి) చాలా దూరం ప్రయాణం చేసి ఆయన్ని పరామర్శించడానికి వచ్చారు. హజ్రత్ అబూదర్దా (రజి) యూసుఫ్‌ను చూసి "నీవు ఇలా వచ్చావేమిటి?" అన్నారు ఆశ్చర్యంతో. యూసుఫ్ ఇబ్నె అబ్దుల్లాహ్ (రజి) అన్నారు, "మిమ్మల్ని పరామర్శించడానికే వచ్చాను. మా తండ్రి గారితో మీ సంబంధాలు చాలా గాఢంగా ఉండేవి."

హజ్రత్ అబూబర్దా (రజి) ఇలా అన్నారు : నేను మదీనా వచ్చినప్పుడు

నా వద్దకు అబ్దుల్లా ఇబ్నె ఉమర్(రజి) వచ్చి "అబూ బర్దా(రజి) నేను నీ వద్దకు ఎందుకొచ్చానో తెలుసా?" అన్నారు. 'మీరు నా వద్దకు ఎందుకొచ్చారో నాకయితే తెలియదు.' అన్నాను నేను.

అప్పుడు హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్నె ఉమర్(రజి) ఇలా అన్నారు. "ఏ వ్యక్తి అయితే సమాధిలో ఉన్న తన తండ్రిపట్ల సత్ప్రవర్తన కలిగి ఉండాలని కోరుకుంటాడో అతను తన తండ్రి మరణానంతరం తండ్రి స్నేహితులు, శ్రేయోభిలాషులపట్ల సత్ప్రవర్తన కలిగి ఉండాలి." అని ప్రవక్త (సఅసం) బోధిస్తుండగా నేను విన్నాను. "సోదరా ! మా తండ్రి హజ్రత్ ఉమర్(రజి), మీ తండ్రి ఆప్తమిత్రులు. ఆ మిత్రత్వాన్ని నిలుపుకొని దాని బాధ్యతను నెరవేర్చాలని అభిలషిస్తున్నాను" అన్నారు ఆయన.(ఇబ్నె హిబ్బాన్)

iv) తల్లిదండ్రుల బంధువుల పట్ల కూడా తప్పని సరిగా మంచి నడవడి కలిగి ఉండాలి. రక్తసంబంధమైన బంధుత్వాన్ని పూర్తిగా గౌరవించాలి. ఆ బంధువుల పట్ల నిర్లక్ష్యవైఖరి అవలంబించటం నిజానికి తల్లిదండ్రులపట్ల నిర్లక్ష్యవైఖరి అవలంబించటమే. ప్రవక్త (సఅసం) అన్నారు :

"మీరు మీ తండ్రి తాతలపట్ల(పెద్దల పట్ల) ఏమాత్రం అశ్రద్ధ చూపరాదు. తల్లిదండ్రులపట్ల అశ్రద్ధచూపడం అంటే దేవునికి కృతఘ్నులుగా ఉండడమే."

15. ఒకవేళ జీవితంలో తల్లిదండ్రులపట్ల ప్రవర్తించే వైఖరిలో వారి హక్కులను గౌరవించడంలో ఏదైనా పొరపాటు జరిగినప్పటికీ దేవుని అనుగ్రహంపట్ల నిరాశ చెందకూడదు. వారు చనిపోయిన తర్వాత కూడా వారి క్షమాపణకై దేవుని తప్పనిసరిగా ప్రార్థిస్తూ ఉండాలి. ఫలితంగా దేవుడు మీ పొరబాట్లను క్షమించి, మిమ్మల్ని తన పుణ్యదాసుల జాబితాలో చేర్చుకుంటాడని ఆశించవచ్చు.

హజ్రత్ అనస్ (రజి) ప్రవక్త (సఅసం) హితవును ఇలా ఉల్లేఖించారు.

'ఒకవేళ ఎవరైనా తల్లిదండ్రులు జీవించి ఉన్నప్పుడు వారిపట్ల అవిధేయుడై ఉన్నట్లయితే తల్లిదండ్రులలో ఒకరు లేక ఇద్దరు ఆ స్థితిలో చనిపోతే, అప్పుడా వ్యక్తి దేవుడు తనను కరుణించి పుణ్యాత్ముల జాబితాలో రాసేంతవరకు తన తల్లిదండ్రుల క్షమాపణ కోసం తప్పనిసరిగా దేవుని ప్రార్థిస్తూ ఉండాలి."

# 2. సుఖమయ దాంపత్యం

ఇస్లామ్ ఒక మహెూత్కృష్టమయిన నాగరికత, సంస్కృతులకు సారథ్యంవహించే జీవన వ్యవస్థ. అలాంటి జీవన వ్యవస్థ ఉనికిలోకి రావాలంటే అది మనం ఒక పవిత్రమైన సమాజాన్ని నిర్మించడంలో కృతకృత్యులమయినప్పుడే సాధ్యం. పవిత్రమైన సమాజ నిర్మాణానికి మొదట కుటుంబ విధానాన్ని అతి పటిష్టంగాను, విజయవంతమైనదిగాను చేయాలి.

కుటుంబ జీవనం భార్యభర్తల పవిత్ర బంధంతో ప్రారంభమౌతుంది. భార్యభర్తలిద్దరు సాంసారిక జీవితం, దాని నియమాలు, దాని బాధ్యతల్ని సరిగ్గా అవగాహన చేసుకుంటేనే ఉత్తమ ఫలితాల్ని పొందడం సాధ్యమవుతుంది. ఆ నియమాలను, బాధ్యతలను నిర్వహించడానికి హృదయపూర్వకంగా, నిర్మలమైన మనస్సుతో ఏకాగ్రతతో సన్నద్ధులవ్వాలి.

మొదట భార్య పట్ల భర్త బాధ్యతలు, ప్రవర్తన తీరు గురించి తెలుసుకుందాం.

1. భార్యపట్ల సత్ప్రవర్తనతో జీవనం గడపాలి. ఆమె హక్కులను విశాల హృదయంతో గౌరవించాలి, ప్రతి విషయంలో మేలును, త్యాగబుద్ధిని కనబరచాలి.

"వారితో సద్వర్తనంతో సంసారంచేయండి"(నిసా) అని దేవుని ప్రబోధం.

మహాప్రవక్త(సఅసం) 'హజ్జతుల్ విదా' సమయంలో ఒకపెద్ద సమావేశంలో ప్రసంగిస్తూ ఈ విధంగా ప్రవచించారు. "ప్రజలారా ! వినండి, మహిళల పట్ల సత్ప్రవర్తనకలిగి ఉండండి. ఎందుకంటే, వారు మీవద్ద బందీలవలె ఉన్నారు. విస్పష్టమయిన అవిధేయత వ్యక్తమయితే తప్ప స్త్రీలపట్ల కఠినంగా ప్రవర్తించే హక్కు భర్తకు ఏమాత్రం లేదు. ఒకవేళ వారు ఆ విధంగా ప్రవర్తిస్తే వారితో తాత్కాలికంగా లైంగిక సంబంధాలకు దూరంగా మెలగవచ్చు. దండించవలసివస్తే తీవ్రమయిన దెబ్బతగిలేలా కొట్టరాదు. తర్వాత మీరు చెప్పినట్లు నడుచుకున్నట్లయితే వారిని అనవసరంగా బాధించడానికి దారులు వెతకకండి, మీకు మీ భార్యలపై చెలాయించే కొన్ని హక్కులు ఉన్నాయి. వారు మీ పరుపులపైన మీకు ఇష్టంలేని వారిని మేను వాల్చనీయరాదు. వారు మీరు సహించని వారిని మీ ఇంటిలోనికి రానివ్వకూడదు. వారికి కొన్ని హక్కులు మీపై ఉన్నాయి. వారికి సరిగా ఆహారం సమకూర్చండి. కట్టుకోవడానికి మంచి వస్త్రాలు ఇవ్వండి. (రియాజుస్సాలిహీన్)

అంటే అన్నపానీయాలు, వస్త్రాలు దంపతుల మధ్య పరస్పరప్రేమానురాగాలను సన్నిహిత సహజీవన వాతావరణాన్ని ఏర్పరచుతాయి. ఈ వాతావరణం నెలకొనేందుకు దోహదపడే ఏర్పాట్లు చేయాలన్న మాట.

2. వీలయినంతవరకు భార్యపట్ల సదభిప్రాయం కలిగిఉండండి. ఆమెతో వ్యవహారంలో సహనం, ఓరిమి, విశాలహృదయత ప్రదర్శించండి. భార్య రూపం, అలవాట్లు, ప్రవర్తన, నేర్పు కార్యశీలతల దృష్ట్యా లోపం కలదయినా సహనం వహించండి. ఆమెలోని సద్గుణాలను దృష్టిలో ఉంచుకుని మన్నింపు, చూపోపు, త్యాగం, సర్దుకుపోవడం లాంటి విధానాలను అవలంబించండి. దైవాదేశం ప్రకారం, సర్దుకుపోవడంలోనే మేలుంది.

విశ్వాసులకు ఇలా బోధించబడింది : "మీకు (ఏ కారణం చేతనైనా, ఆమె) ఇష్టం లేకపోవచ్చు. మీకు ఇష్టం లేని వస్తువులోనే బహుశా దేవుడు మీ కొరకు ఎంతో మేలు పొందుపరచి ఉండవచ్చు. *(దివ్య ఖుర్‌ఆన్ - 4 : 19)*

ఈ భావాన్నే దైవప్రవక్త (సఅసం) ఒక హదీసులో ఇలా విశదీకరించారు.

"ఏ విశ్వాసీ, విశ్వాసురాలు అయినతన భార్యను అసహ్యించుకోకూడదు. ఆమె అలవాటొకటి అతనికి నచ్చకపోతే, ఆమె మరో గుణమయినా అతనికి నచ్చవచ్చు కదా."

ప్రతి స్త్రీలో ఏదో ఒక బలహీనత తప్పకుండా ఉంటుంది. భర్త తన భార్యలో ఏదయినా లోపం చూడగానే ఆమెనుంచి దృష్టి మరలించుకొని మనసు పాడు చేసుకుంటే ఇక ఏ కుటుంబంలో కూడా దాంపత్య సుఖసంతోషాలు లభించవు. అంచేత క్షమాగుణంతో మెలుగుతూ దైవం మీద భారంవేసి భార్యతో సంతోషంగా మనస్ఫూర్తిగా సర్దుకుపోవటానికి ప్రయత్నించడమే తెలివయినపని. అలాంటి స్త్రీ ద్వారా దేవుడు భర్తకు అతని హ్రస్వ దృష్టికి అందనంతటి మేళ్ళు కలిగించవచ్చు. ఉదాహరణకు స్త్రీలో ఉండే ధార్మిక, నైతిక సుగుణ సంపత్తి మూలాన ఆ కుటుంబానికంతటికీ ఆమె కారుణ్యంగా పరిణమించవచ్చు. లేదా ఆమె ద్వారా ప్రపంచానికే ప్రయోజనం చేకూర్చే, లోకం ఉన్నంతవరకు తండ్రి కోసం తరగని పుణ్యంగా (సదకయేజారియాగా) రూపొందగలిగే అత్యుత్తమ సంతానం కలగవచ్చు, లేదా స్త్రీ, భర్త సంస్కరణకు దోహదకారి అయి, స్వర్గ ప్రాప్తికి అతనికి సహాయకారిగా కూడా మారవచ్చు. అంతేకాక ఆమె అదృష్టంవల్ల దేవుడు ఆ పురుషునికి అపారమయిన సంపద, ఆనందమయమయిన జీవితం అనుగ్రహించనూవచ్చు. ఏమయినా, స్త్రీలోని ఏదో ఒక బాహ్యలోపం చూసి తొందరపాటుతో దాంపత్య సంబంధాన్ని విచ్ఛిన్నం చేసుకోకుండా క్రమక్రమంగా

గృహవాతావరణాన్ని సాధ్యమయినంతమేర ఆనందదాయకంగా చేసుకోవటానికే ప్రయత్నించాలి.

3. క్షమ, ఓర్పు కలిగి ఉండాలి. భార్య చేసే తప్పులను, పొరబాట్లను, తిరుగుబాట్లను క్షమిస్తూ ఉండాలి. స్త్రీ సహజంగా, ఉద్రేకం అధికమయి వివేకం కొరవడి ఉంటుంది. కాబట్టి సహనం, ప్రశాంతత, కరుణ, జాలి, దయార్ద్ర హృదయంతో ఆమెను సంస్కరించడానికి ప్రయత్నించాలి. శాంతం, సహనం వహిస్తూ ఆమెతో సర్దుకుపోతూ ఉండాలి. దేవుని హితవుఏమంటేః

"విశ్వాసులారా ! మీ భార్యల్లో కొందరు, మీ సంతతిలో కొందరు మీకు విరోధుల్లాంటి వారు. అయితే వారిపట్ల అప్రమత్తతతో మెలగండి. మీరు క్షమ, కరుణ, జాలి, మన్నింపువహిస్తే, నిస్సందేహంగా దేవుడుకూడా అమితంగా క్షమించే వాడు, అపారంగా కరుణించేవాడు". (అత్తగాబున్)

మహాప్రవక్త (సఅసం) అన్నారు ః

"స్త్రీలపట్ల సత్ప్రవర్తన కలిగి ఉండాలి. స్త్రీ ప్రక్కటెముకతో సృష్టించబడింది. ఆ ఎముకలో పై భాగం ఎక్కువగా వంకరయినది. దాన్ని తిన్నగా చేయాలని ప్రయత్నిస్తే విరిగిపోతుంది. దాన్ని అలాగే వదిలివేస్తే వంకరగానే ఉంటుంది. కాబట్టి స్త్రీలపట్ల సక్రమరీతిలో ప్రవర్తించాలి." (బుఖారి, ముస్లిమ్)

4. భార్యపట్ల సౌజన్యంగా మెలగాలి. ప్రేమాభిమానంతో ప్రవర్తించాలి. ప్రవక్త (సఅసం) అన్నారు, "తమ నడవడిలో అందరికంటే ఉత్తములైనవారే విశ్వాసంలో పరిపూర్ణులు. తమ భార్యల ఎడల అత్యధికంగా మంచిగా మెలిగేవారే, మీలో అందరికంటే మంచినడవడి కలవారు." (తిర్మిజి)

మనిషి నైతిక ప్రవర్తనను, సౌజన్యాన్ని గ్రహించడానికి అసలు గీటురాయి గృహజీవితం. ప్రతినిత్యం ఇంటివారితోనే తటస్థపడవలసి ఉంటుంది. స్వేచ్ఛగా ఉండే గృహజీవితంలోనే మానసిక, నైతిక సంబంధమైన ప్రతి అంశం ముందుకు వస్తుంది. వాస్తవమేమంటే ఇంటివారిపట్ల మంచినడవడి, ఔదార్యం, దయ కలిగి ఉండి, ఇంటివారికి మానసిక తృప్తిని కలిగిస్తూ, ప్రేమాభిమానాలతో ప్రవర్తించి నప్పుడే విశ్వాసి తన విశ్వాసంలో పరిపూర్ణుడవుతాడు.

హజ్రత్ ఆయిషా (రజి) అన్నారు, "నేను ప్రవక్త (సఅసం) ఇంట్లో బొమ్మలతో ఆడుకునే దాన్ని. నా స్నేహితురాండ్రు కూడా నాతో ఆడుకునేవారు. ప్రవక్త (సఅసం) రాగానే అందరూ తలో మూలా దాక్కునేవారు. ఆయన (సఅసం) ఒక్కొక్కర్ని వెదకి నాతో ఆడుకోడానికి నా వద్దకు పంపించేవారు."

(బుఖారి, ముస్లిమ్)

"ఒకసారి హజ్ ప్రయాణంలో హజ్రత్ సఫియ (రజి) ఒంటె కూలబడిపోయింది. ఆమె వెనుకపడిపోయారు. ఆమెకు దుఃఖం పొరలివచ్చింది. అది చూసిన దైవప్రవక్త(సఅసం) ఆగిపోయి తన దుప్పటి అంచుతో ఆమె కన్నీటిని తుడిచారు. ఆయన (సఅసం) అలా కన్నీటిని తుడుస్తూనే ఉన్నారు. ఆమె అప్రయత్నంగా దుఃఖిస్తూనే ఉన్నారు."

5. విశాల హృదయంతో జీవిత భాగస్వామి అవసరాలను తీర్చాలి. ఖర్చుచేయడంలో పిసినారితనం వహించకూడదు. తమ కష్టార్జితాన్ని ఇంటివారి కోసం వెచ్చించి సంతోషాన్ని, సంతృప్తిని పొందాలి. అన్నపానీయాలు, వస్త్రాలు పొందడం భార్య హక్కు. ఆ హక్కును సహృదయంతో, విశాల దృక్ప థంతో నెరవేర్చడం భర్త బాధ్యత. ఈ బాధ్యతను నిండు మనసుతో నిర్వహించడంవల్ల అతనికి ఇహలోకంలో ఆనందదాయకమైన వైవాహిక జీవనభాగ్యం లభించడమే కాకుండా, పరలోకంలో కూడా అతడు అపార పుణ్యఫలానికి అర్హుడౌతాడు.

దైవప్రవక్త (సఅసం) ఇలా అన్నారు :

"మీరు దైవమార్గంలో ఖర్చు చేసిన ఒక దీనార్, మీరు బానిసను స్వతంత్రునిగా చేయడానికి వెచ్చించిన దీనార్, మీరు ఒక నిరుపేదకు సదకా రూపంలో ఇచ్చిన దీనార్, మీరు మీ ఇంటివారి కోసం ఖర్చుపెట్టిన దీనార్ – వీటి అన్నిటిలో అధికమైన పుణ్యఫలం మీరు మీ ఇంటివారికై వెచ్చించిన దీనార్‌కే లభిస్తుంది."

6. భార్యకు ధార్మిక నియమాలు, నాగరికతలు నేర్పాలి. ధార్మికశిక్షణ ఇవ్వాలి. ఇస్లామీయ గుణసంపత్తితో తీర్చిదిద్దాలి. ఆమెను సుశిక్షితురాలిగా చేయడానికి, సంస్కరించడానికి సర్వప్రయత్నాలు చేయాలి. తద్వారా ఆమె ఒక ఉత్తమ ఇల్లాలుగా, ఆదర్శనీయమైన తల్లిగా, ఉత్తమ దైవభక్తురాలిగా తయారవుతుంది. తన గురుతరబాధ్యతల్ని సక్రమమయిన రీతిలో నిర్వహించగలుగుతుంది. దేవుని హితవు గమనించండిః

"విశ్వాసులారా! మిమ్మల్ని, మీ ఇంటివారినీ నరకాగ్ని నుండి మీరు కాపాడుకోండి."

మహాప్రవక్త (సఅసం) బయట ప్రచారప్రబోధాలు చేయటంలో ఎలా నిమగ్నులయ్యేవారో అలాగే ఇంట్లో కూడా ఆ బాధ్యతల్ని నిర్వహించేవారు. ఈ వాస్తవాన్నే సూచిస్తూ ఖుర్‌ఆన్‌లో ప్రవక్త(సఅసం) ధర్మపత్నులను సంబోధిస్తూ ఇలా చెప్పడం జరిగింది.

"మీ ఇళ్ళల్లో పఠించబడే దైవవచనాలు, వినిపించబడే వివేకవంతమైన

విషయాలు విని వాటిని జ్ఞప్తి ఉంచుకోండి."

ఖుర్‌ఆన్‌లో ప్రవక్త(సఅసం) ద్వారా విశ్వాసులకు హితవు చేయబడింది. "మీ ఇంటివారిని నమాజ్ చేయమని ఆజ్ఞాపించండి. మీరు కూడా ధాన్ని పూర్తిగా పాటించండి."

మహాప్రవక్త (సఅసం) ప్రవచించారు : "భర్త రాత్రి తన భార్యను మేల్కొలిపి ఇద్దరు కలిసి రెండు రకాత్‌లు నమాజ్ చేస్తున్నప్పుడు దైవనామస్మరణ చేసే పురుషుల్లో భర్తపేరు, దైవనామ స్మరణ చేసే స్త్రీలలో భార్య పేరు నమోదవుతుంది." (అబూదావూద్)

రెండవ ఖలీఫా హజ్రత్ ఉమర్(రజి) రాత్రి దేవుని సమ్ముఖంలో నిలబడి ఆరాధన చేసేవారు. ప్రాతఃకాల సమయం (సహర్ ) కాగానే సహధర్మచారిణిని మేల్కొలిపి, "లే, లేచి నమాజ్ చెయ్యి" అని చెప్పి "మీ ఇంటి వారిని నమాజ్ చేయడానికి ఆజ్ఞాపించండి, మీరు కూడా దాన్ని పూర్తిగా పాటించండి" అనే ఖుర్‌ఆన్ ఆయత్ కూడా పఠించేవారు.

7. ఒకవేళ భార్యలు ఒకరిని మించి ఉంటే అందరితో సమానంగా ప్రవర్తించాలి.

ప్రవక్త(సఅసం) తమ సతీమణులపట్ల సమానతను పాటించడంలో అత్యంత శ్రద్ధవహించారు. ప్రయాణంచేయవలసి వచ్చినప్పుడు చీటీవేసి, అందులో ఏ భార్యపేరు వస్తే ఆమెనే తనతో తీసుకువెళ్ళేవారు.

హజ్రత్ అబూ హురైరా (రజి) మహాప్రవక్త (సఅసం) బోధించినట్లు ఉల్లేఖించారుః "ఏ వ్యక్తికి అయితే ఇద్దరు భార్యలు ఉండి వారిపట్ల న్యాయం, సమానత్వం పాటించకపోయాడో ఆ వ్యక్తి ప్రళయదినాన సగం పడిపోయిన మొండెంతో వస్తాడు." (తిర్మిజి)

న్యాయం, సమానత్వం - అంటే వ్యవహారాల్లో, ప్రవర్తనలో సమాన వైఖరి కలిగి ఉండటం. అయితే ఒకే భార్యవైపు మానసికంగా మొగ్గు చూపటం, ప్రేమోద్రేకాలు అధికంగా కనబరచడం అనేది మానవుని అధీనంలో లేనటువంటి విషయం. దానిమీద దేవుడు ఎలాంటి చర్యా తీసుకోడు.

8. స్త్రీ భర్త పట్ల సహృదయతతో, సంతోషంతో, విధేయత పాటిస్తూ ఆ విధేయతలో సుఖసంతోషాలను పొందాలి. ఎందుకంటే అది దేవుని ఆజ్ఞ. దైవాజ్ఞను పాటించే స్త్రీయే దైవప్రీతిని పొందుతుంది. ఖుర్‌ఆన్‌లో ఉందిః

"శీలవతులైన స్త్రీలు (భర్తకు) విధేయులైనవారుగా ఉంటారు."

ప్రవక్త (సఅసం) అన్నారు :

"ఏ స్త్రీ అయినా భర్త అనుమతిలేనిదే (నఫిల్) రోజా పాటించకూడదు." (అబూదావూద్)

భర్తసేవ, విధేయతల ప్రాధాన్యతను వివరిస్తూ ప్రవక్త (సఅసం) స్త్రీలను హెచ్చరించారు :

"రెండు రకాల వ్యక్తుల నమాజులు వారి తలలను మించి పైకి పోజాలవు."

i యజమాని నుంచి పారిపోయిన బానిస తిరిగివచ్చేంతవరకు అతని నమాజు దైవ సన్నిధిని చేరదు.

ii భర్తకు అవిధేయురాలైన స్త్రీ తిరిగి విధేయురాలుగ మారేంతవరకు ఆమె నమాజు కూడా స్వీకరించబడదు. (అత్తర్‌గీబ్ వత్తర్‌హీబ్)

9. స్త్రీలు తమ శీలాన్ని కాపాడుకోవాలి. శీలాన్ని కళంకపరుస్తాయని అనుమానం ఉన్న సర్వవిషయాలకూ దూరంగా ఉండాలి. దేవుని హితవు ప్రధాన లక్ష్యం కూడా అదే. వైవాహిక జీవితం సుఖవంతంగా ఉండడానికి కూడా ఇది అత్యంతావశ్యకం. ఎందుకంటే భర్తహృదయంలో అలాంటి అనుమానం ఏదయినా కలిగినట్లయితే ఇక స్త్రీ చేసే సేవ, విధేయత, ఇతర మంచి పనులు ఏవికూడా భర్త మనస్సును ఆకట్టుకోలేవు. ఈ విషయంలో సాధారణమైన పొరపాటు వల్ల కూడా భర్త హృదయంలో అనుమానం రేకెత్తించడంలో షైతాన్ విజయం సాధిస్తాడు. కాబట్టి మానవుని బలహీనతను దృష్టిలో ఉంచుకొని అతి జాగ్రత్తగా మసలుకోవాలి. ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు :

"స్త్రీ అయిదువేళల నమాజు చేసుకొని, తన శీలాన్ని కాపాడుకొని, భర్తకు విధేయురాలయి ఉండినట్లయితే ఆమె తాను కోరిన ద్వారం గుండా స్వర్గంలో ప్రవేశించవచ్చు." (అత్తర్‌గీబ్ వత్తర్‌హీబ్)

10. భర్త అనుమతి, ఇష్టం లేకుండా స్త్రీ ఇంటినుండి బయటకు వెళ్ళరాదు. ఆమె భర్త ఇష్టపడని ఇండ్లకు పోవటంగాని, అతనికి ఇష్టంలేని వారిని తన ఇంటికి రానీయటంగాని చేయకూడదు. హజ్రత్ ముఆజ్ బిన్ జబల్ (రజి) ప్రవక్త (సఅసం) బోధించిన విషయాన్ని ఇలా తెలియజేశారు : "దేవునిపై విశ్వాసమున్న స్త్రీ భర్తకు ఇష్టంలేని వ్యక్తిని తన ఇంట్లోకి అనుమతించడం, భర్తకు ఇష్టంలేని సమయాల్లో ఇంటినుండి బయలుదేరటం, భర్త విషయంలో ఇతరుల మాటలు వినడం సమ్మతించరాని విషయాలు." (అత్తర్‌గీబ్ వత్తర్‌హీబ్)

అంటే భర్త విషయంలో అతని ఇష్టాన్ని సూచనలను బట్టే నడుచుకోవాలి, ఆచరించాలి. వాటికి విరుద్ధంగా ఇతరుల సలహాలను పాటించరాదు.

11. ఎల్లప్పుడూ వాక్కుతో, ఆచరణతో, అలవాట్లద్వారా సభ్యతా విధానాల ద్వారా భర్తను సంతోషపెట్టడానికి ప్రయత్నించాలి. ఆనందదాయకమైన సంసార జీవితంలోని రహస్యం కూడ ఇదే. దైవ అభీష్టాన్ని చూరగొనడానికి, స్వర్గప్రాప్తికి కూడ ఇదే మార్గం. ప్రవక్త (సఅసం) ప్రవచించారుః "స్త్రీ, తన భర్త తన పట్ల సంతోషంగా, ఇష్టుడుగా ఉన్న స్థితిలో మరణిస్తే ఆమె స్వర్గంలో ప్రవేశిస్తుంది." (తిర్మిజి)

"భర్త తన భార్యను లైంగిక అవసరార్థం పిలిచినప్పుడు ఆమె రాకపోతే, ఆ కారణంచేత భర్త రాత్రంతా కోపంతో గడిపితే, ఆ స్త్రీని దైవదూతలు ఉదయం వరకూ శపిస్తూ ఉంటారు." (బుఖారి, ముస్లిమ్)

12. భర్తను ప్రేమిస్తూ అతని సహచర్యాన్ని గౌరవించాలి. అది జీవన సౌందర్యానికి ఆధారం, జీవనమార్గంలో గొప్ప సహాయకారి. దేవుడు అనుగ్రహించిన ఈ మహాభాగ్యానికి ప్రతిగా దేవునికి కృతజ్ఞులై ఉండాలి. ఈ భాగ్యాన్ని కూడా మనస్ఫూర్తిగా గౌరవించాలి.

ఒక సందర్భంలో ప్రవక్త (సఅసం) అన్నారు : "ప్రేమించుకునే ఇద్దరికి వివాహం కంటే ఉత్తమమైన మార్గం మరొకటి లేదు."

హజ్రత్ సఫియా (రజి)కు ప్రవక్త(సఅసం)పట్ల అమితమైన ప్రేమానురాగాలు ఉండేవి. ఆయన (సఅసం) వ్యాధిగ్రస్తులైనప్పుడు ఎంతో హృదయవేదనతో అన్నారు, 'మీకు బదులు నేను వ్యాధిగ్రస్తురాలనైతే ఎంత బాగుండేది' అని. ప్రవక్త (సఅసం) ఇతర ధర్మపత్నులు హజ్రత్ సఫియా (రజి) తన ప్రేమను వ్యక్తపరచిన రీతిపట్ల ఆశ్చర్యంతో ఆమెవైపు చూశారు.

అప్పుడు ప్రవక్త(సఅసం), "ఇది నటన కాదు, ఈవిడ నిజమే చెపుతోంది" అని అన్నారు.

13. భర్త మేలును మరచిపోరాదు. అతనికి కృతజ్ఞులుగా ఉండాలి. అందరికంటే మీకు గొప్ప ఉపకారి మీ భర్తేకదా! అతను మిమ్మల్ని అన్నివిధాలా సంతోషపెట్టడంలో నిమగ్నమై ఉంటాడు. మీ అవసరాలన్నీ తీర్చి, మీకు అన్ని విధాల సౌఖ్యాన్ని కలిగించి ఆనందం పొందుతాడు.

హజ్రత్ అస్మా (రజి) అంటారుః

"ఒకసారి ప్రవక్త (సఅసం) నా వద్దకు వచ్చారు. నేనప్పుడు పక్కింటి స్నేహితురాండ్రతో ఉన్నాను. ఆయన(సఅసం) మాకు సలామ్ చేసి అన్నారుః మేలుచేసిన వారిపట్ల మీరు కృతఘ్నులుగా ఉండకూడదు. మీలో ఒకరు వివాహం కాకుండా కొన్నాళ్ళపాటు తల్లిదండ్రులవద్ద ఉంటారు - తర్వాత దేవుడు ఆమెకు భర్తను ప్రసాదిస్తాడు. ఆ తర్వాత దేవుడు ఆమెకు సంతానాన్ని ఇస్తాడు. (ఇన్ని ఉపకారాలున్నప్పటికీ) ఏదో ఒక విషయంలో భర్తపైన కోపం వస్తే ఆమె "మీవల్ల నాకు జరిగిన మేలు ఏముందనీ?" అని దెప్పిపొడుస్తుంది."

(అల్ అదబుల్ ముఫ్రద్)

భర్తచేసిన మేలు మరచి కృతఘ్నురాలయిన స్త్రీని మందలిస్తూ ప్రవక్త (సఅసం) అన్నారు ః "దేవుడు ప్రళయదినాన భర్తకు కృతఘ్నురాలయ్యే స్త్రీవైపు కన్నెత్తయినా చూడడు. నిజానికి స్త్రీ ఎలాంటి స్థితిలోనూ భర్తపైన ఆధారపడకుండా ఉండజాలదు." (నసాయి)

14. పతిసేవలో ఆనందాన్ని పొందాలి. వీలైనంతవరకు తాను కష్టపడైనాసరే భర్తను సుఖపెట్టాలి. సర్వవిధాలుగా పతి సేవ చేసి అతని హృదయాన్ని ఆకట్టుకోవటానికి ప్రయత్నించాలి.

హ్రజత్ ఆయిషా (రజి) తన స్వహస్తాలతో ప్రవక్త (సఅసం) దుస్తులు ఉతికేవారు. తలకు నూనె రాసి దువ్వేవారు, సువాసన రాసేవారు. ఇలాగే ఇతర సహబియాలు కూడా ఆచరించేవారు.

ఒకసారి ప్రవక్త (సఅసం) అన్నారు ః ఒకమనిషి మరో మనిషి ముందు సజ్దాచేయడం ధర్మసమ్మతం కాదు. ఒకవేళ అలా చేయడానికి అనుమతి ఉంటే భర్త ముందు సజ్దా చేయమని భార్యకు ఆజ్ఞ ఇవ్వబడేది.

భార్యపై భర్తకున్న హక్కు మహోత్కృష్టమైనది. అనేక గాయాలతో రక్తసిక్తమై ఉన్న భర్త శరీరాన్ని భార్య నాలుకతో నాకినప్పటికీ భార్యపై ఆయనకున్న హక్కు పూర్తిగా నెరవేరజాలదు. (ముస్నదె అహ్మద్)

15. భర్త గృహాన్ని, ఇంట్లో వస్తుసామగ్రిని జాగ్రత్తచెయ్యడం, భార్య బాధ్యతల్లో ఒకటి. పెళ్ళయిన తర్వాత భర్త ఇంటిని సొంత ఇల్లులా భావించాలి. భర్త ఇంటి శోభను పెంచడంలో అతని గౌరవప్రతిష్టలను ఇనుమడింప చేయటంలో, అతని పిల్లల భవిష్యత్తును తీర్చిదిద్దటంలో యుక్తి, నేర్పు కనబరచాలి. పొదుపుతో అతని ధనాన్ని వెచ్చించాలి. భర్త ప్రగతి, సుఖాలను తన ప్రగతి, సుఖాలుగా భావించాలి.

ఖురైష్ మహిళలను ప్రశంసిస్తూ ప్రవక్త (సఅసం) అన్నారు :

"ఖురైష్ మహిళలు ఎంత మంచివారు! వారు పిల్లలమీద అమితమైన దయచూపుతారు, భర్తగృహాన్ని అతి జాగ్రత్తగా కాపాడుతారు." (బుఖారి)

ప్రవక్త (సఅసం) శీలవతియైన భార్య సుగుణాలను విశదీకరిస్తూ అన్నారు: "దైవభీతి తర్వాత ఒక విశ్వాసికి, శీలవతి అయిన భార్యే అన్నిటికంటే ఎక్కువ ఉపయోగకరమైన, ఉత్తమోత్తమమైన పెన్నిధి. అతడు ఏదైనా పని చెప్పినప్పుడు ఆమె దాన్ని ఆనందంగా నిర్వర్తించాలి. అతడు ఆమె వైపు దృష్టి సారించినప్పుడు ఆమె అతన్ని సంతోషపెట్టాలి. అతడు ఆమెపై గల నమ్మకంతో ఏదైనా ప్రమాణం చేసినప్పుడు దాన్ని ఆమె నెరవేర్చాలి. అతడు ఎక్కడికైనా వెళ్ళినప్పుడు అతను లేనప్పుడు ఆమె తన శీలాన్నీ, ప్రతిష్టను కాపాడుకుంటూ, అతని సిరిసంపదల పరిరక్షణలో భర్తశ్రేయోభిలాషిగా, విశ్వసనీయురాలిగా మెలగాలి." (ఇబ్నెమాజ)

16. పరిశుభ్రత, పొందిక, అలంకరణ ఇత్యాది విషయాలపట్ల భార్య జాగ్రత్తవహించాలి. గృహాన్ని కూడా పరిశుభ్రంగా ఉంచాలి. ప్రతి వస్తువును పొందికగా అలంకరించి నేర్పుగా ఉపయోగించాలి. పరిశుభ్రమైన గృహం, చక్కగ అలంకరించబడిన శుభ్రమైన గదులు, గృహకృత్యాల్లో చాకచక్యం, అందంగా అలంకరించుకొన్న భార్య చిరునవ్వు – వీటివల్ల గృహ జీవనం ప్రేమ, అనురాగం, సౌభాగ్యం, శుభాలతో శోభిల్లడమే కాకుండా భార్యకు తన మోక్షసాధనకోసం, దైవప్రీతి పొందటం కోసం కూడా ఇదే మార్గం అవుతుంది.

ఒకసారి హజ్రత్ ఆయిషా (రజి) ఉస్మాన్ బిన్ మజ్ఊన్ (రజి) అర్ధాంగిని కలిశారు. ఉస్మాన్ (రజి) సతీమణి ఎలాంటి అలంకరణలు లేకుండా ఎంతో నిరాడంబరమైన దుస్తులు ధరించి ఉండడం చూసి హజ్రత్ ఆయిషా (రజి) చాలా ఆశ్చర్యపోతూ "ఏమమ్మా ఉస్మాన్ గారు ప్రయాణమై ఎక్కడికైనా బయటకెళ్ళి ఉన్నారా?" అని అడిగారు. గృహిణులు తమ భర్తల కోసమే అలంకరణ చేసుకోవడం ఎంత అభిలషణీయమో ఆమె వ్యక్తపరచిన ఆశ్చర్యంవల్ల విదితమౌతోంది. ఒకసారి ఒక సహాబియా ప్రవక్త (సఅసం) దగ్గరికి వచ్చారు. ఆమె తన చేతులకు బంగారు గాజులు ధరించి ఉన్నారు. ప్రవక్త (సఅసం) అలా ధరించకూడదని అన్నప్పుడు, ఆమె ఇలా అన్నారు, "దైవప్రవక్తా! స్త్రీ భర్త కోసం అలంకరణ చేసుకోకపోతే ఆమె అతని అనురాగానికి దూరమైపోతుంది." (నసాయి)

# 3. సంతానం – వరప్రసాదం

1. సంతానం దేవుని బహుమానం అని గ్రహించాలి. వారు పుట్టినందుకు సంతోషపడాలి. ఆ సందర్భంలో ఒకరికొకరు శుభాకాంక్షలు తెలుపుకోవాలి. శ్రేయస్సు, సౌభాగ్యాల దీవెనలతో పరామర్శించుకోవాలి. దేవుడు మీకు తన దాసుణ్ణి పోషించే అవకాశం ఇచ్చాడు. మీరు మీ వెనుక ధర్మానికి, ఇహలోక జీవితానికి వారసుణ్ణి విడిచివెళ్ళే అవకాశం ప్రసాదించినందుకు దేవునికి కృతజ్ఞతలు అర్పించుకోవాలి.

2. సంతానం లేకపోతే ఉత్తమ సంతానం కలగాలని దేవుణ్ణి వేడుకోవాలి. దైవప్రవక్త హజ్రత్ జకరియ్యా (అలై) ఉత్తమ సంతానానికి దుఆ చేసినట్లుగా మనమూ వేడుకోవాలి.

رَبِّ هَبْ لِي مِن لَّدُنكَ ذُرِّيَّةً طَيِّبَةً إِنَّكَ سَمِيعُ الدُّعَاءِ (آل عمران)

"రబ్బి హబ్ లీ మిల్లదున్ క జ్జురియతన్ తయ్యిబతన్ ఇన్నక సమీ ఉద్దుఆ." (ఆలి ఇమ్రాన్)

నా ప్రభూ ! నీవు నాకు నీ సన్నిధి నుండి పవిత్రమైన సంతానాన్ని ప్రసాదించు. నిస్సందేహంగా నీవు దుఆను ఆలకించేవాడవు.

3. సంతానం కలిగినందుకు ఏ పరిస్థితిలోనూ బాధపడరాదు. ఆర్థిక ఇబ్బంది, అనారోగ్యం లేక ఇతర కారణాలవల్ల సంతానం పుట్టుక పట్ల బాధపడటం, సంతానాన్ని ఒక భారంగా భావించడం మానుకోవాలి.

4. పిల్లల్ని చేతులారా చంపుకోరాదు. పుట్టుకకు ముందు లేక పుట్టిన తర్వాత సంతానాన్ని సంహరించడం అతి క్రూరమైన చర్య. భయంకరమైన అత్యాచారం, అత్యంత పిరికితనం, ఇహపరలోకాల వినాశం. దేవుని హితవు గమనించండి-

"ఎవరైతే తమ సంతానాన్ని అజ్ఞానంవల్ల చంపివేశారో వారు అతి తీవ్రమయిన నష్టంలో పడ్డారు." (అల్ అన్ ఆమ్)

దేవుడు మానవ సంకుచిత దృష్టికి తగ్గట్టుగా, హృదయానికి హత్తుకునే సమాధానమిస్తూ సంతానాన్ని హత్యచేయడాన్ని నిషేధించాడు.

"బీదరికం, ఆకలిదప్పుల భయంతో మీ సంతానాన్ని హత్యచేయకండి. మేము వారికీ ఉపాధినిస్తాము, మీకూ ఉపాధినిస్తాము, వాస్తవమేమంటే - సంతానాన్ని హత్యచేయడం అత్యంత ఘోరమైన పాపం." (బనీ ఇస్రాయీల్)

ఒకసారి ఒక సహచరుడు మహాప్రవక్తను అడిగారు, "ఓ ప్రవక్తా ! అన్నిటి కంటె గొప్పపాపమేది?" "ఇతరుల్ని దేవునికి సమానులుగా చేయడం (షిర్క్ = బహుదైవారాధన)" అని జవాబిచ్చారు. "దాని తర్వాత ఏమిటని" అడుగగా "తల్లిదండ్రులకు అవిధేయులుగా మెలగడం" అని జవాబిచ్చారు. ఆ తరువాత ఏమిటని అడుగగా "తన భోజనంలో పాలుపంచుకుంటుంది అనే భావంతో తన సంతానాన్ని చంపివేయడం" అని జవాబిచ్చారు.

5. జనన సమయంలో, జన్మనిచ్చే స్త్రీవద్ద ఆయతుల్ కుర్సీ, అల్ ఆరాఫ్ సూరాలోని రెండు ఆయత్‌లు పఠించాలి. అల్ ఫలఖ్ సూరా, అన్ నాస్ సూరాలు చదివి పైన ఊదాలి.

ఆయతుల్ కుర్సీ భావం : అల్లాహ్ తప్ప ఆరాధ్యదైవం ఎవ్వడూ లేడు. సకల చరాచర సృష్టికి మూలాధారం అయిన ఆయన సజీవుడు, నిత్యుడు, అనంతుడు. ఆయన నిదురపోడు, ఆయనకు కునుకురాదు. భూమ్యాకాశాల్లో ఉన్న సమస్తమూ ఆయనదే. ఆయన సమ్ముఖంలో, ఆయన అనుజ్ఞలేకుండా సిఫారసు చెయ్యగలవాడెవ్వడు? ప్రజలముందు ఉన్నదాన్ని ఆయన ఎరుగు; వారికి గుప్తంగా ఉన్నదీ ఆయనకు తెలుసు. ఆయన స్వయంగా తెలియజెయ్యాలని అభిలషిస్తే తప్ప ఆయనకున్న జ్ఞాన విశేషాల్లోని ఏ విషయమూ వారి (ప్రజల) గ్రహణపరిధిలోకి రాదు. ఆయన రాజ్యాధికారం ఆకాశాలను, భూమిని పరివేష్టించి ఉంది. వాటి సంరక్షణ ఆయనకు ఎంతమాత్రం అలసట కలిగించదు. ఆయన మాత్రమే సర్వాధికుడు, సర్వోత్తముడు. *(అల్ బఖర : 255)*

ఆరాఫ్ సూరా రెండు ఆయత్‌లు -

"వాస్తవమేమంటే - దేవుడే మీ పరిపోషకుడు. ఆయన ఆకాశాలను భూమినీ ఆరుదినాల్లో సృష్టించాడు. ఆ తరువాత ఆయన తన అధికారాసనాన్ని అలంకరించాడు. ఆయనే రాత్రిని పగటిపైన కప్పివేస్తాడు. తర్వాత పగలు రాత్రి వెనుక పరుగెత్తుకువస్తుంది. ఆయనే సూర్య, చంద్ర నక్షత్రాలను సృష్టించాడు. అవి ఆయన ఆజ్ఞకుబద్ధులై కార్యనిర్వహణలో నిమగ్నమై ఉన్నాయి. బాగా వినండి, పుట్టించడం ఆయనపనే. ఆజ్ఞాపించడం ఆయనకే చెల్లుతుంది.

సర్వలోకాల స్వామి ప్రభువయిన అల్లాహ్ ఎంత శుభకరుడు ! మీ ప్రభువు సమక్షంలో విలపిస్తూ చాటు మాటుగా అర్థించండి. నిస్సందేహంగా ఆయన హద్దుల్ని అతిక్రమించేవారిని ఇష్టపడడు." (ఆరాఫ్ : 54, 55)

6. జన్మించిన తరువాత స్నానం చేయించి కుడి చెవిలో అజాన్, ఎడమ చెవిలో ఇఖామత్ పలకాలి. హజ్రత్ హుసైన్ (రజి) జన్మించినప్పుడు ప్రవక్త (సఅసం) ఆయన చెవిలో అజాన్, ఇఖామత్‌లు పలికారు." (త్రిబాని)

ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు :

పిల్లవాడు జన్మించినప్పుడు అతడు ఆ బాలుని కుడిచెవిలో అజాన్ ఎడమ చెవిలో ఇఖామత్ పలికితే ఆ బాలుడు "ఉమ్ముస్సిబ్‌యాన్" (ఓ విధమయిన మూర్ఛరోగం) బాధనుండి రక్షించబడతాడు. (అబూయాలా ఇబ్నెసని)

పుట్టగానే శిశువు చెవిలో దేవుడి పేరు, ప్రవక్త(సఅసం) పేరు వినిపించడంలో ఎంతో యుక్తి ఉంది. అల్లామ ఇబ్నె కయ్యిమ్ తన గ్రంథం "తొహ్‌ఫతుల్‌వదూద్" లో ఇలా అంటున్నారు:

దాని భావమేమిటంటే, మానవుని చెవుల్లో మొట్టమొదట దేవుని ఘనత, మహోత్కృష్టతలకు సంబంధించిన శబ్దం చేరాలి. ఆ విధంగా విన్నటువంటి సాక్ష్యాన్ని ఆ తరువాత అతను భావస్ఫోరకంగా ఆచరించి ఇస్లామ్‌లో ప్రవేశిస్తాడు. ఏ విధంగానైతే మరణ సమయంలో "తౌహీద్ " వాక్యాలను బోధిస్తారో అదే విధంగా ఈ బోధన పుట్టిన రోజునుండే ఆరంభించాలి. అజాన్, ఇఖామత్‌ల వలన రెండవ ఉపయోగం - పుట్టిన వెంటనే మానవుణ్ణి పరీక్షకు గురిచెయ్యాలని పొంచి ఉన్న షైతాన్ అజాన్ వినగానే పారిపోతాడు. ఇలా షైతాన్ సందేశానికి ముందే శిశువుకు ఇస్లామ్, దైవారాధనల సందేశం ఇవ్వబడుతుంది.

7. అజాన్, ఇఖామత్‌ల తరువాత సత్ప్రవర్తనగల పురుషునితోగాని లేక స్త్రీతోగాని ఖర్జూరాన్ని నమిలించి పిల్లవాని తలకు రాయాలి. అతని శుభశ్రేయస్సుల కోసం దుఆ చేయించాలి.

హజ్రత్ అస్మా (రజి) అంటారు : అబ్దుల్లాహ్ ఇబ్నె జుబైర్ (రజి) జనన మొందినప్పుడు నేను అతన్ని ప్రవక్త (సఅసం) ఒడిలో వేశాను. ఆయన (సఅసం) ఖర్జూరం తెప్పించి నమిలి అబ్దుల్లాహ్ ఇబ్నె జుబైర్ (రజి) నోటికి అందించారు. ఖర్జూరాన్ని అతని మాడు మీద రుద్దారు. తర్వాత బాలుని

శుభశ్రేయస్సుల కోసం దుఆ చేశారు.

హజ్రత్ ఆయిషా (రజి) ఇలా తెలుపుతున్నారు : ప్రజలు ప్రవక్త (సఅసం) వద్దకు పిల్లలను తీసుకొచ్చేవారు, ఆయన (సఅసం) తహ్నీక్ చేసేవారు. (ఖర్జూరం మొదలైన వాటిని మెత్తగా నమిలి పిల్లవాని మాడుమీద రుద్దడాన్ని తహ్నీక్ అంటారు). తర్వాత వారి శుభశ్రేయస్సులకై దుఆ చేసేవారు. (ముస్లిమ్)

హజ్రత్ ఇమామ్ అహ్మద్ ఇబ్నె హంబల్ (రహ్) ఇంట్లో పిల్లవాడు పుట్టాడు. అప్పుడు ఆయన ఆ పిల్లవానికి తహ్నీక్ చేయడానికి తమ ఇంట్లో ఉన్న మక్కా ఖర్జూరాన్ని తెప్పించారు. శీలవతి అయిన బీబీ ఉమ్మె అలీ (రహ్)ని తహ్నీక్ చేయమని అభ్యర్థించారు.

8. పిల్లవానికి మంచిపేరు పెట్టాలి. ప్రవక్తల పేర్లుగాని లేక దేవుని పేరు అయితే దానికి ముందు 'అబ్ద్' (దాసుడు) అని కలిపి పేరు పెట్టాలి. ఉదాహరణకు అబ్దుల్లాహ్, అబ్దుర్రహ్మాన్ మొదలైనవి.

ప్రవక్త (సఅసం) ప్రవచించారు : "ప్రళయదినాన మీరు మీ పేర్లతోనే పిలువబడతారు. అంచేత మంచి పేర్లు పెట్టుకోండి." (అబూదావూద్)

ప్రవక్త (సఅసం) ఈ విషయం కూడా తెలియజేశారు : దేవునికి మీ పేర్లలో అన్నిటికంటే అబ్దుల్లాహ్, అబ్దుర్రహ్మాన్ అనే పేర్లు ఎక్కువ ఇష్టం. ఆయన (సఅసం) ఇంకా ఇలా అన్నారు : "ప్రవక్తల పేర్లవంటి పేర్లు పెట్టుకోండి"

ఆయన ఇలా అన్నారు : "నా నామంతో పేరు పెట్టుకోండి. నా సంతానాన్నిబట్టి నా పేరు (కునియత్) పెట్టుకోరాదు." (బుఖారి)

9. ఒకవేళ అజ్ఞానంతో తప్పుడు పేరుపెట్టుకుంటే దాన్ని మార్చి మంచిపేరు పెట్టుకోండి. ప్రవక్త (సఅసం) తప్పుడు పేర్లను మార్చివేసేవారు. హజ్రత్ ఉమర్ (రజి) ఒక కూతురు పేరు ఆసియా. ప్రవక్త (సఅసం) దాన్ని మార్చి జమీలా అని పెట్టారు. (ముస్లిమ్)

హజ్రత్ జైనబ్ అబూ సల్మా (రజి) కూతురు ఆమె పేరు బర్ర. బర్ర అంటే పవిత్రమైనది. ప్రవక్త (సఅసం) అది విని "నీకు నీవే పవిత్రురాలవని చాటుకుంటున్నావా?" అన్నారు. అప్పుడు ప్రజలు, "అయితే ఏమిపేరు పెట్టమంటారు?" అని అడిగారు. దానికి ప్రవక్త (సఅసం) "జైనబ్ అని పేరు పెట్టండి" అని చెప్పారు. (అబూదావూద్)

10. జననం తరువాత ఏడవరోజు అఖీఖ చేయాలి. అబ్బాయి అయితే రెండు మేకలు, అమ్మాయి అయితే ఒక మేకతో అఖీఖ చేయాలి. అయితే అబ్బాయికి రెండు మేకలతో చేయడం తప్పని సరి కాదు. ఒక మేకతో కూడా చేయవచ్చును. పిల్లవాని వెంట్రుకలు తీయించి దానికి సమానంగా బంగారుకాని, వెండికాని తూచి దానం చేయాలి.

ప్రవక్త (సఅసం) అన్నారు : ఏడవదినం పిల్లవానికి పేరు పెట్టాలి. అతని వెంట్రుకలు తీసివేయాలి. ఆ సందర్భంలో అఖీఖా చేయాలి. (తిర్మిజి)

11. ఏడవనాడు సున్నతి (ఖత్నా) కూడా చేయించాలి. కానీ ఏ కారణంచేతనైనా చేయించకపోతే ఏడు సంవత్సరాలలోపల తప్పకుండా చేయించాలి. ఖత్నా ఇస్లామ్ చిహ్నం.

12. పిల్లవాడు మాట్లాడటం ఆరంభించగానే మొట్టమొదట "లా ఇలాహ ఇల్లల్లాహ" వాక్యాన్ని నేర్పించాలి.

ప్రవక్త (సఅసం) అన్నారు :

"మీ సంతానం మాట్లాడటం మొదలుపెట్టినప్పుడు అతనికి 'లా ఇలాహ ఇల్లల్లాహ' నేర్పించండి. ఇక ఎప్పుడు చనిపోతాడో ఏమో దాన్ని గురించి ఆలోచించకండి. పాలపళ్లు ఊడిపోగానే 'నమాజ్' చేయడానికి ఆజ్ఞాపించండి. (ఇబ్నె సిని)

మరో హదీస్‌లో ఇలా ఉంది.

ప్రవక్త(సఅసం) కుటుంబంలో పిల్లవాడు మాట్లాడటం ప్రారంభించగానే ఆయన (సఅసం) అతనికి అల్ ఫుర్ఖాన్ సూరాలోని రెండవ ఆయత్ నేర్పించేవారు. అందులో దేవుని ఏకత్వం (తౌహీద్) పూర్తిగా సమీకృతమయి ఉంది.

భూమ్యాకాశాల సామ్రాజ్యానికి యజమాని దేవుడే. ఆయన ఎవరినీ కుమారునిగా చేసుకోలేదు. ఆయన సామ్రాజ్యంలో ఇంకెవ్వరూ ఆయనకు భాగస్వాములుకారు. ఆయన ప్రతి వస్తువును సృష్టించాడు. తర్వాత వాటికి తగిన విధి నియమాలను నిర్ణయించాడు. *(అల్ ఫుర్కాన్ : 2)*

13. పిల్లవానికి తల్లి తన పాలు కూడ త్రాగించాలి. అది తల్లిపై బిడ్డకు ఉన్న హక్కు.

తల్లి చేసిన ఈ మేలునే జ్ఞాపకంచేసి సంతానం తల్లిపట్ల అసాధారణమైన

సత్ప్రవర్తన కల్గి ఉండాలని నొక్కి చెప్పింది ఖుర్ఆన్. తల్లి తన ఒక్కొక్క చుక్క పాలతో పాటు బిడ్డకు తౌహీద్ ప్రబోధం, ప్రవక్త (సఅసం)పై ప్రేమానురాగాలు, ఇస్లామ్ ధర్మంపట్ల శ్రద్ధాసక్తుల్ని రంగరించి త్రాగించాలి. ఈ ప్రేమాసక్తులు అతని హృదయాంతరాళంలో పాదుకునేలా చేయడానికి ప్రయత్నించాలి. పిల్లవాణ్ణి పెంచే బాధ్యతను పని మనిషి (ఆయా)కి అప్పగించి తన భారాన్ని సులభం చేసుకోరాదు. ఆనందదాయకమైన ఈ ధార్మిక బాధ్యతను స్వయంగా నిర్వహించి హృదయ ప్రశాంతతను, ఆహ్లాదాన్ని పొందాలి.

14. పిల్లల్ని భయపెట్టడం విడనాడాలి. పిన్నవయస్సులోని ఈ భయం జీవితమంతా మనస్సుపై ముద్రితమయి ఉంటుంది. ఇటువంటి పిల్లలు సామాన్యంగా జీవితాల్లో ఎలాంటి గొప్పకార్యాలూ చేయడానికి అర్హులుకారు.

15. సంతానాన్ని మాట మాటకూ గద్దించడం ప్రతి విషయంలోనూ విదిలించడం, తిట్టడం పూర్తిగా విసర్జించాలి. వారి పొరపాట్లకు చికాకు పడడం, అసహ్యించుకోవడం బదులు యుక్తితో, నేర్పుతో, సుశిక్షితులుగా చేయడానికి ప్రేమానురాగాలతో ప్రయత్నించాలి. మీ ప్రవర్తన ద్వారా ఎలాంటి ధర్మవిరుద్ధమైన విషయాన్ని కూడా మీరు భరించరనే భీతిని పిల్లల మనస్సులో కలిగించాలి.

16. సంతానంపట్ల ఎల్లప్పుడు ప్రేమ, వాత్సల్యం, మృదుత్వం కలిగి ఉండాలి. అవసరమైనప్పుడు తాహతుకు తగినట్లు వారి అవసరాలు తీర్చి వారిని సంతోషపెట్టాలి. వారిని వినయవిధేయతలకు అలవాటుపడేలా తయారు చేయాలి. ఒకసారి హజ్రత్ ముఆవియా (రజి) అహనఫ్ బిన్ ఖైస్ (రజి) ను అడిగారు : "సంతానం పట్ల ఎలా ప్రవర్తించాలి?" అని.

అహనఫ్ బిన్ ఖైస్ (రజి) ఇలా అన్నారు : "అమీరుల్ మోమినీన్! సంతానం మన హృదయాల ఫలాలు, నడుముకు ఊతంలాంటివారు. వారికి మనం భూమిలాంటి వారం. ఎందుకంటే భూమి అత్యంత మృదువైనది. హాని కలిగించనిది. మన ఉనికి వారికి ఆకాశంవలె నీడ వంటిది. వారివల్లనే మనకు గొప్ప గొప్ప కార్యాలు చేయడానికి ధైర్యం కలుగుతుంది. అందువల్ల వారు మిమ్మల్ని ఏదైనా అడిగితే పుష్కలంగా ఇవ్వండి. ఒకవేళ వారి మనస్సుకు ఏదైనా బాధకలిగితే దాన్ని దూరం చేయండి. ఫలితంగా వారు మిమ్మల్ని ప్రేమిస్తారు. అనురాగంతో చూస్తారు. తండ్రిగా మీ ప్రయత్నాలను సమ్మతిస్తారు. మీరు వారికి భరించరాని భారంగా ఎన్నటికీ మారరాదు. అలా చేస్తే వారికి మీ జీవితం అంటే

వినుగెత్తి మీ మరణాన్ని కోరుతూ మీ దగ్గరకు రావడానికే అసహ్యించుకుంటారు."

హజ్రత్ ముఆవియా (రజి) విజ్ఞతతో కూడిన ఈ మాటలు విని ఎంతో ప్రభావితులయ్యారు. ఇలా అన్నారు : అహ్నఫ్ ! దేవుని సాక్షిగా ! మీరు నా దగ్గరకు వచ్చి కూర్చున్న సమయంలో నేను యజీదుపై అత్యంత కోపంతో ఉన్నాను. హజ్రత్ అహ్నఫ్ (రజి) వెళ్ళిపోయిన తరువాత హజ్రత్ ముఆవియా (రజి) కోపం చల్లారిపోయింది. యజీద్ అంటే ఇష్టపడ్డారు. అప్పటికప్పుడే యజీద్‌కు రెండు వందల దిర్హమ్‌ల డబ్బు రెండు వందల జతలు (దుస్తులు) పంపించారు. ఈ బహుమతులు చేరిన తర్వాత యజీద్ వాటిని రెండు సమ భాగాలుగా చేసి వంద దిర్హమ్‌లు, వంద జతలు హజ్రత్ అహ్నఫ్ ఇబ్నె ఖైస్ (రజి) సన్నిధికి పంపించారు.

17. ప్రేమపూర్వకంగా చిన్నపిల్లల తలను చేతితో నిమరాలి. వారిని ఒడిలోకి తీసుకోవాలి. ముద్దాడాలి. వారిపట్ల సంతోషపూర్వకంగా ప్రవర్తించాలి. ఎల్లప్పుడు గద్దిస్తూ, కఠినంగా ప్రవర్తించే అధికారిగా ఉండకూడదు. ఈ వైఖరివల్ల పిల్లల హృదయంలో తల్లిదండ్రుల పట్ల ప్రేమోద్వేగం, అనురాగం కలుగదు. వారిలో ఆత్మవిశ్వాసం కూడా జనించదు. వారి స్వాభావికమైన పెరుగుదల మీద కూడా మంచి ప్రభావం పడదు.

ఒకసారి ఇక్‌రా ఇబ్నె హాబిస్ (రజి) ప్రవక్త (సఅసం) వద్దకు వచ్చారు. ఆ తరుణంలో ప్రవక్త (సఅసం) హజ్రత్ హసన్ (రజి)ను ముద్దాడుతున్నారు. ఇక్‌రా చాలా ఆశ్చర్యపోయి,

"ఓ దైవప్రవక్తా ! మీరుకూడ పిల్లల్ని ముద్దాడుతారా! నాకు పది మంది పిల్లలు ఉన్నారు. కానీ నేనెప్పుడూ ఒక్కర్ని కూడా ముద్దుపెట్టుకోలేదు" అన్నారు. దానికి మహాప్రవక్త (సఅసం) ఇక్‌రా వైపు కన్నెత్తి చూసి, "ఒకవేళ దేవుడు నీ హృదయంనుండి కరుణ, వాత్సల్యం తీసివేస్తే దానికి నేనేం చెయ్యను?" అన్నారు.

ఫారుక్ ఆజం (రజి) కాలంలో ఆమిర్ ఒక ముఖ్య పదవిలో ఉండేవారు. ఒకసారి హజ్రత్ ఉమర్ (రజి)ను కలుసుకోడానికి ఆయన ఇంటికి వచ్చారు. అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) పడుకొని ఉన్నారు. పిల్లలు ఆయన ఛాతిపై ఎక్కి ఆడుకుంటున్నారు. ఆ దృశ్యం చూసిన హజ్రత్ ఆమిర్‌కు, అది అమర్యాదగా

తోచింది. అమీరుల్ మోమినీన్ అతని ముఖ కవళికలను గ్రహించి అతని అయిష్టతను గ్రహించారు.

హజ్రత్ ఆమిర్‌తో అన్నారు :

"మీ పిల్లలతో మీ ప్రవర్తన ఎలా ఉంటుందో చెప్పండి"

ఆమిర్‌కు అవకాశం దొరికింది :

వెంటనే అన్నారు :

"అమీరుల్ మోమినీన్ ! నేను ఇంట్లోకి ప్రవేశించగానే ఇంటివారిలో భీతావహం ఏర్పడుతుంది. అందరూ ఊపిరి బిగబట్టి మౌనంగా ఉంటారు" దానికి హజ్రత్ ఉమర్ (రజి) ఎంతో ఆవేదనతో అన్నారు:

"ఆమిర్, మీరు ముహమ్మద్ అనుచర సమాజం పుత్రులై కూడా మీకు ఒక విశ్వాసి తన ఇంటి వారితో ఎలా మృదువుగా, ప్రేమగా నడచుకోవాలో తెలియదే!" అని బాధపడ్డారు.

18. సంతానాన్ని మంచి విద్య, శిక్షణలతో తీర్చిదిద్దడానికి పూర్తి ఏకాగ్రతతో ప్రయత్నించాలి. ఈ మార్గంలో ఎంత పెద్ద త్యాగం చేయాల్సి వచ్చినా వెనుకాడరాదు. ఇది మన ధార్మిక బాధ్యత కూడా. సంతానం పట్ల మనం చేసే గొప్పమేలు కూడా ఇదే. మన కోసం మనం చేసుకునే గొప్పమేలు కూడా ఇదే. ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది :

"విశ్వాసులారా ! మిమ్మల్నీ, మీ ఇంటివారినీ మీరు నరకాగ్ని నుండి రక్షించుకోండి."

నరకాగ్నినుండి రక్షణపొందే ఏకైక మార్గం మనిషికి అవసరమయిన ధార్మిక జ్ఞానం తెలియడం. అతని జీవితం దేవుడు, దైవప్రవక్త విధేయతలో గడపడం.

మహాప్రవక్త (సఅసం) అన్నారు : "తండ్రి తన సంతానానికి ఇవ్వగలిగిన అత్యుత్తమ బహుమానం ఉత్తమ విద్య, శిక్షణలే." (మిష్కాత్)

దైవప్రవక్త (సఅసం) మరో సందర్భంలో ఇలా అన్నారు : "మనిషి చనిపోగానే అతని కర్మలు కూడా అంతమై పోతాయి. కాని మూడు రకాల కర్మల పుణ్యఫలం చనిపోయిన తరువాత కూడా లభిస్తూ ఉంటుంది.

"మొదటిది అతడు చేసిన సద్కయే జారియ. రెండవది ప్రజలకు ఉపయోగపడేలా అతడు వదలివెళ్ళిన విద్య, జ్ఞానం. మూడవది తండ్రికోసం నిరంతరం దుఆ చేసే ఉత్తమ సంతానం." (ముస్లిమ్)

అసలు ఉత్తమ సంతానమే మీ తర్వాత మీ నాగరికతను, ఆచార వ్యవహారాలను, ధార్మిక శిక్షణల్ని, ఏకేశ్వర సందేశాన్ని సజీవంగా ఉంచడానికి ఆధారం. మోమిన్ ఉత్తమ సంతానం కావాలని కోరుకోవటానికి కారణం తన సంతానం తన మరణానంతరం తన సందేశాన్ని సజీవంగా ఉంచగల్గుతుందనే.

19. ఏడు సంవత్సరాలు నిండగానే పిల్లలకు నమాజ్ నేర్పించాలి. నమాజు చేయడానికి ప్రోత్సహించాలి. మనతోపాటు మస్జిద్‌కు తీసుకువెళ్ళి ఆసక్తి కల్గించాలి. పది సంవత్సరాలు నిండగానే నమాజు చేయకపోతే తగిన రీతిలో శిక్షించాలి. మన మాటలద్వారా చేతల ద్వారా వారు నమాజ్ విషయంలో ఏమాత్రం అజాగ్రత్త వహించినా సహించేది లేదని స్పష్టంచేయాలి.

20. పిల్లలకు పది సంవత్సరాల వయస్సు రాగానే వారి పక్కలు వేరు చేయాలి. ఒక్కొక్కర్ని ఒక్కొక్క మంచంమీద పడుకోబెట్టాలి. మహాప్రవక్త (సఅసం) అన్నారు. మీ సంతానానికి ఏడు సంవత్సరాల వయస్సు రాగానే నమాజు చేయడానికి ప్రోత్సహించండి. పది సంవత్సరాలు నిండగానే నమాజు విషయంలో శిక్షించండి. ఆ వయస్సుకు చేరుకోగానే వారి పక్కల్ని వేరుచేయండి.

21. పిల్లలను ఎల్లప్పుడూ పరిశుభ్రంగా ఉంచాలి. వారి పారిశుధ్యం, పరిశుభ్రత, స్నానాదుల విషయంలో శ్రద్ధచూపాలి. దుస్తులు కూడా పరిశుభ్రంగా ఉంచాలి. అయితే ఎక్కువ అలంకరణ, ఆడంబర ప్రదర్శన మానాలి. ఆడపిల్ల దుస్తులను కూడా నిరాడంబరంగా ఉంచాలి. విలువైన దుస్తులు ధరింపచేసి పిల్లల మనస్తత్వాన్ని పాడు చేయరాదు.

22. ఇతరుల ఎదుట పిల్లల తప్పులను ఎత్తిచూపరాదు. ఇతరుల ముందు వారిని అపహాస్యంపాలు చేయడం, వారి ఆత్మగౌరవాన్ని గాయపరచడం కూడా ఖచ్చితంగా విసర్జించాలి.

23. పిల్లల ఎదుట ఎప్పటికీ సంస్కరణ విషయంలో నిరాశ వ్యక్తం చేయరాదు. వారి ధైర్యాన్ని పెంచడానికి వారి చిన్న చిన్న సత్కార్యాలను కూడా బాగా ప్రశంసించాలి. వారిలో ధైర్యాన్ని పెంచడానికి వారిలో ఆత్మవిశ్వాసం, సాహసం వృద్ధిచెయ్యడానికి ప్రయత్నించాలి. తద్వారా క్రియాత్మక జీవనరంగంలో వారు అత్యంత ఉన్నతమయిన స్థానాన్ని పొందగలగాలి.

24. పిల్లలకు ప్రవక్తల, సత్పురుషుల కథలు, సహాబా (రజి) వీరోచిత గాధలు తప్పకుండా వినిపిస్తూ ఉండాలి. సుశిక్షణ, నాగరికత, నైతిక నడవడికలకు, ధర్మంపట్ల శ్రద్ధాసక్తికి ఇవి అత్యంత అవసరమని గ్రహించాలి. ఎన్ని తీరికలేని పనులున్నప్పటికీ అందుకు కొంత సమయం కేటాయించి అప్పుడప్పుడు వారికి పవిత్ర ఖుర్‌ఆన్‌ను కూడా వినసొంపుగా చదివి వినిపించాలి. సమయానుకూలంగా ప్రభావకరమయిన ఉత్తేజకరమైన ప్రవక్త (సఅసం) మాటల్ని తెలియపరచాలి. చిన్నప్పటినుండే వారి హృదయాల్లో ప్రవక్త (సఅసం)పట్ల ప్రేమానురాగాలు పెంపొందించడానికి ప్రయత్నించాలి.

25. అప్పుడప్పుడు పిల్లలచేత్తో పేదలకు అన్నపానీయాలు మొదలయినవి పెట్టించాలి. తద్వారా వారిలో పేదలపట్ల సత్ప్రవర్తన, ఔదార్యం, ధర్మంచేసే సద్భావన జనిస్తాయి. అప్పుడప్పుడు తినే పదార్థాలను, పానీయాలను అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ముల మధ్య పంచుకోడానికి అవకాశాన్ని కల్పించాలి. అందువల్ల వారిలో తమ పరస్పర హక్కులను గౌరవించే భావన, న్యాయం చేసే అలవాటు పుడుతుంది.

26. పిల్లలు మారాము చేసి పట్టుపడితే దాన్ని పూర్తిచేయరాదు. యుక్తితో వారి ఈ అలవాటును దూరం చేయడానికి ప్రయత్నించాలి. సమయానుకూలంగా కఠినంగా కూడా ప్రవర్తించాలి. అనవసరమయిన గారాబంతో వారిని మంకుపట్టుగల వారిగా, మొండివారిగా తయారుచేయరాదు.

27. కరకుగా మాట్లాడడం, గొంతుచించుకొని అరవడం, స్వయంగా మీరుకూడా విసర్జించాలి. వారికి నెమ్మదిగా, మృదువుగా సంభాషించాలని, వారిలో వారు కూడా ఒకరినొకరు అరుచుకోవడం, కేకలు వేయడం మానుకోవాలని హితవు చేయాలి.

28. పిల్లలకు తమ పనిని స్వయంగా చేసుకొనే అలవాటు చేయాలి. ప్రతి పనిలో నౌకర్ల సహాయం తీసుకోకూడదు. అందువల్ల పిల్లలు సోమరులు, అసమర్థులు అయిపోతారు. పిల్లల్ని కష్టజీవులుగా, స్వయంసేవకులుగా, శ్రమపడేవారిగా తర్ఫీదునివ్వాలి.

29. పిల్లలు పరస్పరం పోట్లాడుకున్నప్పుడు మీ పిల్లల్ని వెనుకేసుకురా కూడదు. మీ పిల్లవాని విషయంలో ఏ భావాలు మీ మనస్సులో ఉన్నవో అలాంటి భావాలే తమ పిల్లవాని విషయంలో ఇతరుల మనస్సులో కూడా ఉంటాయని గ్రహించాలి. మీరు ఎల్లప్పుడూ మీ పిల్లవాని తప్పులపైనే దృష్టి ఉంచాలి. రాబోయే ప్రతి అసమంజస సంఘటనలో మీ పిల్లవాని తప్పులను, పొరపాట్లను

పరిశీలించి ఉపాయంతో నిరంతరకృషితో వాటిని దూరం చేయడానికి మనస్ఫూర్తిగా ప్రయత్నించాలి.

30. సంతానంపట్ల ఎల్లప్పుడు సమానదృష్టితో ప్రవర్తించాలి. ఈ విషయంలో అసమానతలు కలగకుండా జాగ్రత్తగా ఉండడానికి ప్రయత్నంచేయాలి. ఒకవేళ స్వాభావికంగా ఒక పిల్లవానిపై ఎక్కువ మక్కువ ఉంటే అది క్షమార్హం కాని, సాధారణ వ్యవహారాల్లో ఇచ్చిపుచ్చుపోవడాల్లో ఎల్లవేళలా న్యాయం, సమానతను పాటించాలి. ఎప్పుడూ ఇతర పిల్లలను బాధించేలా ఒక్క పిల్లవానితోనే ప్రత్యేక ప్రవర్తన కలిగి ఉండరాదు. అందువల్ల ఇతర పిల్లల్లో న్యూనతాభావం, అసహ్యం, నైరాశ్యం తుదకు తిరుగుబాటుతనం జనిస్తాయి. ఈ చెడు ఉద్రేకాలు సహజ సామర్థ్యాలు వృద్ధిచెందడంలో పెద్ద అడ్డుగోడలు, నైతిక వికాసానికి హాలాహలంగా పరిణమిస్తాయి.

ఒకసారి హజ్రత్ నూ'మాన్ (రజి) తండ్రి హజ్రత్ బషీర్ (రజి) తన కుమారుణ్ణి వెంటబెట్టుకుని ప్రవక్త (సఅసం) సమ్ముఖంలో హాజరై "ఓ దైవప్రవక్తా ! నా దగ్గర ఉన్న ఒక బానిసను నా ఈ పిల్లవానికి ఇచ్చి వేశాను" అని అన్నారు.

ప్రవక్త (సఅసం) అడిగారు : "నీవు నీ ప్రతి పిల్లవానికి ఒక్కొక్క బానిసను ఇచ్చావా?"

బషీర్ (రజి) 'లేదు' అని అన్నారు. 'అయితే ఆ బానిసను నీవు తిరిగి తీసుకోమని చెప్పి, "దేవునికి భయపడు. సంతానం పట్ల సమానతను, ఒకేవిధమైన ప్రవర్తనను కలిగిఉండు" అని ప్రవక్త (సఅసం) అన్నారు. అప్పుడు హజ్రత్ బషీర్ (రజి) ఇంటికి వచ్చి తాను ఇచ్చిన ఆ బానిసను నూ'మాన్ (రజి) నుంచి తిరిగి తీసుకొన్నారు. ఇంకొక హదీసులో ఇలా ఉంది.

ప్రవక్త (సఅసం) అడిగారు :

"నీ పిల్లలందరూ నీ పట్ల సత్ప్రవర్తన కలిగి ఉండాలని నీవు అభిలషించవా?" హజ్రత్ బషీర్ (రజి) జవాబిచ్చారు. 'దైవప్రవక్తా ! ఎందుకు అభిలషించను?' "అయితే ఇటువంటి పనిచేయకు" అన్నారు దైవప్రవక్త(సఅసం). (బుఖారి,ముస్లిమ్)

31. పిల్లల ఎదుట ఎప్పుడూ మంచి ఆదర్శవంతమైన పనులు చేయాలి. మీ జీవితం పిల్లలకు సర్వవేళలందు నిశ్శబ్ద శిక్షణనిస్తుంది. మీ జీవితంలో పిల్లలు అనునిత్యం విద్యాబుద్ధులు గ్రహిస్తారు. పిల్లల సమక్షంలో ఎప్పుడూ హాస్యానికైనా అబద్ధం పలకరాదు.

హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్నె ఆమిర్ (రజి) ఒక సంఘటనను గురించి ఇలా చెప్పారు: "ఒకసారి ప్రవక్త (సఅసం) మా ఇంటికి వచ్చారు. నా తల్లి నన్ను పిలిచి, 'ఇక్కడకు రా నేను నీకో వస్తువు ఇస్తాను' అంది. ప్రవక్త (సఅసం) అది విని 'నీవు పిల్లవానికి ఏమి ఇవ్వదలచుకున్నావు?' అని అడిగారు. 'అతనికి ఖర్జూరం ఇవ్వాలని అనుకుంటున్నాను' అంది నా తల్లి. ప్రవక్త (సఅసం) నా తల్లితో అన్నారు. 'ఒకవేళ నీవు ఇచ్చే సాకుతో పిలిచి పిల్లవాడు వచ్చిన తరువాత ఏమీ ఇవ్వకపోతే నీ కర్మల జాబితాలో అది అబద్ధమని వ్రాయబడేది."(అబూ దావూద్)

32. మగ పిల్లవాడు పుట్టినప్పుడు ఎలా సంతోషం వ్యక్తంచేస్తామో అలాగే ఆడపిల్ల పుట్టినప్పుడు కూడా చేయాలి. అమ్మాయి అయినా అబ్బాయి అయినా ఇద్దరూ దేవుడిచ్చిన బహుమానాలే. మీకు అమ్మాయి శుభకరమో లేక అబ్బాయి శుభకరమో దేవునికే బాగా తెలుసు. అమ్మాయి పుట్టినందుకు కోపగించుకోవడం, నిరాశచెందడం ఒక విధేయుడైన విశ్వాసికి తగని పని. ఇలా చేయడం కృతఘ్నత కూడా. పైగా సర్వజ్ఞుడు, కరుణామయుడైన ఆ దేవుని అగౌరవపరచినట్లు కూడా అవుతుంది.

హదీసు ఇలా చెపుతోంది: అమ్మాయి పుట్టినప్పుడు దేవుడు దూతల్ని పంపిస్తాడు. వారు వచ్చి "ఓ గృహస్తులారా ! మీకు శుభం కలుగుగాక" అని అంటారు. తర్వాత వారు అమ్మాయిని తమ రెక్కల నీడలోకి తీసుకుంటారు. ఆమె తలను చేతులతో నిమురుతూ "ఇది బలహీనమైన ప్రాణి, మరొక బలహీనమైన ప్రాణికి జన్మించింది. ఈ అమ్మాయిని ఎవరు సంరక్షించి, పోషిస్తారో వారికి ప్రళయం వరకు దేవుని సహాయం లభిస్తూ ఉంటుంది." అంటారు.

33. ఆడ పిల్లల శిక్షణ, పోషణ అత్యంత సహృదయంతో, ఆనందంతో, ధార్మిక చింతనతో చేయాలి. అందుకు ప్రతిఫలంగా స్వర్గసౌఖ్యాలను దేవునినుండే ఆశించాలి.

ప్రవక్త (సఅసం) అన్నారు:

"ముగ్గురు కుమార్తెలను లేక ముగ్గురు అక్క చెల్లెళ్ళను పెంచి, వారికి విద్యాబుద్ధులు, సభ్యతాసంస్కారాలు నేర్పించి, వారి పట్ల జాలి, దయాభావం కలిగిన వ్యక్తి అవసరాలన్నిటినీ దేవుడు తీరుస్తాడు. అటువంటి వ్యక్తికి దేవుడు స్వర్గప్రాప్తి విధిగా లభింపజేస్తాడు. అప్పుడు ఒకరు అన్నారు, 'ఒకవేళ ఇద్దరే అయితే?' అప్పుడు ప్రవక్త (సఅసం) అన్నారు.

"ఇద్దరు అమ్మాయిలను పోషిస్తే కూడా ఈ ప్రతిఫలం లభిస్తుంది." హజ్రత్ ఇబ్నె అబ్బాస్ అంటారు, "ఒకవేళ ప్రజలు ఒక అమ్మాయి పోషణ విషయం అడిగినా, ఆయన (సఅసం) ఇదే శుభవార్త వినిపించేవారు" అని.

(మిష్కాత్)

హజ్రత్ ఆయిషా (రజి) ఇలా అన్నారు, "ఒకసారి ఒక స్త్రీ తన ఇద్దరు కూతుళ్ళను వెంటబెట్టుకొని నావద్దకు వచ్చింది. ఆమె ఏదో అర్థించింది. నా వద్దనున్న ఒకే ఒక ఖర్జూరాన్ని ఆమె చేతిలో పెట్టాను. ఆ స్త్రీ ఆ ఖర్జూరాన్ని రెండుముక్కలు చేసి కుమార్తెలిద్దరకు చెరొక భాగం పంచిపెట్టింది. తాను మాత్రం తినలేదు. తర్వాత ఆమె లేచి బయటికి వెళ్ళిపోయింది. అప్పుడే దైవప్రవక్త (సఅసం) ఇంటికి వచ్చారు. నేను వారికి (సఅసం) ఈ కథంతా వినిపించాను. వారు విని అన్నారు, 'అమ్మాయి పుట్టుకలో పరీక్షించబడిన వారు కూతుళ్ళపట్ల సత్ప్రవర్తన కలిగి ఉంటూ పరీక్షలో నెగ్గితే, ఆ అమ్మాయిలు ప్రళయదినాన వారిని నరకాగ్నినుండి కాపాడడానికి సాధనంగా నిలుస్తారు."

(మిష్కాత్)

34. ఏ విషయంలోనూ ఆడపిల్లలను తక్కువగా చూడరాదు, మగపిల్లవాణ్ణి అధికుడిగా చూడరాదు. ఇద్దరిపట్ల సమాన ప్రేమను చూపించాలి. సమానంగా చూసుకోవాలి. ప్రియప్రవక్త (సఅసం) అన్నారు, "ఒక వ్యక్తికి ఆడపిల్ల పుట్టింది. అతడు ఆమెను సజీవ సమాధిచేయలేదు. ఆమెను చిన్నచూపు చూడలేదు. పిల్లవాణ్ణి ఆమెకంటే ఎక్కువగా గానీ, మిన్నగా కాని చూడలేదు. ఇటువంటి మనిషిని దేవుడు స్వర్గంలో ప్రవేశింపజేస్తాడు." (అబూదావూద్)

35. సంపదలో అమ్మాయికి నిర్ణయించిన భాగాన్ని సహృదయంతో, ఆదరంతో ఇవ్వాలి. ఇది దేవుడు విధించిన భాగం. అందులో హెచ్చుతగ్గులు చేయడానికి ఎవరికీ ఎటువంటి హక్కు లేదు. ఆడపిల్ల భాగాన్ని ఇవ్వడంలో ఏవో సాకులు వెతుకుతూ తమ ఇష్టం ప్రకారం ఏదో కొంత ఇచ్చి తృప్తిపడడం విధేయుడైన విశ్వాసి చేసే పనికాదు. అలా చేయడం షరీఅత్‌పట్ల నమ్మకద్రోహం. పైగా దైవధర్మాన్ని అగౌరవపరచినట్లు కూడా అవుతుంది.

36. ఈ పనులన్నింటితో పాటు, ఏకాగ్రచిత్తంతో, ఆవేదనతో దేవుని సన్నిధిలో పిల్లల శ్రేయోసుఖాల కోసం దుఆ కూడా చేస్తుండాలి. దేవుడు అత్యంత కరుణామయుడు, దయాళువు. ఆయన తల్లిదండ్రుల హృదయాంత రాళాలనుండి వచ్చే ఆవేదనాపూరితమైన దుఆలను వృధాగా పోనీయడు.

# 4. స్నేహలత, సౌహార్ధవనం

1 స్నేహితులను ప్రేమాభిమానాలతో చూడాలి. మిత్రులకు అత్యంత ప్రీతిపాత్రులుగా ఉండాలి. ఏ వ్యక్తినైతే అతని మిత్రులు ప్రేమతో చూస్తారో, మరే వ్యక్తి అయితే తన స్నేహితుల్ని ప్రీతితో చూస్తాడో అతడు అత్యంత అదృష్టవంతుడు. ఏ వ్యక్తినైతే ప్రజలు అసహ్యించుకుంటారో, ఎవడైతే జనులకు దూరంగా ఉంటాడో అతడు దురదృష్టవంతుడు. దరిద్రులంటే, ధనం లేనివారు కాదు. మిత్రులులేని వారే వాస్తవానికి గొప్ప దరిద్రులు. మిత్రుడు జీవితానికి అలంకరణ, జీవనయాత్రలో సహాయకారి, దేవుని బహుమానం. స్నేహమూ చేయండి, స్నేహితులూ కండి.

ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు :

"విశ్వాసి సంపూర్ణ ప్రేమమూర్తి. ఏ వ్యక్తి అయితే ఇతరులను ప్రేమించడో, ఇతరులు ఎవరిని ప్రేమించరో ఆ మనిషిలో ఎటువంటి మంచితనంగాని, శుభంగాని ఉండవు. (మిష్కాత్)

ఖుర్ఆన్‌లో ఇలా ఉంది. "విశ్వాసులైన పురుషులు, విశ్వాసులైన స్త్రీలు ఒకరికొకరు స్నేహితులు, సహాయకారులు." (తౌబా)

ప్రవక్త (సఅసం) తన స్నేహితులను అత్యంత వాత్సల్యంతో చూసేవారు. ప్రతి ఒక్కరు తననే ప్రవక్త (సఅసం) ఎక్కువగా ఇష్టపడేవారని అనుకునేవారు.

హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) అన్నారు : ప్రవక్త (సఅసం) ఎంతో శ్రద్ధాసక్తులతో నాతో సంభాషించేవారు. నన్ను ఎంత ఆదరంగా చూసేవారంటే నా జాతిలో నేనే, బహుశా ఉత్తమ పురుషుడినని నేననుకునేవాణ్ణి. ఒక రోజు ప్రవక్త (సఅసం)ను అడిగాను కూడా, 'ఓ దైవప్రవక్తా ! నేను గొప్పవాణ్ణా లేక అబూబకర్ గొప్పవారా?'

ప్రవక్త (సఅసం) అన్నారు, "అబూబకర్ గొప్పవారు". మళ్ళీ అడిగాను. "నేను గొప్పవాణ్ణా లేక ఉమరా?", "ఉమర్" అని అన్నారాయన. నేను మళ్ళీ అడిగాను. "ఓ దైవప్రవక్తా ! నేను గొప్పవాణ్ణా లేక ఉస్మానా?", "ఉస్మాన్" అని అన్నారు. తర్వాత నేను చాలా విపులంగా అడిగితే ఆయన (సఅసం) ఎలాంటి

అరమరికలుగాని, మొఖమాటంగాని లేకుండా అతి స్పష్టంగా చెప్పివేశారు. అప్పుడు నాకు నా వైఖరికి చాలా సిగ్గువేసింది. అసలు ఇటువంటి విషయం అడిగే అవసరం ఏమొచ్చిందా అని మనసులోనే మధనపడ్డాను.

2. మిత్రులతో కలసి మెలసి ప్రేమతో జీవితం గడపాలి. నిస్వార్థమైన అనుబంధాలు ఏర్పరచుకొని వాటిని పటిష్టం చేసుకోవడానికి ప్రయత్నించాలి. స్నేహితులను అసహ్యించుకోవడం, ఈసడించుకోవడం, రుసరుసలాడే వైఖరిని వదలుకోవాలి. మనిషి మిత్రులతో కలిసిమెలసి జీవిస్తూ, అన్ని విషయాలలో వారికి తోడుగా వున్నప్పుడు అతనికి రకరకాల కష్టాలు ఎదురౌతాయి. ఒకప్పుడు అతని భావాలకు విఘాతం ఏర్పడుతుంది. అతను అప్రతిష్టపాలవుతాడు. అతని విశ్రాంతికి భంగం కలుగుతుంది. ఇంకొకప్పుడు అతని కార్యకలాపాలకు ప్రతిబంధకాలు ఏర్పడుతాయి. అతని అభిలాషకీ, అభిప్రాయాలకు వ్యతిరేకంగా కొన్ని విషయాలు ఎదురవుతాయి. అతని ఓర్మికి, సహనానికి పరీక్ష ఆసన్న మవుతుంది. ఒక్కొక్కప్పుడు అతనికి వస్తురూపేణా నష్టం కలుగుతుంది. మొత్తంమీద రకరకాల బాధలు, కష్టాలు అతనికి సంభవిస్తాయి. కాని ఆ వ్యక్తి ఆ బాధల్ని భరిస్తున్నప్పుడు అతని హృదయం ఉజ్వలమవుతుంది. మంచి నడవడికలు పెంపొందుతాయి. అతడు సుశిక్షణ, ప్రక్షాళనల సహజమైన మెట్లను దాటుకుంటూ ఆధ్యాత్మిక, నైతిక వికాసాలు పొందుతాడు. అతనిలో సహనం, సుహృద్భావం, త్యాగం, వాత్సల్యం, సానుభూతి, ఔదార్యం, నమ్మకం, శ్రేయోభిలాష, సహకారం, అనురాగం, ప్రేమ, జాలి, దయ, ధైర్యం ఇత్యాది మహోన్నతమైన గుణాలు ఉత్పన్నమౌతాయి. అలాంటి వ్యక్తి మానవ సమాజానికి ఆపాదమస్తకం శుభంకరుడు, శ్రేయోభిలాషిగా రూపొందుతాడు. ప్రతివ్యక్తి హృదయంలో అతనిపట్ల విలువ, ఔన్నత్య భావాలు కలుగుతాయి. ప్రతి మనిషి అతని ఉనికిని కరుణారస మహావృక్షం నీడగా తలుస్తాడు.

ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు :

"ప్రజలతో కలిసిమెలసి ఉంటూ, వారివల్ల కలిగే బాధల్ని సహించే విశ్వాసి, ప్రజలకు దూరంగా ఉంటూ వారివల్ల కలిగే బాధల్ని భరించలేని వాడికంటే ఉత్తముడు." (తిర్మిజి)

3. ఎల్లప్పుడు సత్ప్రవర్తన, మంచినడవడిగలవారితో స్నేహం చేయాలి. స్నేహితుల ఎంపికలో ధర్మంరీత్యా, నీతినిబట్టి మీకు ఉపయోగపడేవారిని

ఎన్నుకోవాలి. ఒక ప్రసిద్ధమైన లోకోక్తి : "ఒకరి నడవడిని తెలుసుకోవాలంటే అతని స్నేహితులెవరో తెలుసుకుంటే సరిపోతుంది." దీన్ని దృష్టిలో ఉంచుకోండి.

ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు :

"మనిషి తన స్నేహితుల ధర్మాన్ని (జీవనవిధానాన్ని) అనుసరిస్తాడు. అందుచేత తాను స్నేహంచేస్తున్న వారిని గురించి ఆలోచించుకుని మరీ స్నేహం చేయాలి. (ముస్నద్ అహ్మద్, మిష్కాత్)

స్నేహితుని ధర్మాన్ని అనుసరించడమంటే స్నేహితునితో కలిసి ఉన్నప్పుడు స్నేహితునిలోని భావాలు, ఆలోచనలు, అభిరుచులు, అభిప్రాయాలు, అతనిలోనూ చోటు చేసుకుంటాయి. స్నేహితుని ఇష్టాయిష్టాల ప్రమాణాలే అతనిలోనూ ఏర్పడతాయి. అందుచేత స్నేహితుని ఎంపికలో బాగా ఆలోచించి, విచక్షణతో వ్యవహరించాలి. ఎవరి అభిరుచులు, ఆలోచనలు, భావోద్రేకాలు, కార్యకలాపాలు తన ధార్మికవిశ్వాసాలకు, నైతిక సూత్రాలకు అనుగుణంగా ఉంటాయో వారితోనే సంబంధాలు పెంపొందించుకోవాలి. ప్రవక్త (సఅసం) నొక్కివక్కాణించారు : నిజ విశ్వాసంగలవారి బాంధవ్యాన్ని పెంపొందించుకోవాలి, అన్నపానీయాలను అతనితో కలిసి పంచుకోవాలి.

ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు :

"విశ్వాసి సహచర్యంలో ఉండాలి. మీరు అన్నపానీయాలను దైవభీతి పరునితో కలిసి పుచ్చుకోండి." కలిసి మెలిసి భుజించడం ప్రేమానురాగ బంధనాలకు మూలం. ఈ ప్రేమానురాగబంధం దైవభీతిపరుడయిన విశ్వాసితో ఏర్పడితే ఎలా ఉంటుంది. దైవాన్ని విస్మరించిన, బాధ్యతారహితులకు, క్రియా శూన్యులకు, అవినీతిపరులకు ఎల్లప్పుడూ దూరంగా ఉండాలి.

ప్రవక్త(సఅసం) మంచి స్నేహితుడు, చెడ్డ స్నేహితులమధ్య వ్యత్యాసాన్ని ఉదాహరణ ద్వారా విశదీకరించారు :

"మంచి స్నేహితుని పోలిక కస్తూరి అమ్మే వానిలాంటిది, చెడ్డ స్నేహితుని పోలిక కొలిమిని కాల్చే కమ్మరివాని లాంటిది. కస్తూరి అమ్మే వాని సహచర్యం వల్ల కొంత లాభం తప్పకుండా ఉంటుంది. కస్తూరి అయినా కొంటాము, లేక కస్తూరి సువాసన అయినా పీలుస్తాము. కాని కమ్మరివాని కొలిమి మీ ఇంటినో దుస్తులనో తగులబెడ్తుంది లేకపోతే దాని పొగ, దుర్వాసన అయినా మీ మెదడులోకి పోతుంది." (బుఖారి, ముస్లిమ్)

అబూదావూద్ హదీసులో ఇలా వివరణ ఉంది :

"మంచివానితో స్నేహం కస్తూరి అమ్మే దుకాణం వంటిది. అందులో లాభం రాకపోయినా సువాసన మాత్రం తప్పకుండా లభిస్తుంది. చెడ్డస్నేహితుని పోలిక కమ్మరివాని కొలిమిలాంటిది. దాని నిప్పు తగలకపోయినా దాని పొగతో వస్త్రాలు మాత్రం తప్పకుండా నల్లబడిపోతాయి."

4. కేవలం దేవుని కోసమే స్నేహితులను ప్రేమించాలి. దేవుని ప్రీతిపాత్రులైన దాసులు దైవధర్మం ప్రాతిపదికపైనే ఒకరితో ఒకరు ఏకమవుతారు. భుజానికి భుజం, మనస్సుకు మనస్సు కలిపి దైవధర్మ సంస్థాపన, సంరక్షణ బాధ్యతను నిర్వహిస్తారు. ఆ ఐక్యత కంచుకోటగా కనబడుతుంది. ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది: సీసపు గచ్చుతో కట్టిన గోడలా భుజానికి భుజం కలిపి దైవమార్గంలో పోరాడేవారే వాస్తవంగా దేవునికి ఇష్టమయినవారు." *(సఫ్ : 4)*

ప్రళయదినాన దేవుడు ఇలా అంటాడని దైవప్రవక్త తెలిపారు : 'కేవలం నా కోసమే ప్రజలను ప్రేమించేవారు ఎక్కడున్నారు, ఈ రోజు వారికి నా నీడలో చోటు ఇస్తాను.' (ముస్లిమ్)

ప్రళయదినాన అటువంటి వారికి లభించే గౌరవ హోదాలను ప్రస్తావిస్తూ ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు :

"దేవుని దాసుల్లో కొందరు (అదృష్టవంతులు) ఉన్నారు. వారు ప్రవక్తలో, అమరగతులో కాదు కాని, ప్రళయదినాన ప్రవక్తలూ అమరగతులు కూడా ఈర్ష్యచెందేటంతటి ఉన్నత స్థానాలను దైవం ప్రసాదిస్తాడు వారికి.

ప్రవక్త (సఅసం) అనుచరులు (రజి) అడిగారు, 'దైవప్రవక్తా ! ఆ అదృష్టవంతులు ఎవరై ఉంటారు?'

ప్రవక్త (సఅసం) సెలవిచ్చారు : "వారు ఒకరినొకరు కేవలం దైవధర్మం కొరకు అభిమానించుకునేవారు, వారు ఒకరికొకరు బంధువులూ కాదు, వారి మధ్య ఆర్థిక లావాదేవీలూ ఉండవు. దైవసాక్షి ! ప్రళయదినాన వారి ముఖాలు జ్యోతితో మెరిసిపోతుంటాయి. అంతేకాదు, ఆపాదమస్తకం వారు జ్యోతిర్మయమయి ఉంటారు. జనులందరు భయంతో కంపించిపోతున్నప్పుడు వారికి ఎలాంటి భీతి ఉండదు. జనులు దుఃఖభరితులై ఉన్నప్పుడు వారికి అసలు ఎటువంటి దుఃఖమూ ఉండదు. ప్రవక్త (సఅసం) ఖుర్‌ఆన్‌లోని ఈ ఆయత్‌ను

పఠించారు. "వినండి, అల్లాహ్ ప్రియులకు ఏ విషయంలోనూ, ఎలాంటి భయమూ ఉండదు. (గతించిన జీవితంగురించి) ఎలాంటి విచారమూ ఉండదు."

(అబూదావూద్)

హజ్రత్ అబూదర్దా (రజి) ప్రవక్త (సఅసం) ఇలా అన్నట్లు ఉటంకించారుః

"ప్రళయదినాన కొందరు తమ సమాధుల్లోనుంచి వస్తారు. వారి ముఖాలు కాంతితో మెరిసిపోతూ ఉంటాయి. వారు ముత్యాల ఆసనాలపై కూర్చుంటారు. ఇతర మానవులు వారి హోదాకు అసూయపడతారు. వీరు దైవప్రవక్తలు గాని, అమర గతులు కాని కారు. ఒక పల్లెవాసి అడిగాడు, 'ఓ దైవప్రవక్తా ! వారు ఎవరో, వారి గుర్తులేమిటో మాకు తెలియపరచండి".

ప్రవక్త (సఅసం) సెలవిచ్చారు ః "వారు దేవుని కొరకు, పరస్పరం ప్రేమించుకునేవారు."

(తిబ్రాని)

5. నీతిమంతులపట్ల ప్రేమకలిగి ఉండటం, దైవప్రీతికి, పరలోక మోక్షానికి మార్గమని గ్రహించాలి.

"దేవా ! పుణ్యాత్ముల ప్రేమను ప్రసాదించు. నన్ను పుణ్యాత్ములలో చేర్చు" అని దేవుని ప్రార్థించాలి. హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్నె మస్ఊద్ (రజి) ఇలా తెలిపారు ః "ఒక వ్యక్తి ప్రవక్త సన్నిధిలోకి వచ్చి ఇలా విన్నవించుకున్నాడుః 'ఒక వ్యక్తి ఒక నీతిమంతుణ్ణి అతని నీతినిబట్టి ప్రేమిస్తాడు కాని తాను మాత్రం అతని వలె మంచి పనులు చేయడు' అని అడగ్గా దైవప్రవక్త (సఅసం) "ఫరవాలేదు. మనిషి ఏ వ్యక్తిని ప్రేమిస్తాడో ప్రళయదినాన ఆ వ్యక్తితోనే ఉంటాడు."

(బుఖారి)

ఒకరాత్రి మహాప్రవక్త (సఅసం) దైవంతో సంభాషించారు. దేవుడు ప్రవక్త (సఅసం)తో 'కోరుకో' అన్నాడు. అప్పుడు ప్రవక్త (సఅసం) ఇలా వేడుకున్నారు.

"దేవా ! మంచి పనులు చేయడానికి అనుకూలత, చెడుపనులనుండి తప్పించుకునే శక్తిని, అనాథల పట్ల ప్రేమను ప్రసాదించమని నిన్ను వేడుకొంటున్నాను. నన్నుక్షమించు, నాపై దయచూపు. నీవు శిక్షించతలచుకున్న ప్రజలనుండి రక్షించుకునేలా నన్ను నీ దగ్గరికి చేర్చుకో. నేను నీ ప్రేమను, ప్రేమించేవ్యక్తి ప్రేమను ప్రసాదించమని అర్థిస్తున్నాను. నీ ప్రీతికి కారణమయ్యే ఆచరణానుకూలత ప్రసాదించమని కోరుతున్నాను." (ముస్నద్ అహ్మద్)

హజ్రత్ ముఆజ్ బిన్ జబల్ (రజి) దైవప్రవక్త (సఅసం) ప్రవచనాన్ని వివరిస్తూ ఇలా తెలిపారు ః

"నాకోసం ఒకరినొకరు ప్రేమించుకొనేవారు, స్నేహం చేసేవారు, నన్ను స్మరించడానికి ఒకచోట చేరి కూర్చునేవారు, నా ప్రేమ కారణంగా కలుసుకొనేవారు, నా ప్రసన్నత కోసం పరస్పరం సత్ప్రవర్తన కలిగివుండేవారు– వీరిని ప్రేమించడం నా విధి." (అహ్మద్, తిర్మిజి)

ప్రవక్త (సఅసం) ఇద్దరు స్నేహితులు కలుసుకోవడాన్ని ఉరకలువేసే విశ్వాసానికి చిహ్నంగా వర్ణిస్తూ ఇలా అన్నారు :

"ఒక వ్యక్తి ఇంకొక బస్తీలో ఉండే తన స్నేహితుణ్ణి కలుసుకోవడానికి బయలుదేరాడు. దేవుడు అతని మార్గంలో ఒక దూతను కూర్చోబెట్టాడు. ఆ దూత అతన్ని ఎక్కడికి వెళ్తున్నావు? అని అడిగాడు. గ్రామంలో నా సోదరుని కలుసుకోవడానికి వెళ్తున్నాను అని జవాబు ఇచ్చాడు అతను. ఆ దూత, అతని వద్దనుండి ఏమైనా నీకు రావలసిన హక్కును వసూలు చేయడానికి వెళ్తున్నావా? అని అడగ్గా, అతడన్నాడు, 'లేదు, లేదు, కేవలం దేవుని కొరకు అతన్ని ప్రేమించడంవల్ల ఆ సోదరుడి దగ్గరికి వెళుతున్నాను.' అప్పుడు దూత ఇలా అన్నాడు, 'అయితే విను, నన్ను నీ వద్దకు దేవుడు పంపాడు. ఏవిధంగానైతే దేవుని కొరకే నీవు నీ స్నేహితుని పట్ల ప్రేమానురాగాలు కలిగి ఉన్నావో అదేవిధంగా దేవుడు కూడా నీపట్ల ప్రేమానురాగాలు కలిగి ఉన్నాడనే శుభవార్త వినిపించడానికి నన్ను దేవుడు నీ వద్దకు పంపించాడు." (ముస్లిం)

6. ఇస్లామ్ దృక్పథంలో ఎవరితో స్నేహంచేయడం ఉచితమో వారితోనే స్నేహం చేయాలి. జీవితాంతం ఆ స్నేహాన్ని నిలుపుకోవడానికి కూడా ప్రయత్నించాలి. ఏ విధంగానైతే స్నేహం చేయడానికి మంచివారి ఎన్నిక అవసరమో, అలాగే ఎల్లప్పుడు ఆ స్నేహాన్ని కాపాడుకోడానికి యత్నించడం కూడ అవసరం. ప్రవక్త (సఅసం) అన్నారు : "ప్రళయదినాన దేవుని సింహాసనం తప్ప మరెక్కడా నీడ ఉండదు. ఆనాడు ఏడురకాల వ్యక్తులు దైవసింహాసనపు నీడలో ఉంటారు. వారిలో ఒక రకానికి చెందిన ఇద్దరు వ్యక్తులు కేవలం దేవుని కోసం పరస్పరం స్నేహితులయినవారు ఉంటారు. వారిని కలిపిఉంచింది దేవుని ప్రేమే. వారు విడిపోయినా ఆ ప్రాతిపదికపైనే. అంటే వారిమధ్య స్నేహం దేవుని కోసమే ఏర్పడుతుంది. జీవితాంతం ఆ స్నేహాన్ని కాపాడుకోవడానికి ప్రయత్నం కూడా దైవంకొరకే. వారిలోని ఒకరు తనువు చాలించినప్పుడు ఆ స్నేహం ఏ స్థితిలో ఉంటుందో ఆ స్థితిలోనే వారు విడిపోతారు.

7. స్నేహితులపై నమ్మకముంచాలి. వారిమధ్య ఉత్సాహంగా ఉండాలి. నిరుత్సాహంగా, నీరసంగా ఉండి, స్నేహితులను నిరుత్సాహపరచడం మంచి పద్ధతికాదు. స్నేహితులతో కలిసి ఉన్నప్పుడు స్వేచ్ఛగా, హుషారుగా హాయిగా ఉండాలి. కోపంతో, రుసరుసలాడడం స్నేహమనిపించుకోదు. స్నేహితులతో నిర్మొహమాటంగా, జంకుగొంకులేకుండా, సహజస్వభావంతో మంచి మనస్సుగల సహచరునిలా ఉండడానికి ప్రయత్నించాలి. మీ సహచర్యంవల్ల వ్యక్తులకు చికాకుబదులు ఆకర్షణ కలిగి, ఆనందం కలగాలి. హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్నె హారిస్ (రజి) ఇలా అంటున్నారు :

"నేను ప్రవక్త(సఅసం) కన్నా ఎక్కువగా చిరునవ్వు నవ్వుతూ కనిపించే వారిని చూడలేదు." (తిర్మిజి)

హజ్రత్ జాబిర్ ఇబ్నె సమ్రా (రజి) ఇలా అన్నారు : "నేను ప్రవక్త (సఅసం) సాంగత్యంలో వందకు పైగా సభలలో పాల్గొన్నాను. ఆ సభలలో సహాబాలు కవిత్వాన్ని వినిపించేవారు. అజ్ఞానపు రోజుల్లోని కథలు, గాధలు కూడా వినిపించేవారు. ప్రవక్త(సఅసం) మౌనంగా అన్నింటిని వింటూ ఉండేవారు. అప్పుడప్పుడు స్వయంగా తను కూడా వారితో కలిసి నవ్వేవారు." (తిర్మిజి)

హజ్రత్ షరీద్ (రజి) అంటారు : "ఒకసారి నేను ప్రవక్త(సఅసం)తో పాటు స్వారీపై ఆయన వెనుక కూర్చున్నాను. స్వారీపై కూర్చునే నేను ప్రవక్త (సఅసం) కు ఉమయ్యా ఇబ్నె సలత్ వ్రాసిన వంద కవితల్ని వినిపించాను. ప్రతి కవిత తర్వాత ఇంకా వినిపించమని ప్రవక్త(సఅసం) అనేవారు. నేను విపించేవాణ్ణి." (తిర్మిజి)

అలాగే ప్రవక్త (సఅసం) తమ సభలో స్వయంగా అప్పుడప్పుడు కథలు వినిపించేవారు.

హజ్రత్ ఆయిషా (రజి) ఇలా తెలిపారు : ఒకసారి ఆయన (సఅసం) తన ఇంటివారికి ఒక కథను వినిపించారు. అప్పుడు ఓ స్త్రీ ఈ వింతకథ అచ్చం ఖురాఫా కథలవలె ఉంది అని అనగా ఆయన, 'నీకు నిజమైన ఖురాఫా కథ తెలుసా' అని అడిగి స్వయంగ వారే (సఅసం) నిజమైన ఖురాఫా కథ వినిపించారు. అలాగే ఒకసారి హజ్రత్ ఆయిషా (రజి) కు పదకొండు మంది స్త్రీల ఆసక్తికరమైన కథను వినిపించారు.

హజ్రత్ బక్ర్ ఇబ్నె అబ్దుల్లాహ్ సహాబా (రజి)ల నిర్మోహమాటం, నిత్యసంతోష స్వభావం గురించి చెపుతూ ఇలా అన్నారు :

"ప్రవక్త అనుచరులు (రజి) పరిహాసానికి, వినోదానికి ఒకరిపై నొకరు పుచ్చకాయ తొక్కలు విసురుకొనేవారు. అయితే యుద్ధ సమయం వచ్చినప్పుడు ఆ రంగంలోని వీరులు కూడా వీరే." (అల్ అదబుల్ ముఫ్రద్)

హజ్రత్ ముహమ్మద్ ఇబ్నె జియార్ (రహ్మలై) అంటున్నారు : "నేను గత సద్వర్తనులను చూశాను. ఒకే ఇంట్లో వాళ్ళ కుటుంబాలు అనేకం ఉండేవి. తరచుగా, వారిలో ఎవరివద్దకు అయినా అతిథి వచ్చినప్పుడు ఇంకొకరి పొయ్యి మీద వంట జరుగుతూ ఉంటే, ఆతిథేయుడు తన అతిథికోసం తన మిత్రుని వంట పాత్రను దించుకొని తీసుకెళ్తాడు. తర్వాత ఆ పాత్ర యజమాని తన పాత్రను వెతుక్కుంటూ 'నా పాత్రను ఎవరు తీసుకెళ్ళారు 'అని అడుగుతూ తిరుగుతుంటాడు. అప్పుడు ఆ మిత్రుడు 'సోదరా ! నా అతిథి కోసం నేనే దాన్ని తీసుకెళ్ళాను' అంటాడు. అప్పుడు యజమాని 'అందుకు దేవుడు నీకు శుభం కలుగజేయుగాక' అంటాడు. తర్వాత ముహమ్మద్ ఇబ్నె జియాద్ (రహ్మలై) ఇలా అన్నారు, వీరు రొట్టెలు చేస్తున్నప్పుడు కూడా ఇటువంటి పరిస్థితే ఎదురయ్యేది."

(అల్ అదబుల్ ముఫ్రద్)

హజ్రత్ అలీ (రజి) ఇలా అన్నారు : "హృదయాన్ని అప్పుడప్పుడు స్వేచ్ఛగా కూడా వదలండి. ఆహ్లాదకరమైన విషయాన్ని కూడా తలపోయండి. ఎందుకంటే, శరీరం వలె హృదయం కూడా అలసిపోతుంది."

8. బిగుసుకుపోయే స్వభావం, జీవంలేని హృదయంగా మారి పోకూడదు. నిత్యసంతోషి అయి ఉత్సాహంగా నవ్వుతూ నవ్విస్తూ ఉండాలి. అయితే, ఆ ఆనందం, ఉత్సాహం హద్దులుమీరకుండా జాగ్రత్తపడాలి. ఆనందదాయకమైన స్వభావంతో పాటు ధార్మిక ఔన్నత్యాన్ని, ఆత్మ గౌరవాన్ని, సంతులిత వైఖరిని దృష్టిలో ఉంచుకోవాలి.

ప్రవక్త (సఅసం) అనుచరుడు హజ్రత్ అబ్దుర్రహ్మాన్ (రజి) అంటారు:. "ప్రవక్త (సఅసం) అనుచరులు బిగుసుకుపోయే స్వభావులుగా కాని జీవచ్ఛవాలుగాగాని ఉండేవారు కాదు. వారు తమ సభలలో కవితల్ని, గేయాల్ని వినిపించేవారు. అజ్ఞాన కాలంనాటి కథల్ని, గాథల్ని కూడా వినిపించేవారు. అయితే ధర్మానికి

విరుద్ధమయిన విషయం ఏదైనా ప్రస్తావనకు వస్తేమటుకు వారు సహించేవారుకారు."

(అల్ అదబుల్ మ్రఫద్)

ప్రఖ్యాత హదీసువేత్త హజ్రత్ సుఫ్యాన్ ఇబ్నె అయీన (రహ్మాలై) తో ఎవరో అన్నారు! "పరిహాసం కూడా ఒక ఆపదే" అని. దానికి ఆయన జవా బిచ్చారు. 'కాదు, అది సున్నత్ (ప్రవక్త సంప్రదాయం). అయితే ఇది సందర్భం తెలిసి, చక్కగా పరిహాసం చేయగల వ్యక్తికి మాత్రమే అన్వయిస్తుంది."

(షరహ్ షిమాయిలెతిర్మి జి)

9. నీవు ప్రేమించే వ్యక్తికి నీ ప్రేమను తప్పకుండా వ్యక్తం చేయాలి. దానివల్ల అతను కూడా మానసికంగా నీ బాంధవ్యాన్ని గ్రహించగలుగుతాడు. ఇలా ఇద్దరూ, తమ తమ భావాలను అభిప్రాయాలను ఒకరికొకరు వ్యక్తం చేసుకోవడంలో ప్రేమానురాగాలు అసాధారణంగా ఇనుమ డిస్తాయి. ఆ ప్రేమానురాగాలు కేవలం హృదయాల వరకే పరిమితంకాక క్రియాత్మక జీవితాన్ని సైతం ప్రభావితం చేస్తాయి. ఆ విధంగా వ్యక్తిగత జీవితాల్లో పరస్పర శ్రద్ధాసక్తులు జనించి సాన్నిహిత్యం అధికమవుతుంది. ప్రవక్త (సఅసం) అన్నారుః

"ఒకని హృదయంలో తన సోదరుని పట్ల ప్రేమభావాలు ఉంటే అతను ఆ భావాలను అతనికి తప్పకుండా తెలియజేయాలి." (అబూదావూద్)

ఒకసారి ఆయన (సఅసం) ముందునుండి ఒక వ్యక్తి వెళ్ళాడు. అప్పుడు కొందరు ఆయన (సఅసం) వద్ద కూర్చుని ఉన్నారు. వారిలో ఒకరు అన్నారుః 'ఓ దైవప్రవక్తా, నాకు ఆ వ్యక్తి అంటే ఎంతో ప్రేమ. అది కేవలం దైవం కొరకే.' అది విని ప్రవక్త (సఅసం) అడిగారు, 'మరి ఈ మాటలు ఆ వ్యక్తికి తెలియపరిచావా?' అని. 'లేదని' అతడు జవాబిచ్చాడు. అప్పుడు ప్రవక్త (సఅసం) అన్నారు. 'వెళ్ళు, నీవు కేవలం దేవుని కొరకే అతన్ని ప్రేమిస్తున్నావని అతనికి తెలుపు'. ఆ వ్యక్తి వెంటనే లేచివెళ్ళి ఆ పోయేవానికి తన భావాలను వ్యక్తం చేశాడు. అందుకు బదులు ఆ వ్యక్తి ఇలా అన్నాడు. "ఎవరికొరకైతే నీవు నన్ను ప్రేమానురాగాలతో చూస్తున్నావో ఆ దేవుడు నిన్ను ప్రేమానురాగాలతో చూడుగాక!"

(తిర్మి జి, అబూదావూద్)

స్నేహబంధాన్ని పటిష్టం చేసుకోవడానికి, దానివల్ల మంచి ఫలితాలు సాధించడానికి, మిత్రులకు అతి సన్నిహితులుగా రూపొందడానికి మీరు స్నేహితుల వ్యక్తిగత విషయాల్లో కూడా పరిమిత పరిధిలో శ్రద్ధ తీసుకోవాలి. వారికి మీ

సాన్నిహిత్యాన్ని, ప్రత్యేక అనుబంధాన్ని వ్యక్తపరచాలి.

ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు : "ఒక మనిషి ఇంకొకరితో స్నేహాన్ని, సన్నిహిత సంబంధాన్ని ఏర్పరచుకున్నప్పుడు అతని పేరు, అతని తండ్రి పేరు, అతని కుటుంబ పరిస్థితులను తెలుసుకోవాలి. దానివల్ల పరస్పర ప్రేమ, అభిమానం గట్టిపడతాయి." (తిర్మిజి)

10. అనురాగాన్ని అనుబంధాన్ని వ్యక్తపరచడంలో ఎల్లప్పుడు మధ్యే మార్గాన్ని అనుసరించాలి. అలక్ష్యం, ఉపేక్షవల్ల మీ అనుబంధం అనుమానాస్పదంగా రూపొందేలా వ్యవహరించకండి. అలా అని ప్రేమోద్రేకాలకు లోనై పిచ్చివానిగా తయారవరాదు, పశ్చాత్తాపపడవలసివచ్చే వరకు సాగదీయరాదు. సదా మధ్యేమార్గాన్ని, సంతులనాన్ని పాటించాలి. స్నేహాన్ని సతతం నిలుపుకోవడానికి స్థిరచిత్తంతో మధ్యస్థ వైఖరిని అవలంబించాలి.

హజ్రత్ ఉమర్(రజి) ఇలా అన్నారని హజ్రత్ అస్లమ్ (రజి) ఉల్లేఖించారు: "మీ ప్రేమానురాగాలు ఉన్మాదస్థితికి పోరాదు, మీ శత్రుత్వం హింసకు కారణం కాకూడదు."

అప్పుడు, నేను దాని భావమేమిటని అడిగాను. ఆయన ఇలా అన్నారు: 'అది ఎలాగంటే, మీరు ప్రేమానురాగంతో ఉన్నప్పుడు పిల్లలవలె హత్తుకుపోవడం, బాల్య చేష్టలు చేయడం, అయిష్టంగ ఉన్నప్పుడు అతని వస్తుసామగ్రిని సర్వనాశనం చేసి, ప్రాణాలకు ముప్పుతెచ్చే వరకు పోవడం అన్నమాట."

(అల్ అదబుల్ ముఫ్రద్)

హజ్రత్ ఉబైద్ కంది ఇలా సెలవిచ్చారు: నేను హజ్రత్ అలీ (రజి) ఈ విధంగా చెబుతూవుండగా విన్నాను, "మీ స్నేహితునిపట్ల మృదుత్వాన్ని, మధ్యే మార్గాన్ని అవలంబించండి. ఎప్పటికైనా అతను మీ శత్రువై పోవచ్చు. అలాగే శత్రువు పట్ల శత్రుత్వంలో మృదుత్వం, మధ్యేమార్గాన్ని అవలంబించండి, ఎప్పటికైనా అతను మీ మిత్రుడు అయిపోవచ్చు." (అల్ అదబుల్ ముఫ్రద్)

11. స్నేహితుల పట్ల విశ్వాసంగాను, శ్రేయోభిలాషతోను మెలగాలి. స్నేహితుని పట్ల అత్యంత శ్రేయోభిలాషిగా మెలగడమంటే అతన్ని నైతికంగా ఉన్నతమయిన మనిషిగా తీర్చిదిద్దడానికి ప్రయత్నించడం. అతని ఇహంకంటే పరాన్ని తీర్చిదిద్దడానికి మీరు మార్గాలు వెదకాలి.

ప్రవక్త(సఅసం) అన్నారు : "విశ్వాసి అందరి పట్లా పరిపూర్ణ శ్రేయోభిలాషి కాగలగాలి. శ్రేయోభిలాషకు అసలు ప్రమాణం నీవు నీ కొరకు ఏమి కోరుకుంటావో అదే నీ స్నేహితుని కొరకు కూడా కోరుకోవడం. ఎందుకంటే మనిషి తనకు ఎప్పుడూ చెడును కోరుకోడు."

ప్రవక్త చెప్పిన మరో వచనం: "నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ దేవుని సాక్షిగా ! తన కొరకు ఇష్టపడిన దాన్ని తన సోదరుని కొరకు కూడా ఇష్టపడనంతవరకు ఏ మనిషీ నిజమైన విశ్వాసి కాజాలడు."

ఒక ముస్లిమ్ వ్యక్తిపై మరో ముస్లిమ్‌కి ఉన్న ఆరు హక్కులను ప్రస్తావిస్తూ ఆయన(సఅసం) అన్నారు : "తన సోదరుడు కళ్ళముందు ఉన్నా లేకపోయినా అతని శ్రేయస్సునే సదా అభిలషిస్తూ ఉండాలి."

ఆయన (సఅసం) ఇలా కూడా అన్నారు: "ఎవరైతే ప్రమాణంచేసి కూడా తోటి వ్యక్తి హక్కును హరించివేస్తాడో ఆ వ్యక్తిపై దేవుడు నరకాగ్నిని తప్పనిసరిగా విధిస్తాడు. అతనికి స్వర్గాన్ని నిషేధిస్తాడు. సహాబీలలో ఒకరు అడిగారు: "ఒకవేళ అది ఒక చిన్న వస్తువైనా కూడానా?" అని. అందుకు ఆయన (సఅసం) "ఒకవేళ అది పీలూ చెట్టులోని చిన్న రెమ్మ అయినా సరే" అని అన్నారు.

12. స్నేహితుల దుఃఖాల్లో పాల్గొనాలి. అలాగే వారి సంతోషాల్లో కూడా భాగం పంచుకోవాలి. వారి దుఃఖంలో పాల్గొని వారి విచారాన్ని నివారించడానికి ప్రయత్నించాలి, వారి ఆనందంలో భాగం పంచుకొని వారి ఆనందాన్ని అధికం జేయడానికి యత్నించాలి. ప్రతి స్నేహితుడు తన కష్టాల్లో సహచరులు తనకు సహాయపడతారని, అవసర సమయంలో తనను విడనాడరని నమ్ముతాడు. అలాగే తన స్నేహితులు తన సంతోషాలను అధికం చేస్తారని, తన సామూహిక వేడుకల్లో పాల్గొని వాటి ప్రాభవ వైభవాల్ని మరింతగా ఇనుమడింపజేస్తారని ఆశిస్తాడు.

దైవప్రవక్త(సఅసం) ఇలా అన్నారు : 'ఒక విశ్వాసికీ ఇంకొక విశ్వాసికీ గల సంబంధం కట్టడం లాంటిది. ఏ విధంగానైతే కట్టడంలోని ఒక ఇటుక వేరొక ఇటుకకు ఊతంగా ఉంటూ దానికి శక్తినిస్తుందో, అలాగే విశ్వాసులు పరస్పరం శక్తినిచ్చుకుంటూ సహాయసహకారులుగా ఉంటారు.' తర్వాత ప్రవక్త (సఅసం) ఒకచేతి వ్రేళ్ళను రెండవచేతి వ్రేళ్ళతో కలిపి విశ్వాసుల పరస్పర సన్నిహిత

సంబంధాలు ఈ విధంగా ఉంటాయని విశదీకరించారు. (బుఖారి, ముస్లిమ్)

దైవప్రవక్త (సఅసం) ఇలా కూడా అన్నారుః "శరీరంలో ఏదైనా ఒక అవయవానికి జబ్బు చేస్తే జ్వరానికి గురై ఆ ఆవేదనలో పాలు పంచుకుంటుంది. అలాగే విశ్వాసులు పరస్పరం జాలి, దయ, కరుణ, ప్రేమానురాగాల్లోనూ, దుఃఖంలో, బాధల్లోనూ భాగస్వాములుగా ఉంటారు." (బుఖారి, ముస్లిమ్)

13. స్నేహితుల్ని సుహృద్భావం, మృదుత్వం, సంతోషం, చిత్తశుద్ధితో కలుసుకోవాలి. అత్యంత ఆసక్తితో, వినయంతో వారిని ఆహ్వానించాలి. అలక్ష్యాన్ని, గర్వాన్ని, మొరటుతనాన్ని ప్రదర్శించరాదు. ఇవి హృదయాలను చీల్చివేసే చెడులు. కలుసుకున్నప్పుడు సంతోషం, సంతృప్తి, కృతజ్ఞత కనబరచి శుభప్రదమైన వాక్యాలు పలకాలి. నిందాపూర్వకమైన, ఆసక్తిని చంపివేసే వాక్యాలు అసలు నోటికి రానీయరాదు, కలుసుకున్నప్పుడు మీ స్నేహితుడు ఆనందానుభూతిని పొందే వైఖరిని అవలంబించాలి. మిమ్మల్ని కలుసుకోవడం అన్నది ఓ బాధగా, మనసు విరిగిపోయే విధంగా ఏడుపు ముఖంతో అతన్ని ఆహ్వానించరాదు.

మహాప్రవక్త(సఅసం) ఇలా బోధించారు. సత్కార్యాలలో ఏ సత్కార్యాన్ని కూడా అల్పమైందిగా ఎంచరాదు. అది నీవు నీ సోదరుణ్ని నగుమోముతో పలుకరించడంలాంటి చిన్నదయినా సరే." (ముస్లిమ్)

మరో సందర్భంలో ఆయన (సఅసం) ఇలా అన్నారుః

"నీ సోదరుణ్ణి చూసి నీవు దరహాసం చేయడం, నవ్వడం కూడా సద్కాయే." (తిర్మిజి)

సహనం, సద్వర్తనం, మార్దవంతోటే హృదయాల్లో ప్రేమానురాగాలు జనిస్తాయి. ఈ సుగుణాల కారణంగా మంచి సమాజం ఆవిర్భవిస్తుంది.

దైవప్రవక్త (సఅసం) ఇలా అన్నారు. "నరకాగ్ని నిషిద్ధం చేయబడి, నరకాగ్నికి నిషిద్ధం చేయబడిన ఆ మనిషి ఆనవాలు చెబుతాను వినండి. అతను మృదు స్వభావి. మృదు మనస్కుడు, మృదు వర్తనుడు." (తిర్మిజి)

ప్రవక్త అనుచరుల (రజి) ప్రకారం, ప్రవక్త (సఅసం) ఎవరినైనా కలుసుకున్నప్పుడు తన దృష్టినే కాక శరీరాన్ని కూడా అతని వైపునకు మరలిస్తారు. అలాగే ఆయనతో ఎవరయినా, సంభాషిస్తున్నప్పుడు పూర్తి శ్రద్ధతో అతని మాటల్ని ఆలకిస్తారు.

ఒకసారి ప్రవక్త (సఅసం) మస్జిద్‌లో కూర్చొని ఉండగా ఒక వ్యక్తి వచ్చాడు. ఆయన (సఅసం) తన శరీరాన్ని కదిలించి కొంచెం సర్దుకున్నారు, అప్పుడా వ్యక్తి "దైవప్రవక్తా! ఈ చోటు విశాలంగానే ఉంది కదా!" అని అన్నాడు. అందుకు ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు. "తన సోదరుడు తనను చూసినప్పుడు అతని కోసం తన శరీరాన్ని కొంచెం సర్దుకోవడం ముస్లిమ్‌ల పరస్పర హక్కు."
(బైహకీ)

విశ్వాసుల్ని ఖుర్‌ఆన్ నిర్వచిస్తూ, వారు విశ్వాసుల పట్ల మృదువుగా ప్రవర్తిస్తారు, అంది.

ప్రవక్త (సఅసం) ఈ వాస్తవాన్ని ఇలా విశదీకరించారు. "విశ్వాసి సహన శీలిగా, మృదు హృదయుడుగా, ముకుతాడు వేసిన ఒంటెవలె ఉంటాడు. ఒంటెను లాగుతూ ఉంటే అది వస్తూనే ఉంటుంది. రాయిపైన కూర్చుండబెడితే కూర్చుంటుంది." (తిర్మిజి)

14. ఒకవేళ ఎప్పుడైనా ఏదయినా విషయంలో మిత్రులతో భేదాభిప్రాయం ఏర్పడితే వెంటనే సర్దుబాటు చేసుకోవాలి. ఎల్లప్పుడు, క్షమాపణ కోరటంలో చేసిన తప్పును ఒప్పుకోవడంలో ముందుకు రావాలి.

హజ్రత్ అబూదర్దా (రజి) ఇలా ఉల్లేఖించారు: "ఒకసారి హజ్రత్ అబూబకర్ (రజి) హజ్రత్ ఉమర్ (రజి) మధ్య ఒక విషయంలో తీవ్రమైన వాగ్వివాదం జరిగింది. తర్వాత హజ్రత్ అబూబకర్ (రజి)చాలా బాధపడ్డారు. ఆయన విచారంతో ప్రవక్త (సఅసం) సమ్ముఖానికి వచ్చి 'దైవప్రవక్తా! నాకు, ఉమర్‌కూ మధ్య కొంచెం భేదాభిప్రాయం వచ్చింది. నాకు కోపం వచ్చింది. తీవ్రపదజాలం చోటుచేసుకుంది. తర్వాత నాకు చాలా సిగ్గు వేసింది. నేను ఉమర్ (రజి)ను క్షమించమని కోరాను కానీ దైవప్రవక్తా! ఆయన క్షమించడానికి సిద్ధంగా లేరు. నేను ఆందోళనతో మీ సన్నిధికి వచ్చాను.'

ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు: దేవుడు నిన్ను క్షమిస్తాడు. కటాక్షిస్తాడు, ఆ సమయంలోనే హజ్రత్ ఉమర్ (రజి) కూడా తన పొరబాటును గ్రహించారు. (వెంటనే) ఆయన పరుగెత్తుకుంటూ హజ్రత్ అబూబకర్ (రజి) ఇంటికి వెళ్ళారు. అబూబకర్ (రజి) ప్రవక్త (సఅసం) సన్నిధికి వెళ్ళారని అక్కడ తెలిసింది. ఆయన కూడా ప్రవక్త (సఅసం) సన్నిధిలో హాజరయ్యారు. హజ్రత్ ఉమర్ (రజి)ను చూడగానే ప్రవక్త (సఅసం) ముఖాన ఆగ్రహం ఛాయలు

కానవచ్చాయి. అది చూసి హజ్రత్ అబూబకర్ (రజి) చాలా భయపడ్డారు. వెంటనే అత్యంత వినయవిధేయతలతో మోకరిల్లి ప్రవక్త (సఅసం)తో ఇలా విన్నవించుకున్నారు. "దైవప్రవక్తా! తప్పు ఉమర్(రజి)ది కాదు. తప్పంతానాదే. నేనే హద్దులు మీరిపోయాను."

ఇది చూసి దైవప్రవక్త ఇలా బోధించారు, "దేవుడు మీ దగ్గరికి నన్ను దైవప్రవక్తగా నియమించి పంపాడు. ప్రారంభంలో మీరు నన్ను నిరాకరిస్తున్నప్పుడు అబూబకర్ నన్ను విశ్వసించాడు, ధన, ప్రాణాలతో అన్ని విధాలా నాతో సహకరించాడు. అలాంటి నా స్నేహితుణ్ణి మీరిప్పుడు బాధపెడతారా!"

రాజీ ప్రయత్నాలలో ఎన్నటికీ ఆలస్యం చేయకండి. ఎంత ఆలస్యమయితే అంత కీడు చోటు చేసుకుంటూ పోతుంది, హృదయాలలో అంతరాలు పెరుగుతూ ఉంటాయి.

సువార్తల్లో హజ్రత్ ఈసా (అలైస) చేసిన ఈ హితవు అత్యంత విశ్వాస జనకమైంది: "నీవు బలిపీఠంపైన నీ మొక్కుబడి సమర్పిస్తున్న సమయాన నీ సోదరునికి నీ వల్ల ఏదైనా బాధ కలిగిందని నీకు జ్ఞప్తికి వస్తే ఆ బలిపీఠం వద్దనే మొక్కుబడిని వదిలేసి నీ సోదరుణ్ణి కలుసుకో, తర్వాత నీ మొక్కు నెరవేర్చుకో."

ప్రియప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు: ప్రజల ఆచరణ వివరాలు ప్రతి సోమవారం, గురువారం వారానికి రెండు రోజులు దైవసమక్షంలో ప్రవేశ పెట్టబడతాయి. ప్రతి విశ్వాసిని మన్నించడం జరుగుతుంది. కాని ఎవరి మనసులోనైతే సోదర విశ్వాసిపట్ల వైషమ్యం ఉంటుందో అతన్ని మన్నించడం జరగదు. వారు పరస్పరం రాజీ కుదుర్చుకోవడానికి అవకాశం ఇవ్వవలసినదని ఆదేశించడం జరుగుతుంది. రాబోయే క్షణం జీవితాన్ని తెస్తుందో మృత్యువును తెస్తుందో ఎవరికి తెలుసు? ఎవరికి తెలుసు సోమవారం, గురువారాలను జీవితంలో మళ్ళీ ఎదుర్కొనే అదృష్టం లభిస్తుందో లేదో? అందుచేత మనస్పర్థల్ని దూరం చేసుకోవడంలో స్నేహితుల మనస్తాపాలను రూపుమాపుకోవడంలో ఆలస్యం దేనికి? ఏ ఆశలవల్ల ఈ జాప్యం? అంతిమదినంపైన విశ్వాసమున్న విజ్ఞుడు ఎవడయినా కపటం నిండిన జుగుప్సాకరమయిన చీకటిగుండెలతో దేవుని సన్నిధిలో హాజరవడానికి సిద్ధపడతాడా?

మీ స్నేహితుడు తన తప్పు ఒప్పుకొని క్షమించమని కోరినప్పుడు అతని కోరికను విశాలహృదయంతో మన్నించాలి. అతన్ని క్షమించాలి, మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు: "సోదర విశ్వాసి తన తప్పును క్షమించమని

కోరినప్పుడు అతణ్ణి క్షమార్హుడుకాడనో లేక అతను చూపిన కారణం సరయినది కాదనో భావించేవాడు పాపంలోపడిపోతాడు, ఆ పాపం - అధర్మంగా పన్నులు వసూలు చేసే వాడిమీద అతని అత్యాచారం వల్ల మోపబడే పాపభారంతో సమానమయింది."

15 స్నేహితులు మీ స్వభావానికి, అభిరుచికి విరుద్ధమయిన మాట ఏదైనా అంటే మీ నోటిని అదుపులో ఉంచుకోవాలి. బదులుగా దురుసుమాటలు పరుషవాక్కులు పలకరాదు. నేర్పుగా మృదువుగా మాటను దాటవేయండి.

మహాప్రవక్త(సఅసం) ఇలా బోధించారు, "హజ్రత్‌మూసా(అలైహిస్సలామ్) దైవాన్ని, "ప్రభూ, నీ దృష్టిలో నీ దాసులలో కెల్లా ప్రియతముడైనవాడు ఎవడు? అని అడిగారు. దానికి సమాధానంగా దైవం, 'ప్రతీకారం తీర్చుకోగల శక్తి ఉన్నప్పటికీ క్షమించగలవాడు అని సెలవిచ్చాడు." (మిష్కాత్)

మరొక సందర్భంలో మహాప్రవక్త (సఅసం) ఇలా పలికారు, "అంతిమ దినాన విశ్వాసి ఆచరణల్ని తూచే త్రాసులో అన్నిటికంటే బరువయినది అతని సద్వర్తనం. దైవం దృష్టిలో, బూతులు పలికేవారు, దుర్భాషలాడేవారు పరమ అసహ్యమయినవారు."

హజ్రత్ అబ్దుల్లా బిన్ ముబారక్(రహ్మ), సద్వర్తనను నిర్వచిస్తూ మూడు విషయాలు చెప్పారు.

(1) ఎవరినయినా కలిసినప్పుడు నగుమోముతో పలకరించాలి.

(2) అగత్యపరులు, నిరుపేదల కోసం ఖర్చుపెట్టాలి.

(3) ఎవరినీ బాధించకూడదు. హజ్రత్ ఆయిషా ప్రకారం దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు: "బూతుమాటలు, అసభ్య సంభాషణ కారణంగా ప్రజలు కలవటమే మానుకునే వ్యక్తి అంతిమదినాన దైవం దృష్టిలో అతి హేయమయినవాడు." (ముస్లిమ్, బుఖారి)

16. తమ మిత్రుల సంస్కరణ సుశిక్షణల్ని ఎన్నడూ ఉపేక్షించకండి. సంస్కరణ సుశిక్షణల మార్గంలో పెద్ద ప్రతిష్టంభనకాగల రుగ్మత, అంటే స్వోత్కర్ష అహంభావాలను మిత్రుల్లో పుట్టేందుకు తావివ్వకండి. మిత్రులు తమ తప్పుల్ని లోటుపాట్లను గుర్తించేందుకు పురికొలుపుతూ ఉండండి. వారు తమ పొరపాట్లను అంగీకరించడంలో ధైర్యం చూపేలా సమాయత్తపరచండి. వాస్తవానికి తమ లోటుల్ని గుర్తించక పోవడం వల్ల, తమ తప్పులేదని తప్పించుకునేందుకు

మొండికి వెయ్యడం వల్ల మనస్సులోని దౌష్ట్యానికే బలిమి చేకూరుతుందన్న సత్యాన్ని సతతం దృష్టిలో ఉంచుకోవాలని బోధించండి.

వాస్తవమేమిటంటే బాహ్యంలో వినమ్రత చూపడం, మాటల్లో తనను అల్పునిగా చెప్పుకోవడం, నడకలో, నడతలో వినయం వ్యక్తం చెయ్యడం అత్యంత సులువయినదే. కాని తన ఆంతర్యంపైన దెబ్బను సహించడం, తన తప్పిదాలను ప్రశాంత హృదయంతో వినడం, అంగీకరించడం తన మనస్సుకు వ్యతిరేకంగా మిత్రుల విమర్శల్ని భరించడం అత్యంత కఠినమయిన పని. కాని వాస్తవంలో జాగరూకులయి ఒకరి జీవితాలను మరొకరు పరిశీలిస్తూ ఒకరినొకరు సంస్కరించుకునేందుకు యత్నిస్తూ ఒకరినొకరు అహంభావానికీ, స్వోత్కర్షకు గురికాకుండా కాపాడుకుంటూ ఉండేవారే నిజమయిన మిత్రులు.

మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు, "మూడు విషయాలు (మనిషిని) సర్వనాశనం చేస్తాయి.

(1) మనిషి తన కాంక్షకు విధేయుడు, బానిసై పోవడం. (2) మనిషి పేరాశ నాయకత్వాన్ని స్వీకరించి దాన్నే అనుసరించడం. (3) స్వోత్కర్ష. ఈ మూడింటిలో ఈ మూడవ వ్యాధి అన్నింటికన్నా అతి ప్రమాదకరమయింది.

(బైహకీ- మిష్కాత్)

సద్విమర్శ, ప్రవర్తనా పరిశీలన శస్త్ర చికిత్స చేసే పరికరంలాంటిది. మనిషి నైతిక ఉనికిలో చోటుచేసుకున్న సకల దుష్ట పదార్థాలను వెలికి తీసి పారవేస్తుంది. ఇంకా నైతిక శక్తుల్ని పెంచి వ్యక్తిలోనూ సమాజంలోనూ నూతన జీవం పోస్తుంది. స్నేహితుల విమర్శలకు కోపగించుకోవటం, ముఖం మాడ్చుకోవడం, తనకు అది వర్తించదని భావించడం కూడా ఎంతో హానికరం. అలాగే విమర్శనా విధిని నిర్వర్తించడంలో జంకడం కూడా ప్రమాదకరమే. మిత్రులలో లోటుపాట్లు కానవస్తే కలత చెందాలి, వాటిని మాన్పించటానికి నేర్పుగా ప్రయత్నించాలి. అలాగే మీలోని లోటుపాట్లను ఎత్తిచూపేందుకు మీరు కూడా విశాల హృదయంతో, అణుకువతో ఎల్లప్పుడూ మిత్రులకు అవకాశం ఇవ్వాలి. వారు విమర్శనా ధర్మాన్ని నెరవేరుస్తున్నప్పుడు మీరు ఆత్మవంచనకు గురవడానికి బదులు నిండు మనస్సుతో విశాల దృష్టితో కృతజ్ఞతా భావంతో వారి విమర్శలను ఆహ్వానించండి. వారి చిత్తశుద్ధికి, మంచితనానికి కృతజ్ఞతలు చెల్లించండి. ప్రియప్రవక్త (సఅసం) ఆదర్శ స్నేహపు ఈ వైఖరిని ఒక చక్కని ఉదాహరణతో ఇలా

విశదీకరించారు.

"మీలో ప్రతి ఒక్కడూ మీ సోదరునికి దర్పణం లాంటివాడు. అందువల్ల మీలో ఎవరయినా తన సోదరునిలో ఏదయినా లోపం (చెడు) చూస్తే దానిని, దూరం చేసే ప్రయత్నం చేయాలి." (తిర్మిజి)

ఈ ఉపమానంలో అయిదు మంచి సూచనలు ఇమిడి ఉన్నాయి. వాటిని దృష్టిలో పెట్టుకుని మీరు మీ స్నేహాన్ని ఆదర్శ స్నేహంగా రూపొందించుకోవచ్చు.

(అ) మీరు మచ్చలను చూసుకునే ఉద్దేశంతో అద్దం ముందుకుపోయి నిలబడినప్పుడే అది మీ మచ్చలను ప్రతిబింబిస్తుంది. మీరు దాని ఎదుటి నుంచి తొలగిపోగానే అది కూడా మౌనం వహిస్తుంది.

అలాగే మీ స్నేహితుడు విశాల హృదయంతో విమర్శనావకాశం కలిగించి స్వయంగా మీ ఎదుటకు వచ్చినప్పుడు ఆ సమయంలో అతని హృదయం విమర్శను తట్టుకోగలుగుతుందా లేదా అని, అతనికి సంస్కరణ అంగీకరించగలిగే ఉదారస్వభావం ఉందా లేదా అని మీరు కూడా గమనించి, అతని తప్పులను బహిర్గతం చేయండి.

అది సందర్భంకాదని మీరు గ్రహిస్తే నేర్పుతో ఆ విషయాన్ని మరో సందర్భం కోసం ఆపి ఉంచి అప్పటికి మౌనం వహించండి. అతను ఎదుట లేనప్పుడు అతని తప్పును సూచించే ఏ విషయాన్నీ మీనోటి నుంచి రాకుండా కడు జాగ్రత్త వహించాలి. ఎందువల్లనంటే ఇది పరోక్షనింద అవుతుంది. పరోక్ష నిందవలన హృదయాలు విడిపోతాయేకాని కలుసుకోవు.

(ఆ) వాస్తవంగా మీ ముఖంమీద ఉన్నటువంటి మచ్చలే అద్దం ప్రతిబింబిస్తుంది, అందులో అది ఎలాంటి హెచ్చుతగ్గులు చేయదు. అది దాని ఎదుటకు వచ్చిన మీ ముఖభాగంలోని లోపాలనే చూపిస్తుంది. కనిపించని లోపాలను ఏ మాత్రం ప్రతిబింబించదు. అంతేకాదు అది ఏదో ఊహాజనిత చిత్రాన్ని ప్రతిబింబించదు.

అలాగే మీరు కూడా మీ మిత్రుని లోపాలను ఎలాంటి హెచ్చుతగ్గులు లేకుండా చెప్పాలి. అనవసరమయిన మొహమాటం వల్లనో ముఖ స్తుతికిలోనయో లోపాలను కప్పిపుచ్చరాదు. లేక మీవాగ్ధాటి, ప్రసంగపటిమతో వాటిని అధికం చేయకూడదు. మీ ఎదుటకు వచ్చిన సాధారణ జీవితానికి సంబంధించిన

లోపాలనే మీరు ఎత్తి చూపాలి. లేని తప్పులెన్నటంలో పడకూడదు. మరుగున ఉన్న లోపాలను వెలికి తీయటం నైతిక సేవ అనిపించుకోదు, అది వినాశకరమయిన నీతికి హానికరమయిన చర్య.

ఒకసారి దైవప్రవక్త (సఅసం) వేదికనెక్కి ఎలుగెత్తి సభికులను ఇలా హెచ్చరించారు. "ముస్లిమ్‌ల లోపాలను వెదుకుతూ వెంటపడకండి. తోటి ముస్లిమ్ సోదరుల రహస్యలోపాలను బయట పెట్టటానికి ప్రయత్నించిన వారి రహస్య లోపాలను దేవుడు బహిర్గతం చేస్తాడు. ఎవరిలోపాలనయితే దేవుడు బయట పెట్టదలుచుకుంటాడో, ఆ వ్యక్తి ఇంట్లో దూరి కూర్చున్నాసరే ఆయన అతన్ని పూర్తిగా అవమానపరచిగాని వదలిపెట్టడు." (తిర్మిజి)

(ఇ) అద్దం ఎలాంటి స్వార్థం లేకుండా నిష్పక్షపాతంగా తన విధిని నిర్వర్తిస్తుంది. దాని ముందుకు వెళితే వ్యక్తిముఖాన్ని నిస్వార్థంగా ఉన్నది ఉన్నట్లుగా ప్రతిబింబిస్తుంది. అది ఎవరిపట్లా ద్వేషభావం, వైషమ్యం కలిగి ఉండదు. దానికి ప్రతీకార బుద్ధి కూడా ఉండదు. అలాగే మీరు కూడా స్వార్థ ప్రయోజనాలు, ప్రతీకారవాంఛ, ద్వేషం, వైషమ్యం, దుస్సంకల్పాలకు అతీతంగా విమర్శ చెయ్యండి.

ఎందుకంటే, అద్దాన్ని చూచి మనిషి తనను తాను సరిదిద్దుకునేలా మీ మిత్రుడు కూడా మిమ్మల్ని చూసి సంస్కరించుకోగలగాలి.

(ఈ) అద్దంలో తన చిత్రాన్ని చూసుకొని ఏ వ్యక్తీ చిర్రెత్తిపోవడంగాని, కోపోద్రేకంతో అద్దాన్ని పగల గొట్టటంగాని చేయడు, వెంటనే తనను తాను తీర్చి దిద్దుకుంటాడు. పైగా మనస్సులో దాని గౌరవ విలువలను కొనియాడుతూ దానికి క్రియారూపంలో కృతజ్ఞత చెల్లించుకుంటాడు. "నిజానికి ఈ అద్దం నన్ను తీర్చిదిద్దటానికి ఎంతో దోహదపడింది, తన సహజ కర్తవ్యాన్ని నిర్వహించింది." అనుకుంటూ దాన్ని ఎంతో జాగ్రత్తగా తీసి మరోసారి వాడటానికి భద్రపరచుకుంటాడు. అలాగే మీ మిత్రుడు తన మాటల అద్దంలో మీ వాస్తవ చిత్రాన్ని ఉంచినప్పుడు మీరు చికాకుపడి పుల్ల విరుపు జవాబు ఇవ్వకూడదు. స్నేహితుడుగా తన బాధ్యతను నెరవేర్చినందుకు మీరు అతనికి కృతజ్ఞత తెలియజేయాలి. నోటితోనే కాక హృదయ పూర్వకంగా కృతజ్ఞతలు తెలుపుకుంటూ తక్షణమే సంస్కరించుకునే యోచన చేయాలి. అత్యంత విశాల హృదయంతో కృతజ్ఞతా భావంతో ఉన్నత స్నేహ ప్రమాణాలను నిలబెట్టాలి. ఇక ముందు

కూడా అలాంటి విలువైన సలహాలనే ఇవ్వమని అతన్ని వేడుకోవాలి.

(ఉ) ముస్లిముల్లోని ప్రతివ్యక్తి తన సోదరునికి అద్దం వంటివాడు. సోదరుడు సోదరుని పట్ల చిత్తశుద్ధితో, వాత్సల్యంతో, విశ్వసనీయతతో, శ్రేయోభిలాషతో, సానుభూతితో మెలుగుతాడు. సోదరుడు ఆపదల్లో ఉంటే చూసి విలవిల్లాడిపోతాడు. సంతోషంగా ఉంటే తానుకూడా సంతోషిస్తాడు. అందువల్ల సోదరుడు గాని, స్నేహితుడు గాని విమర్శించినప్పుడు అందులో ఎంతో ప్రేమ, సానుభూతి, నిర్మలత్వం, బాంధవ్యం, శ్రేయోభిలాష ఉంటాయి.

అతని ప్రతి పలుకులో సంస్కరణాసక్తి ప్రతిబింబిస్తుంది. ఇలాంటి విమర్శనలే విడిపోయిన హృదయాలను కలపటానికి, జీవితాలను తీర్చిదిద్దటానికి దోహదపడతాయని ఆశించగలం.

17 స్నేహితులపైన అనురాగాన్ని వ్యక్తం చేయడానికి, స్నేహితులమధ్య ప్రేమను అధికం చేయడానికి కానుకలు ఇచ్చిపుచ్చుకోవడం అవసరం. కానుకలవల్ల హృదయాలు కలుస్తాయి, ప్రేమానురాగాలు అధికమవుతాయి.

ప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు: "ఒకరికొకరు కానుకలు అందజేసుకోండి, దానివల్ల పరస్పర అనురాగం పెరుగుతుంది. హృదయాల్లో ఏర్పడిన మాలిన్యం దూరమౌతుంది." (మిష్కాత్)

ప్రవక్త (సఅసం) స్వయంగా తన అనుచరులకు అనేక కానుకలు ఇచ్చేవారు. ఆయన (సఅసం) అనుచరులు కూడా పరస్పరం కానుకలు, బహూకరణలు ఇచ్చిపుచ్చుకుంటూ ఉండేవారు.

కానుకలు ఇచ్చేటప్పుడు తన తాహతును చూసుకోవాలి. అది విలువైనదే కావాలని భావించరాదు. ఏది అందుబాటులో ఉంటే అదే ఇవ్వాలి. కానుక విలువైనదా కాదా అన్నది మీ చిత్తశుద్ధి, భావనలపై ఆధారపడి ఉంటుంది. ఈ చిత్తశుద్ధి, నిష్కల్మష భావాలే హృదయాలను ఏకం చేస్తాయి. హృదయాలను చేరదీసేది కానుకల ఖరీదు కాదు. అలాగే మీ స్నేహితుడిచ్చే ఏకానుకనూ ఎప్పుడూ అల్పమయినదిగా భావించరాదు. అతని చిత్తశుద్ధిని, అనురాగాన్ని గమనించండి.

దైవప్రవక్త (సఅసం) ఇలా అన్నారు:

"నాకు కానుకగా మేక కాలి ముక్క ఒకటి ఇచ్చినా దాన్ని నేను తప్పకుండా స్వీకరిస్తాను. విందులో ఒక కాలునే తినిపించినా నేను ఆ విందుకు తప్పకుండా వెళతాను." (తిర్మిజి)

కానుకకు బదులు కానుకను తప్పకుండా ఇవ్వాలి. ప్రియప్రవక్త(సఅసం) ఈ విధానాన్ని పాటించేవారు. ఆయనకు (సఅసం) ప్రీతికరమైన కానుక సువాసన (పరిమళ ద్రవ్యం). మీరు కూడా ఆ కానుకను ఇష్టమయినదిగా భావించండి. ఈనాటి పరిస్థితుల్లో పుస్తకం కూడా ఓ మంచి బహుమానమే. అప్పుడప్పుడూ కలిసి భోజనాలు చేసే ఏర్పాటుకూడా చేసుకోవాలి. స్నేహితులను మీ వద్దకు భోజనానికి ఆహ్వానించండి. బంధుమిత్రులు విందు చేస్తే అత్యంత ఆనందంతో ఆ విందులో పాల్గొనండి. దాని వల్ల కూడా పరస్పరానురాగాలు అభిమానం అధికమౌతాయి, పటిష్టమూ అవుతాయి. అయితే ఇటువంటి సందర్భాలలో హద్దుమీరి, మొహమాటానికి పోయి తినుబండారాలను అధికంగా ప్రదర్శించడానికి బదులు అభిమానాన్ని, హృదయనైర్మల్యాన్ని చూపడంలో ఎక్కువ శ్రద్ధ చూపాలి.

18. స్నేహితుల యోగక్షేమాలు విచారిస్తూ ఉండాలి. అవసరం ఏర్పడి నప్పుడు ఆదుకుంటూ సకలవిధాలా వారికి సహాయం చేస్తూ ఉండాలి. ఇస్ఫహానీ ఉల్లేఖనం ప్రకారం, హజ్రత్ ఇబ్నె అబ్దుల్లాహ్ (రజి) వద్దకు ఒక వ్యక్తి వచ్చి "దేవునికి అత్యంత ప్రీతిపాత్రుడు ఎవరు?" అని అడిగాడు. అందుకు ఆయన "తోటి మానవులకు ఎక్కువ లాభం చేకూర్చే వ్యక్తే దేవునికి అత్యంత ప్రీతి పాత్రుడు. నీవు ఒక విశ్వాసిని సంతోషపరిస్తే అది నీ ఆచరణలలో దేవునికి అత్యంత ప్రీతికరమైనది. సంతోష పరచడం అంటే అతని కష్టాన్ని తొలగించడం, లేక అతని ఆకలిని తీర్చడం. ప్రవక్త మస్జిద్‌లో ఎతెకాఫ్ చేయడం కన్నా ఒక సోదరుని అవసరాన్ని తీర్చటానికి అతనితో పాటు వెళ్ళడమే నాకెక్కువ ఇష్టమయినది. తన కోపాన్ని వ్యక్తం చేసుకోగల శక్తి ఉన్నప్పటికీ దాన్ని దిగమింగే వ్యక్తి హృదయాన్ని అంతిమదినాన దైవం తన ప్రసన్నతా సిరులతో నింపివేస్తాడు. తన సోదరుడి అవసరాన్ని తీర్చడానికి వెళ్ళి ఆ అవసరాన్ని తీర్చివేసినట్లయితే అంతిమ దినాన, అందరిపాదాలు తడబడుతున్నప్పుడు, అతని రెండు పాదాలకు దేవుడు నిలకడను ప్రసాదిస్తాడు."

మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారుః

"తన సోదరుని అవసరాన్ని తీర్చిన వ్యక్తి అవసరాన్ని తీర్చడంలో దైవం నిమగ్నమయిపోతాడు. ఒక విశ్వాసి బాధను నివారించితే, అతని ప్రళయదిన బాధల్లో ఒక బాధను దైవం తొలగిస్తాడు." (బుఖారి, ముస్లిమ్)

మరొక సందర్భంలో ఆయన ఇలా అన్నారు. "ఒక దైవ దాసుడు తన

సోదరునికి సహాయం చేయటంలో నిమగ్నుడయి ఉన్నంతకాలం దేవుడు అతని సహాయంలో నిమగ్నుడయి ఉంటాడు." (తిర్మిజి)

హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్నె అబ్బాస్ (రజి) ఇలా ఉల్లేఖించారు:

"ఒక విశ్వాసి అవసరం తీర్చడంవల్ల లభించే పుణ్యఫలం పది సంవత్సరాల ఎతెకాఫ్ (మస్జిద్‌లో నిరంతర ఆరాధనల్లో నిమగ్నుడయి గడపడం) కంటే అధికమయింది" అని ప్రవక్త (సఅసం) అన్నారు. (తిబ్రాని)

హజ్రత్ అనస్ (రజి) ఇలా ఉల్లేఖించారు:

"తన సోదరునికి ఎవరయినా ఆనందాన్ని సంతోషాన్ని కలిగించే సమాచారాన్ని అందజేసి దాని ద్వారా అతన్ని ప్రసన్నుడిగా చేస్తే అతన్ని దేవుడు అంతిమ దినాన ప్రసన్నుడిగా చేస్తాడు." (తిబ్రాని)

19. స్నేహితుని రహస్యాలను అత్యంత గోప్యంగా ఉంచాలి. మిత్రుడు మిమ్మల్ని నమ్మి తన మనసులోని మాటను చెబితే దాన్ని పదిలంగా దాచాలి. ఎట్టి పరిస్థితిలోనూ స్నేహితుని నమ్మకాన్ని వమ్ము చేయరాదు. మీ హృదయాన్ని పటిష్టమైన రహస్యాల నిక్షేపంగా చేసుకోవాలి. తద్వారా స్నేహితుడు నిస్సంకోచంగా ప్రతి విషయంలోనూ మీ సలహా తీసుకోగలగాలి, మీరు మీ స్నేహితునికి తగు సలహాలు ఇచ్చి సహాయం చేసే అవకాశం ఉండాలి.

హజ్రత్ ఉమర్ (రజి) ఇలా ఉల్లేఖించారు: హఫ్సా (రజి) వితంతువయి నప్పుడు నేను ఉస్మాన్ (రజి)ను కలుసుకొని నీవు ఇష్టపడితే హఫ్సా (రజి)ను నీకిచ్చి వివాహం చేస్తానన్నాను. ఈ విషయం ఆలోచిస్తానని ఉస్మాన్ (రజి) జవాబిచ్చారు. నేను ఎన్నోరోజులు ఎదురు చూశాను. తర్వాత ఉస్మాన్ (రజి) నాతో కలిసి నాకు ప్రస్తుతం వివాహం చేసుకొనే ఆలోచనలేదు అని చెప్పారు. నేను మళ్ళీ అబూబకర్ (రజి) వద్దకు వెళ్ళి నీవు ఇష్టపడితే హఫ్సాను వివాహం చేసుకోవచ్చు అని అన్నాను. ఆయన మౌనం వహించారు. ఎలాంటి జవాబూ ఇవ్వలేదు. ఆయన మౌనం నన్ను చాలా వేధించింది. ఉస్మాన్ (రజి) మౌనం కన్నా ఇది అధికంగా వేధించింది. అలాగే ఎన్నో రోజులు గడిచిపోయాయి.

తర్వాత మహాప్రవక్త (సఅసం) హఫ్సాను వివాహం చేసుకొంటానని సందేశం పంపించారు. నేను ప్రవక్త (సఅసం)తో హఫ్సా వివాహం చేశాను, ఆ తర్వాత అబూబకర్ (రజి)నన్ను కలిసి ఇలా అన్నారు. "నీవు నాకు హఫ్సా (రజి) విషయం చెప్పావు. నేను మౌనం వహించాను, నా మౌనం వల్ల నీకు బాధ కలిగి

ఉండవచ్చు". "అవును బాధ కలిగిందని" నేను అన్నాను. అప్పుడాయన ఇది ప్రవక్త (సఅసం) రహస్యం. దానిని నేను వ్యక్తంచేయదలచలేదు. ఒక వేళ ప్రవక్త (సఅసం) హఫ్సా (రజి) విషయం నాతో అని ఉండకపోతే నేను తప్పకుండా ఒప్పుకొని ఉండేవాడిని." అని అన్నారు. (బుఖారి)

హజ్రత్ అనస్ ఉల్లేఖనం: బాల్యంలో ఒకసారి తోటి బాలురతో కలిసి ఆడుకొంటున్నాను. అంతలో ప్రవక్త (సఅసం) వచ్చి మాకు సలామ్ చేశారు. తర్వాత తన అవసరం నిమిత్తం నన్ను ఒక చోటికి పంపారు. నేను దాన్ని నెరవేర్చడంలో ఆలస్యమైంది. ఆపని పూర్తిచేసి ఇంటికి వెళ్ళగానే మా అమ్మ "ఇంత ఆలస్యం ఎందుకైందని" అడిగింది.

"ప్రవక్త (సఅసం) తన అవసరనిమిత్తం పంపించారు" అన్నాను.

"ఏంపని? అని అమ్మ అడిగింది." అదొక రహస్యమైన విషయం! అని నేను చెప్పాను. అప్పుడు అమ్మ అంది. "చూడు బాబూ! ప్రవక్త (సఅసం) రహస్యం ఎవరికి చెప్పకూడదు." (ముస్లిమ్)

20. సామూహిక నైతికతలో విశాల దృష్టి, సర్వజనీనత, సహిష్ణత, సమదృష్టిజనింపజేయాలి. తద్వారా విభిన్న అభిరుచులు, రకరకాల మనస్తత్వాలు, ఆలోచనలుగల మనుష్యుల్ని మీ వ్యక్తిత్వం ఆకట్టుకోగలుగుతుంది. మీరు ప్రతి మనిషికి ఉన్నటువంటి ప్రత్యేక అభిరుచి, దృక్పథం, విశిష్టమనస్తత్వాన్ని గ్రహించి ఎవరి ఉద్రేకాలకూ దెబ్బ తగలకుండా అత్యంత చాకచక్యంగా ప్రవర్తించాలి. ప్రతి ఒక్కరినీ మీ ప్రత్యేక అభిరుచి ప్రమాణంతో కొలిచే తెలివిలేమిని కనబరచరాదు.

అలాగే ప్రతి ఒక్కరినీ మీ స్వభావానికి అనుకూలంగా మలచుకొనే అర్థంలేని వృధా ప్రయత్నం చేయరాదు. అభిరుచి, మనస్తత్వాల వైవిధ్యం సహజసిద్ధమైన సౌందర్యం, దానిని కృత్రిమమైన అందంగా మలిచే వృధా ప్రయాసతో రూపుమాపరాదు. ప్రతిస్నేహితుడికి అతని సహజమైన స్థానం ఇచ్చి అతని పట్ల శ్రద్ధ కనబరచాలి. అతన్ని గౌరవించాలి. ఉన్నతమైన నైతికతతో అతన్ని ఆకట్టుకొని సంబంధాన్ని పటిష్టం చేసుకోవాలి.

ప్రవక్త మహనీయుని (సఅసం)లోని మహత్తర సర్వజనీన నైపుణ్యాల కారణంగానే సకల అభిరుచులు గలవారు, రకరకాల నైజాలు కలవారు ఆయన సాన్నిధ్యంలో తృప్తిని ప్రశాంతతను పొందేవారు. ప్రవక్త వివేచన వల్ల తమ వైఖరికి అనుకూలమైన వాతావరణం పొందేవారు. తాము అపరిచితులమని భావించేవారు కాదు. ప్రవక్త (సఅసం) సభలో అబూబకర్ (రజి) వంటి మృదు శీలురు,

సహనశీలురూ ఉంటే ఒరలేని ఖడ్గం వంటి ఉమర్ ఫారూఖ్ (రజి) కూడా ఉండేవారు. యుద్ధం ఊసెత్తగానే వణికే హస్సాన్ బిన్ సాబిత్ (రజి) వంటి వారున్నూ, అలీ (రజి) వంటి ఖైబర్ విజేతలున్నూ ఉండేవారు. అబూజర్ గిఫ్ఫారి (రజి) వంటి నిరాడంబర జీవులు, అబ్దుర్రహ్మాన్ ఇబ్నెఔఫ్ వంటి ఆస్తిపరులు, సౌందర్య పిపాసులూ ఉండేవారు. కానీ మహాప్రవక్త (సఅసం)లోని ఉన్నత నైతికత, విశాలదృష్టి, వివేచనా సౌందర్యం, విజ్ఞతా సంపత్తి వల్ల వీరందరూ ప్రవక్త (సఅసం)తో అనుపమానమయిన, అసాధారణమైన ప్రేమానురాగాలు కలిగి మెలిగేవారు, బహుశా ప్రవక్త (సఅసం)కు తానే ఎక్కువ ప్రీతి పాత్రుడనని ప్రతి ఒక్కరూ భావించేవారు. అలాగే ప్రవక్త(సఅసం) కూడా అందరితో ఎంతో ప్రేమగా మెలిగేవారు. ఈ విశాల హృదయం, వివేచనా సౌందర్యం, అసాధారణ త్యాగభావం వల్ల ఆయన (సఅసం) ఆదర్శవంతమైన అనుచర సమాజాన్ని నిర్మించారు. అనుచరుల స్వభావాలలో పరస్పర వైరుధ్యం ఉన్నప్పటికీ వారిలో నిరుపమాన సంఘీభావం, అసామాన్య సహాయ సహకారాలు, గర్వించదగిన ప్రేమాభిమానాలు ఉండేవి. మానవచరిత్రలోని ఈ పుటలు దాని సుదీర్ఘ మనుగడ సాధించిన ఫలితమని అనడంలో అతిశయోక్తి లేదు.

సామూహిక నడవడిలో వివేచనా పూర్వకమైన పట్టువిడుపులు, అసాధారణమైన ఓర్పు కనబరచడం ద్వారానే స్నేహ సంబంధాలు వాస్తవానికి విజయవంతమవుతాయి, పటిష్టమూ అవుతాయి. స్నేహ సంబంధాల్లో సహిష్ణుతాభావం, క్షమ, ఔదార్యం, భావాత్మకమైన త్యాగం, పరస్పరం చూపోపు వహించడం, వినయ వినమ్రతలు, పరస్పర భావావేశాలను గౌరవించడం, శ్రేయోభిలాష ఇత్యాది వైఖరుల్ని అవసరం మేరకు పాటించాలి.

ప్రవక్త(సఅసం) జీవితంలోని కొన్ని సంఘటనలవల్ల ఆయన (సఅసం) తన ఉన్నత నైతికత, విశాలహృదయం, ఓర్మి ఔదార్యాలతో ప్రజల సహజ అవసరాలను బలహీనతల్ని ఎలా మన్నించేవారో గ్రహించవచ్చు.

☆ ఒకసారి మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు. "నేను నమాజ్ చేసేందుకు వస్తాను, సుదీర్ఘమయిన నమాజు చేయాలని అనుకుంటాను, అయితే, ఏ శిశువు ఏడుపో వినిపిస్తే నేను నమాజును కుదించి చేస్తాను. ఎందుకంటే నా సుదీర్ఘ నమాజు వల్ల శిశువు తల్లికి కష్టం కలగటంనాకు సహించదు. (బుఖారి)

☆ హజ్రత్ మాలిక్ బిన్ హువీరస్ ఇలా ఉల్లేఖించారు: సమవయస్కులమైన కొందరు యువకులం ధార్మిక విద్యను అభ్యసించడానికి ప్రవక్త(సఅసం) వద్దకు

వెళ్ళాము. ఆయన వద్ద ఇరువయి రోజులు గడిపాము. ప్రవక్త(సఅసం) అత్యంత దయాశీలురు, మృదువర్తన కలవారు. ఇరువయి దినాలు గడిచిన తరువాత ఆయన (సఅసం) మేము ఇంటికి వెళ్ళడానికి ఆసక్తిగా ఉన్నామని గ్రహించారు.

"మీరు ఎవరెవరిని ఇంటి వద్ద వదలి వచ్చారు?" అని ఆయన (సఅసం) అడిగారు. మేము ఇంటి విషయాలన్నీ చెప్పాము. అప్పుడాయన (సఅసం) "మీరు మీ భార్యాపిల్లల వద్దకు వెళ్ళండి, వారి మధ్య ఉంటూ మీరు నేర్చుకున్నదంతా వారికి నేర్పండి, వారికి మంచి పనులు చేయమని చెప్పండి, ఆయా సమయాల నమాజులు ఆయావేళల్లో చేయండి. మీలో ఒకరు అజాన్ పలకాలి. జ్ఞానంలో, గుణగణాల్లో మిన్నగావున్న వారు నమాజు చేయించాలి." అని బోధించారు.

(బుఖారి, ముస్లిమ్)

☆ హజ్రత్ మావియా బిన్ హకమ్ సులమి (రజి) తన విషయం ఇలా వినిపించారు:

నేను ఒకసారి ప్రవక్త (సఅసం)తో కలిసి నమాజు చేస్తున్నప్పుడు, ఒక వ్యక్తికి తుమ్ము వచ్చింది. నమాజ్ చేస్తూ ఉండగానే నా నోటినుండి " యర్హ ముకల్లాహ్" అన్నపదాలు వెలువడ్డాయి. ప్రజలు నన్ను చురచురచూశారు, "దైవం మిమ్మల్ని కరుణించుగాక! నన్ను ఎందుకిలా చూస్తున్నారు?" అని ప్రశ్నించాను. వారు నన్ను మౌనంగా ఉండమని సంజ్ఞ చేస్తే నేను మౌనం వహించాను. ప్రవక్త (సఅసం) నమాజ్ పూర్తిచేసుకొన్నారు. నా తల్లి దండ్రులు ఆయనకై అర్పింతు, ప్రవక్త (సఅసం) కంటే ఉత్తమ విద్యాబుద్ధులు చెప్పే వారిని నేను ఆయనకు పూర్వంగాని, ఆ తరువాతగాని చూడలేదు. ఆయన (సఅసం) నన్ను ఏ మాత్రం మందలించలేదు, కొట్టలేదు, తిట్టలేదు. కేవలం ఇలా అన్నారు. 'ఇది నమాజు. నమాజులో మాట్లాడటం భావ్యం కాదు. దేవుని పవిత్రతను ఆయన మహత్తును, కొనియాడటాన్ని ఖుర్ఆన్ పఠించడాన్నే నమాజు అని అంటాము." (ముస్లిమ్)

21. దుఆ చేయడానికి ప్రత్యేక శ్రద్ధను పాటించాలి. మీరున్నూ స్నేహితుల కొరకు దుఆ చేయాలి. వారిని కూడా మీ కోసం దుఆ చేయమని కోరాలి. దుఆ స్నేహితుల సమక్షంలో కూడా చేయాలి. వారి పరోక్షంలో కూడా చేయాలి, వారి పరోక్షంలో వారిని గుర్తుపెట్టుకొని వారి పేరు చెప్పి మరీ దుఆ చేయాలి.

హజ్రత్ ఉమర్ (రజి) ఇలా ఉల్లేఖించారు: నేను ప్రవక్త (సఅసం)ను ఉమ్రా

కోసం అనుమతి కోరాను. ఆయన (సఅసం) తమ సమ్మతిని తెలుపుతూ "సోదరా! నీ దుఆలో మమ్మల్ని మరచిపోకు" అని అన్నారు. ఆ మాటలతో నాకెంతో ఆనందం కలిగింది. నాకు సమస్త ప్రపంచం లభించినా అంత ఆనందం కలిగేది కాదు.

ప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు: "ఒక విశ్వాసి, మరో సోదర విశ్వాసి కోసం పరోక్షంగా దుఆ చేస్తే దేవుడు దాన్ని స్వీకరిస్తాడు, దుఆ చేసేవారి తల వద్ద ఒక దైవదూత నిలబడి అతను తన సోదరునికై మంచి దుఆ చేస్తున్నప్పుడు దైవదూత "ఆమిన్" అంటూ, నీవు నీసోదరునికై ఏది కోరుతున్నావో అది నీకూ్కడా లభిస్తుంది." అంటాడు. (సహీ ముస్లిమ్)

చిత్తశుద్ధితో, ధ్యానంతో చేసే దుఆలలో, మన హృదయాలనుండి వైషమ్యం, వైరం, కల్మషాలను కడిగివేసి పరిశుద్ధం చేయమని దైవాన్ని వేడుకోవాలి. మన హృదయాలను ప్రేమానురాగాలతో కలిపివేయమని, మన సంబంధాలను పరస్పర సమైక్యతాభిమానాలతో ఆనందమయం చేయమని దైవాన్ని ప్రార్థించాలి. పవిత్ర ఖుర్ఆన్‌లోని ఈ దుఆను అలవాటు చేసుకోవాలి.

رَبَّنَا اغْفِرْ لَنَا وَلِإِخْوَانِنَا الَّذِينَ سَبَقُونَا بِالْإِيمَانِ
وَلَا تَجْعَلْ فِي قُلُوبِنَا غِلًّا لِّلَّذِينَ آمَنُوا رَبَّنَا إِنَّكَ
رَءُوفٌ رَّحِيمٌ (الحشر)

రబ్బనగ్‌ఫిర్ లనా వలిఇఖ్‌వాని నల్లజీన సబఖూనా బిల్ ఈమాని వలాతజ్ అల్ ఫీఖులూబినా గిల్లల్ లిల్‌ల్లజీన ఆమనూ రబ్బనా ఇన్నక రవూఫుర్రహీమ్.

"ప్రభూ! మమ్మల్నీ – మాకు పూర్వమే విశ్వాసాన్ని గ్రహించిన మా సోదరులనూ కటాక్షించు. మా హృదయాలలో ఒకరి పట్ల ఒకరికి కల్మషాన్నీ, కపటాన్నీ స్పర్థలను ఉండనీయకు. ప్రభూ, నీవు అమిత దయామయుడవు, కరుణామయుడవూను." (హష్ర్)

# 5 ఆతిథ్యం – దాని మర్యాదలు

1. అతిధి రాగానే సంతోషం, ఆత్మీయతల్ని వ్యక్తం చేయాలి. అత్యంత ఆనందంతో, విశాల హృదయంతో సగౌరవంగా అతడిని ఆహ్వానించాలి. సంకుచిత మనస్సు, వైముఖ్యం, అశ్రద్ధ, అసహనం ప్రదర్శించరాదు.

దైవ ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు.

"దైవాన్నీ, తుది దినాన్నీ విశ్వసించేవారు తమ అతిధులను తప్పనిసరిగా ఆదరిస్తారు." (బుఖారి, ముస్లిమ్)

ఆదరించడంలో అతిధికి చేసే గౌరవ మర్యాదలు, చేకూర్చే సౌలభ్యాలు, సౌకర్యాలు, అందజేసే ఆనందం, సంతృప్తులు, అతిధిభావోద్రేకాల మన్నన, నగుమోముతో పలుకరించడం, సుహృద్భావంతో వ్యవహరించడం, ప్రసన్నత చేకూర్చే మాటలతో ఆహ్లాదపరచడం, గౌరవ మర్యాదలతో, కూర్చునేందుకు, విశ్రమించేందుకు ఏర్పాట్లు చేయడం, తన గౌరవనీయులయిన మిత్రులతో పరిచయం చేయడం, అతిథి అవసరాలను తీర్చడం, విశాల హృదయంతో అన్నపానీయాలు సమకూర్చడం, స్వయంగా మర్యాదలు చేసేందుకు సన్నద్ధమవ్వడం ఇత్యాది అనేక విషయాలు "అతిథి సత్కారంలో" చేరి ఉన్నాయి.

★ ప్రవక్త (సఅసం) వద్దకు గౌరవనీయ అతిథులు వచ్చినప్పుడు తాను స్వయంగా వారికి మర్యాదలు చేసేవారు.

★ అతిధి భోజనం చేస్తున్నప్పుడు, మాటి మాటికీ 'ఇంకా తీసుకోండ, ఇంకా తీసుకొండి' అంటూ ఉండేవారు. అతిధి తృప్తిగా తిని ఇకచాలు అనేంతవరకు ఆయన (సఅసం) అలా అంటూనే ఉండేవారు.

2. అతిధి రాగానే మొట్టమొదట సలామ్ చేసి, యోగక్షేమాలు విచారించి తెలుసుకోవాలి.

ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది:

"మీకు ఇబ్రాహీమ్ (అలై) వద్దకు గౌరవనీయ అతిధులు వచ్చిన గాధ తెలుసా? ఆయన వద్దకు రాగానే వారు ముందు సలామ్ చేశారు. ఇబ్రాహీమ్ (అలై) కూడా ప్రతి సలామ్ చేశారు."

3. నిండు హృదయంతో అతిధిని సత్కరించాలి. ఉన్నదానిలో

ఉత్తమమయిన దాన్నివెంటనే అతిధి ముందుంచాలి. హజ్రత్ ఇబ్రాహీమ్ (అలై) అతిధులు వచ్చినప్పుడు వెంటనే వారి అన్నపానీయాల ఏర్పాటులో నిమగ్నులయ్యారు. ఆయన వద్ద బాగా బలిసి ఆరోగ్యంగా ఉన్న దూడ ఒకటి ఉండేది. దాని మాంసాన్నే వేయించి అతిధుల ముందుంచారు. ఖుర్ఆన్‌లో దాని గురించి ఇలా ఉంది:

ఆయన వెంటనే ఇంట్లోకివెళ్ళి ఒక బలిసిన, ఆరోగ్యవంతమైన దూడను (జిబహ్ చేసి, వేయించి) అతిధుల ముందుంచారు. ఈ ఆయత్‌లోని తొలి పదాలకు మరో భావం - ఆయన చడీచప్పుడు లేకుండా అతిధుల సత్కార నిమిత్తం ఇంట్లోకి వెళ్ళిపోయారు. అతిధులకు కనపడేలా అన్నపానీయాలకు, మర్యాదలకు ఏర్పాట్లు జరిగినట్లయితే వారు ముఖమాట పడి, ఆతిథ్యమిచ్చేవారికి కష్టం కలుగుతుందని భావించి వారిస్తారు. తమ వల్ల ఆతిథ్యమిచ్చేవారికి అసాధారణమైన శ్రమకలగటం ఇష్టపడరు. దానివల్ల అతిధికి తగురీతిలో సత్కరించే అవకాశం మిగలదు.

ప్రవక్త (సఅసం) అతిధి సత్కారాన్ని ఏ రీతిగా ప్రోత్సహించారో వర్ణిస్తూ హజ్రత్ అబూషరీహ్ ఇలా తెలియ జేస్తున్నారు:

నేను ఈ రెండు కళ్ళారా చూశాను, ఈ రెండు చెవులారా విన్నాను దైవప్రవక్త (సఅసం) ఇలా హితవు చేసేవారు: "దైవాన్నీ, తుది దినాన్నీ విశ్వసించేవారు తమ అతిధులకు తగు రీతిలో మర్యాదలు చెయ్యాలి, వారిని సత్కరించాలి. మొదటి రేయింపగళ్ళు అతిధికి బహుమానం ఇచ్చే సందర్భం."

(బుఖారి-ముస్లిమ్)

మొదటి రేయింపగళ్ళు ఆతిథ్యమివ్వడాన్ని బహుమానంగా చెప్పడంలో గల భావమేమంటే ఏ విధంగానయితే బహుమానం ఇచ్చేవారు పరమ సంతోషం, ప్రేమ నిండిన భావోద్రేకాలతో బహుమానాన్ని ప్రదానం చేస్తూ ఆనందాన్ని పొందుతారో అలాంటి అనుభూతులే మొదటి రోజు ఆతిథ్యమిచ్చేవారు పొందాలి. అలాగే గ్రహీతలు ఏ విధంగానయితే ఉత్సాహం, సంతోషంతో బహుమానం ప్రదానం చేసేవారిపట్ల ఆదరభావంతో, అది తమహక్కుగా భావించి బహుమానాన్ని పుచ్చుకుంటారో ఆ విధమైన అనుభూతినే అతిథి కూడా మొదటి రేయింపగళ్ళు వ్యక్తం చేయాలి. ఎలాంటి జంకు లేకుండా, హక్కుగా భావిస్తూ సంతోషంతో ఆతిథ్యాన్ని స్వీకరించాలి.

4. అతిధి రాగానే అతని సహజమైన అవసరాలను గ్రహించాలి. నిత్యకృత్యాల విషయంలో విచారించాలి. కాళ్ళు, చేతులు కడుగుకోడానికి, అవసరమైతే

స్నానం చేయడానికి ఏర్పాటు చేయాలి. భోజన సమయం కానప్పటికీ, అతిథి మొహమాటంతో కాదనకుండా నేర్పుగా అడిగి తెలుసుకోవాలి. అతిథి విశ్రమించే గదిని అతనికి చూపించాలి.

5. అనుక్షణం అతిథి వద్దనే ధర్నా చేసినట్లు కూర్చోరాదు. అలాగే చాలా పొద్దుపోయే వరకు అతిథిని విసిగించరాదు. అతిథికి విశ్రాంతి తీసుకునే అవకాశం ఇవ్వాలి. హజ్రత్ ఇబ్రాహీమ్ (అస) వద్దకు అతిథులు వచ్చినప్పుడు వారికి అన్నపానీయాల ఏర్పాటు చేయటానికి కొద్దిసేపు వారిని వదలి వేరుగా పోయారు.

6. అతిథుల భోజన పానీయాలపట్ల సంతోషపడాలి. సంకుచిత హృదయంతో బాధపడటం, లోలోనే మండి పడటం తగదు. అతిథి కష్టానికి కాదు, కారుణ్యానికి చిహ్నం. శుభాలకు దోహదకారి అవుతాడు. దైవం మీ వద్దకు పంపించిన వారి ఆహారాన్ని కూడా మీ వద్ద సమకూరుస్తాడు. అతడు మీ అదృష్టంలోనిదికాదు భుజించేది, తన భాగ్యం లోనిదే భుజిస్తాడు. అతడు మీ గౌరవ ప్రతిష్టలను ఇనుమడింప చేయడానికి కారణ భూతుడవుతాడు.

7. అతిథి గౌరవాభిమానాలను కూడా దృష్టిలో పెట్టుకోవాలి. అతని గౌరవ ప్రతిష్టలను మీ గౌరవ ప్రతిష్టలుగా భావించాలి. మీ అతిథిని ఎవరయినా అవమానిస్తే దాన్ని మీ ఆత్మాభిమానం, పౌరుషాలకు ఒక సవాలుగా పరిగణించాలి. ఖుర్ఆన్ ప్రకారం హజ్రత్ లూత్ (అస) అతిథులపైన పట్టణ వాసులు దురుద్దేశ్యంతో విరుచుకుపడినప్పుడు ఆయన వారిని కాపాడటానికి సిద్ధమై

" వీరు నా అతిథులు. వారి పట్ల అసభ్యకరంగా ప్రవర్తించి నన్ను అవమాన పరచకండి. వారి అవమానం నా అవమానమే" అని అన్నారు.

దివ్య ఖుర్ఆన్ ఆ మాట ఇలా ఉటంకించింది: "లూత్ (అస)ఇలా అన్నారు. "సోదరులారా! వీరు నా అతిథులు నన్ను అవమాన పరచకండి, దైవానికి భయపడండి, నన్ను అగౌరపరచటాన్ని మానుకోండి."

*(అల్ హిజ్ర్ 68,69)*

8. మూడు రోజుల వరకు అత్యంత శ్రద్ధతో ఉత్సాహంతో అతిథి మర్యాదలు నిర్వర్తించాలి. మూడు రోజుల వరకు ఆతిధ్యాన్ని పొందడం అతిథి హక్కు, ఆ హక్కును నిర్వర్తించడంలో విశ్వాసి అత్యంత విశాల హృదయంతో వ్యవహరించాలి. మొదటి రోజు ప్రత్యేక గౌరవ మర్యాదలు చేయవలసిన రోజు. అందుచేత మొదటి రోజు అతిథి మర్యాదలు, సత్కారాలు పూర్తిగా పాటించాలి. తర్వాత రెండు దినాలు అసాధారణ మర్యాదల్ని పాటించలేకపోయినా ఫరవాలేదు.

ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు.

"ఆతిథ్యం మూడు రోజుల వరకు చేయాలి. ఆ తర్వాత ఆతిథేయులు చేసేదంతా వారికి (సద్‌కా) దానంగా పరిణమిస్తుంది."

9. అతిథి సేవను నైతిక బాధ్యతగా భావించాలి. అతిథిని నౌకర్లకు లేక పిల్లలకు అప్పగించడానికి బదులు స్వయంగా వారి సేవ చేయడానికి, వారికి విశ్రాంతి సౌకర్యాలు కల్పించడానికి సన్నద్ధులయి ఉండాలి. దైవప్రవక్త (సఅసం) అతిథుల ఆతిథ్యాన్ని స్వయంగా తానే నిర్వర్తించేవారు. ఇమామ్ షాఫియీ, ఇమామ్ మాలిక్ అతిథిగా వెళ్ళినప్పుడు, ఇమామ్ మాలిక్ ఆయన్ని ఎంతో గౌరవ మర్యాదలతో ఒక గదిలో విశ్రమింప చేశారు. సహర్ (ఉషోదయానికి పూర్వం) సమయానికి ఎవరో తలుపు తట్టినట్లు ఇమామ్ షాఫియీకి వినిపిస్తే, "మిమ్మల్ని దైవం కరుణించుగాక, నమాజ్ సమయం అయింది" అని ఎంతో వాత్సల్యంతో పిలుపు వినిపించింది. చూస్తే ఇమామ్ మాలిక్ చేతిలో నీళ్ళ చెంబుపట్టుకొని కనిపించారు. ఇమామ్ షాఫియీకి సిగ్గు అనిపించింది. ఇమామ్ మాలిక్ అది పసిగట్టి ఎంతో ప్రేమతో "మిత్రమా నీవు ఏమీ అనుకోకు, అతిథి సేవచెయ్యవలసిందేగా" అని అన్నారు.

10. అతిథికి బస ఏర్పాటుచేసిన తర్వాత, మరుగుదొడ్డి ఇత్యాదివి చూపించాలి. నీళ్ళ చెంబు దగ్గర పెట్టాలి. ఖిబ్లా (నమాజ్‌చేసే) దిశను తెలియ జేయాలి. నమాజ్ చేసుకొనే స్థలం, ముసల్లా (నమాజ్ చేసుకునే చాప) వగైరా ఏర్పాటు చేయాలి. ఇమామ్ షాఫియీ (రహ్మలై)కి ఇమామ్‌మాలిక్ సేవకుడు బస ఏర్పాటు చేసిన తర్వాత, "అయ్యా? ఇది, ఖిబ్లాదిశ, నీళ్ళపాత్ర ఇక్కడ ఉంది. మరుగు దొడ్డి ఆవైపు ఉంది" అని తెలియజేశాడు.

11. భోజనానికి ముందు మీరు స్వయంగా చేయి కడుక్కొని తరువాత అతిథిచేతుల్నికడిగించాలి. ఇమామ్ మాలిక్ (రహ్మలై) అలా ఆచరించగానే ఇమామ్ షాఫియీ (రహ్మలై) అందుకు కారణం అడిగారు. ఆయన ఇలా అన్నారు, "భోజనానికి ముందు ఆతిథ్యం ఇచ్చే వారు చేతులు కడుక్కోవాలి. భోజనం వద్దకు వెళ్ళి అతిథికి స్వాగతం పలకడానికి సిద్ధంగా ఉండాలి. భోజనానంతరం అతిథుల చేతులు కడిగించాలి. అందరి తరువాత ఆతిథేయులు చేతులు కడుక్కోవాలి. ఎందుకంటే, లేచేముందు కూడా ఇంకెవరైనా భోజనానికి రావచ్చు."

12. భోజనాలవద్ద ఆహార పదార్థాలు, భుజించే పళ్ళేలు అతిథుల సంఖ్య కంటే కొంచెం ఎక్కువగానే పెట్టాలి. ఎందుకంటే భుజించే సమయంలో

ఇంకెవరైనా రావచ్చు. మళ్ళీ వారికోసమని ఏర్పాట్లు చేయడానికి పరుగెత్త వలసి ఉంటుంది, ఒక వేళ పాత్రలు, పదార్థాలు, ముందే ఏర్పాటయి ఉంటే వచ్చే వ్యక్తి కూడా మొహమాటపడకుండా, అది తన గౌరవంగా భావించి సంతోషిస్తాడు.

13. అతిథి విషయంలో త్యాగభావాన్ని చూపవలసి ఉంటుంది. స్వయంగా తాను శ్రమకు ఓర్చి అయినా సరే అతనికి సుఖం చేకూర్చాలి.

ఒకవ్యక్తి, ఒకసారి ప్రవక్త (సఅసం) సమ్ముఖానికి వచ్చి దైవప్రవక్తా నేను ఆకలిని భరించలేక పోతున్నాను అని అన్నాడు. ప్రవక్త (సఅసం) తన సతీమణి ఒకరి వద్దకు "తినడానికి ఏదయినా ఉంటే పంపించు" అని కబురు చేశారు. అందుకు ఆమె నుండి "మిమ్మల్ని ప్రవక్తగా చేసిపంపిన దేవునిసాక్షి! ఇక్కడ మంచినీళ్ళు తప్ప యింకేమీ లేదు." అని జవాబు వచ్చింది.

తర్వాత ఆయన (సఅసం) మరొక సతీమణి వద్దకు పంపించారు. అక్కడి నుండి కూడా అదే జవాబు వచ్చింది. ప్రవక్త (సఅసం) అలా తన సతీమణులందరి వద్దకు చెప్పి పంపించారు. అందరి వద్ద నుండి అదే జవాబు వచ్చింది. అప్పుడు ఆయన (సఅసం) తన సహచరులను ఉద్దేశించి "ఈ రాత్రికి ఈ అతిథిని ఎవరు స్వీకరిస్తారు' అని అడగ్గా ఒక అన్సార్ సహాబి (రజి) "దైవప్రవక్తా! నేను స్వీకరిస్తాను" అని అన్నారు. అన్సారి అతిథిని ఇంటికి తీసుకెళ్ళారు. ఇంటికి వెళ్ళి భార్యతో "దైవప్రవక్తగారి అతిథిని నా వెంట తెచ్చాను అతన్ని ఆదరించాలి.'' అని అన్నారు. భార్య, "నా వద్ద కేవలం పిల్లలకు సరిపడే భోజనం మాత్రమే ఉంది." అని బదులిచ్చింది. అప్పుడు సహచరులు "పిల్లలకు ఏదోనచ్చజెప్పి పడుకోపెట్టు, అతిథి ముందు భోజనం ఉంచినప్పుడు ఏదో సాకుతో దీపాన్ని ఆర్పివేయి, అతిథితోపాటు భోజనానికి మనమూ కూర్చుందాం. మనం కూడా భోజనం చేస్తున్నామని అతడు భావించేలా చేయాలి" అని అన్నారు. ఆ విధంగా అతిథికి కడుపునిండా భోజనం పెట్టారు. కాని ఇంటివారందరూ ఆ రాత్రికిపస్తులే. ఉదయం ఆ సహచరులు (రజి) ప్రవక్త (సఅసం) సమ్ముఖానికి వెళ్ళినపుడు ఆయన్ని చూసీ చూడగానే ఇలా అన్నారు. "మీరిద్దరు రాత్రి మీ అతిథి పట్ల చూపిన ఉత్తమ వైఖరిని దైవం చాలా మెచ్చుకున్నాడు."

(బుఖారి- ముస్లిమ్)

14. ఒకవేళ మీ అతిథి ఏదయినా సందర్భంలో మీపట్ల ముభావంగా, అయిష్టంగా ప్రవర్తించి ఉన్నప్పటికీ అతని పట్ల మీరు అత్యంత సహృదయత ఉదారబుద్ధి, విశాల హృదయం కనబరచాలి.

హజ్రత్ అబుల్ అహ్వాజ్ జష్మి (ర.జి) తన తండ్రి ఒక సారి దైవప్రవక్తని ఇలా అడిగారని తెలిపారు: 'నేను ఎవరివద్దకయినా వెళ్ళినప్పుడు అతను నాకు సరయిన ఆతిథ్యాన్ని ఇవ్వక అతిథి హక్కుల్ని సరిగ్గా నిర్వర్తించక పోతే అతను నావద్దకు వచ్చినప్పుడు నేను అతిథిహక్కులన్నీ అతని పట్ల సరిగ్గా నిర్వర్తించాలా? లేక అతనికి అదే (ముభావం, ఉపేక్ష, అలక్ష్యాల) రుచిచూపించాలా?,' దానికి దైవ సందేశహరులు (సఅసం) ఇలా ఉపదేశించారు: 'అలాకాదు. ఎట్టిపరిస్థితిలోనూ నీవు అతని ఆతిథ్యపు హక్కులన్నీ సరిగ్గానే నిర్వర్తించాలి.' (మిష్కాత్)

15 అతిథిని మీ ఇంట శుభశ్రేయాల ప్రాప్తి కొరకు దుఆ చేయమని కోరాలి. ముఖ్యంగా అతిథి మంచివాడు, ధర్మవర్తనుడు, ఆధ్యాత్మిక మహత్తు గలవాడయితే తప్పకుండా దుఆ కొరకు అర్థించాలి. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ బసర్ (రజి) ఇలా ఉల్లేఖించారు: "ప్రవక్త (సఅసం)నాతండ్రి వద్ద అతిథిగా ఉన్నారు. మేము ఆయన(సఅసం) ముందు హరీస(ఒక విధమైన ఆహారపదార్థం) ఉంచాము, ఆయన కొంచెం ఆరగించారు. తర్వాత మేము ఖర్జూరపు పండ్లను ఉంచాము, ఆయన ఖర్జూరాన్ని తింటూ వాటి విత్తనాలను చూపుడు వ్రేలు, మధ్య వ్రేలితో పట్టుకొని విసిరి వేస్తూ ఉండేవారు. తర్వాత త్రాగడానికి పానీయం ఇచ్చాము, ప్రవక్త(సఅసం) త్రాగి దాన్ని తన కుడిప్రక్కనున్న వారి ముందుంచారు. ఆయన వెళ్ళిపోతున్నప్పుడు నా తండ్రి ఆయన వాహనం కళ్ళేన్ని పట్టుకొని "ప్రవక్తా మా కోసం దుఆ చేయండి" అని అర్థించారు. ప్రవక్త(సఅసం) ఇలా దుఆ చేశారు.!

اَللّٰهُمَّ بَارِكْ لَهُمْ فِيْمَا رَزَقْتَهُمْ وَاغْفِرْ

لَهُمْ وَارْحَمْهُمْ۔ (ترمذی)

"అల్లాహుమ్మ బారిక్ లహుం ఫీమారజక్తహుమ్, వగ్ఫిర్ లహుమ్ వర్హమ్హుమ్"

"దేవా! నీవు వీరికిచ్చిన ఆహారంలో శుభాన్ని ఇనుమడింపచేయి, వారిని మన్నించు, వారిని కటాక్షించు, కనికరించు." (తిర్మిజి)

# 6 అతిథి విధి నిషేధాలు

1. ఎవరి వద్దకైనా అతిథిగా వెళ్ళినప్పుడు తాహతు ప్రకారం, ఆతిథ్య మిచ్చేవారికి లేక వారి పిల్లలకు ఏదైనా కానుక తీసుకువెళ్ళాలి. అతిథేయుల ఇష్టం, అభిరుచికి తగిన దాన్ని తీసుకెళ్ళాలి. కానుకలు ఇచ్చిపుచ్చుకోవడం వల్ల ప్రేమ, అనురాగ బంధాలు పెంపొందుతాయి. కానుక ఇచ్చేవారి పట్ల పుచ్చుకునేవారి హృదయంలో స్థానం ఏర్పడుతుంది.

2. అతిథిగా ఎవరి వద్దకు వెళ్ళినా మూడు రోజులకు మించి ఉండరాదు, అయితే ప్రత్యేక పరిస్థితుల వల్లగానీ, ఆతిథ్యమిచ్చిన వారు బాగా ఒత్తిడి చేసిన సందర్భంలోగాని ఉండవలసి వస్తే అది వేరే విషయం.

ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు.

"అతిథి, ఆతిథేయులకు కష్టంకలిగించే మేరకు వారి వద్ద ఉండరాదు."

(అల్ అదబుల్ ముఫ్రద్)

సహీహ్ ముస్లిమ్‌లో ఇలా ఉంది: "తన సోదరుణ్ణి పాపంలో పడేసేలా అతని వద్ద బసచెయ్యడం తగదు." దానికి ప్రజలు "దైవప్రవక్తా! పాపంలో పడవేయడం అంటే ఎలా?" అని అడిగారు. దానికి ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు:

"అతని వద్ద ఎన్నో దినాలు ఉండి, ఆతిథ్యం ఇవ్వడానికి అతని వద్ద ఇంకేమీ మిగులకుండా చేయడమే."

3. ఎల్లప్పుడు ఇతరులవద్దకు అతిథులుగా పోవడంతో సరిపోదు, ఇతరుల్ని కూడా మీ వద్దకు ఆహ్వానించాలి. మనస్ఫూర్తిగా సత్కరించాలి.

4. అతిథిగా వెళ్ళినప్పుడు కాలానుగుణంగ అవసరమైన సామగ్రి, పరుపు పడక మొదలైనవి తీసుకు వెళ్ళాలి. ముఖ్యంగా చలికాలంలో దుప్పటిలేకుండా అసలు వెళ్లకూడదు. ఎందుకంటే ఆతిథ్యమిచ్చేవారు శక్తికి మించి బాధపడవలసి వస్తుంది. ఆతిథ్యం ఇచ్చేవారికి ప్రాణసంకటంగా మారడం తగని పని.

5. ఆతిథ్య మిచ్చేవారి కార్యకలాపాల్ని, బాధ్యతల్ని కూడా దృష్టిలో ఉంచుకోవాలి. మీ వల్లవారి కార్యకలాపాలకు అంతరాయం కలగకుండా, అతని బాధ్యతల నిర్వహణలో ఆటంకం కలగకుండా మసలుకోవాలి.

6. ఆతిథేయుల్ని రకరకాల కోరికలు కోరకూడదు, మిమ్మల్ని సత్కరించ డానికి, మిమ్మల్ని సంతోష పరచడానికి ఆతిథేయులు స్వయంగా సమకూర్చిన దానికి తృప్తితో వారికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి. వారికి అనవసరమైన శ్రమ ఇవ్వకూడదు.

7. ఒక వేళ ఆతిథ్యమిచ్చేవారి స్త్రీలు- మీకు అపరిచితులు (గైర్‌మొహ్రం=

పెళ్లికి నిషిద్ధం కానివారు) అయితే అతడులేనప్పుడు అనవసరంగా వారితో మాట్లాడ రాదు, ఇంటి వారి సంభాషణ వినకూడదు. మీ మాటలు, మీవైఖరి వారికి ఎలాంటి ఇబ్బందిని కలిగించకుండా ఉండేలా మెలగాలి. సదా పరదా నియమాలను పాటించాలి.

8. ఒకవేళ ఏదైనా కారణంవల్ల మీరు ఆతిథేయులతో కలిసి భుజించదలచకపోతే లేక ఉపవాసం ఉంటే అత్యంత వినయంగా మన్నింపు కోరాలి. వారికై శుభ శ్రేయాల దుఆ చేయాలి.

హజ్రత్ ఇబ్రాహీమ్ (అస) గౌరవనీయులైన అతిథులు విచ్చేసినప్పుడు వారి ముందు ఉత్తమమయిన ఆహారాన్ని ఉంచారు. వారు భుజించక పోవడాన్ని చూసి హజ్రత్ ఇబ్రాహీమ్ (అస) మీరు భోజనం పుచ్చుకోరేమిటి? అని అభ్యర్థించారు. దైవ దూతలు ఆయన్ని సముదాయిస్తూ "మీరు బాధపడకండి, అసలు మేము తినలేము. మేము కేవలం మీకు యోగ్యుడైన కుమారుడు పుడతాడనే శుభవార్తను ఇవ్వడానికి వచ్చాము." అని అన్నారు. (అతిథులుగా వచ్చినవారు దైవదూతలు)

9. ఎవరి వద్దకైనా విందుకు వెళితే అన్నపానీయాల తర్వాత, ఆతిథేయునికి పుష్కలంగా ఆహారం, శుభశ్రేయాలు, దైవక్షమాపణలు ప్రాప్తం కావాలని దుఆ చేయాలి. హజ్రత్ అబుల్ హసీమ్ బిన్ తైహాన్ (రజి) ప్రవక్త (సఅసం)కు, వారి సహచరులకు (రజి) విందు ఏర్పాటు చేశారు. వారు అందరూ భోజనాలు చేసి తర్వాత ప్రవక్త (సఅసం) "తమ సోదరునికి ప్రతిఫలం ఇవ్వండి" అని అన్నారు. దానికి సహబా (రజి), దైవప్రవక్తా! ఏ ప్రతిఫలం ఇవ్వాలి?అని అడగ్గా ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు. "మనిషి తన సోదరుని వద్దకు వెళ్ళి అతని ఇంట భోజనం చేస్తే అతనికి శుభశ్రేయాలు ప్రాప్తం కావాలని ప్రార్థించాలి. అదే అతనికి ఇచ్చే ప్రతిఫలం." (అబూదావూద్)

ప్రవక్త (సఅసం) ఒకసారి హజ్రత్ సఅద్ బిన్ ఉబాద (రజి) వద్దకు వెళ్ళారు. హజ్రత్ సఅద్ (రజి) రొట్టె, జైతూన్ నూనె ముందు ఉంచారు. ఆయన (సఅసం) భుజించిన తర్వాత ఈ దుఆ చేశారు.

اَفْطَرَ عِنْدَكُمُ الصَّائِمُوْنَ وَاَكَلَ طَعَامَكُمُ الْاَبْرَارُ وَصَلَّتْ
عَلَيْكُمُ الْمَلَائِكَةُ - (ابوداؤد)

**"అఫ్‌తర ఇన్దకుముస్సాయిమూన వ అకల తఆమకుముల్ అబ్రారు, వసల్లత్ అలైకుముల్ మలాయికా" (అబూదావూద్)**

**"మీ వద్ద ఉపవాసకులు ఇఫ్తార్ చేయుదురుగాక! సత్పురుషులు మీవద్ద భోజనం చేయుదురుగాక! దైవదూతలు మీకు కారుణ్య క్షమాపణలకై దుఆ చేయుదురుగాక!"**

# 7. సభా మర్యాదలు

1. ఎల్లప్పుడూ మంచివారి సహచర్యంలో గడపటానికి ప్రయత్నించాలి.

2. కలిసి కూర్చున్నప్పుడు జరిగే సంభాషణలో పాల్గొనాలి, కలిసి కూర్చుని చర్చలో పాల్గొనకపోవడం తలబిరుసుతనానికి, గర్వానికీ చిహ్నం.

ప్రవక్త సహచరులు (సహబా) కూర్చొని జరిపే చర్చల్లో ప్రవక్త (సఅసం) కూడా పాల్గొనేవారు. సభలో విచారంగా, నిరాసక్తతతో కూర్చోకూడదు. నగుమోముతో, ఉత్సాహంగా ఉండాలి.

3. మీరు జరిపే ప్రతి సమావేశంలో దైవం, తుది దినం ప్రస్తావన వచ్చేలా ప్రయత్నించాలి. శ్రోతలు ధార్మిక విషయాల్లో శ్రద్ధచూపడం లేదని గ్రహించినప్పుడు సంభాషణను ఏదయినా ప్రాపంచిక సమస్య వైపునకు మరల్చాలి. తరువాత తగిన అవకాశం లభిస్తే సంభాషణను యుక్తిగా ధార్మిక విషయం వైపునకు మరల్చడానికి ప్రయత్నించాలి.

4. సమావేశంలో ఎక్కడ స్థలం ఉంటే అక్కడే కూర్చోవాలి. సమూహాన్ని చీల్చుకొని గెంతుతూ ముందుకు పోవడానికి యత్నించరాదు. అలా చేయడంవల్ల ముందు వచ్చిన వారికీ, కూర్చున్న వారికి కూడా ఇబ్బంది కలుగుతుంది. ఇలా చేసే వారిలో తను గొప్పవాడన్న భావం, గర్వం గోచరిస్తాయి.

5. సభలో కూర్చున్న ఒక వ్యక్తిని లేపి ఆ స్థలంలో కూర్చోడానికి ప్రయత్నించకూడదు, ఇది చాలా చెడ్డ అలవాటు. అలా చేయడం వల్ల ఇతరుల హృదయాల్లో ద్వేషం, వైషమ్యం కూడా జనిస్తాయి. తన గొప్పతనాన్ని తన ప్రాముఖ్యాన్నీ ప్రకటించే భావం కూడ వ్యక్తం అవుతుంది.

6. ఒకవేళ సమావేశంలో వ్యక్తులు వృత్తాకారంలో కూర్చుంటే వారి మధ్యలో కూర్చుండరాదు. ఇది అత్యంత అసహ్యమయిన, హాస్యాస్పదమయిన ప్రవర్తన. అలా చేసే వారిని ప్రవక్త (సఅసం) శపించారు.

7. సమావేశంలో కూర్చున్న వ్యక్తుల్లో ఎవరయినా అవసరం కలిగి లేచి వెళితే అతని స్థలాన్ని ఆక్రమించుకోకూడదు. అతని స్థలాన్ని అలాగే ఉంచాలి. ఆ వ్యక్తి తిరిగిరాడని తెలిస్తే, నిరభ్యంతరంగా ఆ స్థలంలో కూర్చోవచ్చు.

8. సమావేశంలో ఇద్దరు వ్యక్తులు దగ్గరగా కూర్చుంటే వారి అనుమతి

లేకుండా ఇద్దరినీ విడదీయరాదు. ఎందుకంటే పరస్పరం ప్రేమానురాగంతో, ఇంకా ఏదైనా కారణంతో వారలా దగ్గరగా కూర్చుని ఉండవచ్చు. వేరు చేస్తే వారు బాధపడతారు.

9. సభలో ప్రత్యేక స్థానంలో కూర్చోవడం చెయ్యరాదు. ఎవరి వద్దకైనా వెళితే అతని ఇంట గౌరవప్రదమయిన స్థానంలో కూర్చోడానికి ప్రయత్నించరాదు. అయితే అతనే స్వయంగా బలవంతం చేస్తే యెలాంటి అభ్యంతరంలేదు. సభలో ఎల్లప్పుడు వినయవిధేయతలతో కూర్చోవాలి, కాళ్ళు చాపి కానీ, లేక పిక్కలు కనబడేలా కానీ కూర్చోరాదు.

10. ఎలాగైనా సరే సభా అధ్యక్షునికి దగ్గరగా కూర్చోవాలని యత్నించరాదు. ఎక్కడ చోటు దొరికితే అక్కడే కూర్చోవాలి. తర్వాత వచ్చేవారు స్థలం లభించి కూర్చోడానికి కష్టం కలగకుండా కూర్చోవాలి. ప్రజలు అధిక సంఖ్యలో వచ్చినప్పుడు సర్దుబాటుచేసుకొని, వచ్చేవారికి విశాలహృదయంతో చోటివ్వాలి.

11. నలుగురితో ఉన్నప్పుడు ఒకరి ముందుగాని, లేక చుట్టూగాని గౌరవసూచకంగా నిలబడకూడదు. వినయం చూపే ఈ పద్ధతి ఇస్లామ్ స్వభావానికి వ్యతిరేకమయినది.

12. నలుగురిలో ఉన్నప్పుడు ఇద్దరు వ్యక్తులు పరస్పరం చాటు మాటుగా మాట్లాడుకోకూడదు. తద్వారా వారు తమ రహస్య సంభాషణలో ఇతరులు పాల్గొనేందుకు అనర్హులని భావించారనే భావన ఇతరుల్లో కలుగుతుంది. బహుశా మా గురించే ఏదో మాట్లాడుకుంటున్నారు అనే అనుమానం కూడా కలుగవచ్చు.

13. సమావేశంలో ఏదైనా చెప్పదలచుకుంటే సభాధ్యక్షుని అనుమతి పొంది మాట్లాడాలి. సంభాషణ, ప్రశ్న అడగటంలో లేక జవాబు చెప్పడంలో మీరే సభాధ్యక్షులనే భావం ఉట్టిపడే వైఖరిని అవలంబించరాదు. ఇది ఆత్మ ప్రదర్శనే కాక సభాధ్యక్షునికి అగౌరవం కూడా.

14. ఒక సమయంలో ఒకే వ్యక్తి మాట్లాడాలి. ప్రతి వ్యక్తి ప్రసంగాన్ని శ్రద్ధతో వినాలి. తమ మాటలు చెప్పటానికి ఆత్రం ప్రకటించకూడదు. అలా చేయడం వల్ల అందరూ ఒకేసారి మాట్లాడుతారు. సభలో గందర గోళం యేర్పడుతుంది.

15. సభలోని రహస్య సంభాషణల్ని ఇతర చోట్ల బహిర్గతం చేయరాదు, సభ రహస్యాలను కాపాడడం సభాహక్కు.

16. సమావేశంలో ఏ విషయంపైన చర్చ జరుగుతోందో దానిపైన ఒక నిర్ణయం జరిగేవరకు రెండవ విషయాన్ని లేవనెత్తకూడదు. ఇతరుల సంభాషణకు అడ్డువచ్చి తమ మాటను ప్రారంభించకూడదు. ఒకవేళ ఎప్పుడైనా అలాంటి అవసరం ఏర్పడితే, వెంటనే మాట్లాడటం అవసరమని అనుకుంటే సంభాషించే వారినుంచి మొదట అనుమతి తీసుకోవాలి.

17. సమస్యలను గురించి ప్రసంగిస్తున్నప్పుడు సభాధ్యక్షుడు శ్రోతలందరి మీద దృష్టి ఉంచాలి. అన్నివైపులా దృష్టిని మరల్చుతూ సుభాషించాలి. ప్రతి ఒక్కరికి స్వేచ్ఛగా తన అభిప్రాయాలను వ్యక్తంచేసే అవకాశం ఇవ్వాలి.

18. సభను ముగించేముందు ఈ దుఆ చేసి సభను ముగించాలి.

"దేవా! మాకు మా పాపాలకు అడ్డుగా నిలిచే, మమ్మల్ని నీ స్వర్గంలోకి చేర్చే వినయ విధేయతల్ని ప్రసాదించు. మాకు 'పటిష్టమైన విశ్వాసాన్ని అనుగ్రహించు. దాని ద్వారా ప్రాపంచిక నష్టాలు, కష్టాలు మాకు తృణ ప్రాయమయిపోవాలి. దేవా! నీవు మమ్మల్ని సజీవంగా ఉంచినన్నాళ్ళూ మాకు వినే, చూసే శక్తుల్ని, శారీరక జవసత్వాలను వినియోగించుకునే అవకాశం కలుగచెయ్యి. ఈ శుభాన్ని మా తర్వాత వారు కూడా పొందేలా కనికరించు. మాపై అత్యాచారం జరిపిన వారిమీద ప్రతీకారం తీసుకో, మాకు శత్రువుగా ఉండేవారిపైన మాకు ఆధిక్యతను ప్రసాదించు. మమ్మల్ని ధర్మం విషయంలో పరీక్షకు గురిచేయకు. మాకు ప్రపంచాన్ని మహత్తర లక్ష్యంగాను, ప్రపంచాన్ని మా జ్ఞానానికి, విచక్షణా దృష్టికి గీటురాయిగాను చేయకు, మాపై కరుణ చూపని వ్యక్తికి మాపైన ఆధిక్యత నివ్వకు." *(తిర్మిజి)*

# 8. సలామ్ చేసే నియమాలు

1. ఒక ముస్లిమ్ సోదరుణ్ణి కలుసుకున్నప్పుడు అతని పట్ల మీ అనుబంధాన్నీ ఆనందాన్ని వ్యక్తం చేయడానికి "అస్సలాము అలైకుమ్" అనండి.

పవిత్ర ఖుర్ఆన్‌లో ఇలా ఉంది:

"ప్రవక్తా! మా ఆయత్‌లను విశ్వసించినవారు మీ వద్దకు వచ్చినప్పుడు వారితో " అస్సలాము అలైకుమ్" అనండి. (అల్ అన్ఆమ్:54) ఈ ఆయత్‌లో ప్రవక్త(సఅసం)ను ఉద్దేశించి పరోక్షంగా ముస్లిమ్ సముదాయానికి (ఉమ్మత్‌కు) ఈ సూత్రప్రాయమయిన శిక్షణ ఇవ్వబడింది.

విశ్వాసి మరో విశ్వాసిని కలుసుకున్నప్పుడల్లా ఇద్దరూ ప్రేమానురాగాల భావాలను వ్యక్తపరుచుకోవాలి. అందుకు ఉత్తమమైన పద్ధతి ఒకరినొకరు శ్రేయస్సుభాల దుఆతో పలుకరించుకోవడం. ఒకరు "అస్సలాము అలైకుమ్" అనాలి, రెండవ వారు జవాబుగా "వఅలైకుముస్సలామ్" అనాలి.

"సలామ్" పరస్పర అనుబంధాన్ని, ప్రేమను పెంపొందించడానికి, పటిష్టం చేయడానికి కారణభూతమవుతుంది. ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు:

"మీరు విశ్వాసులు కానంతవరకు స్వర్గంలోకి ప్రవేశించలేరు. మీరు పరస్పరం అనురాగంతో మెలగనంతవరకు విశ్వాసులు కాలేరు. మీరు ప్రేమతో మెలిగే ఉపాయం చెప్పమంటారా? పరస్పరం సలామ్ చేసుకోవడాన్ని వ్యాపింపజేయండి." (మిష్కాత్)

2. ఎల్లప్పుడూ ఇస్లామీయ పద్ధతిలో సలాం చేయాలి. ఒకరితో సంభాషించేటప్పుడయినా ఉత్తర ప్రత్యుత్తరాల్లోనయినా, దైవ గ్రంథం ప్రవక్త (సఅసం) సంప్రదాయం చూపించిన ఈ పదాలనే వాడాలి.

ఈ ఇస్లామీయ పద్ధతిని విడనాడి సంఘంలో చెలామణిలో ఉన్న పదాలు, ధోరణి అనుసరించరాదు. ఇస్లామ్ చూపించిన ఈ సంబోధనా పద్ధతి అత్యంత సాధారణమయినది, భావయుక్తమయింది, ప్రభావవంతమయింది. అది శుభ శ్రేయస్సులకు పరిపూర్ణమైన దుఆ (ప్రార్థన) కూడా. మీరు ఒక సోదరునితో "అస్సలాము అలైకుమ్" అని అంటే దాని భావం: "దేవుడు నీకు అన్ని విధాలా శుభాలను, శ్రేయస్సును ప్రసాదించాలి. దేవుడు నీ ధన ప్రాణాలను ఇల్లూ వాకిలిని, భార్యా పిల్లల్ని, బంధు మిత్రుల్ని, ధర్మం, విశ్వాసాలను సురక్షితంగా కాపాడాలి. నువ్వు ఇహలోకంలోనూ, పరలోకంలోనూ శ్రేయస్కరంగా జీవించాలి.

నాకు తెలిసిన శుభాలను నాకు తెలియని శుభాలను కూడా నీకు కటాక్షించాలి. నీ పట్ల నా హృదయంలో శుభం, శ్రేయస్సు, ప్రేమాభిమానాల అమృత భావాలు ఉన్నాయి. అందుచేత నీకు నావల్ల ఎప్పుడయినా, ఎలాంటి ప్రమాదమయినా కలుగుతుందని శంకించనవసరం లేదు. నా వల్ల నీకు ఎప్పటికీ దుఃఖం కలగదు." సలామ్ పదానికి అలిఫ్ లామ్ జోడించి 'అస్సలాం' అంటే అతనికి శుభ శ్రేయాలకు సంబంధించిన సకల దుఆలను సమీకరించి అందచేశారన్నమాట. ఒక వేళ ఈ పదాన్ని చైతన్య వంతంగా, బాగా ఆలోచించి, గ్రహించి మరీ మీరు పలికినట్లయితే ఎవరినైనా కలుసుకున్నప్పుడు మనస్సులో ఉన్న ప్రగాఢమైన అనురాగం, అనుబంధం, ప్రేమాభిమానాల భావాలను వ్యక్తం చేయడానికి ఇంతకంటే ఉత్తమమయిన పదాలు ఇంకేమీ దొరకవు. సోదరుడిని 'అస్సలాము అలైకుమ్" అనే పదాలతో ఆహ్వానిస్తే దాని భావం - శ్రేయోసరోవరం, శాంతి సాగరం అయిన ఆ దేవుడు నీకు శ్రేయస్సును ప్రసాదించుగాక! ఆయన నామమే "అస్సలామ్". అంటే సకల శాంతుల నిలయం. ఆయన సంరక్షణపొందిన వారే నిజమయిన శ్రేయస్సు, రక్షణ పొందినట్టు. ఆయన ఎవరిని తన రక్షణకు దూరం చేస్తాడో వారు ఇహపరలోకాల్లోనూ శ్రేయస్సును, రక్షణను కోల్పోతారు.

ప్రవక్త (సఅసం) ఇలా అన్నారుః

"అస్సలామ్" అనేది దేవుని పేర్లలో ఒక పేరు. దాన్ని దేవుడు భూలోకవాసులకు కేటాయించి ఉంచాడు కాబట్టి "అస్సలామ్"ను బాగా వ్యాపింపచేయండి." (అల్ అదబుల్ మ్రఫద్)

హజ్రత్ అబూహురైరా (రజి) ప్రవక్త (సఅసం) ప్రవచనాన్ని ఇలా ఉల్లేఖించారుః

"దేవుడు హజ్రత్ ఆదమ్ (అస)కు జన్మనిచ్చి ఆయనను దైవదూతల ఒక సమూహం వద్దకు పంపుతూ, వెళ్ళు, ఆ కూర్చున్న దూతలకు "సలామ్" చెయ్యి, వారు సలామ్‌కు జవాబుగా ఇచ్చే దుఆను శ్రద్ధగా విను. ఎందుకంటే అదే నీకూ నీ సంతతికీ దుఆ అవుతుంది." అని అన్నాడు. అప్పుడు హజ్రత్ ఆదం (అస) దూతల వద్దకు వెళ్ళి " అస్సలాము అలైకుమ్" అన్నారు. అందుకు దూతలు "అస్సలాము అలైక-వరహ్మతుల్లాహ్" అన్నారు. అంటే "వరహ్మతుల్లాహ్"ను జోడించి జవాబు ఇచ్చారు." (బుఖారి, ముస్లిమ్)

దివ్య ఖుర్‌ఆన్‌లో, దైవదూతలు విశ్వసించిన వారి ఆత్మలను స్వాధీనం చేసుకోవడానికి వచ్చినప్పుడు 'సలామున్ అలైకుమ్' అంటారని ఉంది.

"ధర్మనిష్ఠాగరిష్టులయినవారికి ఇలాంటి ప్రతిఫలాన్నే ప్రసాదిస్తాడు. దేవుడు

వారి పరిశుద్ధమైన ఆత్మల్ని దైవ దూతలు స్వాధీనం చేసుకునేందుకు వచ్చినప్పుడు, సలామున్ అలైకుమ్ అంటూ వెళ్ళి మీ సదాచరణలకు ప్రతిఫలంగా స్వర్గాలలో ప్రవేశించండి అని చెబుతారు. *(అన్‌నహ్ల్: 31, 32)*

స్వర్గ ద్వారాల వద్దకు ఈ దైవ భీతిగలవారు చేరుకోగానే స్వర్గాధికారులు కూడా ఈ పదాలతోనే వారిని ఘనంగా ఆహ్వానిస్తారు.

"ఎవరైతే పవిత్రమైన, విధేయతా పూర్వకమైన జీవితం గడిపారో వారి సమూహాలు స్వర్గం వైపునకు పంపబడతాయి. వారు అక్కడికి చేరుకొన్నప్పుడు దాని ద్వారాలు ముందుగానే (వారిని ఆహ్వానించడానికి) తెరుచుకొని ఉంటాయి. స్వర్గాధికారులు వారితో 'సలామున్ అలైకుమ్'. మీరు చాలా మంచివారు శాశ్వతంగా ఈ స్వర్గంలో ప్రవేశించండి." అంటారు. *(అజ్ జుమర్:73)*

వీరు స్వర్గంలో ప్రవేశించినప్పుడు దైవ దూతలు అన్ని స్వర్గద్వారాల గుండా ప్రవేశిస్తూ వారికి "అస్సలాము అలైకుమ్" అని స్వాగతం పలుకుతారు.

"దూతలు ప్రతి ద్వారం గుండా స్వాగతం ఇవ్వడానికి వస్తారు. వారితో "సలామున్ అలైకుమ్" అని అంటారు. మీ సహనానికి, స్థయిర్యానికి ఇది ప్రతిఫలం, ఎంత మంచిది ఈ పరలోక గృహం!" అంటారు.

స్వర్గవాసులు కూడ ఒకరినొకరు ఈ వచనాలతోనే పలుకరించుకుంటారు.

అక్కడ వారి ఈ వచనమే సదా తేలియాడుతూ ఉంటుంది. "దేవా! నీవు పవిత్రుడివి. ఉన్నతుడివి." వారు ఒకరినొకరు "మీకు సలామ్" అని దుఆతోనే పలుకరించుకుంటారు.

దేవుని వైపునుంచి కూడా వారికొరకు సలామ్, కరుణ వచనాలే అవతరిస్తాయి.

"స్వర్గవాసులు ఆనాడు సుఖభోగాలలో తేలియాడుతూ ఉంటారు. వారు, వారి సతీమణులు దట్టమైన ఛాయల్లో ఎత్తయిన పాన్పులపైన దిండ్లు వేసుకుని విజయానందంతో సుఖాసీనులై ఉంటారు. వారికి స్వర్గంలో అన్ని రకాల రుచికరమైన పండ్లు లభిస్తాయి. వారు కోరినవన్నీ ఉంటాయి. కరుణా మయుడైన ప్రభువు వైపుగా సలామ్ పిలుపూ ఉంటుంది. *(యాసీన్: 55-58)*

అలా స్వర్గంలో విశ్వసించిన వారికి అన్ని దిశల నుండి సలామ్, సలామ్ అన్న పిలుపే వినిపిస్తుంది.

"వారు అక్కడ వ్యర్థప్రలాపనలుగాని, పాపపు పలుకులుగాని వినరు. (అన్ని వైపులా) సలామ్ సలామ్,అన్నమాటే ప్రతిధ్వనిస్తుంది"*(వాకియా: 25,26)*

దైవ గ్రంథం, ప్రవక్త (సఅసం) సంప్రదాయం చేసే ఈ అతి స్పష్టమైన

హితవులు అందచేసే సాక్ష్యాలు ఉండగా దైవం, దైవప్రవక్త చూపించిన పద్ధతులను విడనాడి తన ప్రేమను ఆనందాన్ని వ్యక్తం చేయడానికి ఇతర రీతులను అవలంబించడం విశ్వాసికి ఏ విధంగానూ ధర్మబద్ధం కాదు.

3. ముస్లిమ్ అయిన ప్రతి వ్యక్తికీ సలామ్ చేయాలి. అంతకు ముందు పరిచయం, సంబంధాలు ఉన్నా లేకపోయినా అతడు విశ్వసించిన నీ సోదరుడు అన్న విషయమే చాలు. ఓ విశ్వాసిపట్ల మరో విశ్వాసి హృదయంలో ప్రేమానురాగాలు, శ్రేయోభిలాష విశ్వసనీయతాభావాలు సదా తొణికిసలాడాలి. ఒక వ్యక్తి ప్రవక్త (సఅసం) ను అడిగాడు "ఇస్లామ్‌లో అత్యుత్తమ ఆచరణ ఏది?" అన్న దానికి ఆయన (సఅసం) "పేదలకు అన్నం పెట్టడం, నీకు పరిచయం ఉన్నా లేకపోయినా ప్రతి విశ్వాసికీ సలామ్ చేయడం." (బుఖారి- ముస్లిమ్)

4. మీరు మీ ఇంట్లో ప్రవేశిస్తున్నప్పుడు ఇంటివారికి సలామ్ చేయాలి.

ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది.

"మీరు మీ ఇండ్లల్లోకి ప్రవేశిస్తున్నప్పుడు మీ (ఇంటివారికి) సలామ్ చేయండి. ఇది దైవం ప్రబోధించిన అత్యంత పుణ్యప్రదమైన, పవిత్రమైన, శ్రేయస్కరమైన దుఆ". (నూర్: 61)

హజ్రత్ అనస్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు: "నాకు ప్రవక్త (సఅసం) హితవు చేశారు: ప్రియమైన కుమారా! నీవు నీ ఇంట్లోకి ప్రవేశిస్తున్నప్పుడు మొదట ఇంటివారికి సలామ్ చెయ్యి. అది నీకూ, నీ ఇంటి వారికిన్నీ శ్రేయస్కరమైన, పుణ్యప్రదమైన విషయం." (తిర్మిజి)

అలాగే మీరు ఇతరుల ఇంట్లోకి ప్రవేశించేముందు సలామ్ చేయాలి. సలామ్ చేయకుండా ఇంట్లోకి వెళ్ళకూడదు.

"విశ్వసించిన వారలారా! మీ ఇండ్లు తప్ప, ఇతరుల ఇండ్లలోకి, ఇంటివారి అనుమతి లేకుండా, ఇంటివారికి సలామ్ చేయకుండా ప్రవేశించకండి."

(నూర్: 27)

హజ్రత్ ఇబ్రాహీమ్ (అస) వద్దకు దూతలు గౌరవనీయులైన అతిథులై వచ్చిరాగానే సలామ్ చేశారు. ఇబ్రాహీమ్ (అస) కూడా జవాబుగా సలామ్ చేశారు.

5. చిన్న పిల్లలకు కూడా సలామ్ చేయాలి. ఇది పిల్లలకు సలామ్ నేర్పించే ఉత్తమ మార్గం. ప్రవక్త (సఅసం) సంప్రదాయం కూడా. హజ్రత్ అనస్ (రజిఅన్) పిల్లల దగ్గరనుంచి వెళ్ళుతున్నప్పుడు వారికి సలామ్ చేశారు. 'ప్రవక్త (సఅసం) కూడ అలాచేసేవారు' అని అన్నారు. (బుఖారి- ముస్లిమ్)

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) ఉత్తరాల్లో కూడా పిల్లలకు సలామ్

వ్రాసేవారు. (అల్ అదబుల్ ముఫ్రద్)

6. స్త్రీలు పురుషులకు సలామ్ చేయవచ్చును, పురుషులు స్త్రీలకు సలామ్ చేయవచ్చును. హజ్రత్ అస్మా అన్సారియ (రజి) అన్నారు. "నేను నా స్నేహితురాండ్రతో కూర్చుని ఉండగా ప్రవక్త (సఅసం) అటువైపు నుండి వెళ్ళారు. అప్పుడాయన (సఅసం) మాకు సలామ్ చేశారు." (అల్ అదబుల్ ముఫ్రద్)

హజ్రత్ ఉమ్మెహానీ (రజి) ఇలా అన్నారుః నేను ఒకసారి ప్రవక్త (సఅసం) వద్దకు వెళ్ళాను. ఆ సమయంలో ఆయన (సఅసం) స్నానం చేస్తున్నారు. నేను వారికి సలామ్ చేశాను. అప్పుడు ఆయన (సఅసం) 'ఎవరూ?' అనిఅడిగారు. "నేను ఉమ్మెహానిని" అన్నాను. 'భేష్!, స్వాగతం" అని అన్నారు.

7. ఇతోధికంగా సలామ్ చేయడం అలవరచుకోవాలి. సలామ్ చేయడంలో ఎప్పుడూ వెనుకంజ వేయరాదు.

పరస్పరం అధికంగా సలామ్‌ను సర్వసాధారణం చేయాలి. సలాం చేస్తే ప్రేమ పెరుగుతుంది. దేవుడు ప్రతి ఆపద నుండి, నష్టాన్నుండి కాపాడుతాడు.

ప్రవక్తా (సఅసం) ఇలా అన్నారు.

"నేను మీకు ఒక ఉపాయం చెబుతాను. దాన్ని అనుసరించడంవల్ల మీ మధ్య ఉన్న స్నేహం, ప్రేమ అధికం అవుతాయి. పరస్పరం అత్యధికంగా సలామ్ చేసుకుంటూ ఉండండి." (ముస్లిమ్)

ఆయన (సఅసం) ఇలా కూడ అన్నారు. "సలామ్"ను బాగా వ్యాపింప చేయండి. దేవుడు మిమ్మల్ని సురక్షితంగా కాపాడుతాడు."

హజ్రత్ అనస్ (రజిఅన్) అన్నారు. ప్రవక్త (సఅసం) ఆయన సహచరులు (రజిఅన్) చాల ఎక్కువగా సలామ్ చేసుకుంటూ ఉండేవారు. సలాం చేసుకునే పరిస్థితి ఎలా ఉండేదంటే వారిలో ఎవరైనా చెట్టుచాటుకు పోయి మళ్ళీ ముందుకు వచ్చినా మళ్ళీ సలామ్ చేసుకొనేవారు.

ఒకసారి ఆయన (సఅసం) ఇలా బోధించారుః

"ఒక వ్యక్తి తన ముస్లిమ్ సోదరుణ్ణి కలుసుకున్నప్పుడు అతనికి సలామ్ చేయాలి. ఒకవేళ చెట్టు, గోడ లేక బండ రాయిగాని అడ్డువచ్చి మళ్ళీ కలుసుకుంటే మళ్ళీ సలామ్ చేయాలి." (రియాజుస్సాలిహీన్)

హజ్రత్ తుఫైల్ (రజి) ఇలా అన్నారు. "నేను తరచు హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) వద్దకు వెళ్ళేవాణ్ణి. అయితే మేమిద్దరం బజారుకు వెళ్ళినప్పుడు హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) ఎవరు ముందుకు వస్తే వారికి సలామ్

చేసేవారు. ఆ కలిసే వారిలో పాత సామానువాడయినా, దుకాణం వాడయినా, బీద, బిక్కి వాడయినా, ఎవరయినా సరే, సలామ్ తప్పక చేసేవారు.

ఒక దినం నేను ఆయన వద్దకు వెళ్ళాను. అప్పుడాయన 'పద, బజారుకు వెళదాం' అన్నారు. నేను, "అయ్యా, బజారుకు వెళ్ళి ఏంచేయాలి? మీరు సరుకు కొనరు. వస్తువుల విషయం అడిగి తెలుసుకోరు, ధర అడగడంగాని కొనడంగాని జరగదు. బజారులో నలుగురితో కలిసి కూర్చుండరు. రండి ఇక్కడే కూర్చుని ఏదైనా మాట్లాడు కుందాం." అని అన్నాను. అప్పుడాయన, "అబూబతన్(బొజ్జ గలవాడా) మనం కేవలం సలామ్ చేసేందుకు బజారుకు వెళ్ళుతున్నాము మనకు ఎవరుకనబడితే వారికి సలామ్ చేద్దాం" అనిఅన్నారు.(ముఅత్తా ఇమామ్ మాలిక్)

8. "సలామ్" విశ్వాసి అయిన తన సోదరుని హక్కు అని భావించాలి. ఆ హక్కును నిర్వర్తించడంలో విశాల మనస్సుతో ప్రవర్తించాలి. సలామ్ చేయడంలో లోభత్వం చూపించరాదు.

ప్రవక్త (సఅసం) ఇలా అన్నారుః

"ఒక విశ్వాసికి ఇంకొక విశ్వాసి మీద ఉన్న హక్కు ఏమంటే, తన సోదరుణ్ణి కలుసుకున్నప్పుడు అతనికి సలామ్ చేయాలి." (ముస్లిమ్)

హజ్రత్ అబూ హురైర (రజి) ఇలా అన్నారు. "సలాం చేయడంలో లోభత్వం చూపించిన వాడే అందరికన్నా పెద్ద లోభి" (అల్ అదబుల్ మఫ్రద్)

9. ఎల్లప్పుడూ ముందుగా సలామ్ చేయడానికి ప్రయత్నించాలి. ఒకవేళ ఎప్పుడయినా ఎవరితోనయినా కీచులాడుకుంటే సలామ్ చేసి రాజీపడి సర్దుకు పోవడంలో కూడా ముందు ఉండాలి.

ప్రవక్త(సఅసం) ఇలా అన్నారుః "సలామ్ చేయడంలో మున్ముందుండే వ్యక్తి దేవునికి అతి సమీపంలో ఉంటాడు." (అబూదావూద్)

ఇంకా ఆయన (సఅసం) ఇలా కూడా అన్నారు.

"ఒక విశ్వాసి, విశ్వాసి అయిన తన సోదరునితో మూడు దినాల వరకు మాట్లాడకుండా ఉండడం, ఇద్దరు కలుసుకున్నప్పుడు మూతి ముడుచుకుని ఒకరు ఇటు, మరొకరు అటు వెళ్ళిపోవడం ధర్మసమ్మతం కాదు. సలామ్ చేయడంలో వారిలో ఎవరుముందుకువస్తారోవారేగొప్పవారు." (అల్ అదబుల్ మఫ్రద్)

ప్రవక్త (సఅసం)ను ఒకరు అడిగారు : "ఇద్దరు వ్యక్తులు కలుసుకుంటే ఇద్దరిలో ఎవరు ముందు సలామ్ చేయాలి?" ఆయన (సఅసం) "ఇద్దరిలో ఎవరు దేవుని వద్ద ఎక్కువ ఉత్తముడుగా పరిగణింపబడగోరుతాడో వారు" అని బదులిచ్చారు. (తిర్మిజి)

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) నిత్యం తానే ముందుగా సలాం చేయడానికి యత్నించేవారు. ఏ వ్యక్తీ ఆయనకు ముందు సలామ్ చేయలేక పోయేవారు.

10. ఎల్లప్పుడూ నోటితో అస్సలాము అలైకుమ్ అని సలామ్ చేయాలి. మనం సలామ్ చేసే వ్యక్తికి వినిపించేలా కంఠం హెచ్చించి మరీ సలామ్ పలకాలి. నోటితో సలామ్ చెప్పడంతో పాటు అవసరమనుకుంటే చేతితో లేదా తలతో సంజ్ఞ చేసినా తప్పు లేదు. ఉదాహరణకు మనం సలామ్ చేసే వ్యక్తి మన కంఠధ్వని చేరనంత దూరాన ఉన్న పక్షంలో లేక చెవిటివాడయిన పక్షంలో నోటి పలుకులతో పాటు చేతితో సంజ్ఞ కూడా చేయవచ్చు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్(రజి) ఇలా బోధించారు: "మీరు సలామ్ చేస్తే మీ సలామ్‌ని ఆ వ్యక్తికి వినిపించేలా చేయండి-ఎందువల్లనంటే సలాం అనేది దైవం బోధించిన అత్యంత పవిత్రమైన, శుభప్రదమైన దుఆ"

(అల్ అదబుల్ మఫ్రద్)

హజ్రత్ అస్మా (రజి) బిన్తె యజీద్ ఇలా అన్నారు: "దైవ ప్రవక్త ఒకసారి మస్జిద్ వైపుగాపోవడం తటస్థించింది, అప్పుడు అక్కడ కొందరు స్త్రీలు కూర్చుని ఉన్నారు. ప్రవక్త (సఅసం) వారికి చేతిసైగతో సలామ్ చేశారు." (తిర్మిజి)

అంటే దైవప్రవక్త (సఅసం) నోటితో సలామ్ పలకడంతో పాటు చేతిసైగతో కూడా సలామ్ చేశారన్నమాట. ఇదే విషయాన్ని అబూదావూద్‌లోని మరో హదీసుకూడా సమర్థిస్తోంది. దాని ప్రకారం హజ్రత్ అస్మా (రజి) ఇలా తెలియ జేశారు: "దైవ ప్రవక్త(సఅసం) మా వైపుగా పోతూ మాకు సలామ్‌చేశారు."

అందుచేత వాస్తవం ఏమిటంటే, సలామ్ అనేది నోటితో చెప్పాలి. అవసరమయితే చేయి, లేదా తలపంకించి సంజ్ఞ చేయాలి.

11. పెద్దలకు సలామ్ చేయటాన్ని అలవరచుకోవాలి. కాలినడకన పోతున్నప్పుడు కూర్చున్న వారికి సలామ్ చేయాలి. ఏదయినా చిన్న బృందం తో పాటు ఉన్నప్పుడు అంతకంటే ఎక్కువ మంది గల బృందాన్ని కలుసుకోవటం తటస్థిస్తే ముందుంగా వారికి సలామ్ చేయాలి.

మహాప్రవక్త (సఅసం) ఇలా ఆదేశించారు:

"చిన్నవాళ్ళు పెద్దవారికి, నడుస్తున్నవారు కూర్చున్నవారికి కొంత మంది జనం, అత్యధిక జనానికి ముందుగా సలామ్ చేయాలి."

(అల్ అదబుల్ మఫ్రద్)

12. మీరు వాహనం మీద పోతున్నప్పుడు కాలినడకన పోతున్నవారికి, దారిలో కూర్చున్న వారికి సలామ్ చేయాలి. దైవ ప్రవక్త (సఅసం) ఇలా సెల విచ్చారు.

"వాహనం మీదపోయేవారు కాలినడకన పోయేవారికి, కాలినడకన పోయేవారు కూర్చున్న వారికి, కొంత మంది జనం అత్యధిక జనానికి సలామ్ చేయడానికి ముందుకురావాలి." (అల్‌అదబుల్ ముఫ్రద్)

13. ఎవరినయినా కలుసుకోబోయినప్పుడు లేదా ఏదయినా సమావేశానికి హాజరయినప్పుడు లేదా ఏదయినా జనసమూహం దగ్గర నుంచి పోవటం తటస్థించినప్పుడు, అక్కడికి చేరగానే మళ్ళీ అక్కడ నుంచి వచ్చేటప్పుడు కూడా సలామ్ చేయాలి. ప్రియప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు.

"మీరేదయినా సమావేశంలోకి ప్రవేశించినప్పుడు సలామ్ చేయండి. మళ్ళీ అక్కడినుంచి తిరిగి వస్తున్నప్పుడు కూడా సలామ్ చేయండి. గుర్తుంచుకోండి – తొలుత చేసే సలామ్ మళ్ళీ (వెళ్ళేటప్పుడు) చేసే సలామ్ కన్నా అధిక పుణ్యఫలానికి పాత్రమయిందికాదు. (అంటే ప్రవేశించేటప్పుడు మహా గొప్పగా సలామ్ చేసి, తిరిగి వచ్చేటప్పుడు సలామ్ చేయకుండా, వీడ్కోలు సలామ్‌కు ఎలాంటి ప్రాముఖ్యత నివ్వకపోవటం అని అర్థం.) (తిర్మిజి)

14. సభలో ప్రవేశించినప్పుడు సభికులందరికీ సలామ్ చేయాలి. కాని ప్రత్యేకంగా ఎవరో ఒకరికి పేరుపెట్టి సలామ్ చేయకూడదు.

ఒకసారి హజ్రత్ అబ్దుల్లా (రజి) మస్జిద్‌లో ఉండగా, ఒకవ్యక్తి వచ్చాడు. అతను హజ్రత్ అబ్దుల్లా పేరు పెట్టి సలామ్ చేశాడు, అప్పుడాయన "దేవుడు సత్యం చెప్పాడు, దైవ ప్రవక్త (సఅసం) ప్రచార హక్కును నెరవేర్చారు."అని పలికి ఇంటిలోకి వెళ్ళిపోయారు. అక్కడున్నవారు దాని అర్థం ఏమిటో ఆయనే వచ్చి చెబుతారని ఎదురుచూడసాగారు. చివరికి హజ్రత్ అబ్దుల్లా (రజి) తిరిగి రాగానే హజ్రత్ తారిఖ్ (రజి) ఆయన్ని అడిగారు:(మీరు చెప్పినదేమిటో మాకేమీ అర్థంకాలేదు? అని) దానికి ఆయన ప్రళయ దినం సమీపంలో ప్రజలు సమావేశాల్లో, సభల్లో ప్రజలను పేరు పెట్టి ప్రత్యేకించి సలామ్ చేయనారంభిస్తారు అన్నారు. (అల్‌అదబుల్ ముఫ్రద్)

15. వ్యక్తుల ద్వారా కానీ, ఉత్తరాల ద్వారా కానీ మిత్రులకో, పెద్దవాళ్ళకో సలామ్ చెప్పే అవకాశం ఉంటే తప్పకుండా ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలి.

దైవ ప్రవక్త (సఅసం) తనతో చెప్పినట్లు హజ్రత్ ఆయిషా (రజి) ఇలా

ఉల్లేఖించారుః "ఆయిషా! నీకు జిబ్రీల్ అలైహిస్సలాం సలామ్ చెప్పున్నారు" అప్పుడు నేను (ఆయిషా) 'వ అలైకుముస్సలాం వరహ్మతుల్లాహి వ బరకాతుహు' అన్నాను. (బుఖారి, ముస్లిమ్)

16. కొందరు నిద్రిస్తూ, మరి కొందరు మేల్కొనివున్న చోటికి మనం పోయినప్పుడు, పడుకున్న వారికి నిద్రా భంగం కలగకుండా మేల్కొని ఉన్నవారికి మాత్రం వినిపించేలా సలామ్ చేయాలి.

హజ్రత్ మిఖ్దాద్ (రజి) ఇలా తెలియజేస్తున్నారుః

'దైవ ప్రవక్త (సఅసం) కోసమని మేము కొంచెం పాలు దగ్గర ఉంచుకునే వాళ్ళం. ఆయన (సఅసం) కాస్త పొద్దుపోయిన తరువాత వచ్చేవారు. అప్పుడాయన పడుకున్న వారికి నిద్రాభంగం కలగకుండా, మేల్కొన్నవారికి మాత్రమే వినిపించేలా సలామ్ చేసేవారు. తదనుగుణంగా దైవ ప్రవక్త (సఅసం) వచ్చి మామూలు ధోరణిలో సలామ్ చేశారు. (ముస్లిమ్)

17. హృదయ పూర్వకంగా సంతోష భరితంగా సలామ్‌కు జవాబివ్వాలి. ఇది ముస్లిమ్ సోదరుని హక్కు. ఈ హక్కు నెరవేర్చడంలో ఎన్నటికీ పిసినారితనం చూపకూడదు.

దైవ సందేశహరులు (సఅసం) ఇలా ప్రవచించారుః ఒక ముస్లిమ్ మీద మరో ముస్లిమ్‌కు అయిదు హక్కులున్నాయి.

సలామ్‌కు జవాబివ్వడం
వ్యాధిగ్రస్తుని పరామర్శించడం
జనాజా వెంట వెళ్ళటం
విందు ఆహ్వానాన్ని అంగీకరించటం
తుమ్ముకు జవాబివ్వడం (ముత్తఫకున్ అలైహ్)

మరొక సందర్భంలో ప్రియప్రవక్త (సఅసం) 'దారుల్లో కూర్చోవడం మానండి' అని అన్నారు, 'దైవ ప్రవక్తా! దారుల్లో కూర్చోవడం మాకు తప్పదుకదా?' అని ప్రజలు వేడుకున్నారు. "దారుల్లో కూర్చోవడం మీకు అంతగా అవసరమయితే దారి హక్కును తప్పని సరిగా నెరవేర్చుతూ కూర్చోండి." అని సెలవిచ్చారు ప్రవక్త (సఅసం).

దారి హక్కు అంటే ఏమిటి? అని ప్రజలు అడిగారు. "చూపు కిందికి దించి ఉంచడం, ఎవరినీ బాధించకుండా ఉండటం, సలామ్‌కు జవాబియ్యడం, మంచిని బోధించడం, చెడును నిరోధించడం." (ముత్తఫకున్ అలైహ్)

18. సలామ్‌కు జవాబు ఇవ్వడంలో "వఅలైకుముస్సలాం" అని ఆగిపోకుండా "వరహ్మతుల్లాహి వ బరకాతుహు" అనే పదాల్ని కూడా చేర్చాలి.

పవిత్ర ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది.

"మీకు దుఆ, సలామ్ చేసినవారి కొరకు అంతకంటే ఉత్తమ దుఆ చేయండి. లేదా కనీసం అవే పదాలలో సమాధానమివ్వండి."

భావమేమిటంటే - సలామ్‌కు జవాబు ఇవ్వడంలో పిసినారితనం చూపించ రాదు. సలామ్‌కు ఇంకా కొన్ని పదాలను జోడించి అంతకంటే ఉత్తమ దుఆను చేయాలి. అలా కాకపోతే కనీసం అటువంటి పదాలనే అయినా తిరిగి పలకాలి. జవాబు మాత్రం తప్పక ఇవ్వాలి.

హజ్రత్ ఇమ్రాన్ ఇబ్నె హిసీన్ (రజి) ఇలా ఉల్లేఖించారుః

"ప్రవక్త (సఅసం) కూర్చొని ఉండగా ఒక వ్యక్తి వచ్చి "అస్సలాము అలైకుమ్" అన్నాడు. ఆయన (సఅసం) సలామ్‌కు జవాబు ఇచ్చి 'పది' అన్నారు. (అంటే పది పుణ్యఫలాలు లభించుగాక! అని) తర్వాత ఇంకో వ్యక్తి వచ్చి "అస్సలాము అలైకుమ్ వరహ్మతుల్లాహ్" అన్నాడు. ఆయన (సఅసం) జవాబు ఇచ్చి 'ఇరవై' అన్నారు (అంటే ఇరవై పుణ్యఫలాలు లభించుగాక) తరువాత మూడవ వ్యక్తి వచ్చి "అస్సలాము అలైకుమ్ వ రహ్మతుల్లాహి వ బరకాతుహు" అన్నాడు. ప్రవక్త (సఅసం) జవాబు ఇచ్చి 'ముప్పయి' అన్నారు. (అంటే ముప్పయి పుణ్యఫలాలు లభించుగాక! అని). (తిర్మిజి)

హజ్రత్ ఉమర్ (రజి) ఇలా తెలిపారుః

"ఒకసారి నేను హజ్రత్ అబూబక్ర్ (రజి) వెనుక వాహనంపైన కూర్చుని ఉన్నాను, మేము దారిలో కలుసుకున్న వారందరికీ అబూబక్ర్ (రజి) "అస్సలాము అలైకుమ్" అనేవారు. అందుకు వారు వ అలైకుముస్సలామ్ వ రహ్మతుల్లాహ్ అని జవాబు ఇచ్చేవారు.

అబూబక్ర్ (రజి) "అస్సలాము అలైకుమ్ వ రహ్మతుల్లాహ్" అని అంటే ప్రజలు అందుకు "వ అలైకుముస్సలాము వ రహ్మతుల్లాహి వ బరకాతుహు" అని జవాబు ఇచ్చేవారు, అప్పుడు అబూబక్ర్ (రజి) "ఈ రోజు ప్రజలు మనల్ని అధిగమించారు." అని అన్నారు. (అల్‌అదబుల్ ముఫ్రద్)

19. ఎవరినయినా కలుసుకున్నప్పుడు మొట్టమొదట 'అస్సలాము అలైకుమ్' అనాలి. ఒకేసారి సంభాషణ ప్రారంభించడాన్ని మానుకోవాలి. ఏమి సంభాషించదలచుకున్నా సలామ్ తర్వాతనే చేయాలి.

దైవ ప్రవక్త (సఅసం) అన్నారు

"ఎవరయినా సలామ్‌కు ముందు సంభాషిస్తే దానికి జవాబు ఇవ్వకండి."

20. ఈ క్రింది పరిస్థితుల్లో సలామ్ చేయరాదు.

1. జనం ఖుర్ఆన్, హదీసు పఠించడంలోనో నేర్పడంలోనో లేక వినడంలోనో నిమగ్నులయి ఉన్నప్పుడు

2. ఎవరయినా ప్రసంగిస్తుండగా లేక ప్రసంగాన్ని వింటూ ఉండగా.

3. అజాన్ ఇస్తున్నప్పుడు లేక తక్బీర్ చెపుతున్నప్పుడు

4. ఏదయినా సమావేశంలో ధార్మిక విషయాన్ని గురించి చర్చ జరుగుతున్నప్పుడు లేదా ఒకరు మరొకరికి మతధర్మాలను గురించి వివరిస్తున్నప్పుడు.

5. ఉపాధ్యాయుడు పాఠాలు బోధించడంలో నిమగ్నుడై ఉన్నప్పుడు.

6. మల మూత్ర విసర్జనకై కూర్చుని వున్నప్పుడు.

ఈ క్రింది పరిస్థితులలో సలామ్ చేయకుండా ఉండటమే కాక మీ అసమ్మతిని, ఆత్మ ఆవేదనను కూడా యుక్తిగా వ్యక్తం చేయాలి.

అ) ఎవరయినా పాపకార్యాల్లో షరీఅత్‌కు విరుద్ధమయిన వ్యర్థకార్య కలాపాల్లో, భోగవిలాసాల్లో లీనమయి ధర్మాన్ని కించపరుస్తూ ఉన్నప్పుడు.

ఆ) తిట్లు, దూషణలు, పరుష పదాలు ప్రయోగిస్తూ వ్యర్థ ప్రలాపనలు చేస్తూ, అభూత కల్పనలు చేస్తూ అసభ్య హాస్యంతో ధర్మాన్ని అపహాస్యం పాలు చేస్తూ ఉంటే.

ఇ) ఎవరయినా ధర్మానికి, షరీఅత్‌కు విరుద్ధమయిన ఆలోచనల్ని సిద్ధాంతాలను ప్రచారం చేస్తూ ఉంటే, జనుల్ని ధర్మానికి వ్యతిరేకంగా పురికొలి పేందుకు, బిద్అత్‌లకు, ధర్మవ్యతిరేకతను పురికొలుపుతూ ఉంటే.

ఈ) ధార్మిక విశ్వాసాలను, ధార్మిక చిహ్నాలను అగౌరవపరుస్తూ షరీఅత్ సిద్ధాంతాలను, ఆదేశాలను ఎగతాళి చేస్తూ తనలోని పైశాచికత్వాన్ని రుజువుచేసు కుంటూ ఉంటే - అటువంటి వారికి సలామ్ చెయ్యడం మానివేయండి.

21. యూదులకు, నస్రానీలకు సలామ్ చేయడానికి ముందుగా ఉద్యుక్తులవకండి. ఎందుకంటే యూదులు ధర్మ విహీనులు, సత్య విరోధులు; అది అత్యాచారం, క్రూరత్వం, కుట్ర, మోసాలలో మునిగిన అతి నీచమైన జాతి అని ఖుర్ఆన్ సాక్ష్యమిస్తుంది. దేవుడు ఆ జాతికి అంతులేని శుభాలను ప్రసాదించాడు. కాని అది ఎల్లప్పుడూ తన కృతఘ్నతను, చెడునడతను చూపించింది. దేవుడు

పంపించిన పవిత్ర ప్రవక్తలను సైతం హత్య చేసిందికూడా ఈజాతే. అందుచేత విశ్వాసి యూదులపట్ల గౌరవం ప్రదర్శించరాదు. అంతేకాకుండా సత్యం పట్ల అవలంబించిన నీచాతి నీచమయిన వ్యతిరేకతకు లభించే ఫలితమేమిటో వారికి పదేపదే తెలిసి వచ్చే ధోరణిని అనుసరించాలి. అటువంటి వారికి ఎల్లప్పుడు లభించేది నికృష్టమైన స్థానం, నీచమయిన బ్రతుకు మాత్రమే అని తెలిసేలా వ్యవహరించాలి.

22. ఏదయినా సమావేశంలో విశ్వాసులు, బహుదైవారాధకులు కలిసి ఉన్నట్లయితే వారందరికీ సలామ్ చేయాలి. "ఒకసారి విశ్వాసులు, బహుదైవా రాధకులు కలిసి ఉన్న ఒక సమావేశం వద్ద నుండి ప్రవక్త (సఅసం) వెళ్ళారు. అప్పుడాయన (సఅసం) అందరికీ సలామ్ చేశారు." (అల్ అదబుల్ మ్ఫద్)

23. ముస్లిమేతరులకు సలామ్ చేసేటప్పుడు 'ఆదాబ్ అర్జ్' 'తస్లీమాత్' వంటి పదాలు ఉపయోగించవచ్చు. ఇస్లామ్ విశ్వాసాలకు, ఇస్లామ్ నైజానికి విరుద్ధంగా ఉండే ఎలాంటి సంకేతాల్ని చేతులతోగాని, తలతోగాని చేయరాదు.

హరిక్ల్ పేరున దైవ ప్రవక్త (సఅసం) పంపిన లేఖల్లో సలామ్ పదాలు ఇలా ఉన్నాయి :

"సలామున్ అలా మనిత్తబఅల్ హుదా" 'ప్రబోధన పాటించిన వారికి (శాంతి) కలుగుగాక.'

24. సలామ్ చేసిన తర్వాత ప్రేమానురాగాన్ని లేక తమ విశ్వసనీయతను వ్యక్తం చేయడానికి కరచాలనం కూడా చేయాలి. ప్రవక్త (సఅసం) కూడా ఇలా కరచాలనం చేసేవారు. ఆయన సహచరులు (రజి) కూడా పరస్పరం కలుసు కున్నప్పుడు కరచాలనం చేసుకొనేవారు. ప్రవక్త (సఅసం) సహచరులకు పర స్పరం కరచాలనం చేసుకోవాలని ఉపదేశించి, దాని ఔన్నత్యాన్ని, ప్రాముఖ్యతను అనేక విధాలుగా విశదీకరించారు. హ్రజత్ కతాదా, హ్రజత్ అనస్ (రజి)ని సహచరులు కరచాలనం చేసుకొనేవారా? అని అడిగితే, హ్రజత్ అనస్ (రజి) "చేసుకొనేవారు" అని జవాబిచ్చారు. (బుఖారి)

హ్రజత్ సల్మా బిన్ దర్దాన్ (రహ్మలై) ఇలా అన్నారుః

"నేను హ్రజత్ మాలిక్ బిన్ అనస్ (రహ్మలై)ని ప్రజలతో కరచాలనం చేయడం చూశాను. ఆయన మీరెవరు? అని నన్ను అడిగితే నేను "బనీలైస్" బానిసను అన్నాను. ఆయన నా తలను మూడు సార్లు చేతితో నిమిరి "దేవుడు మీకు శ్రేయస్సుభాలను ప్రసాదించుగాక!" అని అన్నారు.

ఒకసారి యమన్‌కు చెందిన కొందరు వ్యక్తులు వచ్చినప్పుడు మహా

ప్రవక్త(సఅసం) సహచరుల(రజి)తో "మీ వద్దకు యమన్ ప్రజలు వచ్చారు. ఇక్కడికి వచ్చే వారిలో వీరు కరచాలనానికి ఎక్కువ హక్కుగలవారు." అని అన్నారు. (అబూదావూద్)

హజ్రత్ హుజైఫా బిన్ యమాన్(రజి) ఉల్లేఖించిన దాని ప్రకారం ప్రవక్త (సఅసం) ఇలా అన్నారుః

"ఇద్దరు విశ్వాసులు కలుసుకొని సలామ్ చేసుకొన్న తరువాత కరచాలనం కొరకు ఒకరి చేతిని మరొకరు తన చేతుల్లోకి తీసుకుంటే చెట్టునుండి ఎండిన ఆకులు రాలిపోయేలా వారిరువురి పాపాలు పటాపంచలై పోతాయి." (త్రిబాని)

హజ్రత్ అబ్దుల్లాహ ఇబ్నె మస్ఊద్(రజి) ప్రకారం దైవ ప్రవక్త(సఅసం)ఇలా అన్నారు.

"సంపూర్ణ సలామ్ అంటే కరచాలనం కొరకు చేతులు కూడా కలపాలి."

25. మిత్రుడు, బంధువు లేక పెద్ద మనిషి ప్రయాణం చేసి వస్తే కౌగిలించుకోవడం కూడా మంచిది. హజ్రత్ జైద్ బిన్ హారిస (రజి) మదీనా వచ్చినప్పుడు దైవ ప్రవక్త (సఅసం) వద్దకు వెళ్ళి తలుపు తట్టారు. ప్రవక్త (సఅసం)తమ దుప్పటిని ఈడ్చుకుంటూ ద్వారం వద్దకు వచ్చి ఆయన్ని కౌగిలించుకుని నుదుటిని ముద్దుపెట్టుకున్నారు. (తిర్మిజి)

హజ్రత్ అనస్ (రజి) ఇలా అన్నారుః

సహచరులు(రజి) పరస్పరం కలుసుకున్నప్పుడు కరచాలనం చేసుకునే వారు. ప్రయాణం నుండి తిరిగి వచ్చినప్పుడు కౌగిలించుకొనేవారు. (త్రిబాని)

# 9 వ్యాధిగ్రస్తుల పరామర్శ

1. రోగిని, తప్పకుండా పరామర్శించాలి. పరామర్శించడం అంటే కేవలం సామూహిక జీవనంలో అదొక అవసరమనీ, లేక పరస్పర సహకారానికీ, ఒకరి బాధల్లో మరొకరు పాల్గొనే భావానికి చిహ్నమని మాత్రమే కాదు. ఇది ఒక విశ్వాసి పట్ల ఇంకొక విశ్వాసికి గల ధార్మిక బాధ్యత. దైవం పట్ల గల ప్రేమానుబంధానికి ప్రతీక. దేవునితో సంబంధం ఉన్న వ్యక్తి సాటి దైవదాసులతో సంబంధంలేకుండా ఉండజాలడు. రోగికి ఉన్న బాధలో కష్టాలలో పాలు పంచుకోకపోవడం, సహకారం విషయాల్లో నిర్లక్ష్యం చూపడం నిజానికి దైవాన్నే నిర్లక్ష్యం చేయడం వంటిది. మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారుః

"ప్రళయ దినాన దేవుడు, ఆదమ్ కుమారా! నేను జబ్బుపడ్డాను. కాని నీవు నన్ను పరామర్శించలేదు అంటాడు. అప్పుడు దాసుడు "దేవా! నీవు సర్వ విశ్వానికి ప్రభువు, నేను ఎలా నిన్ను పరామర్శించగలను" అని విన్నవించుకుంటాడు. అప్పుడు దేవుడు ఇలా అంటాడు. నా ఫలానా దాసుడు రోగపీడితుడయి ఉంటే నీవు అతడిని పరామర్శించ లేదు. అతడిని పరామర్శించడానికి వెళ్ళి ఉంటే అక్కడ నీవు నన్ను కానగలిగి ఉండేవాడివి. (అంటే నా ప్రీతికి, కరుణకు పాత్రుడయ్యేవాడివి). (ముస్లిమ్)

మహాప్రవక్త (సఅసం) ఇంకా ఇలా అన్నారుః

"ఒక విశ్వాసికి ఇంకొక విశ్వాసి పట్ల ఆరు బాధ్యతలున్నాయి."

అలా అనగానే కొందరు, దైవ ప్రవక్తా, ఆ ఆరు హక్కులు (బాధ్యతలు) ఏవి? అని అడిగారు. ఆయన (సఅసం) అన్నారుః

మీరు విశ్వాసిని కలుసుకున్నప్పుడు అతనికి సలామ్ చేయాలి.

అతడు మిమ్మల్ని విందుకు పిలిచినప్పుడు అతని ఆహ్వానాన్ని స్వీకరించాలి.

అతడు మిమ్మల్ని సలహాలు కోరితే అతని శ్రేయస్సును అభిలషిస్తూ అతనికి మంచి సలహాలు ఇవ్వాలి.

అతనికి తుమ్ము వచ్చినప్పుడు అతడు "అల్‌హమ్దులిల్లాహ్" అంటే దానికి జవాబుగా మీరు "యర్‌హముకల్లాహ్" అని చెప్పాలి.

అతడు వ్యాధి గ్రస్తుడయితే అతన్ని పరామర్శించడానికి వెళ్ళాలి.

అతడు చనిపోయినప్పుడు అతని జనాజా వెంట నడవాలి. (ముస్లిమ్)

ప్రవక్త(సఅసం) ఇలా కూడా అన్నారు. "ఎవరయితే విశ్వాసి అయిన తన సోదరుడిని పరామర్శిస్తాడో అతడు స్వర్గంలో ఉన్న ఎత్తయిన సౌధంలో ఉంటాడు." (అల్ అదబుల్ మఫ్రద్)

ప్రవక్త ఇలా అన్నట్లు హజ్రత్ అబూహురైరా (రజి) ఉల్లేఖించారుః

"ఒక దైవదాసుడు విశ్వాసి అయిన తన సోదరుడిని పరామర్శించడానికి, లేక కలుసుకోడానికి వెళ్లినప్పుడు, ప్రకటన చేసే ఒక (దైవదూత) ఇలా ప్రకటిస్తాడుః "నీవు మంచివాడివి, నీ నడత మంచిది, నీవు నీ కోసం స్వర్గంలో నివాసం నిర్మించుకున్నావు." (తిర్మిజి)

2. రోగి తల వద్ద కూర్చొని అతని తల, లేక శరీరాన్ని చేతితో నిమురుతూ ధైర్యం చెప్పాలి, సంతృప్తికరమయిన మాటలు చెప్పాలి. అతని ఆలోచన తుది దిన పుణ్యఫలం వైపునకు మరల్చేందుకు, అసహనం, ఆరోపణ, నిందా వాక్కులు అతని నోటి వెంట రాకుండా ఉండేందుకు యత్నించాలి.

హజ్రత్ ఆయిషా బిన్తె సాద్ (రజి) ఇలా ఉల్లేఖించారుః

నా తండ్రిగారు తన కథను ఇలా వినిపించారుః "నేను ఒకసారి మక్కాలో ఉన్నప్పుడు తీవ్రంగా జబ్బుపడ్డాను. దైవ ప్రవక్త(సఅసం) నన్ను పరామర్శించడానికి వచ్చారు. అప్పుడు నేను, "దైవ ప్రవక్తా! నేను చాలా ఆస్తిని వదిలి పోతున్నాను, నాకు ఉన్నది ఒక్క ఆడపిల్ల మాత్రమే. నేను ఆ ఆస్తిలో రెండు భాగాలకు వీలునామా వ్రాసి ఒక భాగాన్ని అమ్మాయి కోసం వదిలి పెట్టవచ్చా?" అని అడిగాను. అందుకు ఆయన (సఅసం) 'వద్దు' అని అన్నారు. అయితే సగభాగానికి వీలునామా వ్రాసి, సగం అమ్మాయికి వదిలి పెట్టనా? అన్నాను. ఆయన (సఅసం) మళ్ళీ వద్దు అని అన్నారు. అప్పుడు నేను ప్రవక్తా! మూడింట ఒక భాగానికి వీలునామా వ్రాయనా? అని అడగ్గా దైవప్రవక్త(సఅసం) "ఔను మూడో వంతుకు వీలునామా వ్రాయాలి. మూడో వంతూ ఎక్కువే" అని అన్న తరువాత ఆయన(సఅసం) తన చేతిని నా నుదుటి మీద ఉంచారు. తరువాత ముఖమ్మీద, కడుపుపైనా ఉంచారు. పిమ్మట ఈ దుఆ చేశారు.

"దేవా! సాద్‌కు ఆరోగ్యాన్ని ప్రసాదించు, అతని హిజ్రత్‌ను పరిపూర్తి గావించు."

అప్పటి నుండి ఈ నాటి వరకు ఎప్పుడయినా ఈ సంఘటన జ్ఞప్తికి వచ్చినా ప్రవక్త(సఅసం) శుభహస్తాల చల్లదనం నా హృదయంపైన అనుభవిస్తూ ఉంటాను. (అల్ అదబుల్ మఫ్రద్)

హజ్రత్ జైద్ ఇబ్నె అర్ఖమ్ (రజి) ఇలా అన్నారు.

"ఒకసారి నాకు కళ్ళకలక వచ్చింది. దైవ ప్రవక్త (సఅసం) నన్ను పరామర్శించడానికి వచ్చి, 'జైద్! నీ కళ్ళ బాధకు ఏమి చేస్తున్నావు?' అని అడిగారు. అందుకు నేను "ఓర్పు, సహనం వహిస్తున్నాను" అని అన్నాను. " ఈ కళ్ళ బాధలో నీవు ఓర్పు, సహనం వహిస్తే దానికి ప్రతిఫలంగా నీకు స్వర్గం ప్రాప్తిస్తుంది." అని ఆయన (సఅసం) ఉపదేశించారు.

హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) ఇలా అన్నారు:

దైవ ప్రవక్త (సఅసం) ఎప్పుడయినా రోగిని పరామర్శించడానికి వెళితే అతని తల వద్ద కూర్చునే వారు. తరువాత ఏడు సార్లు ఈ విధంగా పలికేవారు.

اَسْأَلُ اللهَ الْعَظِيْمَ رَبَّ الْعَرْشِ الْعَظِيْمِ اَنْ يَّشْفِيَكَ

"అస్ అలుల్లాహల్ అజీమ రబ్బల్ అర్ షిల్ అజీమి అంయ్యష్ ఫియక్."

"నీకు ఆరోగ్యం చేకూర్చాలని అత్యంత గొప్ప సింహాసనానికి ప్రభువు, మహోన్నతుడయిన దైవాన్ని వేడుకొంటున్నాను". ఆయన (సఅసం) ఇంకా ఇలా అన్నారు.

"ఈ దుఆను ఏడుసార్లు పఠిస్తే రోగి తప్పకుండా ఆరోగ్యవంతుడవుతాడు. మృత్యువు వస్తే తప్ప." (మిష్కాత్)

హజ్రత్ జాబిర్ (రజి)ఉల్లేఖించిన దాని ప్రకారం, మహా ప్రవక్త (సఅసం) (ఒకవృద్ధురాలు) ఉమ్మెస్సాయిబ్‌ను పరామర్శించడానికి వచ్చారు. ఉమ్మెస్సాయిబ్, తీవ్రమైన జ్వరంతో వణికిపోతున్నారు. ఆయన "ఎలా ఉంది" అనడిగారు. "ఈ జ్వరం పాడుగాను, ఇది నన్ను పూర్తిగా చుట్టుకున్నది." అన్నారు ఆమె. అది విని ప్రియప్రవక్త (సఅసం) "జ్వరాన్ని నిందించకూడదు. ఏ విధంగానయితే కొలిమిలోని నిప్పు ఇనుముకు పట్టిన త్రుప్పును వదలగొట్టి శుభ్రం చేస్తుందో అదే విధంగా జ్వరం విశ్వాసి పాపాలను పోగొట్టి అతన్ని పవిత్రం చేస్తుంది" అని బోధించారు. (అల్ అదబుల్ ముఫ్రద్)

3. రోగి వద్దకు వెళ్ళి అతని ఆరోగ్య పరిస్థితిని గురించి విచారించాలి. అతని ఆరోగ్యం కొరకు దుఆ చేయాలి. దైవ ప్రవక్త (సఅసం) వ్యాధిగ్రస్తుల వద్దకు వెళ్ళినప్పుడు "మీ ఆరోగ్యం ఎలా ఉంది?" అని అడిగే వారు, ఆ తర్వాత అతనికి ధైర్యం చెపుతూ "భయపడవలసిన పనిలేదు. దైవం తలిస్తే ఈ వ్యాధి త్వరలోనే నయం అవుతుంది. వ్యాధి, పాపాల ప్రక్షాళనకు కారణం కాగలదు." అని బాధ ఉన్నచోట కుడిచేత్తో తడిమి దుఆ చేసేవారు:

اَللّٰهُمَّ اَذْهِبِ الْبَاْسَ رَبَّ النَّاسِ اَشْفِهٖ وَاَنْتَ الشَّافِيْ لَا شِفَاءَ اِلَّا

شِفَآءُكَ شِفَاءً لَّا يُغَادِرُ سُقْمًا (بخاری، مسلم)

"అల్లాహుమ్మ అజ్‌హిబిల్ బ'స, రబ్బన్నాసి, అష్‌ఫిహీ వ అన్తష్షాఫీ లా షిఫాఅ ఇల్లా షిఫాఉక, షిఫాఉల్లాయుగాదిరు సుక్‌మా " (బుఖారి, ముస్లిమ్)

'అల్లాహ్ ఇతని ఈ బాధను తొలిగించు, మానవుల ప్రభువా, ఇతనికి నివారణను అనుగ్రహించు, నీవే నివారణ ప్రసాదించేవాడివి. నీవు తప్ప మరెవరి నుంచీ నివారణను ఆశించలేము. వ్యాధి నామరూపాల్లేకుండా ఉండే నివారణను ప్రసాదించు.'

4. రోగివద్ద ఎక్కువసేపు కూర్చోరాదు. అల్లరి, రణగొణధ్వని చేయ రాదు. ఒకవేళ రోగి ఆప్తమిత్రుడో, బంధువో అయి ఉండి అతడే చాలాసేపటి వరకు కూర్చోమని కోరితే మీరు తప్పకుండా అతని కోరికను మన్నించవచ్చు. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) ఇలా అన్నారుః "రోగివద్ద చాలాసేపటి వరకు కూర్చోకుండా ఉండటం, అల్లరి చేయకుండా ఉండటం ప్రవక్త సంప్రదాయం."

5. రోగి బంధువులను కూడా రోగి పరిస్థితిని గురించి అడిగి తెలుసుకోవాలి. సానుభూతిని వ్యక్తం చేయాలి. చేయగల సేవ, సహాయం తప్పకుండా చేయాలి. ఉదాహరణకు వైద్యుడికి చూపించడం, పరిస్థితిని వివరించడం, మందులు వగైరా తెచ్చివ్వడం. అవసరమయితే ధనసహాయం కూడా చేయాలి.

హజ్రత్ ఇబ్రాహీమ్ బిన్ అబీహిబ్‌ల (రహ్)ఇలా అన్నారుః "ఒకసారి నా భార్య వ్యాధిగ్రస్తురాలైంది. నేను ఆ రోజుల్లో హజ్రత్ ఉమ్మెదర్ద (రజి) ఇంటికి వచ్చిపోతూ ఉండేవాణ్ణి. నేను అక్కడికి వెళ్ళగానే "నీ భార్య ఆరోగ్యం ఎలా ఉంది?" అని ఆమె అడిగేవారు. "ఇప్పటికీ ఆమె వ్యాధిగ్రస్తురాలే" అని నేను జవాబిచ్చేవాణ్ణి. తర్వాత ఆమె భోజనం తెప్పించేవారు. నేను వారి ఇంట్లో కూర్చుని భోజనం చేసి తిరిగి వచ్చేవాణ్ణి. ఒకరోజు నేను వెళ్ళగానే పరిస్థితి అడిగారు. దేవుని కరుణాకటాక్షాలవల్ల దాదాపు ఆవిడ ఆరోగ్యం కుదుటపడింది అని అన్నాను. అందుకు ఆమె 'నీవు నీ భార్య వ్యాధి గ్రస్తురాలై ఉందని చెప్పినప్పుడు నేను నీకోసం భోజనం ఏర్పాటు చేశాను. ఇప్పుడు ఆమె ఆరోగ్యవంతురాలయింది. కనుక ఆ ఏర్పాటు అవసరంలేదు కదా!' అని అన్నారు.

6. వ్యాధిగ్రస్తుడయిన ముస్లిమేతర సోదరుని కూడా పరామర్శించడానికి వెళ్ళాలి. సమయానుకూలంగా అతని దృష్టిని ధర్మం వైపునకు మరల్చాలి. సాధారణస్థితిలో కన్నా మనిషి వ్యాధిగ్రస్తుడై ఉన్నప్పుడే దేవుని వైపు మరలడానికి ఎక్కువ అవకాశం ఉంది. సత్యాన్ని స్వీకరించాలనే భావం కూడా సామాన్యంగా అప్పుడే ఎక్కువగా జనిస్తుంది.

హజ్రత్ అనస్ (రజి) ఇలా ఉల్లేఖించారు. "ఒక యూదుకుర్రవాడు ప్రవక్త (సఅసం) సేవచేసేవాడు. ఒకసారి అతడు వ్యాధిగ్రస్తుడయ్యాడు. అప్పుడు ప్రవక్త (సఅసం) అతన్ని పరామర్శించడానికి వెళ్ళారు. ఆయన (సఅసం) అతని తలవద్ద కూర్చొని ఇస్లామ్ సందేశాన్నిచ్చారు. పిల్లవాడు తన వద్దనే ఉన్న తండ్రి వంక (నీ ఉద్దేశం ఏమిటి అన్నట్లు) చూశాడు. తండ్రి పిల్లవానితో 'అబ్బాయి! అబుల్ కాసిమ్ మాటను అంగీకరించు' అని అన్నాడు. కాబట్టి పిల్లవాడు ఇస్లామ్ స్వీకరించాడు. అప్పుడు ప్రవక్త (సఅసం) ఈ పిల్లవాణ్ణి నరకం నుండి రక్షించిన దేవునికి కృతజ్ఞతలు' అంటూ బయటికి వచ్చారు." (బుఖారి)

7. రోగిని పరామర్శించడానికి అతని ఇంటికి వెళ్ళినప్పుడు అటూ ఇటూ తొంగి చూడరాదు. ఇంటిలోని మహిళలపైన మన దృష్టిపడకుండా ఉండే విధంగా జాగ్రత్తగా కూర్చోవాలి. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ (రజి) ఒకసారి ఒక రోగిని పరామర్శించడానికి వెళ్ళారు. ఆయన వెంట మరికొంతమంది కూడా ఉన్నారు. ఇంట్లో ఒక మహిళకూడా ఉంది. ఆయన వెంటవచ్చిన వారిలో ఒకడు ఆ మహిళను క్రీగంట చూడసాగాడు. హజ్రత్ అబ్దుల్లాహ్ అది గ్రహించి "నీవు నీ కళ్ళను పాడుచుకుంటే నీకు ఎంతో మేలు" అని పలికారు.

8. బహిరంగంగా పాపకార్యాలకు, నీతిబాహ్య చర్యలకు లోనైనవారినీ, లజ్జారహితంగా విశృంఖలంగా దేవునికి అవిధేయులై ప్రవర్తిస్తున్న వారిని పరామర్శించడానికి వెళ్ళనవసరం లేదు. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ ఇలా అన్నారుః

"మద్యపానం చేసేవారు వ్యాధిగ్రస్తులైతే వారిని పరామర్శించరాదు."

9. రోగిని పరామర్శించడానికి వెళ్లినట్లయితే రోగితో తమ కొరకు కూడా దుఆ చేయమని కోరండి.

ఇబ్నె మాజాలో ఈ విధంగా వుంది : మీరు రోగిని పరామర్శించడానికి వెళ్ళినప్పుడు తమ కోసం దుఆ చేయమని కోరండి. రోగి చేసే దుఆ దైవదూతల దుఆ వంటిది. అంటే దైవ దూతలు దేవుని అభీష్టాన్ని గ్రహించి మరీ దుఆ చేస్తారు. వారి దుఆ స్వీకరించబడుతుంది.

# 10. ఒకరికొకరు కలుసుకునే రీతులు

1. ఎవరినయినా కలుసుకున్నప్పుడు నగుమోముతో ఆహ్వానించాలి. సంతోషాన్ని సాన్నిహిత్యాన్ని వ్యక్తం చేయాలి. సలామ్ చేయడంలో ముందుండాలి. దానికి పెద్ద పుణ్యఫలం లభిస్తుంది.

2. సలామ్, దుఆలకు ఇతర పదాలను ఉపయోగించరాదు. దైవ ప్రవక్త (సఅసం) నేర్పిన పదాలు "అస్సలాము అలైకుమ్"ను ఉపయోగించాలి. వీలుంటే కరచాలనం చేయాలి. యోగక్షేమ సమాచారాలు అడిగి తెలుసుకోవాలి. ఉచితమనుకుంటే ఇంటి వారి యోగ క్షేమాలు కూడా అడిగి తెలుసుకోవాలి.

ప్రవక్త (సఅసం) తెలిపిన పదాలు "అస్సలాము అలైకుమ్" సమగ్రమైనవి. వాటిలో ఇహ, పరలోకాల సర్వ శుభాలు 'పుణ్యం' శ్రేయస్సులు ఇమిడి ఉన్నాయి. ప్రవక్త (సఅసం) కరచాలనం చేసేటప్పుడు తన చేతిని వెంటనే విడిపించుకోడానికి ప్రయత్నించే వారుకాదని, రెండవ వ్యక్తి తనంతట తాను చేతిని వదిలే వరకు వేచి ఉండేవారని కూడా గుర్తుంచుకోవాలి.

3. ఎవరినైనా కలుసుకోడానికి వెళ్ళేటప్పుడు పరిశుభ్రమైన బట్టలు తొడుక్కొని వెళ్ళాలి, మురికి దుస్తులతో వెళ్ళకూడదు. అలాగని విలువైన వస్త్రాలనే ధరించి వారి ముందు తమ గొప్పతనాన్ని ప్రదర్శించే ఉద్దేశంతో వెళ్ళరాదు.

4. ఒకరిని కలుసుకోవాలని అనుకున్నప్పుడు ముందే వారిని అడిగి సమయాన్ని నిర్ణయించుకోవాలి. సమయం సందర్భంలేకుండా ఎవరి వద్దకయినా సరే వెళ్లటం మంచిది కాదు. దాని వల్ల ఇతరుల సమయమూ పాడైపోతుంది. అలా కలుసుకునే వారు కూడా విలువకోల్పోతారు.

5. ఎవరయినా మిమ్మల్ని కలుసుకోడానికి వచ్చినప్పుడు ప్రేమతో చిరునవ్వుతో స్వాగతం పలకాలి. సగౌరవంగా కూర్చోబెట్టాలి. వీలునుబట్టి ఉచిత రీతిలో సత్కరించాలి.

6. ఎవరి వద్దకైనా వెళ్ళినప్పుడు ముఖ్యమైన విషయాలే సంభాషించాలి. అనవసరమయిన మాటలు మాట్లాడి వారి సమయాన్నీ మీ సమయాన్నీ వృధా చేయకండి. అలా చేస్తే మీరు జనుల్ని కలుసుకోవడానికి వెళ్ళడమే వారికి దుర్భరంగా రూపొందుతుంది.

7. ఎవరినయినా కలవడానికి వెళితే ద్వారం వద్ద అనుమతి పొందాలి, అనుమతి లభిస్తే "అస్సలాము అలైకుమ్" అంటూ లోనికి వెళ్ళాలి. మూడుసార్లు "అస్సలాము అలైకుమ్" అన్న తరువాత కూడా ఎలాంటి జవాబు రాకపోతే

సంతోషంగా వెను తిరిగి వచ్చేయండి.

8. ఎవరి వద్దకయినా వెళ్ళేటప్పుడు అప్పుడప్పుడు, ఏదైనా మంచి కానుక కూడా తీసుకు వెళ్ళాలి. కానుకలు ఇచ్చిపుచ్చుకోవడం వల్ల పరస్పర అనుబంధం పెంపొందుతుంది.

9. ఎవరయినా అవసరమయి మీ వద్దకు వస్తే సాధ్యమైనంత వరకు అతని అవసరాన్ని తీర్చాలి. సిఫారసు చేయమని కోరితే సిఫారసు చేయాలి. ఒకవేళ అతని అవసరాన్ని తీర్చలేకపోతే ప్రేమపూర్వకమయిన మాటలతో నచ్చజెప్పాలి. అనవసరంగా అతనికి లేనిపోని ఆశలు కల్పించరాదు.

10. మీరు ఎవరి వద్దకయినా అవసరమై వెళితే సభ్యతాయుతమయిన రీతిలో మీ అవసరాన్ని తెలియజేయాలి, అది నెరవేరినట్లయితే వారికి కృతజ్ఞతలు చెప్పాలి. నెరవేరకపోయినా "సలామ్" చెప్పి సంతోషంగా తిరిగి రావాలి.

11. ఎల్లప్పుడు ఇతరులే మిమ్మల్ని కలుసుకునేందుకు రావాలి అనే కోరిక ఉండరాదు, మీరు కూడా ఇతరుల్ని కలుసుకోవడం, ఒకరి అవసరాలు మరొకరు తీర్చుకోవడం అవసరం, అభిలషణీయం. అయితే పరస్పరం కలుసుకోవడం అన్నది పవిత్ర లక్ష్యాల కొరకే జరగాలి.

12. కలుసుకున్నప్పుడు ఎదుటి వారి ముఖం, గడ్డం, లేక దుస్తులపై ఏదైనా గడ్డిపోచ లేక మరేదైనా పదార్థాన్ని చూస్తే తీసివేయాలి. ఒకవేళ ఇంకొకరు మనపట్ల అలా మంచిగా ప్రవర్తిస్తే కృతజ్ఞత తెలుపుకోవాలి, ఈ దుఆ కూడా చేయాలి.

مَسَحَ اللّٰهُ عَنْكَ مَا تَكْرَهُ

"మసహల్లాహు అన్‌క మాతక్ రహు"

**మీకు ఇష్టంలేని వస్తువుల్ని దైవం మీకు దూరం చేయుగాక!**

13. రాత్రివేళలో ఎవరి వద్దకయినా వెళ్ళ వలసిన అవసరం కలిగితే వారి విశ్రాంతిని దృష్టిలో పెట్టుకోవాలి. చాలా సమయంవరకు కూర్చోరాదు. ఒకవేళ వెళ్ళిన తర్వాత వారు నిద్రపోయారని తెలిస్తే ఎటువంటి చిరాకు పడకుండా సంతోషంగా తిరిగి వచ్చేయాలి.

14. కొందరు వ్యక్తులు కలిసి బృందంగా ఎవరినయినా కలుసుకోడానికి వెళితే మాట్లాడే వారు అందరి తరపున ప్రాతినిధ్యం వహించాలి.

సంభాషణలో తన ప్రత్యేకమైన గొప్పతనాన్ని ప్రదర్శించడం, తన ప్రాముఖ్యతను వెల్లడి చేసుకోవడం, తనతోటివారిని నిర్లక్ష్యం చేయడం, ఎదుటి వారిని తనవైపునకు ఆకర్షించుకోవడం వంటి వాటికి దూరంగా ఉండాలి.

# 11 సంభాషణా మర్యాదలు

1. ఎల్లప్పుడూ సత్యమే పలకాలి. ఎంత గొప్ప నష్టమయినప్పటికి సత్యం పలకడంలో ఎప్పుడూ భయపడరాదు.

2. అవసరం ఉన్నప్పుడే సంభాషించాలి. ఎప్పుడు మాట్లాడినా ఉపయోగకరమయిన మాటలే పలకాలి. అనవసరంగా మాట్లాడటం హుందాతనానికి, గంభీరస్వభావానికి వ్యతిరేకం. దేవుని వద్ద ప్రతి మాటకు సమాధానం ఇవ్వవలసి ఉంటుంది. మనిషి నోటి నుండి వెలువడే ప్రతిపలుకునూ దైవదూత వెంటనే రాస్తూ ఉంటాడు.

"అతని నోటి నుండి పలుకు రాగానే ఒక కావలి (దైవదూత) దాన్ని భద్ర పరచడానికి వేచి ఉంటాడు." (ఖుర్ఆన్)

3. సంభాషించేటప్పుడు మృదువుగా మాట్లాడాలి, చిరునవ్వుతో తియ్యగా మాట్లాడాలి, శ్రోతకు వినబడనంత మెల్లగా గాని, శ్రోతను భయాక్రాంతుని చేసేంత బిగ్గరగాగాని మాట్లాడ కూడదు. కంఠ స్వరం మధ్యస్థంగా ఉండాలి. దివ్యఖుర్ఆన్‌లో ఉంది :

"అత్యంత అసహ్యకరమయిన, భరించరాని స్వరం గాడిద స్వరం"
(లుఖ్మాన్)

4. మురికి మాటలు పలికి నోటిని మలినం చేసుకోరాదు. ఇతరులను గురించి చెడుగా ప్రస్తావించకండి. చాడీలు చెప్పకండి, నిందారోపణలు చేయకండి, ఇతరుల్ని అనుకరించకండి. ఉత్తుత్తిగా వాగ్దానం చేయకండి. ఇతరులను అపహసించకండి, మిమ్మల్ని గురించి మీరే చెప్పుకోకూడదు. ఆత్మ స్తుతి చేసుకోరాదు, పిడివాదం చేయకూడదు. ఎవరిముందు వారిమాటగా మాట్లాడ కూడదు. సూటిపోటిమాటలు అనకూడదు, దెప్పిపొడవరాదు. ఎవరినీ చెడ్డపేరుతో పిలువకూడదు. మాటిమాటికీ ఒట్టు వేసుకోరాదు.

5. ఎల్లప్పుడూ న్యాయమయిన మాటనే పలకాలి, అందు వలన మీకు మీ స్నేహితులకు, మీ బంధువులకు ఎంత నష్టం కలిగినా సరే.

"నోటితో ఏదయినా మాట్లాడదలిస్తే న్యాయమయిన మాటనే పలకాలి, వారు మీ బంధువులైనా సరే" (దివ్య ఖుర్ఆన్)

6. మృదువుగా, సమంజసంగా, మనోరంజకంగా మాట్లాడాలి. కరుకుగా మనస్సుకు బాధ కలిగేలా కఠినంగా మాట్లాడరాదు.

7. స్త్రీలు ఒకవేళ పురుషులతో మాట్లాడవలసి వస్తే స్పష్టంగా, సూటిగా, పొడిగా మాట్లాడాలి. నాజూకుగా, కలుపుగోలుతనం చూపించి వినేవారి మనస్సులో దురాలోచన కలిగే విధంగా సంభాషించరాదు.

8. మూర్ఖులు మాటలతో చిక్కులు సృష్టించదలచినప్పుడు ఉచితరీతిలో సలామ్ చేసి అక్కడినుండి తప్పుకోవాలి. వ్యర్థమయిన మాటలు మాట్లాడేవారు, ఎల్లప్పుడు పిచ్చివాగుడు వాగేవారు ముస్లిమ్ సమాజంలోని హీనమయినవారు.

9. ఎదుటివాడికి విషయాన్ని బాగా విశదపరచడానికి లేదా విషయ ప్రాధాన్యతను నొక్కిచెప్పడానికి, అతని మనో నైజాన్ని, ఆలోచనా విధానాన్ని దృష్టిలో ఉంచుకొని సరయిన సంభాషణ పంథాను అవలంబించాలి. ఒకవేళ ఎదుటి వ్యక్తి గ్రహించలేకపోతే లేదా వినలేకపోతే ఏమాత్రం చికాకు పడకుండా విషయాన్ని మరోసారి చెప్పాలి.

10. ఎల్లప్పుడూ క్లుప్తంగా అవసరమయిన విషయం గురించే మాట్లాడాలి. అనవసరంగా సంభాషణను పొడగించడం భావ్యం కాదు.

11. ఎప్పుడయినా ఏదయినా ధార్మిక విషయం వివరించవలసి వస్తే లేక ఉపన్యాసం ద్వారా ధార్మిక ఆదేశాలు, నియమాలు అర్థమయేలా చెప్పవలసి వస్తే అవి సాధారణ పద్ధతిలో ఆర్ద్ర హృదయంతో విశదీకరించాలి. ఉపన్యాసం ద్వారా కీర్తిని కోరడం, గారడి మాటలతో ప్రజలను సమ్మోహితులుగా చేయడం వారిని బుట్టలో వేసుకోవడం, గర్వించడం, హాస్యానికి, వినోదానికి ఉపన్యాసాలు చేయడం మొదలయినవి అతి హేయమయిన అలవాట్లు. దీని వల్ల హృదయం నల్లబడిపోతుంది.

12. ముఖస్తుతి పొగడ్తలు చేయరాదు, ఆత్మాభిమానాన్ని ఎప్పుడూ దృష్టిలో ఉంచుకోవాలి. మీ స్థాయికి తగని విధంగా ఎప్పుడూ మాట్లాడకూడదు.

13. ఇద్దరు వ్యక్తులు సంభాషిస్తున్నప్పుడు, అనుమతి తీసుకోకుండా అందులో జోక్యం కలుగజేసుకోరాదు, ఇతరుల మాటను ఖండించి మాట్లాడటానికి ప్రయత్నించరాదు. మాట్లాడటం తప్పనిసరి అయినప్పుడు అనుమతి తీసుకొని మరీ మాట్లాడాలి.

14. మెల్లమెల్లగా, మర్యాదగా, హుందాగా మాట్లాడాలి. మాట్లాడేటప్పుడు

వేగిర పడరాదు. అనుక్షణం నవ్వులాట, ఎగతాళి చేయకూడదు. దానివల్ల మనిషి విలువ తగ్గిపోతుంది.

15. ఎవరయినా ఏదయినా అడిగితే ముందు, జాగ్రత్తగా వారి మాటను ఆలకించాలి. ఆ తర్వాత బాగా ఆలోచించి సమాధానం ఇవ్వాలి. అనాలోచితంగా అర్థం పర్థంలేని జవాబు ఇవ్వడం తెలివి తక్కువతనాన్ని సూచిస్తుంది. ఒకవేళ ఎవరయినా మరో వ్యక్తిని ప్రశ్నిస్తుంటే మధ్యలో కల్పించుకుని మీ అంతట మీరు ముందుగా జవాబు ఇవ్వ యత్నించకూడదు.

16. ఎవరయినా ఏదయినా తెలియ జేస్తున్నప్పుడు 'అది నాకు తెలుసు' అని ముందే చెప్పేయకూడదు. బహుశా వారు చెప్పే మాటల్లో మీకు తెలియని కొత్త విషయం ఏదయినా ఉండ వచ్చు లేక ఏదయినా ప్రత్యేక విషయం మీ మనసుపైన ప్రత్యేక ప్రభావం వేయవచ్చు. ఎందుకంటే విషయంతో బాటు చెప్పే వారి చిత్తశుద్ధి, సత్ప్రవర్తనలు కూడా మనల్ని ప్రభావితం చేస్తాయి.

17. ఎవరితో మాట్లాడినా వారి వయస్సు, హోదా, అంతస్తు, వారితో మీకున్న సంబంధాన్ని దృష్టిలో పెట్టుకుని మాట్లాడాలి. తల్లి తండ్రులు, ఉపాధ్యాయులు, తదితర పెద్దలతో స్నేహితులవలే సంభాషించరాదు. అలాగే చిన్నవారితో మాట్లాడినప్పుడు మీ అంతస్థును గమనించి ప్రేమ పూర్వకంగా, పెద్దమనిషి తరహాలో సంభాషించాలి.

18. సంభాషిస్తున్నప్పుడు ఇతరులవైపు సైగ చేయకూడదు. దానివల్ల ఇతరులు అపార్థం చేసుకునే ఆస్కారముంది. అనవసరంగా వారి మనసులో మీ పట్ల అనుమానం కలగవచ్చు. అలాగే ఇతరుల మాటలు చాటుగా వినడం కూడా తప్పు.

19. ఇతరులు చెప్పే మాటలే ఎక్కువగా వినాలి. మీరు సాధ్యమైనంత తక్కువగా మాట్లాడాలి. రహస్య విషయం ఏదయినా ఉంటే దాన్ని ఎవరి ముందూ వ్యక్తం చేయరాదు. మీ రహస్యాన్ని ఇతరులకు తెలిపి అది భద్రంగా ఉంటుందని ఆశించడం అవివేకమే అవుతుంది.

# 12. ఉత్తర ప్రత్యుత్తరాల మర్యాదలు

1. ఉత్తరం ఎల్లప్పుడూ "బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్" అని వ్రాసి ప్రారంభించాలి. క్లుప్తంగా వ్రాయాలనుకుంటే "బిఇస్మిహీ తఆలా" అని వ్రాయాలి. దైవప్రవక్త (సఅసం)

"ఏపనయితే "బిస్మిల్లాహ్"తో ఆరంభం కాదో అది అసంపూర్తిగాను, అశుభ్రంగాను ఉండిపోతుంది" అన్నారు.

కొందరు అక్షరాలకు బదులు 786 అని అంకెలు వ్రాస్తారు. దాన్ని మానుకోవాలి. ఎందుకంటే దేవుడు ఉపదేశించిన అక్షరాల్లోనే శుభం ఉంటుంది.

2. మీ చిరునామాను ప్రతిలేఖలో తప్పకుండా వ్రాయాలి. ఇంతకు ముందు లేఖలో వారికి చిరునామా వ్రాశాను అనో లేక వారికి జ్ఞాపకం ఉండే ఉంటుందనో తలచి మళ్ళీ చిరునామా వ్రాయకుండా అలసత్వం చూపడం మంచిది కాదు. మీ చిరునామా వారి వద్ద భద్రంగా ఉండాలని యేమీలేదు. అలాగే వారికి మీ చిరునామా జ్ఞాపకం ఉండాల్సిన అవసరమూ లేదు.

3. మీ చిరునామా ఎడమవైపు కొద్దిగా స్థలం వదలి వ్రాయాలి. చిరునామా ఎల్లప్పుడూ స్పష్టంగా, చక్కగా వ్రాయాలి. చిరునామా సరిగా ఉందా లేదా అని ఒకసారి పరిశీలించుకోవడం మంచిది.

4. చిరునామా కింద లేక కుడి వైపు పైభాగాన తేదీ తప్పకుండా వ్రాయాలి.

5. తేది వ్రాసిన తరువాత ఎవరికి లేఖ వ్రాస్తున్నారో వారిని విశేష నామంతో, గౌరవ పూర్వకమైన పదాలతో సంబోధించాలి. బిరుదులు, గౌరవ పదాలను క్లుప్తంగా, సాదాగా వ్రాయాలి. తద్వారా ప్రేమ సాన్నిహిత్యాలు, వ్యక్తంకావాలి. కల్పన, కృత్రిమత వ్యక్తమయ్యే బిరుదులు ప్రయోగించరాదు. బిరుదులు, గౌరవ పదాల తర్వాత వాటి పక్కన లేదా వాటి క్రింద రెండవ వరుసలో "సలామ్ మస్నూన్" లేక "అస్సలాముఅలైకుమ్" అని వ్రాయాలి. "ఆదాబ్" "తస్లీమాత్" అని వ్రాయకూడదు.

6. ముస్లిమేతరులకు ఉత్తరం వ్రాస్తే "ఆదాబ్" "తస్లీమాత్" వంటి పదాలు వ్రాయాలి.

7. గౌరవ పదాల్లో, సలామ్ తర్వాత ఏ ఉద్దేశంతో లేఖ వ్రాయదలచు

కున్నారో దాన్ని వ్రాయాలి. ఆ తర్వాత వారితో మీ సంబంధాన్ని తెలిపే మాట లతోబాటు మీ పేరు వ్రాసి లేఖను పూర్తి చేయాలి. ఉదాహరణకు 'మీ సేవకుడు', 'శ్రేయోభిలాషి' మొదలగునవి.

8. ఉత్తరం స్పష్టంగా, నిరాడంబరంగా చక్కని దస్తూరితో వ్రాయాలి. సులభంగా చదవగలిగేలా, అర్థం అయ్యేలా, ఉత్తరం చదివే వారి హృదయంలో దాని విలువ ఉండేలా వ్రాయాలి.

9. ఉత్తరంలో అత్యంత సామాన్యమైన, సులభమైన, సభ్యతాయుతమైన భాషను ఉపయోగించాలి.

10. ఉత్తరం క్లుప్తంగా వ్రాయాలి. కాని ప్రతి విషయాన్ని విడమర్చి విశదీకరించాలి. కేవలం సూచనలతో సరిపెట్టరాదు.

11. పూర్తి లేఖలో గౌరవ పదాలు మొదలుకొని ముగింపు వరకు చిరునామా దారుని హోదా అంతస్తుల్ని దృష్టిలో పెట్టుకోవాలి.

12. క్రొత్త పేరాగ్రాఫ్ ప్రారంభించేటప్పుడు దానికి సంబంధించిన పద్ధతుల్ని అనుసరించాలి.

13. ఉత్తరంలో ఎల్లప్పుడు గంభీర విధానాన్ని అవలంబించాలి. దానికి భిన్నమైన విధానాన్ని అనుసరించరాదు.

14. కోపంలో ఉన్నప్పుడు ఉత్తరం వ్రాయకూడదు. కఠినమైన మాటలు వ్రాయరాదు. ఉత్తరం సదా సౌమ్యమయిన ధోరణిలో వ్రాయాలి.

15. సామాన్య ఉత్తరాల్లో రహస్య విషయాలను ప్రస్తావించరాదు.

16. వాక్యం పూర్తి అయిన తరువాత ఫుల్‌స్టాప్ తప్పకుండా పెట్టాలి.

17. ఇతరుల ఉత్తరాలను అనుమతి లేకుండా చదవరాదు. ఇది నైతికంగా గొప్ప ద్రోహం. అయితే ఇంటి పెద్దలు, సంరక్షకులు బాధ్యత గలవారు తమ చిన్న పిల్లల ఉత్తరాలు వారికి శిక్షణ, సరైన సలహాలు ఇచ్చేందుకు చదవాలి. బాలికల ఉత్తరాల విషయంలో ప్రత్యేకంగా శ్రద్ధ వహించాలి.

18. బంధువులకు, మిత్రులకు యోగక్షేమాలు విచారిస్తూ తప్పకుండా ఉత్తరాలు వ్రాస్తూ వుండాలి.

19. ఎవరయినా వ్యాధిగ్రస్తులయితే, లేక ఏదయినా ప్రమాదం సంభవిస్తే లేక మరేదయినా ఆపదలో చిక్కుకుంటే వారికి సానుభూతి తెలుపుతూ తప్పకుండా ఉత్తరం వ్రాయాలి.

20. ఏదైనా శుభకార్యం జరిగితే లేక ఎవరయినా బంధువు వస్తే లేక ఇంకా వేరే ఏదైనా సంతోషకరమయిన సమయం వస్తే అభినందన లేఖ తప్పకుండా వ్రాయాలి.

21. ఉత్తరం ఎల్లప్పుడు నీలి సిరా లేక నలుపు సిరాతో వ్రాయాలి, పెన్సిలు లేక ఎర్ర సిరాతో అసలు వ్రాయరాదు.

22. ఎవరయినా మీకు పోష్టు చేయడానికి ఉత్తరం ఇస్తే ఎంతో బాధ్యతతో దాన్ని సమయానికి పోష్టులో వేయాలి. ఆలస్యం, అలక్ష్యం, చేయకూడదు.

23. సంబంధంలేని వ్యక్తుల నుంచి సమాధానం కోరదలచినప్పుడు మన ఉత్తరంతో పాటు జవాబు కార్డు గాని స్టాంపులుగాని పంపించాలి.

24. వ్రాసిన తరువాత కొట్టి వేయాలని అనుకుంటే తేలికైన ఒక గీత గీస్తే సరిపోతుంది.

25. ఉత్తరంలో కేవలం మీకు నచ్చినవి మీకు సంబంధించిన విషయాలు మాత్రమే వ్రాసుకోకూడదు. అవతలి వ్యక్తి భావోద్రేకాలు, ఇష్టాయిష్టాలు, అభిరుచుల్ని కూడా దృష్టిలో ఉంచుకోవాలి. అలాగే ఉత్తరాల్లో కేవలం మీ సంబంధీకుల క్షేమ సమాచారాలే తెలుపుకోకుండా అవతలి వారి సంబంధీకుల క్షేమసమాచారాన్ని కూడా అడిగి తెలుసుకోవాలి. వారిని జ్ఞాపకం చేయాలి. ఉత్తరాల్లో ఎవరినీ ఎక్కువ కోరికలు కోరకూడదు. అలా ఎక్కువ కోరికలు కోరే మనిషికి విలువ ఉండదు.

# 13. వ్యాపార నియమాలు

1. వ్యాపారం శ్రద్ధతో, శ్రమతో చేయాలి. మీ ఉపాధిని మీరే స్వహస్తాలతో సంపాదించాలి. ఒకరికి భారంగా రూపొందకూడదు. ఒకసారి ప్రవక్త (సఅసం) దగ్గరికి ఒక అన్సారీ సహాబి (రజి) వచ్చి ఏదో సహాయం అడిగారు. ప్రవక్త (సఅసం) "మీ ఇంట్లో సామాగ్రి ఏదైనా ఉందా?" అని అడిగారు. ఆ సహచరుడు (రజి) "దైవ ప్రవక్త, రెండు వస్తువులు మాత్రం ఉన్నాయి. ఒకటి బొంతపరుపు దాన్నే మేము కప్పుకుంటాము. పరుచుకుంటాము కూడా. రెండవది నీళ్ళు తాగే చెంబు" అని చెప్పాడు. ప్రవక్త (సఅసం) 'ఆ రెండు నావద్దకు తీసుకొనిరా' అని ఆదేశించారు. సహాబి (రజి) ఆ రెండు వస్తువులు తీసుకువచ్చారు. ప్రవక్త (సఅసం) ఆ రెండు వస్తువుల్ని రెండు దీనారాలకు అమ్మి, ఆ రెండు దీనారాలను సహాబికిస్తూ "ఇదిగో ఒక దీనారులో ఆహార పదార్థాలు కొని ఇంటి వారికి ఇచ్చిరా, ఇంకొక దీనారుతో ఒక గొడ్డలికొని తీసుకొనిరా" అని చెప్పారు.

తర్వాత సహాబి (రజి) తెచ్చిన గొడ్డలికి స్వహస్తాలతో కర్ర తొడిగి ఇస్తూ ఇలా అన్నారు. "వెళ్ళు అడవికిపోయి కట్టెలు కొట్టి వాటిని తెచ్చి బజారులో అమ్ము. పదిహేను రోజుల తర్వాత వచ్చి వృత్తాంతం వివరించు."

పదిహేను రోజులు గడిచిన తర్వాత ఆ సహచరుడు హాజరుకాగానే అతని వద్ద పది దీనారులు మిగిలుండటం చూచి ప్రవక్త (సఅసం) సంతోషించారు. అప్పుడాయన "నీవు ఇతరులను యాచిస్తూ తిరగడం, ప్రళయ దినాన నీ ముఖంపైన ఆ యాచన కారణంగా ఏర్పడే కళంకం కన్నా ఈ కష్టార్జితమే నీకు చాలా మేలైనది." అని బోధించారు. (హదీసు)

2. పట్టుదలతో వ్యాపారం చేయాలి. బాగా సంపాయించాలి. ఇతరులపైన ఆధారపడకుండా ఉండాలి. ప్రవక్త (సఅసం)ను ఒకసారి జనులు ఇలా అడిగారు. "దైవప్రవక్తా! అన్నిటి కంటె ఉత్తమమైన సంపాదన ఏది?"

ఆయన ఇలా అన్నారు." స్వహస్తాలతో సంపాదించినది. అబద్ధం, నమ్మకద్రోహం ఉండని వ్యాపారం."

హజ్రత్ అబూఖలాబ (రహ్మలై) ఇలా అంటూ ఉండేవారు. "బజారులో దీక్షతో వ్యాపారం చేయండి, మీరు ధర్మంపైన దృఢంగా నిలబడగలుగుతారు. ప్రజల పట్ల అపేక్ష లేకుండా మెలగ గలుగుతారు."

3. వ్యాపారాన్ని అభివృద్ధి చేయడానికి ఎల్లప్పుడూ సత్యాన్నే పాటించాలి. అసత్య ప్రమాణాలు చేయడం కఠినంగా మానుకోవాలి. ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు. 'తన వ్యాపారాన్ని అభివృద్ధి చేయడానికి అసత్య ప్రమాణాలు చేసిన వ్యక్తితో దేవుడు ప్రళయ దినాన మాట్లాడడు. కన్నెత్తి అతని వైపు చూడడు. అతన్ని అతని పాప ప్రక్షాళన చేసి స్వర్గంలో ప్రవేశింప చేయడు.' (ముస్లిమ్)

ఆయన (సఅసం) ఇంకా ఇలా కూడా అన్నారు. "మీ సామగ్రిని అమ్ముకోడానికి అసత్య ప్రమాణాలు చేయడం మానండి. అలా చేయడం వల్ల ఆ సమయానికి అభివృద్ధి చెందినట్లు అనిపించినా తుదకు వ్యాపారంలో శుభలాభాలు అంతమైపోతాయి. (ముస్లిమ్)

4. వ్యాపారంలో ఎల్లప్పుడూ విశ్వసనీయత, అప్పగింత (అమానత్) పట్ల నమ్మకం అవలంబించాలి. చెడిపోయిన వస్తువును అమ్మిగాని లేక సాధారణ లాభం కంటే అధిక లాభాలు తీసుకొని గాని మీ ధర్మమైన సంపాదనను అధర్మమైందిగా చేసుకోకండి. దేవుని ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు.

"సత్యవంతుడయిన, నమ్మకస్తుడయిన వ్యాపారి ప్రళయదినాన ప్రవక్తలతో, సత్యసంధులయిన వారితో, అమరగతులయిన వారితో కలిసి ఉంటాడు."

(తిర్మిజి)

5. కొనేవారికి మంచి వస్తువులే సమకూర్చడానికి ప్రయత్నించాలి. మీకు నమ్మకం లేని సామగ్రిని అసలు కొనే వారికి అమ్మనే కూడదు. ఒకవేళ కొనే వారు మిమ్మల్ని సలహా కోరితే వారికి సముచితమైన సలహా ఇవ్వాలి.

6. కొనేవారి నమ్మకాన్ని సంపాదించేందుకు ప్రయత్నించండి. వారు మిమ్మల్ని శ్రేయోభిలాషులని నమ్మేలా, మీ వద్ద వారు ఎప్పుడూ మోసపోరని వారికి పూర్తిగా నమ్మకం కలిగేలా మెలగాలి.

మహాప్రవక్త ఓ సారి ఇలా అన్నారు : 'ధర్మ సంపాదనపైనే జీవితం గడిపిన వాడు, నా సంప్రదాయాన్ని (సున్నత్) పాటించినవాడు, తనవల్ల చెడు జరక్కుండా ప్రజలను కాపాడినవాడు స్వర్గ నివాసి. స్వర్గంలో తప్పక ప్రవేశిస్తాడు'. ప్రజలు "దైవప్రవక్తా ఈ కాలంలో అటువంటివారు అధిక సంఖ్యలో ఉన్నారు." అని అన్నారు. అందుకు ఆయన (సఅసం) "నా తర్వాత కూడా అటువంటివారు ఉంటారు." అని అన్నారు. (తిర్మిజి)

7. సమయాన్ని సక్రమంగా పాటించాలి. వేళకు దుకాణానికి వెళ్ళాలి. దీక్షతో, ఓర్పుతో కూర్చోవాలి, ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు. ఉపాధి

అన్వేషణలో ధర్మ సమ్మతమైన సంపాదన కొరకు ప్రాతఃకాలానే బయల్దేరండి. ఎందుకంటే ప్రొద్దున్నే చేసే పనుల్లో శుభలాభాలు ఇమిడి ఉన్నాయి."

8. స్వయంగానూ శ్రమించాలి, నౌకరులకు కూడా కష్టపడి పనిచేసే అలవాటు చేయాలి. అయితే నౌకర్ల హక్కుల్ని ఉదారబుద్ధితో, త్యాగహృదయంతో నెరవేర్చాలి. వారిపట్ల ఎల్లప్పుడూ మృదువుగా, సహృదయంతో ప్రవర్తించాలి. ప్రతిమాటకు కోపగించుకోవడం, అనుమానపడడం మంచిది కాదు. ప్రవక్త (సఅసం) ఇలా అన్నారుః "బలహీనులకు వారి హక్కుల్ని ఇప్పించని సమాజానికి దేవుడు పవిత్రతను ప్రసాదించడు."

9. కొనేవారి పట్ల సౌమ్యంగా ప్రవర్తించాలి. అప్పు అడిగేవారి పట్ల కఠిన వైఖరిగాని, వారిని నిరాశపరచడం గాని చేయకూడదు, వసూలు చేసేటప్పుడు కూడా వారిపట్ల కఠినంగా ప్రవర్తించరాదు. ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు.

"ఎవరైతే కొనడం, విక్రయించడం, వసూలు చేయడంలో మృదుత్వంతో, మంచినడవడికతో ప్రవర్తిస్తారో అలాంటివారిని దేవుడు కరుణించుగాక!" (బుఖారి)

ఆయన ఇంకా ఇలా అన్నారుః "ప్రళయదినాన దుఃఖం, బాధ నుండి దైవం తనను రక్షించాలని అభిలషించే వ్యక్తి అప్పు ఇవ్వజాలని వారికి వ్యవధినివ్వాలి లేక అతడిని ఋణ భారంనుండి విముక్తం చేయాలి." (ముస్లిమ్)

10. సామానులోని లోపాన్ని కప్పిపుచ్చడం, కొనే వారిని మోసం చేయడం తప్పు. వస్తువుల లోపాన్ని కొనేవారికి విస్పష్టం చేయాలి. ఒకసారి ప్రవక్త (సఅసం) ఒక ధాన్యరాశి వైపుగా వెళ్ళటం జరిగింది. ఆయన (సఅసం) తన చేతిని ఆ రాశిమీద వేయగానే అది కొంచెం తడిగా ఉందని గ్రహించారు. ప్రవక్త (సఅసం), ధాన్యం యజమానిని "ఇదేమిటి"? అని అడిగారు. అందుకు దుకాణందారు "దైవప్రవక్తా! ఈ రాశి వర్షంలో తడిసింది" అని చెప్పాడు. అప్పుడాయన (సఅసం) 'అయితే నీవు ఈ తడిసిన ధాన్యాన్ని ప్రజలకు పైకి కనిపించేలా ఎందుకు పెట్టలేదు? ఇలా మోసం చేసే వ్యక్తితో నాకు ఎలాంటి సంబంధం లేదు'. అని ఆగ్రహం వ్యక్తం చేశారు.

11. ధరలు పెరుగుతాయన్న తలంపుతో ఆహారపదార్థాలను నిల్వచేసి దేవుని దాసులను ఆందోళన పరచడం తగదు.

దైవప్రవక్త (సఅసం) ఇలా అన్నారు. "అక్రమ నిల్వలు చేసే వాడు పాపాత్ముడు" వేరొక సందర్భంలో ప్రవక్త(సఅసం) ఇలా అన్నారు, "అక్రమంగా నిల్వ చేసేవాడు ఎంత చెడ్డ మనిషి, దేవుడు వస్తువుల్ని చౌక చేసినప్పుడు అతడు

విచారంతో కృంగిపోతాడు. వస్తువుల ధరలు పెరిగిపోయినప్పుడు అతని హృదయం సంతోషంతో పొంగిపోతుంది" (మిష్కాత్)

12. కొనుగోలుదారుని హక్కును పూర్తిగా గుర్తించాలి. తూనికలు, కొలతల విషయంలో నిజాయితీగా మెలగాలి. ఇచ్చేటప్పుడు, తీసుకునేటప్పుడు ఒకే రకమయిన కొలమానం వాడాలి. మహాప్రవక్త (సఅసం) తూనికలు కొలత లతో వ్యాపారం చేసేవారిని సంబోధిస్తు ఇలా హెచ్చరించారు.

"మీరు రెండు విధాలైన పనులకు బాధ్యులుగా చేయబడ్డారు. వాటివల్ల పూర్వపు జాతులు నాశనమై పోయాయి."

ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది. "తూనికల్లో తక్కువ తూచేవారికి వినాశనం దాపురిస్తుంది. తీసుకునేటప్పుడు పూర్తిగా తూచి తీసికొని ఇచ్చేటప్పుడు తక్కువగా తూచి ఇచ్చే వారికి తిరిగి జీవితం పొందుతామన్న విషయం తెలియదా? మానవులంతా విశ్వప్రభువు సమ్ముఖంలో నిలబడే దినం అత్యంత భయంకరమైన దినం. (*తత్ఫీఫ్ 1-6*)

వ్యాపార సంబంధమైన పొరపాట్లకు బదులుగా పరిహారం (కప్ఫారా) తప్పనిసరిగా చెల్లిస్తూ ఉండాలి. దైవ మార్గంలో విశాల హృదయంతో దాన ధర్మాలు విధిగా చేస్తూ ఉండాలి. ప్రవక్త (సఅసం)వ్యాపారులకు ఇలా హితవు చేశారు. "వ్యాపారులారా! వస్తువులు అమ్మేటప్పుడు అబద్ధాలాడే అసత్య ప్రమాణాలు చేసే ఆస్కారమెంతయినా ఉంది. మీరు మీ సామగ్రి నుండి దాన ధర్మాలు తప్పకుండా చేయండి." (అబూదావూద్)

13. అత్యంత భయంకరమయిన నరకం నుండి విముక్తిని కలిగించే ఆ పరమవ్యాపారాన్ని మనస్సు నుండి ఎప్పుడూ దూరం కానివ్వరాదు. దానిలో లభించే లాభం అశాశ్వతమైన ధనం కాదు, శాశ్వతమయిన సాఫల్యం, అంతంకాని ఆనందం. ఖుర్‌ఆన్ ఇలా బోధిస్తోంది.

"విశ్వాసులారా! మిమ్మల్ని భయంకరమైన నరకం నుండి విముక్తినిచ్చే వ్యాపారాన్ని గురించి మీకు తెలుపనా? (అదేమంటే) దైవాన్ని ఆయన ప్రవక్తను విశ్వసించండి, దేవుని మార్గంలో మీ ధన ప్రాణాలతో నిరంతరం కృషి చేయండి. ఒకవేళ మీరు వివేచనతో పరిశీలిస్తే అది మీ కొరకే ఉత్తమమైనది.

# 4

# ధర్మ సందేశం

## 1 సందేశకుని పాత్ర-మర్యాదలు

1. మీ బాధ్యతల స్పృహ కలిగి ఉండాలి. మీరు ప్రవక్త (సఅసం)కు వారసులు. ధర్మ సందేశం, సత్యానికి సాక్ష్యం, ధర్మ ప్రచారం ఇత్యాది బాధ్యతలను దైవప్రవక్త (సఅసం) నిర్వహించిన రీతిలోనే మీరు కూడా నిర్వహించాలి. కాబట్టి దైవ ప్రవక్త (సఅసం) వలె సందేశకుని తపనను మీలో సృజించుకోవడానికి ప్రయత్నించాలి. అదే ప్రవక్త (సఅసం) ప్రత్యేకత.

ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది.

"ఆయన మిమ్మల్ని ఎంచుకున్నాడు. ధర్మం విషయంలో మిమ్మల్ని ఎలాంటి ఇబ్బందికి గురి చేయలేదు. మీ తండ్రి ఇబ్రాహీమ్ ధర్మాన్నే అనుసరించండి. ఆయన పూర్వం కూడా మీకు ముస్లిమ్ అన్న పేరునే ప్రసాదించాడు- తదనుగుణంగానే ప్రవక్త (సఅసం) మీ సమక్షంలో సత్యధర్మానికి సాక్ష్యం పలకాలని, మీరున్నూ ప్రపంచ మానవులందరి సమక్షంలో సత్యధర్మానికి సాక్ష్యం పలకాలని."

అంటే ముస్లిమ్ సమాజం ప్రవక్త (సఅసం) బాధ్యతకు వారసురాలన్నమాట. ప్రవక్త (సఅసం) నిర్వహించిన కార్యాన్ని అది నిర్వహించాలి. చివరి ప్రవక్త (సఅసం) తన మాటలు, చేతల ద్వారా రాత్రింబవళ్ళు కృషిచేసి దైవ ధర్మాన్ని విశదీకరించే బాధ్యతను నిర్వర్తించినట్లే ముస్లిమ్ సమాజం కూడా ప్రపంచ మానవుల సమక్షంలో దైవ ధర్మాన్ని విశదీకరించే బాధ్యతను నిర్వర్తించాలి. అదే విధమైన కర్తవ్య భావంతో సందేశకుని తపనతో సత్యధర్మానికి సజీవ సాక్ష్యమై జీవించాలి.

2. మీ నిజస్థానాన్ని ఎల్లప్పుడూ దృష్టిలో ఉంచుకోవాలి. దాని ఔన్నత్యానికి అనుగుణంగా మీ జీవితాన్ని తీర్చిదిద్దుకోడానికి నిరంతరం ప్రయత్నిస్తూ ఉండాలి. మీరు ప్రపంచంలోని సామాన్య మానవ సముదాయాలలో ఒక సముదాయం కాదు. మీకు దైవం మహోత్కృష్టమైన స్థానాన్ని ప్రసాదించాడు. ప్రపంచ జాతుల్లో మీకు మూలస్థానం, మార్గదర్శక స్థానం ప్రసాదించాడు. మీరు సకల అతివాదాలకు దూరంగా, దైవం చూపిన తిన్నని రాచబాటలో మధ్యస్థ వైఖరిపైన స్థిరంగా ఉన్నారు. ఖుర్ఆన్‌లో ఇలా ఉంది:

"అదే విధంగా మిమ్మల్ని మేము ఒక మధ్యేమార్గం అనుసరించే సమాజంగా చేశాము, తద్వారా, మీరు సకల మానవులపై సత్యధర్మానికి సాక్షులై ఉండాలని, ప్రవక్త మీపై సాక్ష్యంగా ఉండాలనీను." *(అల్ బఖర)*

3. మీ ధ్యేయానికి సంబంధించిన వాస్తవ జ్ఞానం ఏమిటో తెలుసుకోవాలి. దైవం దృష్టిలో ముస్లిమ్ సమాజ ధ్యేయం ఏమంటే - అది సంపూర్ణ ఏకాగ్రతతో చిత్తశుద్ధితో పరిపూర్ణ ధర్మాన్ని స్థాపించాలి. దాన్ని అమలు పరచాలి. దైవ గ్రంథాలు, ప్రవక్త బోధించిన ఈ ధర్మంలో విశ్వాసాలు ఆరాధనలు, నైతిక, సామాజిక, ఆర్థిక, రాజకీయరంగాలకు చెందిన దైవ బోధనలన్నీ ఉన్నాయి. ప్రవక్త (సఅసం) తన పవిత్ర జీవిత కాలంలో ఈ ధర్మాన్ని దాని వివరణతో సహా స్థాపించారు. ఆయన (సఅసం) విశ్వాసాలను బోధించడంతో పాటు నైతిక శిక్షణ కూడా ఇచ్చారు. ఆరాధనల పద్ధతిని కూడా నేర్పారు. ధర్మం ఆధారంగా సమాజాన్ని కూడా నిర్మించారు. మానవ జీవితాన్ని సంఘటితపరచే, అందులో శుభ శ్రేయస్సులను నింపే శుభదాయకమయిన రాజ్యాన్ని కూడా నెలకొల్పారు.

దేవుడు ఇలా ప్రబోధించాడు: "విశ్వాసులారా! దేవుడు మీ కొరకు ఏ ధర్మాన్ని, ఏ జీవన విధానాన్ని బోధించాడో ఆ విధానం నూహ్ (అ)కు బోధించిన విధానం. ప్రవక్తా! మేము అదే సందేశాన్ని మీ వద్దకు వహీ ద్వారా పంపించాము. అదే హితబోధను మేము ఇబ్రాహీమ్ (అస), మూసా (అ.స), ఈసా (అ.స)కు బోధించాము ఈ ధర్మాన్ని స్థాపించమని, అందులో విభేదాన్ని సృష్టించరాదనీను"

*(అష్షూరా:13)*

4. చెడులను రూపుమాపడానికి, మంచిని స్థాపించడానికి అనుక్షణం సన్నద్ధులయి ఉండాలి. ఇదే మీ విశ్వాసం మీ నుండి కోరేది. ఇదే మీ సాముదాయిక ధ్యేయం కూడా. ఆ ధ్యేయం కోసమే జీవించాలి, దాని కోసమే

ప్రాణాల్ని అర్పించాలి. ఆ కార్యాన్ని నిర్వర్తించడానికే దేవుడు మీకు ఉత్తమ సమాజం(ఖైరె ఉమ్మత్) అనే మహోన్నతమయిన బిరుదును ప్రసాదించాడు.

"ఇక నుండి ప్రపంచంలో మానవుల మార్గదర్శకత్వానికి, సంస్కరణకు రంగంలోకి తీసుకురాబడిన ఉత్తమ సమాజం మీరే. మీరు మంచిని చెయ్యమని ఆజ్ఞాపిస్తారు. చెడు నుండి ఆపుతారు. అల్లాహ్‌ను విశ్వసిస్తారు." *(ఆలి ఇమ్రాన్:11)*

దైవ ప్రవక్త (సఅసం) ఇలా బోధించారు:

"ఎవరి అధీనంలో నా ప్రాణముందో ఆ దేవుని సాక్షిగా చెపుతున్నాను. మీరు తప్పనిసరిగా మంచిని ఆజ్ఞాపిస్తూ ఉండాలి. అలా చేయకపోయినట్లయితే త్వరలో దేవుడు మీపై కి భయంకర శిక్షను పంపిస్తాడు. అప్పుడు మీరు ఆక్రందన చేస్తూంటారు. కాని ఎవరూ దాన్ని వినిపించుకోరు." *(తిర్మిజి)*

5. దైవ సందేశాన్ని అందజెయ్యడానికి, దేవుని దాసులను భయంకర మయిన నరకాగ్ని నుండి కాపాడడానికి సందేశకుని తపన, ఆదర్శవంతమైన అనురక్తి, ఆవేదనల్ని మీలో ఉత్పన్నం చేసుకోవాలి. దైవ ప్రవక్త (సఅసం) అనుభవించిన నిరుపమానమైన తపననీ ఆవేదనల్ని ఖురాన్ ఎలాంటి పదాలతో ప్రకటించిందో చూడండి.

"ఒకవేళ వారు ఈ హితబోధనను విశ్వసించకపోతే బహుశా మీరు వారి వెనుకబడి మీ ప్రాణాన్నే కోల్పోతారు కాబోలు" *(అల్‌కహఫ్-6)*

ప్రవక్త (సఅసం) తన స్థితిని ఇలా విశదీకరించారు. "ఒక వ్యక్తి అగ్నిని రాజేశాడు. దాని వెలుతురులో పరిసర ప్రాంతమంతా వెలిగిపోనారంభించగానే మిడతలు, శలభాలు దానిపై న విరుచుకు పడసాగాయి. ఆ వ్యక్తి పూర్తి శక్తితో ఆ శలభాలను ఆపుతున్నాడు. కాని శలభాలు మాత్రం అతని ప్రయత్నాన్ని ఖాతరు చేయకుండా అగ్నిలో దూకుతున్నాయి. నా ఉపమానం కూడా అలాంటిదే. నేను మీ నడుమునుగట్టిగా పట్టుకొని అగ్నిలో పడిపోకుండా మిమ్మల్ని ఆపు తున్నాను. కాని మీరు మాత్రం అగ్నిలో పడిపోతూనే ఉన్నారు."(మిష్కాత్)

ఒకసారి హజ్రత్ ఆయిషా (రజి) ఆయన్ని "దైవప్రవక్తా! ఉహుద్ కంటే కఠినమయిన దినం మీకు ఎప్పుడయినా తారసపడిందా?" అని అడిగారు. దానికి మహాప్రవక్త (సఅసం) "ఔను ఆయిషా (రజి). నా జీవితంలో అత్యంత కఠినమయినది ఉక్బా దినం" అని అన్నారు. ఇది ఆయన మక్కా వారితో నిరాశ

చెంది తాయఫ్ ప్రజలకు దేవుని సందేశాన్ని ప్రబోధించడానికి వెళ్ళిన రోజు, అప్పుడు అక్కడి సర్దారు అబ్దయాలైల్ కొందరు దుండగులను ఆయన (సఅసం) వెంట పెట్టాడు. కారుణ్య సందేశానికి ప్రతిగా వారు ఆయనపైన రాళ్ళ వర్షాన్ని కురిపించారు. దైవ ప్రవక్త (సఅసం) రక్తసిక్తమయి పోయారు. స్పృహ కోల్పోయి క్రిందపడి పోయారు. తర్వాత ఆయన (సఅసం) అత్యంత ఆందోళనతో విచారంతో అక్కడి నుండి బయల్దేరారు. ఖిర్నస్సఆలిబ్ అనే చోటికి చేరుకున్న తరువాత బాధ కొంచెం తగ్గింది. అప్పుడు దేవుడు శిక్షనిచ్చేదూతను ఆయన దగ్గరకు పంపించాడు.

ఆ దూత ఇలా విన్నవించుకున్నాడు.

"దైవప్రవక్తా! మీరు ఆజ్ఞాపిస్తే నేను అబూ ఖబీస్, జబలె అహ్మర్‌లను ఒకదానితో మరొకటి ఢీ కొనేలా చేస్తాను. ఆ రెండు పర్వతాల మధ్య ఈ దౌర్భాగ్యులు పిండి అయిపోయి తమ పర్యవసానాన్ని చవి చూస్తారు." అప్పుడు విశ్వకారుణ్యామూర్తి ఇలా అన్నారుః

"వద్దు, వద్దు, నన్ను వదిలేయండి, నేను నా జాతిని దేవుని శిక్ష గురించి భయపెడుతూనే ఉంటాను. బహుశా దైవం వారి హృదయద్వారాలను ప్రబోధన కోసం తెరవవచ్చు. లేక వారి సంతతిలో ప్రబోధాన్ని స్వీకరించే వారు జన్మించవచ్చు." (బుఖారి, ముస్లిమ్)

మహాప్రవక్త (సఅసం) మక్కాలో ఉండగా అక్కడి జనులు ఆయనకు వ్యతిరేకంగా కుట్రలు పన్నుతున్నారు. ఆయన్ని నగరం నుండి బహిష్కరించాలని ఒకరంటే, ఆయన్ని చంపివేయాలని మరొకరు సలహా ఇచ్చేవారు.

ఆ రోజుల్లోనే మక్కాలో ఆకస్మాత్తుగా కరవు వచ్చిపడింది. ఖురైష్ ప్రజలకు ఆకులు, చెట్టుబెరడులూ తినే గతి పట్టించిందా కరవు. పిల్లలు ఆకలితో అలమటించిపోసాగారు. పెద్దలు వారి దీనావస్థను చూసి ఆవేదనతో క్రుంగిపోసాగారు. ఘోరమయిన ఆపదలోపడిన ఆ జనాన్ని చూసి విశ్వకారుణ్యామూర్తి (సఅసం) చలించిపోయారు. ఆయన సహచరులు కూడా ఆయన ఆందోళనను చూసి ద్రవించిపోయారు, తన ప్రాణశత్రువులు కలిగించిన గాయాలు ఇంకా మాననయినా లేదు. అయినప్పటికీ వారికి సంభవిస్తున్న విపత్తుకు ఆయన హృదయపూర్వకంగా తన సానుభూతి సందేశాన్ని పంపించారు. అబూ సుఫ్యాన్, సఫ్వాన్‌ల వద్దకు అయిదువందల దీనారాలను పంపిస్తూ, కరవు బాధితులయిన పేదవారికి వీటిని పంచిపెట్టండని చెప్పారు.

మార్గభ్రష్టులయిన దాసుల కష్టాలలో పాలుపంచుకోవడం, వారి మార్గభ్రష్టత్వం పట్ల, ఆపదలపట్ల దుఃఖించడం, దేవుని ఆగ్రహం నుండి వారిని రక్షించడానికి తాపత్రయపడటం, వారి కష్టాలను చూసి ఆందోళన చెందడం, వారి హితవునకై ఎంతో ఆరాటపడటం ఇవే ఒక సత్య సందేశకునికి వెలలేని భూషణాలు, వాటి ద్వారా అతని జీవితం అత్యంత ఆకర్షణీయంగా అసాధారణ ప్రభావంతో అలరారుతుంది.

6. జాతికి నిస్వార్థ సేవచేయాలి. మీరు చేసిన సేవకు ప్రతిఫలాన్ని ఆశించకండి. ఏమి చేసినా దేవుని ప్రీతిని పొందడానికే చేయాలి. ఆయన నుంచే పుణ్యాఫలాన్ని ఆశించాలి. దైవ ప్రీతిని, దేవుని దగ్గర పుణ్య ఫలాన్ని కోరడం అనే ప్రేరణ మనిషి మాటలో ప్రభావాన్ని జనింపజేస్తుంది. అది మనిషిని అనుక్షణం క్రియాశీలుని చేస్తుంది. దేవుడు నిత్యుడు. ఆయన ఆద్యంతరహితుడు. ఆయనకు నిద్రగానీ, కునుకుగానిరాదు. ఆయన దృష్టి సర్వత్రా ఆవరించి ఉంది. దాసుడు చేసే ప్రతి పనినీ ఆయన గమనిస్తున్నాడు. ఆయన చిత్తశుద్ధిగల తన దాసుల పుణ్యఫలాన్ని ఎప్పుడూ వృధా చేయడు. ఆయన తన దాసునికి అతని కృషికి మించిన పుణ్యఫలాన్ని కూడా ప్రసాదిస్తాడు. ఆయన ఎవరి ఆచరణలనూ వృధాపోనివ్వడు. ప్రవక్తలు తమ జాతి జనులతో పదేపదే ఇలా అంటుండేవారు. "నేను మిమ్మల్ని ఎలాంటి ప్రతిఫలమూ కోరను. నాకు పుణ్యఫలం ప్రసాదించడం సర్వలోకాల ప్రభువు బాధ్యత."

7. ఇస్లామ్‌ను గురించి లోతుపాతులు తెలుసుకొని సరయిన పరిజ్ఞానం సంపాయించాలి. ఈ విషయాల పట్ల దృఢ విశ్వాసం కలిగి ఉండాలి. దైవదృష్టిలో ఆమోదం పొందిన జీవిత విధానం(దీన్) ఒక్క ఇస్లామ్(దైవ విధేయతా విధానం) మాత్రమే. ఈ సత్యధర్మాన్ని విడనాడి, మరే విధానాన్ని అవలంబించినా దానికి ఏమాత్రం విలువ ఉండబోదు. దైవం దృష్టిలో ఖుర్‌ఆన్‌లోని ధర్మమే ఆమోద యోగ్యమైనది. దానికి ఆచరణాత్మకమయిన వివరణను హజ్రత్ ముహమ్మద్ (సఅసం) ఆదర్శవంతమయిన తన పవిత్ర జీవితం ద్వారా అందచేశారు. పవిత్ర ఖుర్‌ఆన్‌లో ప్రవక్త (సఅసం)తో, "నేను ఏ మార్గాన్నయితే అనుసరించానో దాన్ని ఆలోచించి, గ్రహించి, సంపూర్ణ వివేచనతోనే అనుసరించాను. అని ప్రజలకు స్పష్టంగా విశదీకరించండి" అని చెప్పడం జరిగింది.

"ప్రవక్తా! మీరు వీరికి స్పష్టంగా తెలుపండి, నా మార్గమయితే అదే.

నేనూ, నా అనుచరులూ సంపూర్ణ వివేచనతో అల్లాహ్ వైపునకు పిలుస్తున్నాము. అల్లాహ్ సకల లోపాలకు అతీతుడు. పరిశుద్ధుడు. దైవంతో పాటు ఇతరుల్ని సహవర్తులుగా ఎంచి షిర్క్ చేసే వారితో నాకు ఏ సంబంధమూ లేదు".

*(యూసుఫ్ : 108)*

ఖుర్‌ఆన్‌లో ఇంకా, స్పష్టంగా ఇలా ఉంది: "ఎవడయినా ఈ విధేయతా విధానాన్ని (ఇస్లామ్‌ను) కాక మరొక మార్గాన్ని అవలంబించదలిస్తే ఆ మార్గం ఎంత మాత్రం ఆమోదింపబడదు. అలా అనుసరించినవాడు పరలోకంలో విఫలుడౌతాడు, నష్టపోతాడు." *(ఆలి ఇమ్రాన్-85)*

దేవుని దృష్టిలో ఆమోదయోగ్యమయిన ధర్మం ఒక్క ఇస్లామ్-దైవ విధేయతా మార్గం మాత్రమే.

8. మీ ధ్యేయం, దాని ఔన్నత్యాన్ని, ప్రాముఖ్యతను ఎల్లప్పుడూ దృష్టిలో ఉంచుకోవాలి. ఈ మహోన్నత కార్యసాధనకై దేవుని వైపు నుండి ఎల్లప్పుడూ ప్రవక్తలు పంపించబడ్డారు. దైవం మీకు ప్రసాదించిన ధర్మ సంపద ఇహ పరలోకాల్లో విజయోన్నతులకు మూలధనం అనీ, దాని ముందు అశాశ్వతమయిన ఈ ప్రాపంచిక ధన సంపద గౌరవోన్నతులు నిస్సారమైనవనీ ప్రగాఢ విశ్వాసముండాలి.

ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది:

"మేము మీకు పలుమార్లు పఠించబడే ఏడు ఆయత్‌లను, దివ్యఖుర్‌ఆన్‌ను ప్రసాదించాము. కాబట్టి మీరు అశాశ్వతమయిన, విభిన్న వర్గాలకు మేము ఇచ్చిన ఈ ధన సంపదల వైపునకు కన్నెత్తి కూడా చూడకండి."

ఇంకా గ్రంథవహుల్ని సంబోధిస్తూ ఇలా అనడం జరిగింది.

"గ్రంథం కలవారలారా! మీరు తౌరాత్, ఇన్జీల్, మీ ప్రభువు నుండి మీవైపునకు అవతరింపజెయ్యబడిన ఇతర గ్రంథాలను స్థాపించనంత వరకు అసలు మీరు ఏ పునాదిపైనా నిలువ లేరు." *(అల్ మాయిద-68)*

9. దైవధర్మ జ్ఞానాన్ని గ్రహించడానికి అందులోని మర్మ హేతువుల్ని తెలుసుకోవడానికి నిరంతరం ప్రయత్నిస్తూ ఉండాలి. దైవప్రవక్త (సఅసం) ఇలా అన్నారు:

"దేవుడు ఎవరికి మంచిని ప్రసాదించాలని అభిలషిస్తాడో అతనికి సరయిన ధార్మిక జ్ఞానాన్ని, లోతయిన ధార్మిక వివేచనా శక్తిని ప్రసాదిస్తాడు."

(బుఖారి, ముస్లిమ్)

వాస్తవం ఏమంటే, సరయిన ధర్మావగాహన దాని మర్మ హేతువులే సర్వశుభశ్రేయస్సులకు మూలకందం. శుభాన్ని పొందని వ్యక్తి ఇహపరలోకాల్లోని సకల సౌభాగ్యాలకు దూరమవుతాడు. అతని జీవితంలో సమతుల్యం, సమభావం జనించవు. అతడు జీవితాన ఏ రంగంలోనూ ధర్మానికి సరయిన ప్రాతినిధ్యం వహించలేడు.

10. ప్రపంచానికి ఏది బోధించదలచుకున్నారో దానిని మొట్టమొదట మీరు మీకు బోధించుకోవాలి. ఒక విషయాన్ని గురించి ఇతరులకు చేయమని చెప్పే ముందు దాన్ని మీరు చేసి చూపించాలి. మీరు మీ సందేశానికి ప్రతీకగా నిలవాలి. మీరు ఏది చెప్పినా దానికి మీ ఆచరణ, ప్రవర్తన సాక్ష్యం పలకాలి. ఏ యదార్థాలను స్వీకరించడంలో లోకకళ్యాణం ఇమిడి ఉందని తలుస్తున్నారో, వాటిని మీరే అందరికంటే అధికంగా ఇష్టపడాలి. ఇవి ఒక సత్య ధర్మ సందేశ దాత ప్రత్యేకతలు. దైవ ప్రవక్త (సఅసం) తన జాతికి సందేశం అందచెయ్యడానికి సంసిద్ధులయినప్పుడు "స్వయంగా నేనే మొట్టమొదటి ముస్లిమ్‌ని" అని ప్రకటించారు.

వాక్కు ద్వారా, కలం ద్వారా కూడా మీరు వ్యక్తం చేస్తున్నదే సత్యమని సాక్ష్యమిస్తూ మీ వ్యక్తిగత ఆచరణ ద్వారా, వైయక్తిక సంబంధాల ద్వారా, సామాజిక వ్యవహారాల ద్వారా, రాజకీయ, జాతీయ కార్యకలాపాల ద్వారా కూడా సత్య ధర్మాన్ననుసరిస్తేనే సచ్ఛీలత ఉనికిలోకి వస్తుందని, పటిష్టమైన కుటుంబం, ఉత్తమ సమాజం రూపొందుతాయని, నీతి న్యాయాల పునాదులు కలిగిన ఒక అత్యున్నత సభ్యతా సంస్కృతుల వ్యవస్థ నెలకొనగలదని ఋజువు చేయాలి. తమను తాము సంస్కరించుకోకుండా ఇతరుల శిక్షణ గురించీ, సంస్కరణలను గురించి మాట్లాడేవారు పరమ అవివేకులు. వారు తమ ఇల్లు కాలిపోతున్నా విచారించరు, కాని ఇతరుల ఇళ్ళు కాలిపోతూ ఉంటే ఆర్పుదామని నీళ్లపాత్రలు చేతపట్టుకొని మరీ తిరుగుతూ ఉంటారు, అలాంటి వారు ఇహలోకంలోనూ పరలోకంలోనూ విఫలురవుతారు.

ఇహలోకంలో వారి క్రియారాహిత్యం వారి హితబోధనలను ప్రభావరహితం చేస్తుంది. పోతే పరలోకంలో వారు భయంకరమయిన నరకశిక్ష కూడా అనుభవిస్తారు.

ఇతరులకు హితవు చేసేవారు స్వయంగా క్రియాశూన్యులై ఉండటం, తాము స్వయంగా ఆచరించని దాన్ని చెప్పడం దేవునికి ఏమాత్రం నచ్చదు.

దైవ ప్రవక్త (సఅసం) ఇటువంటి క్రియాశూన్యులైన బోధకులకు భయంకర నరకశిక్ష ప్రాప్తిస్తుందని హెచ్చరించారు. ఆయన ఇలా సెలవిచ్చారుః

"ప్రళయదినాన ఒకవ్యక్తి అగ్నిలో త్రోసివేయబడతాడు. ఆ అగ్నికి అతని ప్రేగులు బయటపడతాయి. అప్పుడా వ్యక్తి బయటికి వచ్చిన ప్రేగులను పట్టుకొని గానుగ చుట్టూ తిరిగే గాడిదలా తిరుగుతాడు. అది చూసి ఇతర నరకవాసులు అతని వద్దకు వచ్చి ఇలా అడుగుతారు. "ఏమిటి నీ ఈ పరిస్థితి? నీవు ప్రపంచంలో మాకు మంచిని బోధిస్తూ చెడులనుండి వారించేవాడివి కదా? అటువంటి మంచి కార్యాలు చేసి కూడా నీవు ఇక్కడకు ఎలా వచ్చావు?" ఆ వ్యక్తి దానికి ఇలా బదులిస్తాడు, "నిజమే, నేను మిమ్మల్ని మంచిపనులకోసం ప్రేరేపించేవాణ్ణి కాని స్వయంగా నేనే దాని దరిదాపులకు కూడా పోయేవాణ్ణి కాదు. మిమ్మల్ని నేను చెడుల నుండి వారించేవాడిని, కాని నేను స్వయంగా చెడులను ఆచరించేవాడిని." (ముస్లిమ్, బుఖారి)

మేరాజ్ రాత్రి చూసిన భయంకర దృశ్యాలను ప్రవక్త (సఅసం) ప్రజల ముందుంచడంలో ప్రధాన ఉద్దేశ్యం పొరబాట్లు చేసేవారికి అది హెచ్చరిక అవుతుందనీ, తద్వారా వారు తమ శిక్షణ, సంస్కరణల కోసం సంసిద్ధులవుతారనీ.

దైవ ప్రవక్త ఇలా అన్నారు. "నేను మేరాజ్ రాత్రి కొందరు వ్యక్తుల్ని చూశాను. వారి పెదవులు అగ్ని కత్తెరలతో కోసి వేయబడుతుండేవి. నేను జిబ్రీల్ (అ)ను "వీరు ఎవరు?" అని అడిగాను. 'వీరు మీ అనుచర సమాజం (ఉమ్మత్) ఉపన్యాసకులు, వీరు ప్రజలకు పుణ్య కార్యాలు, దైవ భీతి గురించి హితవులు చేస్తుండేవారు కాని స్వయంగా తమను తాము మరచిపోయేవారు" అని జిబ్రీల్ (అస) చెప్పారు. (మిష్కాత్)

ప్రవక్త సహచరులు (రజి) కూడా ఇటువంటి పొరపాటు చేసే వారిని తీవ్రంగా హెచ్చరించేవారు. ఒకసారి హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) వద్దకు ఒక వ్యక్తి వచ్చి

"అయ్యా! నేను ప్రజలకు పుణ్య కార్యాల్ని గురించి ఆజ్ఞాపిద్దామని, చెడుల నుంచి వారిద్దామనీ సందేశ, ప్రచార కార్యాన్ని చేపడదామనీ అనుకుంటున్నాను." అని అడిగాడు. దానికి ఆయన,

"నీవు ప్రచారకుడు కాగలిగే స్థాయికి చేరుకున్నావా?" అని అడిగారు. "ఆ నమ్మకం అయితే ఉంది" అన్నాడు అతను. అప్పుడు హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) ఇలా అన్నారు. "పవిత్ర ఖుర్‌ఆన్‌లోని మూడు ఆయత్‌లు నిన్ను అవమానపరుస్తాయన్న సంశయం లేకపోతే సంతోషంగా ధర్మ ప్రచార కార్యానికి పూనుకో."

"ఆ మూడు ఆయత్‌లు ఏవి?" అని ఆవ్యక్తి అడిగాడు. దానికి ఆయన ఇలా పలికారు :

"సన్మార్గంపై నడవమని మీరు ఇతరులకయితే ఉపదేశిస్తారు కాని మిమ్మల్ని మీరు మరచిపోతారా?" (అల్ బఖర-44)

ఇది మొదటి ఆయత్, ఈ ఆయత్‌ను నీవు చక్కగా అనుసరిస్తున్నావా? అడిగారు హజ్రత్ ఇబ్నె అబ్బాస్. (రజి)

'లేదు' అని అతడు జవాబిచ్చాడు.

"మీరు ఆచరించని మాటను ఇతరులకు ఎందుకు చెపుతారు.?" (సఫ్:2) ఇది రెండవ ఆయత్. 'దీన్ని పూర్తిగా నీవు అనుసరిస్తున్నావా?' అడిగారు హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి). అతడు 'లేదని' చెప్పాడు.

"ఏ విషయాల నుండి అయితే నేను మిమ్మల్ని వారిస్తున్నానో స్వయంగా వాటిని నేనే చెయ్యటాన్ని సుతరామూ ఇష్టపడను." (హూద్-88) ఇది మూడో ఆయత్. ఈ ఆయత్‌ను పాటిస్తున్నావా అడిగారు ఇబ్నె అబ్బాస్ (రజి) ఆ వ్యక్తి "లేదు" అన్నాడు.

"అయితే వెళ్ళు. ముందు నిన్ను నీవు సత్కార్యాలను గురించి ఆజ్ఞాపించుకొంటూ చెడుల నుండి వారించుకో" అన్నారు మహనీయ ఇబ్నె అబ్బాస్(ర)

11. నమాజ్‌ను దాని సమస్త నియమాలు, నిబంధనలతో అత్యంత శ్రద్ధాసక్తులతో నిర్వహించాలి. నవాఫిల్‌ను కూడా ఆచరించాలి. దైవంతో ప్రగాఢ అనుబంధాన్ని ఏర్పరుచుకోకుండా ప్రచార కార్యం సాధ్యంకాదు. దేవుని పట్ల ప్రగాఢ అనుబంధం కలిగి ఉండడానికి సరయిన మార్గం నమాజ్. దాన్ని దేవుడు స్వయంగా తన దాసులకు చూపించాడు. దైవ ప్రవక్త(సఅసం)ను సంబోధిస్తూ దేవుడు ఇలా విశదీకరించాడు.

"దుప్పటి కప్పుకున్నవాడా? రాత్రివేళ నమాజ్ కోసం నిలబడు. కానీ కొంచెం రాత్రి, అర్థరాత్రి లేక దాని కంటే కొంచెం తక్కువ లేదా కొంచెం ఎక్కువ. ఖుర్‌ఆన్‌ను ఆగి,ఆగి పఠించు. మేము నీపైన త్వరలోనే ఒక మహోత్కృష్టమైన ఫర్మానా (బాధ్యత)ను వేయబోతున్నాము." (ముజ్జమ్మిల్ 1-5)

మహోత్కృష్టమైన ఫర్మానా బాధ్యత అంటే సత్య ధర్మప్రచారం. వాస్తవం ఏమంటే, ఈ బాధ్యత ప్రపంచంలోని అన్ని బాధ్యతల్లో కెల్లా అత్యంత భారమైనది. విలువైనది. ఈ మహత్తర బాధ్యతను నిర్వహించడానికి మనం నమాజ్ ద్వారా శక్తిని పొందడం, దేవునితో అనుబంధాన్ని పటిష్టం చేసుకోవడం ఎంతో అవసరం.

12. పవిత్ర ఖుర్‌ఆన్‌ను అత్యంత శ్రద్ధాసక్తులతో అధ్యయనం చేయాలి. నమాజ్‌లో కూడా అత్యంత శ్రద్ధతో ఖుర్‌ఆన్ పఠించాలి. నమాజ్ తర్వాత కూడా ఎంతో శ్రద్ధాసక్తులతో ఆగుతూ ఆగుతూ చదవాలి. హృదయపూర్వకంగా, ఏకాగ్ర మనస్కులై చేసే పఠనం వల్ల ఖుర్‌ఆన్‌ను అవగాహన చేసుకోడానికి, ఆలోచించడానికి వీలు కలుగుతుంది. శ్రద్ధాసక్తులు కూడా అధికమౌతాయి. పవిత్ర ఖుర్‌ఆన్ ప్రబోధనకు, గుణపాఠానికి ఏకైక నిలయం. దాని ఆయత్‌లను పరిశీలించి గ్రహించడానికి, పఠించి దాని హితవులతో ప్రయోజనం పొందడానికి అవతరింపజేయబడింది. అందుచేత వాటిని గురించి ఆలోచించే, పరిశీలించే అలవాటు చేసుకోవాలి. దాని మార్గదర్శకత్వంలో తమ జీవితాల్ని తీర్చుదిద్దు కోవాలనే, దాని హితవుల ప్రకారం సమాజం రూపురేఖల్ని దిద్దాలనే కృత నిశ్చయంతో దాన్ని పఠించాలి. దివ్య ఖుర్‌ఆన్ భక్తి శ్రద్ధలతో పఠిస్తూ దాని గురించి దీర్ఘంగా ఆలోచించడాన్ని నిత్యకృత్యంగా చేసుకున్న వారు మాత్రమే దైవ ధర్మాన్ని స్థాపించగలరు. ఆ పని వదిలేసి ఏ ఒక్కరూ తమంతటు తాము ధర్మంపైన స్థిరంగా నిలబడజాలరు. అంతే కాదు, ధర్మ సంస్థాపనా యత్నంలో పాల్గొనడం కూడా సాధ్యపడదు. ఖుర్‌ఆన్ పఠనం చేసే వారికి ఇలా ఉద్బోధించ బడింది.

"మేము మీ వద్దకు పంపించిన గ్రంథంలో అపారశుభాలు ఉన్నాయి. ప్రజలు దాని ఆయత్‌లను గురించి యోచించి పరిశీలించేందుకు, విజ్ఞులు దాని నుండి గుణపాఠం గ్రహించేందుకు అది ప్రసాదించబడింది." *(సాద్ః 29)*

ఇంకా ఇలా హితవు చేయబడింది. "ఖుర్‌ఆన్ని ఆగుతూ, ఆగుతూ పఠించాలి." *(అల్ ముజ్జమ్మిల్ః4)*

దైవప్రవక్త (సఅసం) ఇలా అన్నారు. "ఏ విధంగానయితే నీరు పడ్డ తరువాత ఇనుము త్రుప్పు పడతుందో అలాగే ఈ హృదయాలు తుప్పుపట్టి పోతాయి." అప్పుడు కొందరు, "దైవ ప్రవక్తా! అయితే హృదయాలకు పట్టిన తుప్పును శుభ్రపరిచే వస్తువేది?" అని అడిగారు. దైవ ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు. "మనిషి మృత్యువును అధికంగా జ్ఞాపకం చేసుకోవడం ద్వారా, ఖుర్‌ఆన్‌ను పఠించడం ద్వారా హృదయాలకు పట్టిన తుప్పును దూరం చేసుకోవచ్చు" (మిష్కాత్)

13. అన్ని పరిస్థితుల్లోనూ దేవునికి కృతజ్ఞులుగా ఉండాలి. కృతజ్ఞతా భావం జనింపజేసుకోడానికి ప్రాపంచిక గౌరవ ప్రతిష్ఠల రీత్యా, భోగభాగ్యాల దృష్ట్యా మీ కన్నా తక్కువ వారిని దృష్టిలో వుంచుకోవాలి.

మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారుః "భోగభాగ్యాలలో ప్రాపంచిక హోదాలలో మీ కంటే తక్కువ స్థాయి వారిని చూడండి. అప్పుడు మీకు దైవం ప్రసాదించిన దానిపట్ల మీలో కృతజ్ఞతా భావం కలుగుతుంది. ధన సంపదలో, ప్రాపంచిక వస్తు సామాగ్రిలో మీ కంటే ఉన్నతస్థాయి వారిని చూడకండి. ఎందుకంటే, అప్పుడు మీకు లభించిన భాగ్యాలు అల్పమయినవిగా అగుపిస్తాయి. (అందువల్ల మీలో దేవుని పట్ల కృతఘ్నతా భావం ఏర్పడుతుంది.)"

14. భోగలాలసకు దూరంగా ఉండాలి. ఎల్లప్పుడూ పహారాలో ఉంటూ ఏ క్షణాన కూడా ఆయుధం దించని సిపాయిలా సిద్ధంగా ఉండాలి.

మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారుః "ఇస్రాఫీల్ (అలైస) శంఖం నోటి దగ్గర పెట్టుకొని, చెవి వొగ్గి, తల వంచి శంఖం ఊదమని ఆజ్ఞ ఎప్పుడు లభిస్తుందా అని (తీవ్రంగా) నిరీక్షిస్తున్నారు. అలాంటప్పుడు నేను భోగభాగ్యాల జీవితం ఎలా గడపడలను.?"

పవిత్ర ఖుర్ఆన్‌లో విశ్వాసులను సంబోధిస్తూ దేవుడు ఇలా బోధించాడు. "మీరు మీ శక్తి మేరకు అత్యధిక బలాన్ని, కట్టి వేయబడి సిద్ధంగా ఉండే అశ్వాలను, విరోధుల్ని ఎదుర్కోటానికి సమాయత్త పరుచుకోండి. తద్వారా అల్లాహ శత్రువులనీ, మీ యొక్క శత్రువుల్ని ఇంకా మీరు ఎరుగని, కాని అల్లాహ ఎరిగిన ఇతర శత్రువుల్ని భయకంపితులను చెయ్యండి. అల్లాహ మార్గంలో మీరు ఏది ఖర్చు చేసినా దాని యొక్క పూర్తి ఫలం మీ వైపునకు మళ్ళించబడుతుంది. మీకు ఎంత మాత్రం అన్యాయం జరగదు. *(అన్‌ఫాల్ః60)*

15. సత్యధర్మం కొరకు ఏ త్యాగమయినా చేయడానికి సిద్ధంగా ఉండాలి. అవసరం వస్తే మన జన్మ భూమి నుండి హిజ్రత్ చేయడానికయినా తయారుగా ఉండాలి. ఈ భావన మీలో ఎంత దృఢంగా పాతుకుంటూ ఉందో మిమ్మల్ని మీరు ఎప్పటికప్పుడు తప్పకుండా పరిశీలించుకుంటూ ఉండాలి. ఖుర్ఆన్‌లో దేవుడు హజ్రత్ ఇబ్రాహీమ్ (అలైహిస్సలామ్) గారి హిజ్రత్ సంఘటనను వివరిస్తూ, హిజ్రత్ చెయ్యడాన్ని ప్రోత్సహిస్తూ దాని కోసం ఎలాంటి త్యాగాలయినా చేయడానికి సిద్ధంగా ఉండాలంటూ ఈ విధంగా హితవు చేశాడు.

"ప్రవక్తా! ఈ గ్రంథంలో ఇబ్రాహీమ్ గాధను వివరించు. నిస్సందేహంగా ఆయన ఒక సత్య వంతుడయిన మనిషి. ఒక ప్రవక్త, (వీరికి ఆ సమయంలో జరిగిన విషయాన్ని జ్ఞాపకం చెయ్యి) అప్పుడు ఆయన తన తండ్రితో ఇలా అన్నాడు. నాన్నా మీరు వాటిని ఎందుకు ఆరాధిస్తారు? అవి వినలేవు, చూడలేవు మీకు ఏపనీ చేసిపెట్టలేవుకూడా. 'నాన్నా! మీ వరకు చేరనటువంటి ఒక విషయజ్ఞానం నావద్దకు వచ్చింది. మీరు నన్ను అనుసరించండి.నేను మీకు ఋజు మార్గాన్ని చూపిస్తాను. నాన్నా! మీరు షైతాన్ని ఆరాధించకండి. షైతాన్ రహ్మాన్‌కు అవిధేయుడు. నాన్నా! మీరు రహ్మాన్ శిక్షకు ఎక్కడ గురి అవుతారో, ఎక్కడ షైతాన్ సహచరులయిపోతారో అని నాకు భయంగా ఉంది." దానికి ఆయన తండ్రి, "ఇబ్రాహీమ్! ఏమిటి? నీవు నా ఆరాధ్యుల పట్ల విముఖుడివయ్యావా? ఒకవేళ నీవు ఇది మానుకోకపోతే నేను నిన్నురాళ్ళతో కొట్టిస్తాను. ఇక నీవు శాశ్వతంగా నాకు దూరమయిపో" అని అన్నారు. ఇబ్రాహీమ్ ఇలా అన్నారుః

"మీకు ఒక సలామ్, నేను నా ప్రభువును వేడుకుంటాను. మీకు క్షమాభిక్ష పెట్టమని. నా ప్రభువుకు నేనంటే ఎంతో ఇష్టం. నేను మిమ్మల్ని వదలి వేస్తున్నాను. మీరు దైవాన్ని కాదని ఎవరినైతే ఆరాధిస్తున్నారో వాటినీ వదలి వేస్తున్నాను. నేనయితే నా ప్రభువునే ఆరాధిస్తాను. నేను నా ప్రభువును అర్థించి వైఫల్యం పొందనని ఆశిస్తున్నాను." *(మర్యమ్ : 41-48)*

16. దైవ మార్గంలో బయలుదేరాలనే ఉత్సాహాన్ని, ధన ప్రాణాలతో నిరంతర కృషి సలిపే శ్రద్ధాసక్తుల్ని, దైవ మార్గంలో అమరగతి పొందాలనే పవిత్ర ఆకాంక్షను జనింపజేసుకోవాలి. అసలు దైవమార్గంలో నిరంతర కృషి సలపడమే 'జిహాద్'! అదే విశ్వాసానికి గీటురాయి, ఏ హృదయంలో నయితే అలాంటి కోరిక ఉండదో ఆ హృదయం విశ్వాసానికి, ప్రబోధానికి దూరమయిన, కళావిహీనమయిన శిధిలం వంటిది. కార్యరంగంలో ప్రవేశించే భాగ్యం, దైవమార్గంలో ధన ప్రాణాల్ని త్యాగం చేసే అవకాశం లభించడం నిజంగా గొప్ప అదృష్టం. అయితే కొన్ని పరిస్థితుల్లో ఇలాంటి అవకాశాలు లభించకపోవచ్చు. లేదా కార్యరంగానికి వెళ్ళి మీ విశ్వాస పటిమను ప్రదర్శించేందుకు వనరులు లభించకపోవచ్చు. అయినప్పటికీ మీరు దైవ మార్గంలో మరణించి అమరగతులైనవారి జాబితాలో లేక యోధుల జాబితాలో చేర్చబడవచ్చు. అయితే మీ హృదయాల్లో దైవ మార్గంలో బయలు దేరాలన్న ఉత్సాహం, తాపత్రయం, ధర్మమార్గంలో అమరగతి పొందాలన్న ప్రగాఢ ఆకాంక్ష మాత్రం

ఉండి తీరాలి. ఎందుకంటే, మనిషిని వీర కార్యాల కోసం ప్రేరేపించే అతని మానసిక భావోద్రేకాలపైనే దేవుని దృష్టి ఉంటుంది.

తబూక్ నుండి ప్రవక్త(సఅసం)తిరిగి వస్తున్నప్పుడు మార్గంలో ఆయన (సఅసం) తమ సహచరులను ఉద్దేశించి ఇలా ప్రసంగించారుః

"మదీనాలో ఉంటూ కూడా కొందరు, మీతో పాటు మీరు అనుసరించిన మార్గాన్నే అనుసరించారు. మీరు పయనించిన లోయల్లో మీతో పాటే పయనించారు." దానికి ప్రవక్త (సఅసం) సహచరులు ఆశ్చర్యంతో,

"ఏమిటి? మదీనాలో ఉంటూనేనా" అని అడిగారు. "ఔను మదీనాలో ఉంటూనే. వారిని కొన్ని క్లిష్ట పరిస్థితులు ఆపాయి, లేకపోతే వారు తమంతట తాము ఆగిపోయేవారు కాదు." అన్నారు ఆయన.

పవిత్ర ఖుర్‌ఆన్‌లో కూడా దేవుడు ఇటువంటి వారిని శ్లాఘించాడు. వారు ఆసక్తి ఉండి కూడా జిహాద్ (నిరంతర కృషి)లో పాల్గొనలేకపోయారు. ఆ అవకాశం చేయిజారిపోయినందుకు వారి కళ్ళు అశ్రుధారల్ని వర్షించాయి.

"స్వయంగా మీ వద్దకు వచ్చి వారి కొరకు వాహనాలు సమకూర్చమని విజ్ఞప్తి చేసిన వారిపట్ల కూడా ఏ ఆక్షేపణకు అవకాశం లేదు. 'నేను మీకు వాహనాలను సమకూర్చలేను' అని అన్నప్పుడు వారు గత్యంతరం లేక మరలిపొయ్యారు. అప్పుడు వారి కళ్ళ నుండి అశ్రువులు ప్రవహించాయి. జిహాద్‌లో పాల్గొనేందుకు ఖర్చుచెయ్యలేకపోయినందుకు బాధ పడ్డారు." *(అత్ తౌబా : 92)*

దైవప్రవక్త (సఅసం) ఇలా అన్నారుః "దైవమార్గంలో నిరంతరకృషి సలపకుండా మరణించిన వ్యక్తి హృదయంలో ఆ కోరిక కూడా లేకపోయినట్లయితే అతడు ద్వంద్వ స్వభావిగా మరణించాడు." (ముస్లిమ్)

యదార్థం ఏమిటంటే దైవ మార్గంలో కృషి చేసే, ధన ప్రాణాలను త్యాగం చేసే భావన లేని హృదయం విశ్వాసి హృదయం ఎంతమాత్రంకాదు.

# 2. సందేశప్రచార నియమాలు

1. సందేశ ప్రచారాన్ని వివేచనతో, పొందికగా నెరవేర్చాలి. అన్ని విధాలా అత్యంత యోగ్యమైన, గంభీర విధానాన్ని అవలంబించండి. లక్ష్యానికి అనుగుణంగా ఉండేలా ఎదుటి వ్యక్తిలో శ్రద్ధాసక్తుల్ని జనింపజేసేలా వ్యవహరించాలి.

పవిత్ర ఖుర్‌ఆన్‌లో "నీ ప్రభువు మార్గం వైపునకు ఆహ్వానించు-వివేచనతోనూ ఉత్తమ ఉపదేశంతోనూ. వాదన అవసరమయితే అత్యంత రమ్యమయిన రీతితో వాదించండి." *(అన్‌నహ్ల్-125)*

సమగ్రమైన ఈ ఖుర్‌ఆన్ ఆయత్ నుండి మూడు సూత్రప్రాయమైన హితవులు లభిస్తాయి.

1. సందేశం వివేచనతో చేయాలి.
2. హితవు గరపడం, అవగతపరచడం ఉత్తమ రీతిలో జరగాలి.
3. వాదన రమ్యంగా సాగాలి.

వివేచనతో సందేశాన్ని అందచెయ్యడానికి స్వయంగా మీకు మీ సందేశం పవిత్రత పట్ల, మహత్తుపట్ల అవగాహన ఉండాలి. ఇలాంటి అమూల్య సంపత్తిని అవివేకంతో ఇట్టే ఎక్కడబడితే అక్కడ వృధా చేయకూడదు. సమయం సందర్భాలను గమనించాలి. సంబోధితుణ్ణి దృష్టిలో పెట్టుకోవాలి. ప్రతి వర్గం వారితో, ప్రతి వ్యక్తితో అతని గ్రహణ శక్తి, సామర్థ్యం, బుద్ధికుశలత, సామాజిక స్థాయికి అనుగుణంగా సంభాషించాలి. కాదనలేని మూల్యాలను పరస్పర అవగాహనకు, సందేశానికి ఆధారం చేయండి. తద్వారా ఏకాభిప్రాయసాధనకు, పరస్పరం దగ్గరవడానికి మార్గం సుగమమవుతుంది. ఉత్తమ హితవు గరపడం అంటే ఎదుటి వ్యక్తి శ్రేయస్సు పట్ల ఆవేదన, చిత్తశుద్ధి వ్యక్తమయి అతనిలో ఉత్తమ భావాలు, శ్రద్ధాసక్తులు జనించాలి. ధర్మం కేవలం మేథస్సుకు తృప్తిగా కాక అతని హృదయ ఘోషకు నెమ్మదినిచ్చేదిగా, అతని భావోద్రేకాలను తృప్తిపరచగలదిగా మారాలి.

విమర్శలోను, వాదనలోను, ఉత్తమరీతి అవలంబించడమంటే మీరు చేసే విమర్శలు నిర్మాణాత్మకమైనవిగా, మీహృదయ వేదనకు,చిత్తశుద్ధికి అద్దంపట్టేవిగా ఉండాలి. మాట తీరు మనోజ్ఞమైనదిగా, సాధారణమయినదిగా ఉండాలి. మొండి తనం, ద్వేషం, అజ్ఞానం, పక్షపాతాలు, భావోద్రేకాలు ఉప్పొంగచేసేదిగా ఉండరాదు.

వారిని ఆలోచింపచేసేదిగా, వారిలో సత్యపిపాస జనింపచేసేదిగా ఉండాలి. ఇలాంటి వాతావరణం ఏర్పడుతున్నట్లు సూచనలు కనబడని పక్షంలో మాట ముగించి అక్కడి నుంచి తప్పుకోవాలి.

2. అన్ని పరిస్థితుల్లోనూ సమగ్ర ధర్మాన్నే అందచేయాలి. మీ తెలివితేటలు ఉపయోగించి అందులో హెచ్చుతగ్గులు చేయకండి. ఇస్లామ్ సందేశ ప్రచారం చేసే వ్యక్తికి తన ఇష్టానుసారంగా అందులో కొంత దాచిపెట్టి కొంత బోధించే హక్కు ఏమాత్రమూలేదు.

"మాతో కలిసే నమ్మకం లేని వారికి విస్పష్టమైన మాటల్ని వినిపించినప్పుడు అంటారు – "దీనికి బదులుగా మరొక ఖుర్‌ఆన్ తీసుకురా లేదా ఇందులో ఏవైనా సవరణలు చెయ్యి" ఓ ప్రవక్తా! వారితో అనండి. "ఇందులో నా తరపు నుండి ఏదైనా మార్పు చెయ్యటం నాపనిఎంతమాత్రం కాదు. నేను నా వద్దకు పంపబడే వాటిని మాత్రమే అనుసరిస్తాను. నేనుగనక నా ప్రభువు పట్ల అవిధేయత చూపితే ఒక మహాభయంకరమైన దినం యొక్క శిక్షకు నేను భయపడతాను." ఇంకా అనండి "అల్లాహ్ సంకల్పం ఇదేగనక ఐతే నేను ఈ ఖుర్‌ఆన్‌ను మీకు ఎన్నటికీ వినిపించి ఉండేవాణ్ణికాదు. అల్లాహ్ దాని గురించి మీకు అసలు తెలిపి ఉండే వాడే కాదు. దీనికి ముందు నేను మీమధ్య ఒక జీవిత కాలాన్నంతా గడిపాను. మీరు బుద్ధిని ఉపయోగించారా? ఒక అబద్ధాన్ని సృష్టించి దాన్ని అల్లాహ్‌కు ఆపాదించే వాడికంటే, లేక అల్లాహ్ యొక్క నిజమైన ఆయత్‌లను అబద్ధాలుగా నిర్ణయించే వాడికంటే పరమ దుర్మార్గుడెవడుంటాడు? నిశ్చయంగా అపరాధులు ఎన్నటికీ సాఫల్యాన్ని పొందలేరు." *(యూనుస్ 15-17)*

పరిస్థితులు ఎంత ప్రతికూలంగా ఉన్నప్పటికీ దైవ ధర్మాన్ని దాని అసలైన, సంపూర్ణమైన స్వరూపంలోనే బోధించడం ప్రబోధకుని కర్తవ్యం. దేవుని ధర్మంలో హెచ్చుతగ్గులు చేయడం, పరిస్థితులకు అనుగుణంగా తన ఇష్టం వచ్చినట్లు అందులో మార్పులు చేర్పులు చేయడం మహాఘోరం, అన్యాయం. అటువంటి వారి పరలోక జీవితమే కాదు. ఇహలోక జీవితమూ నాశనమైపోతుంది.

సకల విశ్వాన్ని పరివేష్టించిన జ్ఞానం కల దేవుడు పంపిన ధర్మమే "ఇస్లామ్". ఆయనకు ఆది నుండి అంతం వరకు గల వాస్తవమైన జ్ఞానం వుంది. ఆయన దృష్టికోణం దోష రహితమైనది, అతి పవిత్రమైనది. ఆయనకు మానవ జీవితారంభం కూడా తెలుసు, దాని పర్యవసానం కూడా. ఆయన సంకల్పానుసారమే

మానవ విజ్ఞానం రోజు రోజుకూ వృద్ధి చెందుతూ ఉంది. మానవ జీవితం అసాధారణమైన ప్రగతి పథంలో ముందుకు పురోగమిస్తున్నది. అలాంటి దైవం పంపిన ధర్మంలో పరిస్థితులను బట్టి మార్పులు, చేర్పులు చేయవలసిన అవసరం ఏముంటుంది? అలాంటి అవకాశమే లేదు. స్వయంగా ఆ ధర్మాన్ని అందజేసిన మహాప్రవక్త (సఅసం) ఒక ఆదర్శవంతమయిన విధేయునిలా దాన్ని పాటిస్తూ, అవిధేయతా భావం తలంపునకు వస్తేనే కంపించి పోయేవారు.

3. ధర్మాన్ని వివేచనతో, నేర్పుగా, సహజమైన రీతిలో బోధించాలి. వినేవారికి అది అసహజమైనదిగా భారమైనదిగా అనిపించేలా బోధించకూడదు. ప్రజలు అసహ్యించుకొని పారిపోవడానికి బదులు సంతోషంతో స్వీకరించేలా ఉండాలి. మీ మృదుత్వం, మధురసంభాషణ, వివేకవంతమయిన వైఖరితో ప్రజలను ధర్మం వైపునకు ఆకర్షించాలి.

హజ్రత్ ముఆవియ ఇబ్నె హకమ్ (రజి) ఇలా తెలిపారు: "ఒకసారి నేను ప్రవక్త (సఅసం)తో బాటు నమాజ్ చేస్తున్నప్పుడు ఒక వ్యక్తికి తుమ్ము వచ్చింది. నేను నమాజ్‌లోనే "యర్‌హముకల్లాహ్" అని తుమ్ముకు జవాబు ఇచ్చాను. ప్రజలు నన్ను కోపంతో చూడసాగారు. "దేవుడు మీకు మేలు చేయుగాక! నన్ను ఎందుకలా చూస్తారు?" అని అన్నాను. అప్పుడు ప్రజలు నన్ను నిశ్శబ్దంగా ఉండమని సైగచేశారు. నేను మౌనంగా ఉండిపోయాను. ప్రవక్త (సఅసం) నమాజ్ పూర్తి చేశారు- నాతల్లి తండ్రులను ఆయన కోసం సమర్పింతు! నేను అలాంటి సుశిక్షణ ఇచ్చే వారిని అంతకు పూర్వంగాని ఆయన తర్వాత గాని చూడలేదు. ఆయన (సఅసం) నన్ను కొట్టలేదు, గద్దించలేదు. కనీసం నిందించనూ లేదు, కాని "చూడుబాబూ! ఇది నమాజ్. నమాజ్‌లో మాట్లాడకూడదు. నమాజ్ అంటే దేవుని పవిత్రతను, ఔన్నత్యాన్ని స్తుతించడం, ఆయన ఘనతను కొనియాడటం ఖుర్ఆన్‌ను పఠించడం కదా!" అని మాత్రమే అన్నారు.

4. మీ రచనల్లో, ప్రసంగాల్లో, ప్రచార సంభాషణల్లో ఎల్లప్పుడూ మధ్యేమార్గాన్ని పాటించాలి. తద్వారా శ్రోతలలో ఆశాభావమూ జనించాలి, భయమూ కలగాలి. అలా కాక ఇక తమపై దైవ కారుణ్యం వర్షించదని నిరాశ చెందేలా, వారికి తమ సంస్కరణా సాఫల్యాలు కష్టసాధ్యమనిపించేలా వారి ముందు భయోత్పాతాన్ని సృష్టించకూడదు. అలాగే ప్రజలు దేవుని అపార అనుగ్రహాన్ని, క్షమాపణను ఆసరా చేసుకొని విశృంఖలంగా, బాధ్యతారహితులుగా మారిపోయి, అవిధేయతా చర్యలకు పాల్పడేలా వారి ముందు దైవ కారుణ్యాన్ని దైవ క్షమను హద్దులు మీరి వర్ణించనూ కూడదు. హజ్రత్ అలీ (రజి) ఇలా

అన్నారు. "ప్రజలకు దేవుని వైపునకు రమ్మని పిలుపునిచ్చే తీరులో దైవం పట్ల అటు నిరాశ పరచనివాడు, ఇటు దైవ అవిధేయులుగా మారేలా వారికి అవకాశాలూ కల్పించనివాడు, దైవ శిక్షనుండి వారిని నిర్భయులుగా చేయనివాడే ఉత్తమ విద్వాంసుడు."

5. మీరు పాల్గొనే ప్రచార కార్యకలాపాల్లో నిరంతరత, నిత్యత ఉండేలా ప్రయత్నించండి. నిర్దేశించిన కార్యక్రమాన్ని పట్టుదలతో, బాధ్యతాయుతంగా నిర్వహించడానికి యత్నించాలి. కార్యక్రమాలను సగంలో ఆపి క్రొత్త క్రొత్త కార్యక్రమాలను ప్రారంభించడం మానుకోవాలి. కొద్దిపనే చేసినా ఎడతెగకుండా చేయాలి. దైవ ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు.

"ఎంత చిన్నపని అయినా సరే నిరంతరం చేస్తూనే ఉండాలి. అదే మంచి ఆచరణ"

6. సందేశ ప్రచార మార్గంలో ఎదురయ్యే కష్టాలను బాధలను, పరీక్షలను చిరునవ్వుతో ఎదుర్కోవాలి. సహనాన్ని సాహసాన్ని ప్రదర్శించాలి. ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది:

"సత్కార్యాన్ని ఆజ్ఞాపించండి, చెడు నుండి ఆపండి, ఈ మార్గంలో ఎన్ని కష్టాలు వచ్చినా వాటిని ధైర్యంతో సహిస్తూ ఉండండి." *(లుఖ్మాన్-17)*

దైవ మార్గంలో కష్టాలు, బాధలు రావడం తప్పనిసరి. పరీక్ష ఘట్టాలను అధిగమించిన తర్వాతనే విశ్వాసంలో శక్తి, నీతి నడవడికలో పటిష్టత జనిస్తాయి. ఈ కారణం చేతనే విశ్వసించిన వారమని ప్రకటించుకున్న దాసులను దేవుడు తప్పనిసరిగా పరీక్షిస్తుంటాడు. ధార్మిక ఆచరణలో, విశ్వాసంలో ఎవరెంత ఎక్కువ దృఢంగా ఉంటారో వారికి ఎదురయ్యే పరీక్ష కూడా అంత కఠినంగానే ఉంటుంది. ఖుర్‌ఆన్‌లో దేవుడు ఇలా విశదీకరించాడు:

"భయప్రమాదాలకు, ఆకలిబాధలకు, ధనప్రాణ ఆదాయాల నష్టాలకు గురిచేసి, మిమ్మల్ని మేము తప్పకుండా పరీక్షిస్తాము. ఈ పరిస్థితిలో మనఃస్థయిర్యంతో నిలకడ చూపే వారికీ, కష్టకాలం దాపురించినప్పుడు, "మేమంతా అల్లాహ్‌కే చెందిన వారము, అల్లాహ్ వైపునకు మరలి పోవలసినవారము" అని అనే వారికి శుభవార్తలు తెలుపు, వారిపై వారి ప్రభువు తన అపూర్వ అనుగ్రహాలను కురిపిస్తాడు. ఆయన కారుణ్యఛాయలు వారికి ఆశ్రయమిస్తాయి, వారే సన్మార్గగాములు." *(అల్‌బఖర-155-157)*

హజ్రత్ సఅద్ (రజి) దైవ ప్రవక్త (సఅసం) ను "దైవ ప్రవక్తా! అందరి

కంటే కఠినంగా ఏ వ్యక్తిని పరీక్షించడం జరుగుతుంది.?" అని అడగ్గా ఆయన (సఅసం) ఇలా సమాధానమిచ్చారుః

"ప్రవక్తల్ని అలా పరీక్షించడం జరుగుతుంది. ఆ తర్వాత విశ్వాసం, ధార్మిక ఆచరణల్లో వారికి చేరువగా వుండే వారిని, ఆపైన, వారికి చేరువుగా ఉన్నవారినీ పరీక్షించడం జరుగుతుంది. మనిషికి ఎదురయ్యే పరీక్ష అతని ధార్మికత ప్రకారం ఉంటుంది. తన ధర్మంలో దృఢంగా ఉన్న వ్యక్తికి ఎదురయ్యే పరీక్ష కూడా కఠినంగా ఉంటుంది. ఎవరైతే ధర్మంలో బలహీనంగా ఉంటాడో అతనికి ఎదురయ్యే పరీక్ష కూడా అతని ధర్మం ప్రకారమే ఉంటుంది. మనిషి భూమిపైన జీవితం గడుపుతున్నంతకాలం అతనిపైన ఎలాంటి పాపప్రభావమూ మిగులనంతవరకు ఈ పరీక్ష సాగుతూనే ఉంటుంది." (మిష్కాత్)

మహాప్రవక్త (సఅసం) తన పరిస్థితిని వివరిస్తూ ఇలా అన్నారు. "దైవ మార్గంలో నేను ఎంత బాధించబడ్డానో అంతగా ఏ మానవుడూ బాధించబడలేదు. అలాగే దైవ మార్గంలో నేను భయపెట్టబడినంతగా ఏమానవుడూ భయపెట్టబడలేదు. ముప్పై పగళ్ళూ, రాత్రుళ్ళయితే బిలాల్ (రజి) చంకనవున్న కొద్దిపాటి పదార్థం తప్ప, నాకూ అతనికీ ప్రాణి తినగలిగే ఏ ఆహారమూ లేకుండా గడిచాయి." (తిర్మిజి)

మరోసారి దైవప్రవక్త ఇలా తెలిపారుః "సహనం చూప ప్రయత్నించిన వారికి దైవం సహనాన్ని ప్రసాదిస్తాడు. సహనం కన్నా ఉత్తమమయినది, అనేక మేళ్ళను సమకూర్చేది మరేదీ లేదు." (బుఖారీ, ముస్లిమ్)

వాస్తవమేమంటే ఈ పరీక్ష ఉద్యమానికి శక్తినిచ్చి ముందుకు నడిపించగల తప్పనిసరి సాధనం. పరీక్ష ఘట్టాలను అధిగమించకుండా ఉద్యమం ఎప్పుడూ విజయాన్ని సాధించలేదు. అందునా మానవుల్లో విశ్వజనీన విప్లవ సందేశాన్ని అందజేసి పూర్తి మానవజీవితాన్ని నూతన పునాదులపై పునర్మించగల ప్రణాళిక చేపట్టే ఉద్యమం.

మక్కా దుర్మార్గులు, పాషాణ హృదయులు, ప్రవక్త (సఅసం) మీద ప్రవక్త అనుచరులపైనా దారుణ దౌర్జన్యాలు జరుపుతున్న రోజుల్లో సంభవించిన ఒక సంఘటనను గురించి హజ్రత్ ఖబ్బాబ్ బిన్ అరత్ (రజి) ఇలా వర్ణించారుః

"దైవప్రవక్త (సఅసం) దైవగృహం (కాబా) నీడలో దుప్పటిని తల క్రింద పెట్టుకొని విశ్రాంతి తీసుకుంటున్నారు. మేము ఆయన (సఅసం)వద్దకు ఫిర్యాదుచేయడానికి వెళ్ళాము. దైవ ప్రవక్తా! మీరు మా కోసం దైవ సహాయాన్ని

అర్థించరు, ఈ దౌర్జన్య కాండ అంతం కావడానికి దుఆ చేయరు ఈ పరంపర ఎప్పటి వరకు ఇలా కొనసాగుతుంది? ఎప్పుడు ఈ కష్టకాలం అంతమవుతుంది" ప్రవక్త (సఅసం) అది విని ఇలా అన్నారుః

"మీకు పూర్వం కొందరు ప్రజలు గతించారు. వారిలో కొందరికి గొయ్యి త్రవ్వబడేది.తర్వాత వారిని ఆ గోతిలో నిలబెట్టే వారు. తర్వాత రంపంతో వారి శరీరాలు చీల్చివేయబడేవి. అలా వారి శరీరాలు రెండు ఖండాలుగా వేరుచేయబడేవి. అయినప్పటికీ వారు తమ ధర్మాన్ని విడనాడే వారుకారు. వారి శరీరాల్లోకి ఇనుప ఊచలు గ్రుచ్చేవారు. అవి కండరాలను చీల్చుకుంటూ ఎముకల వరకూ చొచ్చుకొనిపోయేవి. అయినా ఆ దైవదాసులు ధర్మాన్ని ఏమాత్రం విడ నాడేవారుకారు. దైవసాక్షి! ఈధర్మం తప్పక ఆధిక్యతను సాధిస్తుంది. అప్పుడు, ఒక రౌతు (యమన్ రాజధాని) సనా నుండి హజ్రమౌత్ వరకు ప్రయాణం చేసినా, మార్గంలో అతనికి దైవం గురించి తప్ప మరొకరి భయం ఉండదు. గొర్రెలకాపరికీ తోడేళ్ళ భయం తప్ప మరే భయమూ ఉండదు. కాని మీరు తొందరపడటం చాలా విచారకరం." *(బుఖారి)*

హజ్రత్ముఆవియా(రజి) ప్రవక్త(సఅసం) ప్రవచనాన్ని ఇలా ఉల్లేఖించారు.

"నా అనుచర సమాజం (ఉమ్మత్)లో ధర్మాన్ని కాపాడుతూ ఉండే ఒక వర్గం తప్పనిసరిగా ఉంటుంది. వారితో సహకరించనివారు, వారిని వ్యతిరేకించేవారు, దేవుని తీర్పు అయ్యే వరకు వారిని అంతం చేయలేరు. అప్పటి వరకు ఈ ధర్మ పరిరక్షకులు తమ ఆ స్థితిపై స్థిరంగా నిలబడతారు." *(బుఖారి, ముస్లిమ్)*

7. నిరర్థకమైన ఉదారతను ప్రదర్శించడం, వాస్తవాన్ని కప్పి పుచ్చడం, సిద్ధాంతాలను త్యాగం చేయడం, ఎన్నటికీ జరగనివ్వరాదు. ఖుర్ఆన్లో విశ్వ సించిన వారిని ప్రశంసిస్తూ ఇలా చెప్పబడింది.

"వారు తిరస్కారుల పట్ల కఠినంగా వ్యవహరిస్తారు. భావమేమంటే - వారు తమ ధర్మం, సిద్ధాంతాల విషయాల్లో ఏ మాత్రం లొంగరు. వారు ఎట్టి పరిస్థి తుల్లోనూ తమ విధానాల విషయాల్లో రాజీ పడటం గాని, సత్యాన్ని మరుగు పరచడంగాని చేయరు. వారు అన్నింటిని సహించగలరు కాని ధర్మాన్ని, సిద్ధాంతాన్ని మాత్రం త్యజించలేరు. విశ్వాసులకు దేవుడు, తన ప్రవక్త (సఅసం) ద్వారా ఇలా హితబోధ చేశాడుః "మీరు ఈ ధర్మం వైపునకే పిలుపునివ్వండి. మీకు ఆదేశించిన విధంగా దానిపై దృఢంగా, స్థిరంగా నిలువండి. వారి కోరికలను అనుసరించకండి" *(అష్షూరా : 15)*

దైవ ధర్మం విషయంలో అనవసరమైన ఉదారతను చూపడం, నిజాన్ని దాచడం, అధర్మంతో బేరసారాలు చేయడమంటే ధర్మాన్నీ, విశ్వాసాన్ని సర్వనాశనం చేసివేసే భయంకరమైన బలహీనత.

మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు:

"ఇస్రాయీల్ సంతతి వారు దైవ అవిధేయతా కార్యాలు చేస్తున్నప్పుడు వారి విద్వాంసులు వారిని నిరోధించారు, కాని వారు మానలేదు. (అప్పుడు వారి విద్వాంసులు వారిని బహిష్కరించడానికి బదులు) వారి సమావేశాల్లో కూర్చోవడం, వారితో కలిసి తినడం త్రాగడం ఆరంభించారు. అలా జరిగినప్పుడు దేవుడు వారందరి హృదయాలను ఒకే విధంగా చేసివేశాడు. తర్వాత హజ్రత్ దావూద్ (అలైస) హజ్రత్ ఈసా ఇబ్నె మర్యం (అలైస) నోటి ద్వారా దేవుడు వారిని శపించాడు. అలాఎందుకు జరిగిందంటే - వారు అవిధేయతా మార్గాన్ని అనుసరించారు. అందులోనే వారు పురోగమిస్తూ వెళ్ళారు." ఈ ప్రవచనాన్ని ఉల్లేఖించిన అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ (రజి) ఇలా అన్నారు. 'అప్పటి వరకు ఆనుకొని కూర్చున్న ప్రవక్త (సఅసం) నిటారుగ కూర్చుని ఇలా అన్నారు. "లేదు, ఎవరి ఆధీనంలో నా ప్రాణముందో ఆ దేవుని సాక్షిగా చెపుతున్నాను. మీరు తప్పకుండా మంచిని ఆజ్ఞాపిస్తూ ఉంటారు. చెడు నుండి ఆపుతూ ఉంటారు. దుర్మార్గుడి చేతిని పట్టుకుంటారు (అంటే అతని దుష్కార్యాలను అడ్డుకుంటారు) దౌర్జన్యపరుణ్ణి ధర్మం సమక్షంలో లొంగ దీస్తారు. ఒకవేళ మీరు అలా చేయకపోయినట్లయితే మీ అందరి హృదయాలు కూడా ఒకే విధంగా తయారవుతాయి. ఇస్రాయీల్ సంతతిని దేవుడు ఎలా పతనానికి గురి చేశాడో, ఆయన అలాగే మిమ్మల్ని కూడా తన కారుణ్యానికి మార్గనిర్దేశనకు దూరంగా విసరివేస్తాడు."

8. మీ పిల్లలను సంస్కరించి, సుశిక్షితుల్ని చేయడం, ధర్మ సంస్థాపన విధిని నిర్వహించేందుకు వారిని తయారుచేయడం మీ ప్రధమ కర్తవ్యం. అది మీ కార్యకలాపాలకు సహజమైన రంగం కూడా. ఈ రంగాన్ని వదిలేసి మీరు ప్రచారం, సంస్కరణల కృషికోసం కేవలం బయటి రంగాన్ని అన్వేషించడం తెలివిమాలిన, అసహజమైన పని. ఇలా చేయడం పెద్ద పొరపాటు. బాధ్యతల నుంచి పారిపోవడం కూడా. దీని ఉపమానం, కరవుకాలంలో ఆకలి దప్పులతో నకనకలాడుతున్న ఇంటి వారిని వదలి పెట్టి బయటవున్న అగత్య పరులను వెతికి వెతికి ఆహారాన్ని పంచి ఉదార స్వభావాన్ని ప్రదర్శించే వ్యక్తి వైఖరిలా ఉంటుంది. ఆకలి దప్పులు, ఆత్మీయత, అనురాగం అంటే ఏమిటో మీరు గ్రహించలేదన్నమాట. ఆహారపంపిణీ

ఎలా వివేచనతో చేయాలో తెలియని వారన్నమాట. ఖుర్‌ఆన్‌లో ఇలా ఆదేశించ బడింది:

"విశ్వాసులారా! మిమ్మల్నీ, మీ ఇంటివారిని నరకాగ్ని నుండి రక్షించుకోండి."

ప్రవక్త (సఅసం) దీని భావాన్ని ఇలా విశదీకరించారు.

"మీలో ప్రతి ఒక్కడూ కాపలాదారు, బాధ్యతగలవాడు– మీ కాపలాలో ఉన్న వారి విషయంలో మీలో ప్రతి ఒక్కరూ ప్రశ్నింపబడతారు. పాలకుడు (తన ప్రజల) కాపలాదారు. అతన్ని అతని ప్రజలను గురించి అడగడం జరుగుతుంది. భర్త తన ఇంటి వారికి కాపలాదారు. స్త్రీ తన భర్త ఇంటికి, అతని పిల్లలకు కాపలాదారు. కాబట్టి మీలో ప్రతి ఒక్కడూ కాపలాదారు. బాధ్యతగలవాడు. మీ కాపలాలో ఇవ్వబడిన వారి విషయంలో మీలో ప్రతి ఒక్కడూ ప్రశ్నించ బడతాడు." (బుఖారి, ముస్లిమ్)

9. ఇరుగు పొరుగువారి, వీధివారి శిక్షణ సంస్కరణలను గురించి కూడా యోచించాలి. ఆ విషయాలు కూడా మీ కర్తవ్యం అని గ్రహించాలి.

మహాప్రవక్త (సఅసం) ఒకసారి ఒక ఉపన్యాసం ఇచ్చారు. అందులో కొందరు విశ్వాసుల్ని ప్రశంసించారు. తర్వాత ఇలా అన్నారు. "కొందరు తమ పొరుగువారిలో ధార్మిక స్ఫూర్తిని కలుగజేయరు. వారికి ధర్మాన్ని బోధించరు. ధర్మం తెలుసుకోకుండా ఉంటే సంభవించే దారుణఫలితాలు ఏమిటో వారికి తెలుపరు. వారిని చెడుపనుల నుండి ఆపరు. ఇలా ఎందుకు జరుగుతోంది? కొందరు తమ పొరుగువారి వద్ద ధార్మిక విద్యను నేర్చుకోరు. ధార్మిక స్ఫూర్తిని పొందరు. ధర్మం పట్ల విముఖులై అజ్ఞానంతో ఉన్నందువల్ల కలిగే ఘోరఫలితాలు ఏమిటో తెలుసుకోరు. ఇలా ఎందుకు జరుగుతోంది? దైవసాక్షి! ప్రజలు తమ పొరుగువారికి తప్పనిసరిగా ధార్మిక శిక్షణను ఇవ్వాలి. వారిలో ధార్మిక స్ఫూర్తిని కలుగజేయాలి. వారికి హితబోధ చేయాలి, వారికి మంచి విషయాలు తెలుపాలి. చెడు విషయాల నుండి వారిని వారించాలి. అంతే కాకుండా ప్రజలు తప్పనిసరిగా తమ పొరుగువారినుంచి ధర్మాన్ని నేర్చుకోవాలి. ధార్మిక స్ఫూర్తిని పొందాలి. వారి హితవులను స్వీకరించాలి. ఇలా చేయకపోయినట్లయితే వారిని నేను అతి త్వరలో శిక్షిస్తాను." తర్వాత ఆయన (సఅసం) వేదిక నుండి దిగి ప్రసంగాన్ని ముగించారు.

ప్రవక్త (సఅసం) ఎవరిని గురించి ఇలా ప్రసంగించారో శ్రోతలలో కొందరు కొందరిని అడిగారు. ప్రజలు ఇలా చెప్పారు, "ఆయన (సఅసం)

సంబోధన అష్‌అర్ తెగవారిని గురించి. వారు ధార్మిక జ్ఞానం ఉన్నటువంటివారు. వారి పొరుగున ఒయాసిస్సుల వద్ద నివసించే గ్రామీణులు ఏమీ తెలియనివారు."

ఈ ప్రసంగం వార్త అష్‌అర్ తెగవారికి తెలియగానే వారు దైవ ప్రవక్త (సఅసం) సన్నిధిలో హాజరై ఇలా అడిగారు "దైవప్రవక్తా మీరు (సఅసం)మీ ప్రసంగంలో కొందరిని ప్రశంసించారు. మా మీద కోపగించుకొన్నారు. మా వల్ల జరిగిన అపరాధమేమిటో సెలవియ్యండి." అప్పుడు ఆయన (సఅసం) ఇలా అన్నారుః

"ప్రజలు తమ పొరుగువారికి ధర్మ విద్యను నేర్పాలి. వారికి హితబోధ చేయాలి. మంచి విషయాలు బోధించాలి. చెడులనుండి వారించాలి. ఇది వారి విధి. అలాగే ప్రజలు తమ పొరుగువారి ద్వారా ధార్మిక విద్యను నేర్చుకోవాలి. వారిహితవులను స్వీకరించాలి. ధార్మిక స్ఫూర్తిని పొందాలి. ఇది కూడా వారి కర్తవ్యమే. అలా చేయకపోయినట్లయితే అతి త్వరలో నేను వారికి ఈ ప్రపంచంలోనే శిక్ష విధిస్తాను." అదివిని అష్‌అర్ తెగ ప్రజలు "దైవప్రవక్తా! మేము ప్రజల్లో స్ఫూర్తిని ప్రదీప్తం చేయాలా?" అని అడగ్గా ఆయన (సఅసం) "అవును అది మీ బాధ్యత" అని అన్నారు. అప్పుడు ఆ ప్రజలు ఇలా విన్నవించు కొన్నారు. "అయితే మహనీయా, మాకు ఒక సంవత్సరం వ్యవధినివ్వండి." అందుకు ప్రవక్త(సఅసం) వారికి ఒక సంవత్సరం వ్యవధినిచ్చారు - తమ పొరుగు వారికి ధర్మాన్ని నేర్పడానికి, వారిలో ధార్మిక స్ఫూర్తిని జనింపజేయడానికి. ఆ తర్వాత ప్రవక్త (సఅసం) ఈ ఆయత్‌లను పఠించారుః

"ఇస్రాయీల్ సంతతి వారిలో ఎవరైతే తిరస్కారమార్గం అవలంబించారో వారిని దావూద్ నోట మర్యమ్ కుమారుడైన ఈసా నోట శపించటం జరిగింది. ఎందుకంటే వారు తిరుగుబాటు చేశారు. మితిమీరి ప్రవర్తించసాగారు. వారు ఒకరినొకరు చెడుపనులు చెయ్యకుండా నిరోధించడం మానేశారు. వారు అవలంబించిన ఈ విధానం చాల చెడ్డది." (అల్ మాయిద-97)

10. మీరు ధార్మిక ప్రచారబాధ్యతను నిర్వహించే ప్రజల మత విశ్వాసాలను భావోద్రేకాలను గౌరవించాలి. వారి పెద్దలను, మతాచార్యులను చెడ్డపేరుతో ప్రస్తావించరాదు, వారి మతవిశ్వాసాలపైన దాడి చేయరాదు. వారి మతాచారాలను అగౌరవ పరచరాదు. వివేచనతో నేర్పుగా దైవ సందేశాన్ని వారికి అందజేస్తూ ఉండాలి. విమర్శించడంలో కూడా ఎదుటివారిని రెచ్చగొట్టడానికి బదులు ఎంతో సహృదయంతో మీ మాటకు వారి మనసుల్లో చోటుకల్పించడానికి ప్రయత్నించాలి. ఎందుకంటే ఉద్రేకపూరితమయిన విమర్శ, అవమానకరమయిన

సంభాషణతో ఎదుటివారిలో మంచి మార్పు తీసుకురావచ్చునని ఆశించలేరు. అంతే కాక అజ్ఞానపు దురభిమానానికి లోనయి అతడు దైవాన్ని, ధర్మాన్ని తూలనాడే ప్రమాదం ఉంది. ధర్మానికి చేరువ కావడానికి బదులు మరింత దూరం కావచ్చు. ఖుర్ఆన్ హితవు ఇలా ఉంది:

"విశ్వాసులారా! వీరు దైవాన్ని కాదని పూజిస్తున్న వాటిని దూషించకండి. ఎందుకంటే వీరు దైవానికి, సహవర్తుల్ని కల్పించడంలో (షిర్క్) ఇంకా పురోగమించి అజ్ఞానం వల్ల అల్లాహ్‌ను దూషిస్తారు."

11. అల్లాహ్ వైపునకు పిలిచే ప్రబోధకులయి ప్రచార కర్తవ్యాన్ని నిర్వర్తించాలి. అంటే, కేవలం అల్లాహ్ వైపునకే సందేశమిచ్చే వారుగా రూపొందాలి. దేవుని దాసులను దేవుని వైపునకు తప్ప మరో విషయం వైపునకు పిలువరాదు. దేశం, జాతి, వంశం వైపునకుగాని, భాష, సంఘం వైపునకుగాని పిలువరాదు. విశ్వాసి లక్ష్యం కేవలం దైవప్రీతిని పొందడమే. ఆ లక్ష్యం వైపునకే సందేశం ఇవ్వాలి. దాసుని పని కేవలం తన సృష్టికర్త యజమాని పట్ల విధేయత కలిగి ఉండడమే. వ్యక్తిగత, కుటుంబ, సామాజిక జీవితాలలో, దేశీయ విదేశీయ వ్యవహారాలలో, జీవిత రంగాలన్నింటిలో దాసుడు తన యజమాని, పరిపోషకుడు అయిన దేవుని ఆజ్ఞ ప్రకారమే నడవాలి. ఆయన శాసనాన్నే చిత్తశుద్ధితో అనుసరించాలి. అది తప్ప ముస్లిమ్ లక్ష్యం మరొకటి కాదు. ముస్లిమ్ ఎక్కడయినా దేవుని హితవును తిరస్కరించి దైవ ప్రసన్నతకు బదులు మరొక విషయాన్ని తన లక్ష్యంగా ఎంచుకుంటే అతను ఇహపరలోకాల్లో పరాజయం పొందుతాడు. ఈ విశ్వాసాన్ని మీలో జనింప జేసుకోవడానికి ప్రయత్నించాలి.

"అల్లాహ్ వైపునకు పిలుపునిచ్చేవాడు, సత్కార్యాలు చేసేవాడు, నేను దేవునికే విధేయుణ్ణి, ముస్లిమ్‌ని అనేవాడు - ఇటువంటి వ్యక్తి మాటకంటే మంచి మాట ఇంకెవరిది కాగలదు?" (ఖుర్ఆన్)

# 3 సంఘజీవితం దాని నియమాలు

1. సందేశ ప్రచార బాధ్యతలను నిర్వర్తించడానికి పటిష్టమయిన సంస్థను నిర్మించుకోవాలి. ధర్మ సంస్థాపన కొరకు సామూహికంగా ప్రయత్నం చేయాలి.

"మంచివైపునకు పిలిచే, మేలు చేయమని ఆజ్ఞాపించే, చెడు నుండి వారించే ఒక సంఘం తప్పకుండా మీలో ఉండాలి."

(దివ్య ఖుర్ఆన్ 3:104)

మానవ స్వభావం సదా 'మంచి' అని భావించిన, సర్వ దైవగ్రంథాలు 'మంచి' అని సాక్ష్యం ఇచ్చిన దాన్నే ఈ వాక్యంలో "అల్‌ఖైర్ లేక మేలు అని పేర్కొనడం జరిగింది. ప్రతి యుగంలో దేవుని ప్రవక్తలు ఇలాంటి మంచి విషయాలను బోధించారు, వాటి సమగ్ర స్వరూపమే దేవుడు అవతరింపచేసిన ధర్మం (దీన్). అదే సంపూర్ణమైన ప్రామాణికమయిన సురక్షితమయిన రూపంలో మహాప్రవక్త(సఅసం) తన అనుచర సమాజాని(ఉమ్మత్)కి అందజేసిన ఖుర్ఆన్, హదీసులు. ఈ 'మంచి' వైపునకు పిలుపునివ్వడానికి, సకల శుభాలతో ప్రపంచాన్ని తీర్చిదిద్దడానికి విశ్వాసులు జమాఅత్ (సంఘం)గా ఏర్పడి క్రమశిక్షణాయుతంగా పనిచేయాలి. జీవిత రంగాలన్నింటిలో అధర్మాన్ని జయించడానికి శక్తిమంతమైన సామూహిక వ్యవస్థను నిర్మించాలి. అత్యంత క్రమశిక్షణతో సామూహిక ప్రయత్నం కొనసాగించాలి.

విశ్వాసులు నిర్మించుకున్న ఇలాంటి పటిష్టమైన సామూహిక వ్యవస్థను, వారి సామూహిక ప్రయత్నాలను, రూపురేఖలను చూపుతూ వారి ఆదర్శవంత మయిన సామూహిక వ్యవస్థనే దేవుడు శ్లాఘించాడు. వారు తనకు ప్రియమైనవారని అభివర్ణించాడు.

"దైవ మార్గంలో, సీసంతో తయారయిన కట్టడం వలె(చెక్కు చెదరక) నిలకడతో సంఘర్షిస్తూ ఉండేవారే నిస్సంశయంగా దైవప్రియులు."

(ఖుర్ఆన్)

జమాఅత్‌గా ఏర్పడి జీవితం గడపాలని హితవు చేస్తూ దైవ ప్రవక్త (సఅసం) సామూహిక జీవిత ప్రాముఖ్యతను గురించి ఇలా ఉపదేశించారు.

"అడవిలోనైనాసరే ముగ్గురు మనుషులు ఉంటే వారిలో ఒకరిని తమ అమీరుగా (నాయకునిగా) ఎన్నుకోవాలి. అలా చేయకుండా జీవించడం వారికి ధర్మం కాదు." (ముస్‌తకా)

ఇంకా మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు:

"స్వర్గం మధ్యలో తన నివాసాన్ని నిర్మించుకోదలచిన వ్యక్తి 'అల్ జమాఅత్'ను పటిష్టంగా పట్టుకొని బ్రతకాలి. ఎందుకంటే షైతాన్ ఒంటరి మనిషితో ఉంటాడు. 'ఇద్దరు' కాగానే వాడు దూరంగా పారిపోతాడు."

"అల్ జమాఅత్" అంటే సంఘటితమయిన ఒక సామూహిక వ్యవస్థ. ఆ వ్యవస్థలో అధికారం ఇస్లామ్ అధీనంలో ఉంటుంది. విశ్వాసుల ఖలీఫా, ఇస్లామ్ ఆదేశాలు, శాసనాలను అమలు జరుపుతూ ఉంటారు, విశ్వాసులు అందరూ ఆయన నేతృత్వంపైన, మార్గ దర్శకత్వంపైన ఏకాభిప్రాయం కలిగి ఉంటారు. అటువంటి పరిస్థితిలో ఒక విశ్వాసి ఈ "జమాఅత్"కు దూరంగా ఉండి జీవితం గడపడానికి ఎటువంటి అవకాశమూ లేదు. అల్ జమాఅత్ లేనప్పుడు ఉమ్మత్ సంఘటితమయి సామూహిక ప్రయత్నం ద్వారా అల్ జమాఅత్‌ను స్థాపించే కృషి చేయడం దాని కర్తవ్యం.

2. జమాఅత్ విధించే ఐక్యతకు, వ్యవస్థీకరణకు ఆధారం కేవలం ధర్మంకావాలి. దైవధర్మం ఆధారంగా ఏర్పడిందే ఇస్లామీయ సంస్థ కాగలదు. దైవ ధర్మం తప్ప మరొకటి ఆధారంగా ముస్లిముల సమైక్యతకు, ఏకాభిప్రాయానికి కృషిచేస్తే అది ఇస్లామ్ ఆదేశించిన ఐక్యత కాజాలదు. ఇలాంటి సంస్థ అయినా, జమాఅత్ అయినా ఇస్లామీయ వ్యవస్థకాజాలదు. ముస్లిములమధ్య నిజమయిన సోదరసంబంధానికి ఐక్యతకు పునాది ధర్మం ఒక్కటే. ధర్మం తప్ప వీరు దేన్ని తమ ఐక్యతకు ఆధారంగా చేసుకున్నా వారు సమైక్యంకావడానికి బదులు చెదిరిపోతారు. ఒక్క 'అల్ జమాఅత్'గా రూపొందడానికి బదులు వర్గాలుగా, ముఠాలుగా విడిపోతారు.

సంస్థ ఏర్పరిస్తే దాని ధ్యేయం దైవధర్మ సంస్థాపనం కావాలి. అందులో మీరు చేసే కృషి అంతా దానికోసమే జరగాలి. దివ్య ఖుర్ఆన్‌లో ఇలా ఉంది:

> "మీరంతా కలిసి దైవ సూత్రాన్ని గట్టిగా పట్టుకోండి. వేర్వేరు వర్గాలుగా చీలిపోరాదు. దైవం మీకు చేసిన మహోపకారాన్ని జ్ఞాపకముంచుకోండి. మీరు పరస్పరం వైరులయి ఉన్నప్పుడు ఆయన మీ హృదయాలను కలిపాడు, మీరు ఆయన అనుగ్రహం, కటాక్షాల వల్ల పరస్పరం సోదరులయ్యారు." *(ఆలి ఇమ్రాన్:103)*

దైవ సూత్రం (త్రాడు) అంటే దైవ ధర్మం అని భావం. ఖుర్ఆన్ దృష్టిలో ముస్లిముల ఐక్యతను, సామూహిక వ్యవస్థకు ఆధారం ఈ ధర్మమే. ఇది తప్ప మరే ఆధారమూ ముస్లిముల్ని ఏకత్రం చేయజాలదు– ముక్క చెక్కలుగానే చేసి వేస్తుంది.

3. ధర్మ సందేశ కార్యకర్తల్ని మనస్ఫూర్తిగా ప్రేమించండి. ఆ సంబంధాన్ని మరే సంబంధం కన్నా ప్రముఖమయిందిగా గౌరవనీయమయిందిగా భావించండి. ఖుర్‌ఆన్‌లో విశ్వాసుల గురించి ఇలా నిర్వచింపబడింది:

"దైవాన్ని, అంతిమ దినాన్ని విశ్వసించేవారు, దైవం పట్ల, ఆయన సందేశహరుని పట్ల శత్రుత్వానికి ఒడిగట్టేవారి ఎడల ప్రేమానురాగాలతో మెలగడం నీవు చూడలేవు– వారు తమ తండ్రులు, కొడుకులు, సోదరులు తమ కుటుంబం వారే అయినప్పటికీ" *(అల్‌ముజాదిలహ్: 22)*

4. సంఘసహచరుల పట్ల హితవు, శ్రేయోభిలాషలు కలిగి ఉండాలి. సంఘజీవితంలో పరస్పర హితబోధనా భావాన్ని నిత్యజాగృతం చెయ్యాలి. ఇదే సాఫల్యమార్గంగనక:

"కాలమే సాక్షి. మానవుడు నష్టంలో ఉన్నాడు - విశ్వసించిన వారు, సదాచరణ చేసేవారు, పరస్పరం సత్యధర్మ బోధన చేసుకునేవారు, సహన స్థయిర్యాలు బోధించుకునేవారు తప్ప!" *(అల్‌అస్ర్)*

5. సంఘక్రమశిక్షణను పూర్తిగా పాటించండి. అది కేవలం సంఘపటిష్టతకు సంబంధించింది మాత్రమే అని భావించకండి, అది మీ ధార్మిక బాధ్యత అని భావించండి. దైవ వచనం ఇది:

"వాస్తవానికి విశ్వాసులయినవారు వీరే. వీరు దైవాన్నీ, దైవ సందేశ హరుణ్ణి మనస్ఫూర్తిగా విశ్వసిస్తారు, సామూహిక కార్యంలో దైవ ప్రవక్తకు తోడుగా ఉన్నప్పుడు ఆయనను అనుమతి లేనిదే వదలి వెళ్లరు. వాస్తవంగా మీ అనుమతి పొందేవారే దైవాన్ని, దైవప్రవక్తనూ విశ్వసించేవారు." *(అన్‌నూర్:62)*

జమాఅత్ విధించే క్రమశిక్షణను పాటించడం, నాయకుని ఆజ్ఞను శిరసావహించి విధేయులయి ఉండడం కేవలం చట్టపరమయిన వ్యవహారం మాత్రమేకాదు, అదొక అత్యంత ప్రధానమయిన ధార్మిక అంశం. సంఘ క్రమశిక్షణను పాటిస్తూ సంఘ సంబంధమయిన విధినుండి తమ నాయకుని అనుమతి పొందనంత వరకు తప్పుకోని వారి విశ్వాసమే వాస్తవమయినదని పవిత్ర ఖుర్‌ఆన్ సాక్ష్యం ఇచ్చింది.

6. సంఘ జీవితంలో జరుగుతున్న ఏమంచి పనిలోనయినా చిత్తశుద్ధితో సహకరించాలి, చేయగలిగినంత వరకు చేయాలి. కాని తప్పించుకోడానికి ప్రయత్నించరాదు. స్వార్థం, అవకాశవాదం, స్వాతిశయంలాంటి దుర్గుణాలకు దూరంగా ఉండాలి, ఇది పవిత్ర ఖుర్‌ఆన్ హితవు:

"సత్కార్యాలలో దైవ కార్యాలలో పరస్పరం సహాయం చేసుకుంటూ ఉండండి."

7. అనుయాయులతో సత్సంబంధాలు కలిగి ఉండాలి, ఎవరితోనయినా భేదాభిప్రాయం వస్తే వెంటనే దాన్ని దూరం చేసుకోవాలి. హృదయాన్ని నిష్కల్మషంగా ఉంచుకోవాలి. "దేవునికి భయపడి పరస్పర సంబంధాలను సంతోషదాయకంగా ఉంచుకోండి." అన్నది ఖుర్‌ఆన్ సూక్తి.

8. ఇస్లామీయ సంఘనాయకునికి సహృదయంతో విధేయులుగా ఉండాలి. ఆయన శ్రేయస్సును అభిలషిస్తూ విశ్వాసపాత్రులుగా ఉండాలి. మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు. "ముస్లిమ్‌లు తమ, నాయకుని ఆజ్ఞను వినడం, పాటించడం అవసరం. ఆ ఆజ్ఞ వారి స్వభావానికి అనుకూలమయినదయినా, ప్రతికూలమయిన దయినా సరే, అయితే అది దైవధిక్కార విషయం కాకూడదు. దైవ అవిధేయతకు దారి తీసే ఆజ్ఞ ఇవ్వబడితే మాత్రం దాన్ని వినకూడదు, పాటించకూడదు. (బుఖారి- ముస్లిమ్)

హజ్రత్ తమీమ్‌దారి (రజి) ప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించినట్లు ఉల్లేఖించారు: "దీన్(ధర్మం) చిత్తశుద్ధి కలిగి ఉండే శ్రేయోభిలాషకు మారుపేరు" ఈ మాటను ఆయన మూడుసార్లు అన్నారు. మేము, "ఈ శ్రేయోభిలాష ఎవరి పట్ల?" అని అడిగాము. "అల్లాహ్, ఆయన ప్రవక్త పట్ల, ఆయన గ్రంథం పట్ల, ముస్లిముల నాయకుని పట్ల, వారి సామాన్య ప్రజల ఎడల" అని బదులిచ్చారు ఆయన (సఅసం). (ముస్లిమ్)

9. సంఘ దురభిమానం, సంకుచిత దృష్టి, ముఠాతత్వాన్ని విడనాడాలి, విశాల హృదయం, సత్ప్రవర్తన కలిగి ఉండి ప్రతి ఒక్కరితో సహకరించాలి. ధర్మకార్యాన్ని ఎవరు నిర్వర్తించినా సరే వారందరిని గౌరవించాలి. వారిపట్ల శ్రేయోభిలాష, మంచి నడవడిక కలిగి ఉండాలి. వారిని మన మార్గంలో తోటి ప్రయాణీకునిగా, సహాయకారులుగా భావించాలి, ధర్మకార్యాన్ని నిర్వహించేవారు పరస్పరం సహాయకారులు, సమర్థించుకునేవారు. అందరి లక్ష్యం ధర్మసంస్థాపనే, అందరూ తమతమ ఆలోచనాసరళి ప్రకారం ధార్మిక సేవ చేయాలని కోరుకుంటారు. చిత్తశుద్ధితో విషయాన్ని విపులీకరించడం ద్వారా తప్పొప్పుల్ని తెలియజేసుకోవడం, వాస్తవమైన ఆలోచనాసరళిని, ఆచరణా విధానాన్ని పరస్పరం సూచించుకోవడం ఎంతో శుభకరమయిన కార్యం. ఇలా చేయవల్సిందే. పరస్పర ద్వేషం, ఉద్రిక్తత, అసూయ, విరోధం, ఒకరినొకరు అవమాన పరచుకోవడం, దుష్ప్రచారం చేసుకోడం వంటి దుష్కృత్యాలలో మునిగిపోవడం ధర్మప్రబోధకులకు తగదు. తమ జీవితంలో దైవధర్మ సేవ ఏదైనా చెయ్యాలని, ఆ మార్గంలో తమ శక్తిసామర్థ్యాలను శక్తివంచనలేకుండా వినియోగించాలని హృదయపూర్వకంగా కోరుకునేవారు ఇలాంటి చెడు గుణాలకు ఎంతో దూరంగా వుండాలి.

# 4 నాయకత్వపు మర్యాదలు

1. ఇస్లామీయ సంఘానికి నాయకత్వం వహించి నడిపించేందుకు అసాధారణమైన దైవభీతి, భక్తితత్పరతగల వారిని ఎంపిక చేయాలి. ధర్మం విషయంలో గొప్పతనానికి ప్రమాణాలు వంశం, సిరిసంపదలు కావు, అందరికంటే అధికంగా దేవునికి భయపడేవాడే ధర్మంలో గొప్పవాడు. ఖుర్ఆన్‌లో ఇలా ఉంది:

"మానవులారా! మేము మిమ్మల్ని ఒక స్త్రీ పురుషుల జంట ద్వారా పుట్టించాము, మీరు పరస్పరం గుర్తించుకోడానికి మీ వంశాలను, తెగలను చేశాము. నిస్సందేహంగా, మీలో అందరి కంటే ఎక్కువ దైవభీతిగలవాడే దేవుని వద్ద గొప్పవాడు." *(అల్‌హుజురాత్)*

2. నాయకుని ఎంపికను ఒక స్వచ్ఛమయిన ధార్మిక బాధ్యతగా భావించాలి, అభిప్రాయాన్ని దేవుని అమానత్‌గా భావిస్తూ వాస్తవంగా ఈ మహోన్నతమయిన బాధ్యతా భారాన్ని మోయగలిగి దాన్ని నిర్వర్తించడంలో యోగ్యుడైన వ్యక్తినే ఎన్నుకొనడానికి దాన్ని వినియోగించాలి. దేవుడు ఇలా ఆదేశించాడు, "నిస్సందేహంగా మీరు మీ అమానత్‌లను యోగ్యులయిన వారికి అధీనం చేయండి" అని దేవుడు మిమ్మల్ని ఆజ్ఞాపిస్తున్నాడు. *(నిసా-58)*

ఇది ఒక సూత్రప్రాయమయిన సమగ్రమయిన ఆదేశం. ఇది అన్ని రకాల అమానత్‌లకు వర్తిస్తుంది, ఇక్కడ అమానత్ అంటే ఇస్లామీయ సంఘం బాధ్యతలు అని అర్థం. ఇస్లామీయ సంఘం నాయకత్వం కోసం వాస్తవంగా అలాంటి బాధ్యతా భారాన్ని మోసే అర్హత, సామర్థ్యంవున్న వ్యక్తికే మన అభిప్రాయాన్ని, అంటే మనకు ప్రియమైన అమానత్‌ను అప్పగించాలి. ఈ విషయంలో దురభిమానం, పక్షపాతం ఇంకా అలాంటి ఇతర విషయాల ప్రభావాలకులోనై ఓటును వినియోగించడం ఖియానత్(విశ్వాస ఘాతుకం) అవుతుంది, విశ్వాసులు అటువంటి విషయాలకు దూరంగా ఉండాలి.

3. మీరు ముస్లిమ్‌ల సంఘబాధ్యతను గ్రహించండి. అంతేకాదు, పరిపూర్ణ విశ్వాసం, కృషి, బాధ్యతాభావం, దీక్షతో మీ బాధ్యతని మీరు నిర్వర్తించవలసి వుంటుంది. మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు, "ముస్లిమ్‌ల సాంఘిక వ్యవహారాల్లో బాధ్యాతాయుతమయిన పదవి స్వీకరించిన వ్యక్తి, వారిపట్ల నమ్మక ద్రోహంతలపెడితే అల్లాహ్ అతనికి స్వర్గం నిషేధిస్తాడు." (బుఖారి, ముస్లిమ్)

దైవ ప్రవక్త(సఅసం) మరో చోట ఇలా అన్నారుః "ముస్లిముల సామూహిక విషయాల బాధ్యతను స్వీకరించిన తర్వాత, తన సొంత విషయంలో శ్రద్ధ వహించి తన మేలు కోసం కృషి చేసి అలసిపోయినట్లే ముస్లిమ్‌ల శ్రేయాన్ని కాంక్షించి వారికి మేలు చేయకపోతే, వారి కార్యకలాపాల్లో కృషి చేయకపోతే అలాంటి వారిని అల్లాహ్ తల క్రిందుగా నరకంలో పడవేస్తాడు." (తిబ్రాని)

4. అనుయాయులపట్ల మృదుత్వం, వాత్సల్యం, న్యాయం, సాధు స్వభావాలతో ప్రవర్తించాలి, అప్పుడే వారు నిండు హృదయంతో మీకు సహకరిస్తారు.

దివ్య ఖుర్ఆన్‌లో మహాప్రవక్త(సఅసం)ను గురించి ఇలా బోధించబడిందిః "నీవు వారి పట్ల అత్యంత మృదుహృదయుడవయ్యావంటే అది దేవుని అనుగ్రహమే, అలా కాకుండా నీవు కఠినంగా వ్యవహరించినట్లయితే నీ చుట్టూ వున్న వారంతా నిన్ను వదలిపారిపోయేవారు." మరో చోట దైవ ప్రవక్త (సఅసం)కు ఇలా ఆజ్ఞాపించబడింది. "నిన్ను అనుసరిస్తున్న విశ్వాసులపట్ల ఉదాత్త వైఖరితో ప్రవర్తించు." *(అష్షూరా : 215)*

హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) ఒకసారి ప్రసంగిస్తూ ఇలా అన్నారు. "ప్రజలారా! మీరు మా వెనుక మా మంచిని అభిలషించేవారుగా, సత్కార్యాల్లో మాకు తోడ్పడే వారుగా మెలగాలి. ఇది మీపై మాకున్న హక్కు" ఆయన మళ్ళీ అన్నారు. "అధికారులారా! అధికారియొక్క సహనశీలత, హృదయమార్దవం కంటే లాభకరమయింది, దేవునికి ప్రీతికరమైంది వేరొక సహన గుణం లేదు, అలాగే అధికారి యొక్క మూర్ఖత్వం, అతని దుష్ప్రవర్తనకంటే నష్టకరమైన, దేవునికి అప్రియమయిన మరొక మూర్ఖత్వం లేదు."

5. మీరు మీ అనుయాయుల ప్రాముఖ్యతను గ్రహించాలి, వారి భావోద్రేకాలను గౌరవించాలి, వారి అవసరాలను గుర్తించాలి, వారు మిమ్మల్ని అందరికంటే తమకు, గొప్ప శ్రేయోభిలాషి అని భావించేలా మీరు వారిపట్ల సోదరభావంతో మెలగాలి. హజ్రత్ మాలిక్ బిన్ హువైరస్ (రజి) ఇలా ఉల్లేఖించారుః

"ఒకసారి సమవయస్కులమయిన యువకులం ప్రవక్త(సఅసం) సేవలో ఉండటానికి వెళ్ళాము. మేము ఆయన (సఅసం) సేవలో ఇరువయి రోజులున్నాము. నిజంగా దేవుని ప్రవక్త (సఅసం) అత్యంత మృదుహృదయంగల కారుణ్యమూర్తి. మా ఇంటి జ్ఞాపకం మమ్మల్ని వేధిస్తున్నది అని గ్రహించినవెంటనే ఆయన 'మీరు మీ ఇంటిలో ఎవరెవరిని వదలి వచ్చారు?' అని మమ్మల్ని అడగడం ప్రారంభించారు, మేము అన్ని విషయాలు వివరంగా తెలియజేశాము. అప్పుడాయన 'సరే, అయితే ఇప్పుడు మీరు మీ ఇళ్ళకు తిరిగి వెళ్ళండి, వారి వద్దనే

వుండండి. మీరు నేర్చుకున్నది వారికి నేర్పించండి. వారికి మంచి విషయాల్ని బోధించండి, ఫలానా నమాజు ఫలానా సమయంలోనూ ఫలానా నమాజు ఫలానా సమయంలోనూ చేయండి. నమాజు వేళ అయినప్పుడు మీలో ఒకరు అజాన్ పలకండి. మీలో ఎవరు జ్ఞానంలో, నడవడికలో అందరికంటే మిన్నగా వుంటాడో అతడు నమాజు చేయించాలి.'

6. అనుయాయులను గౌరవించాలి. వారిని మీ మూలధనం అని భావిస్తూ పూర్తి దృష్టి కేంద్రీకరించి వారికి శిక్షణ ఇవ్వాలి. వారిని నిరుపేదలుగా, నిర్భాగ్యులుగా భావించి, దేవుడు ప్రాపంచిక గౌరవం, గొప్పతనం, ధన సంపత్తి ప్రసాదించిన వారివైపు ఆశతో కన్నెత్తి చూడకూడదు.

"ఎవరయితే తమ ప్రభువు ప్రీతిని పొందే కోరికతో ఉదయం సాయంత్రం ఆయన్నే స్మరిస్తూ వుంటారో వారి సహచర్యంతో నిన్ను నీవు తృప్తిపరచుకో, వారి నుండి నీ దృష్టిని మళ్లించుకోకు. ప్రాపంచిక జీవితపు ఆకర్షణను కోరుకోకు"

*(అల్‌కహఫ్:28)*

నిజానికి ధన మాన ప్రాణాలను ధారపోసి ధార్మిక ప్రచారంలో నిమగ్న లయినవారే ధార్మిక సంఘానికి మూలధనం. వారిప్రాముఖ్యతను గ్రహించి వారి శిక్షణవైపు తన దృష్టిని పూర్తిగా కేంద్రీకరించడం సంఘనాయకుని కర్తవ్యం.

7. సంఘం యొక్క ముఖ్యమయిన కార్యాలన్నీ అనుయాయుల సలహా సంప్రదింపులతోనే నిర్ణయించి, నిర్వర్తించాలి. అనుయాయులిచ్చే మంచి సలహాలతో ప్రయోజనం పొందుతూ సంఘ కార్యకలాపాల్లో వారి శ్రద్ధాసక్తులను పెంపొందించాలి. ఈ సందర్భంలో విశ్వాసుల లక్షణాన్ని దేవుడు ఇలా అభి వర్ణించాడు :

"వారి వ్యవహారాలు పరస్పర సలహా సంప్రదింపులతో పరిష్కరించ బడతాయి." ముఖ్యమయిన విషయాల్లో తమ అనుచరులతో సంప్రదింపులు జరపమని మహాప్రవక్త (సఅసం)కు ఆదేశించబడింది.

"విశేష వ్యవహారాలలో, వారిని సంప్రదించండి." (ఖుర్‌ఆన్)

8. సంఘ వ్యవహారాల్లో ఎల్లప్పుడూ విశాల హృదయంతో, త్యాగబుద్ధితో వ్యవహరించాలి. మీరు తమకు, తమ ఇంటి వారికీ ఏ విషయంలోనూ ప్రాధాన్యత ఇచ్చుకోరాదు. ఎల్లప్పుడూ త్యాగనిరతితో, ఉదార స్వభావంతో ప్రవర్తించాలి. అప్పుడే అనుయాయులు సంతోష పూర్వకంగా అన్ని విధాలా త్యాగాలు చేయడానికి సన్నద్ధులవుతారు. అప్పుడే వారిలో సంఘం పట్ల అసంతృప్తిగాని,

అనాసక్తతగాని జనించవు. స్వార్థం, అవకాశవాదం లాంటి భావో[ద్రేకాలు కలగవు. హ[జత్ అబూబ[క్ (రజి) ఒకసారి హ[జత్ ఉమర్ (రజి) తో ఇలా అన్నారుః

"ఖత్తాబ్ కుమారా! నేను విశ్వాసులపైన (నాయకునిగా) నిన్ను ఎందుకు ఎంపిక చేశానంటే - నీవు వారిపట్ల [పేమతో [పవర్తించాలి. నీకు మహా [పవక్త (సఅసం) సహచర్యం లభించింది. ఆయన తనకంటే మనకు, తన ఇంటి వారికంటే మన ఇంటివారికి ఎక్కువ [పాధాన్యత ఇవ్వడం నీవు చూశావు. చివరకు ఆయన (సఅసం) నుండి మనకు లభించిన దానిలో ఏమయినా మిగిలితే దాన్ని మనం [పవక్త (సఅసం) ఇంటివారికి కానుకగా పంపించే వాళ్లం." (కితాబుల్ ఖరాజ్)

9. పక్షపాతానికి, బంధు[పీతికి ఎల్లప్పుడూ దూరంగా వుండాలి. అనవసర మయిన అభిమానాన్ని, ఉదారత్వాన్ని కూడా మానుకోవాలి. హ[జత్ అబూబ[క్ తనను సేనాపతిగా నియమించి సిరియాకు పంపినప్పుడు ఆయన ఇలా చెప్పారని యజీద్ బిన్ సుఫ్యాన్ (రజి) చెప్పారు.

"యజీద్! నీకు కొందరు బంధువులున్నారు. అధికారులుగా నియమిం చడంలో వారికి నీవు [పాధాన్యత ఇవ్వవచ్చు. నీ గురించి నాకున్న గొప్పభయమిదే. మహా[పవక్త ఏమని చెప్పారంటే, ముస్లిమ్‌ల సామూహిక వ్యవహారాలకు బాధ్యుడయిన వ్యక్తి బంధు [పీతితో ఎవరినయినా పదవులలో నియమిస్తే అతనిపైన అల్లాహ్ అభిశాపం కలుగుతుంది. అల్లాహ్ అతను ఇచ్చే ఏ పరిహారాన్ని స్వీకరించడు, చివరికి అతన్ని నరకంలో పడవేయడం జరుగుతుంది." (కితాబుల్ ఖరాజ్)

10. సంఘ [క్రమశిక్షణను అత్యంత పటిష్టంగా వుంచడానికి [పయత్నించాలి. ఈ విషయంలో ఎప్పుడూ అనవసరమయిన మెతకదనం, ఉదారవైఖరి అవలంబించరాదు. దేవుడు ఇలా ఆదేశించాడుః

"వారు ఏదైనా తమ [పత్యేక కార్యం కోసం నిన్ను అనుమతి అడిగితే నీవు కోరిన వారికి అనుమతి ఇవ్వు, వారిని కటాక్షించమని దేవుణ్ణి వేడుకో."

(నూర్-62)

సంఘకార్యకర్తలు ఏదయినా సామూహిక కార్యం కొరకు సమావేశం అయినప్పుడు కొందరు తమ వ్యక్తిగత అవసరాల కొరకు గత్యంతరంలేక అను మతి కోరితే సంఘ[క్రమశిక్షణ [పాముఖ్యత దృష్ట్యా ఈ సామూహిక ధర్మ కార్యం కంటే వారి అవసరమే వాస్తవానికి ముఖ్యమయినదయితే లేక వారు కోరిన పని ఇస్లాం షరీఅత్ [పకారం సమంజసమయితే, దాన్ని సమ్మతించడం, అవసరమయితే అటువంటి వారికి అనుమతి ఇవ్వడం సంఘనాయకుని విధి అని దీని భావం.

# 5

# దైవదాస్యం

## 1. పశ్చాత్తాపం, క్షమకై అర్థింపు

1. ఎంత ఘోరపాపం జరిగినా అది క్షమించబడదన్న నిరాశకు లోను కాకూడదు, పశ్చాత్తాపం, క్షమాపణకై వేడుకోలు ద్వారా, హృదయాన్ని పరిశుద్ధం చేసుకోవాలి, దైవం పట్ల పూర్తిగా నమ్మకం కలిగి ఉండాలి, నిరాశా నిస్పృహలకు గురికావడం తిరస్కారుల లక్షణం. అత్యధికంగా మన్నింపునుకోరడం, ఎలాంటి పరిస్థితులలోనూ దైవం పట్ల నిరాశచెందకపోవడం విశ్వాసుల ప్రత్యేకతలు. పాపాలు ఎక్కువయ్యాయని ఆందోళన చెంది నిరాశపడటం, అవిక్షమించబడవని నిస్పృహకు గురికావడం మానసిక, భావపరమయిన వినాశానికి నిదర్శనం. తన ప్రియ భక్తుల వల్ల అసలు పాపమే జరగదని దైవం చెప్పలేదు. వారివల్ల పాపాలు జరుగుతాయి. కాని తాము చేసింది సరయినదే అని వారు తమ పాపాలను గురించి మంకుతనం వహించరు. వారు నిజాయితీగా తమ పాపాలను ఒప్పు కుంటారు. తమ్ము తాము పరిశుద్ధం చేసుకునేందుకు తహతహలాడుతారు అని మాత్రమే దేవుడు నిర్వచించాడు.

"ఎప్పుడయినా ఏదయినా లజ్జాకరమయిన పని వారివల్ల జరిగితే లేక ఏదయినా పాపం చేసి, వారు తమ ఆత్మలకు అన్యాయం చేసుకున్నట్లయితే, వెంటనే వారికి అల్లాహ్ గుర్తుకు వస్తాడు. అప్పుడు వారు ఆయన్ని తమ తప్పులు

క్షమించమని వేడుకుంటారు. అల్లాహ్ తప్ప పాపాలను క్షమించగలిగేవాడెవడున్నాడు? వారు తాము చేసిన తప్పులపట్ల తెలిసీ మంకుపట్టు పట్టరు." *(ఆలిఇమ్రాన్:135)*

ఖుర్ఆన్‌లో మరోచోట ఇలా ఉంది:

"యదార్థంగా భయభక్తులు కల వారిస్థితి ఎలా ఉంటుందంటే, ఎప్పుడయినా షైతాన్ ప్రభావం వల్ల ఏదయినా చెడు ఆలోచన తట్టినప్పటికీ వారు తక్షణం అప్రమత్తులవుతారు. తరువాత సరయిన వైఖరి ఏదో వారికి స్పష్టంగా కనిపిస్తుంది."
*(అల్ ఆరాఫ్: 201)*

మహాప్రవక్త (సఅసం)ఇలా ప్రవచించారు:

"మానవుల్లో అపరాధం చెయ్యనివారు లేరు, ఐతే అత్యధికంగా దైవం వైపునకు మరలి క్షమాపణ అర్థించే వారే మేలైన అపరాధులు." *(తిర్మిజి)*

దివ్య ఖుర్ఆన్‌లో దేవుడు తన ప్రియభక్తుల విశిష్టతను గురించి వివరిస్తూ వారు రాత్రి చివరి గడియల్లో దైవ సన్నిధిలో మోకరిల్లి ఎంతో విలపిస్తూ క్షమాపణ కోరుకుంటారు అని పేర్కొన్నాడు. ఆయన విశ్వాసులకు, నిరంతరం దైవ క్షమాపణను కోరుతూ వుండమని బోధించాడు. వారి పాపాలను దేవుడు క్షమిస్తాడని నమ్మాలి. ఎందుకంటే, ఆయన ఎంతో క్షమా గుణం కలవాడు. తన దాసుల పట్ల కడు వాత్సల్యం కలవాడు.

"తమ ప్రభువును క్షమాపణ కోరండి, నిస్సందేహంగా నా ప్రభువు కరుణామయుడు తన సృష్టిని ప్రేమించేవాడు." *(హూద్ : 90)*

2. దైవ కారుణ్యం పట్ల ఎల్లప్పుడూ ఆశ కలిగి ఉండాలి. మానవుని పాపాలు ఎన్ని ఉన్నప్పటికీ, దేవుని కారుణ్యం అంతకంటే అధికమయినదన్న విషయాన్ని విశ్వసించాలి. సముద్రపు నురుగు కంటే కూడా ఎక్కువ పాపాలు చేసినవాడయినా సరే తన పాపాలకు సిగ్గుపడి దేవుని ముందు పశ్చాత్తాప హృదయంతో విలపిస్తూ వేడుకుంటే, దేవుడు అతని మొర ఆలకించి అతనికి తన కారుణ్య ఛాయలో రక్షణ కల్పిస్తాడు.

"ఆత్మలకు అన్యాయం చేసుకున్న నా దాసులారా! దేవుని కారుణ్యంపట్ల ఏ విధంగానూ నిరాశ చెందకండి. దేవుడు మీ సమస్త పాపాలను తప్పకుండా క్షమిస్తాడు. ఆయన అమితంగా క్షమించేవాడు. అత్యంత దయగలవాడు. మీకు ఏదయినా ఆపద వచ్చిపడి, మీరు ఎటునుండి సహాయం పొందలేని స్థితి రాకముందే మీరు మీ ప్రభువు వైపునకు మరలండి. ఆయనకు విధేయులుగా ఉండండి." *(అజ్ జుమర్: 53,54)*

3. జీవితంలో ఎప్పుడయినా, ఏదశలోనయినా పాపాలకు సిగ్గు, పశ్చాత్తాపాల అనుభూతి కలిగితే అది దేవుని కటాక్షమని గ్రహించాలి, దేవుని వైపు మరలడానికి తౌబా (పశ్చాత్తాపం) ద్వారం తెరిచి ఉంది అని గ్రహించాలి. దాసుల శ్వాసచెదరక మునుపు దేవుడు వారి క్షమాపణ స్వీకరిస్తాడు. అయితే శ్వాస చెదిరిపోయి, మానవుడు పరలోకంలోకి తొంగి చూడసాగినప్పుడు క్షమాపణ కోరే అవకాశం అంతమయిపోతుంది.

మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారుః

"దేవుడు తన దాసుని క్షమాపణ స్వీకరిస్తాడు, కానీ అది శ్వాసచెదరకముందే."
(తిర్మిజి)

హజ్రత్ యూసుఫ్ (అలైహిస్సలాం)ని ఆయన సోదరులు ఒక పాడుబడిన బావిలో పడత్రోసి ఆయన్ని చంపివేశామని అనుకున్నారు. అలా వారు ప్రవక్త హత్యాపాపాన్ని చేశారు. ఆయన చొక్కాను రక్తంలో తడిపి యూసుఫ్ చనిపోయాడని, ఆయన్ని తోడేలు తినివేసిందని తమ తండ్రి యాకూబ్ (అలైహిస్సాలం)ను నమ్మించడానికి ప్రయత్నం చేశారు. కాని అలాంటి మహా పాపం చేసిన అనేక సంవత్సరాల తర్వాత వారిలో తమ అపరాధ భావన పెల్లుబికిరాగానే సిగ్గుపడి తమ తండ్రిని "నాన్నా! మీరు మా పాపాల క్షమాపణ కొరకు ప్రార్థించండి" అని అభ్యర్థించారు. అందుకు దేవుని ప్రవక్త హజ్రత్ యాకూబ్ (అస) 'మీ పాపం చాల ఘోరమయినది. ఈ మహాపాపం జరిగి ఎన్నో సంవత్సరాలు గడిచిపోయాయి. ఇప్పుడు క్షమించబడే ప్రశ్నే లేదని' వారిని నిరాశపరచలేదు. పైగా ఆయన వారితో "నేను తప్పకుండా మీ కోసం నా ప్రభువు దగ్గర క్షమాపణ వేడుతాను" అని వాగ్దానం చేశారు. ఇంకా, "దేవుడు తప్పకుండా మిమ్మల్ని క్షమిస్తాడు, ఎందుకంటే ఆయన అమితమయిన దయగలవాడు, కరుణించేవాడూను." అని చెప్పి వారిలో విశ్వాసంకలిగించారు. ఈ విషయం ఖుర్ఆన్‌లో ఇలా ఉందిః "అంతా ఇలా అన్నారు, "నాన్నా! మాపాపాల క్షమాపణకొరకు మీరు ప్రార్థించండి. మేము నిజంగానే అపరాధులం." (యూసుఫ్-97) ఆయన సమాధానంగా ఇలాఅన్నారు. "మీ క్షమాపణ కొరకు నేను నా ప్రభువును అర్థిస్తాను, ఆయన అమితంగా క్షమించేవాడు, కరుణించేవాడు." (యూసుఫ్ః 98)

ప్రవక్త (సఅసం) తన ఉమ్మత్‌ను నైరాశ్యం వల్ల జరిగే వినాశనం నుండి తప్పించడానికి అనుచరులకు ఒక వింత గాధను వినిపించారు. దీనివల్ల విశ్వాసి

తన జీవిత కాలంలోని ఏ దశలోనయినా సరే తన పాపాలకు సిగ్గుపడి, హృదయ పూర్వకంగా దేవుని సమ్ముఖంలో పశ్చాత్తాపంతో కుమిలిపోతే ఆయన తప్పకుండా క్షమిస్తాడనే గుణపాఠం లభిస్తుంది.

మహాప్రవక్త (సఅసం) ఇలా తెలిపారుః

"గతించిపోయిన జాతిలో ఒక వ్యక్తి ఉండేవాడు. అతడు తొంభై తొమ్మిది హత్యలు చేశాడు. అతడు ప్రపంచంలో అందరికంటే గొప్ప విద్వాంసుడు ఎవరని ప్రజల్ని అడిగాడు. వారు దైవ భక్తుడయిన ఒక సాధువును చూపించారు. అతడు ఆ సాధువు వద్దకు వెళ్ళి అయ్యా! నేను తొంభైయి తొమ్మిది హత్యలు చేశాను. నా తౌబా స్వీకరించబడుతుందా? అని అడిగాడు. అందుకు ఆ సాధువు "లేదు, నీ తౌబా అంగీకరించబడటానికి ఇప్పుడు ఎలాంటి అవకాశంలేదు" అన్నాడు. అది వినగానే ఆ వ్యక్తి నిరాశా నిస్పృహలతో ఆ సాధువును కూడా హత్య చేసివేశాడు. ఇప్పుడు అతడు పూర్తిగా వందమందిని హత్య చేసిన వాడయ్యాడు. అతడు మళ్ళీ ప్రజల్ని అడగడం ప్రారంభించాడు. ఈ ప్రపంచంలో అందరికంటే గొప్ప మత విద్వాంసుడు ఎవరు అని. ప్రజలు అతనికి ఇంకొక సాధువును చూపించారు. అతడు తౌబా ఉద్దేశ్యంతో ఆ సాధువు దగ్గరికి వెళ్ళి ఆయనకు తన పరిస్థితిని వివరిస్తూ ఇలా అన్నాడు, అయ్యా! నేను వంద హత్యలు చేశాను, మరి నా తౌబా అంగీకరించబడుతుందంటారా? నా ఈ పాపానికి నిష్కృతి ఉందా? అప్పుడు సాధువు ఇలా అన్నాడు, "ఎందుకులేదు, నీకూ తౌబాకు మధ్య ఉన్న అడ్డు ఏమిటని? నీవు ఫలానా దేశం వెళ్ళు, అక్కడ దేవుని ప్రియదాసులు కొందరు దేవుని ఆరాధనలో నిమగ్నులయి ఉన్నారు, వారితో పాటు నీవు కూడా దేవుని ఆరాధనలో నిమగ్నమయిపో. మళ్ళీ ఇంకెప్పుడూ నీ స్వదేశం తిరిగి రావద్దు. ఎందుకంటే ఈ స్థలం ధార్మిక దృష్టితో చూస్తే నీకు అనుకూలంగా లేదు" (అంటే ఇక్కడ నీవు నీ తౌబాపై స్థిరంగా ఉండడం, సంస్కరణకు యత్నించడం చాలా కష్టం). తరువాత ఆ వ్యక్తి (అలాగే) బయలు దేరాడు. అతడు ఇంకా సగం దూరమే చేరుకున్నాడు. ఈ మధ్యలో అతనికి మృత్యు సమయం ఆసన్న మయ్యింది. ఇక అప్పుడు కారుణ్య దూతలు, శిక్షా దూతలు వాదులాడుకో సాగారు, "ఇతడు తన పాపాలకు పశ్చాత్తాపం చెంది, దేవుని వైపునకు దృష్టి కేంద్రీకరించి ఇటువచ్చాడు." అన్నారు కారుణ్యదూతలు.

"కాదు. ఇతడు ఇంకా ఎలాంటి పుణ్యకార్యం చేయలేదు" అన్నారు శిక్షా దూతలు. ఈ సంభాషణ జరుగుతూ ఉండగా మరొక దైవ దూత మానవాకారంలో

అక్కడికి వచ్చాడు, కారుణ్య, శిక్షాదూతలు తమ మధ్య తీర్పు ఇవ్వడానికి అతడిని మధ్యవర్తిగా ఎంచుకున్నారు, అతడు ఇలా తీర్పు చెప్పాడు. ఈ వ్యక్తి ఎటు నుండి వచ్చాడో అది ఇక్కడకు దగ్గరగా ఉందో, లేక ఈ వ్యక్తి చేరదలచిన గమ్యం దీనికి దగ్గరగా ఉందో కొలిచి చూడండి. దైవ దూతలు భూమిని కొలిచారు, అప్పుడు ఆ వ్యక్తి గమ్యమే దగ్గరగా ఉందని తేలింది. కారుణ్య దూతలు వెళ్ళిపోతూ ఆ వ్యక్తి ఆత్మను స్వాధీనం చేసుకున్నారు, దేవుడు ఆ వ్యక్తిని కటాక్షించాడు."

(బుఖారి,ముస్లిమ్)

4. కేవలం దేవుని సమ్ముఖంలోనే తమ పాపాలను ఒప్పుకోవాలి. ఆయన ముందే దుఃఖించాలి, విలపించాలి. ఆయన ముందే తమ దీనత్వాన్ని, బలహీనతను, అపరాధాలను వ్యక్తం చేయాలి. వినయ వినమ్రతలు కేవలం ఒక్క దేవుని ముందే అర్పించవలసిన సంపద. తన వినయ వినమ్రతల సంపత్తిని తనలాంటి బలహీనుడు, అశక్తుడయిన వాని ముందే అర్పించుకునే దౌర్భాగ్యుడూ, దురదృష్టవంతుని వద్ద దేవుని ముందు అర్పించుకోడానికి ఇక ఏమీ మిగలదు. అతడు పరాభవం, అవమానాల పాలై ఎల్లప్పుడూ, ఎల్లెడలా వంచించబడతాడు. ఎక్కడా గౌరవం పొందలేడు. దేవుడు ఇలా తెలిపాడు:

"నీ ప్రభువు, పాపాలను కప్పిపుచ్చేవాడు, అమితంగా కరుణించేవాడు. వారి చేష్టలకు వారిని వెనువెంటనే పట్టుకుంటే అప్పటికప్పుడే శిక్షించేవాడు. కాని ఆయన(తన కారుణ్యంతో) ఒక సమయాన్ని వారి కోసం నిర్ణయం చేసివుంచాడు. వారు తమ్ముతాము రక్షించుకోడానికి ఆయన తప్ప వేరే ఆశ్రయం లేదు."

(అల్‌కహఫ్:58)

షురా సూరాలో ఇలా ఉంది:

"ఆయనే కదా తనదాసుల పశ్చాత్తాపాన్ని స్వీకరించేవాడు, వారి అపరాధాలను క్షమించేవాడు. మీరు చేసేదంతా ఆయనకు బాగా తెలుసు."

(అష్షురా : 25)

అసలు విషయమేమంటే, సాఫల్యానికి మోక్షానికి, ఒకే ఒక ద్వారం ఉందని మానవుడు విశ్వసించాలి. ఆ ద్వారాన ఎవరయితే తిరస్కరించబడతారో వారు శాశ్వతంగా హీనులయి సర్వస్వాన్ని కోల్పోయిన వారవుతారు. దాసుడు ఎలాంటి పాపం చేసినప్పటికీ అతను దేవుని సన్నిధిలోనే విలపిస్తూ వేడుకోవాలి, ఆయన దివ్య సమ్ముఖంలోనే తన పశ్చాత్తాప అశ్రువుల్ని చిందించాలి. విశ్వాసి ఆలోచనా విధానం ఇలానే ఉండాలి. దైవం తప్ప క్షమాపణ లభించగల మరొక మార్గంలేదు.

వాస్తవమేమంటే ఒకవేళ మనిషి దేవుణ్ణి విడిచి ప్రవక్తను సంతోషపరచడానికి ప్రయత్నించినా సరే దేవుని సమ్ముఖంలో అతని యత్నానికి ఎటువంటి విలువా ఉండదు. అతను తిరస్కరించబడతాడు. ప్రవక్త కూడా దేవుని దాసుడే. ఆయన కూడా ఆ ద్వారం కడ భిక్షువే. ప్రవక్తకు లభించిన మహోన్నతమైన స్థానం దైవం ప్రసాదించిందే. ఆయనగొప్పతనమూ అదే- ఆయన అందరినీ మించిన వినయవినమ్రతలు గల దేవుని దాసుడు.

మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారుః

"ప్రజలారా! దేవుని దగ్గర మీపాపాలను గురించి క్షమాపణను వేడుకోండి, ఆయన వైపునకు మరలండి. నన్ను చూడండి, నేను రోజుకు వందసార్లు దేవుని దగ్గర క్షమాపణ అర్థిస్తూ ఉంటాను." (ముస్లిమ్)

కపటుల విషయం తెలియపరుస్తూ దేవుడు ఇలా అన్నాడుః

"ఈ కపటులు మీ సమక్షంలో ప్రమాణాలు చేస్తారు- మీరు వారిపట్ల రాజీపడాలని. ఒకవేళ మీరు రాజీపడినా అల్లాహ్ మట్టుకు అటువంటి విద్రోహుల ఎడల ఎన్నటికీ ప్రసన్నుడు కాడు." *(అత్‌తౌబాః96)*

పవిత్ర ఖుర్‌ఆన్‌లో హజ్రత్ కాబ్ బిన్ మాలిక్(రజి) సంఘటన ప్రస్తావన ఉంది. అది గుణపాఠాన్ని బోధిస్తుంది. దాసుడు అన్నింటిని భరించాలి. ప్రతి పరీక్షనూ సహనంతో ఎదుర్కోవాలి, కాని దైవ సన్నిధిని విడనాడే భావన కూడా అతని మనస్సులో దారిచేసుకోకూడదు. సత్యమార్గంలో మనిషికి ఎన్ని ఇక్కట్లు ఎదురయినా దైవం ఎన్నివిధాల పరీక్షించినా, తాను ఎన్ని హింసలకు గురయినా అదంతా అతని జీవితాన్ని ప్రకాశింపజేయడానికి, అతని ఆధ్యాత్మికస్థాయిని పెంపొదింపజేయడానికి ఒక సాధనం కావాలి. ప్రాపంచిక అవమానం శాశ్వతమైన గౌరవానికి గట్టి సోపానం కాగలగాలి. దేవుని సన్నిధిని వదలి మరొకచోట గౌరవాన్ని వెతికే వ్యక్తికి ఎక్కడా గౌరవం ప్రాప్తంకాదు. అతను ప్రతిచోటా అవమానాలపాలవుతాడు, భూమ్యాకాశాలలోని ఏ ఒక్కటీ అతన్ని గౌరవదృష్టితో చూడజాలదు.

"వ్యవహారం వాయిదా వెయ్యబడిన ఆ ముగ్గురిని కూడా ఆయన క్షమించాడు. ఇంత పెద్దవైశాల్యం కలిగివుండి కూడా, భూమి వారికి ఇరుకైపోయింది. వారి ప్రాణాలు కూడా వారికి భారమైపోయాయి. అల్లాహ్ నుండి తమను కాపాడుకోవటానికి స్వయంగా అల్లాహ్ కారుణ్యం తప్ప వేరే ఆశ్రయం ఏదీలేదని

వారు తెలుసుకున్నారు. అప్పుడు అల్లాహ్ కనికరంతో వారి వైపునకు మరలాడు, వారు ఆయన వైపునకు మరలి వచ్చేటందుకు. నిశ్చయంగా ఆయన చాలా క్షమించేవాడూ, కరుణించేవాడూను. *(అల్ తౌబా: 118)*

ఈ ముగ్గురు అనుచరులు, హజ్రత్ కాబ్ బిన్ మాలిక్, హజ్రత్ మురారా బిన్ రబీ, హజ్రత్ హిలాల్ బిన్ ఉమయ్యా. ఈ ముగ్గురి ఆదర్శవంతమయిన పశ్చాత్తాప సంఘటన ప్రళయం వరకూ విశ్వాసులకు మార్గజ్యోతిగా ఉంటుంది. హజ్రత్ కాబ్ బిన్ మాలిక్(రజి) వృద్ధాప్యంలో అంధుడయిపోయి తన కుమారుని సహాయంతో నడిచేవారు. ఆయన స్వయంగా తన ప్రబోధాత్మకమయిన పశ్చాత్తాప సంఘటనను తన కుమారునికి వివరించారు. అది హదీసు గ్రంథాలలో సురక్షితంగా వుంది:

"అది తబూక్ యాత్రకు సన్నాహాలు జరిగే కాలం. దైవ ప్రవక్త (సఅసం) విశ్వాసుల్ని ఈ యాత్రలో పాల్గొనేందుకు ప్రోత్సహిస్తున్న ప్రతి సమావేశంలో నేను కూడా పాల్గొనేవాణ్ణి. ఆయన (సఅసం) మాటలు విన్నప్పుడల్లా నేను తప్పకుండా వెళతాను అని మనస్సులో అనుకునేవాణ్ణి. కాని ఇంటికి తిరిగి వచ్చాక బద్ధకించేవాణ్ణి."ఇంకా చాలా సమయం వుందిలే, నావద్ద ప్రయాణానికి కావలసిన సామాగ్రివుంది, నేను ఆరోగ్యవంతుణ్ణి, పైగా నాకు మంచి వాహనం కూడావుంది. ఇక వెళ్ళడానికి ఎంతసేపు పడుతుంది." అని అనుకునేవాణ్ణి, ఇలా సమయం గడిచిపోతుండేది. చివరికి ముజాహిద్‌లు అందరూ తబూక్ చేరుకున్నారు. నేను మాత్రం మదీనాలో కూర్చుని ఇంకా ఆలోచిస్తూనే ఉండిపోయాను.

ఇక ఇప్పుడు మహాప్రవక్త (సఅసం) తిరిగిరానున్నారని వార్తలు రాసాగాయి, ఒకరోజు ఆయన తిరిగి వచ్చేశారని, మామూలుగా మస్జిద్‌లో వేచి ఉన్నారని తెలిసింది. అప్పుడు నేను కూడా మస్జిద్‌కు వెళ్ళాను, అక్కడ కపటులు (మునాఫికులు) ప్రవక్త (సఅసం) సన్నిధికి వచ్చి పెద్ద పెద్ద ప్రమాణాలు చేస్తూ తమ తమ సాకులు చెప్పుకుంటున్నారు. మహాప్రవక్త (సఅసం) వారి కల్లబొల్లి మాటల్ని విని వారి బాహ్యపరమయిన కారణాలను అంగీకరిస్తూ దేవుడు మిమ్మల్ని క్షమించుగాక అంటూ పోతున్నారు.

ఇక నా వంతు రాగానే మహా ప్రవక్త (సఅసం) నగుమోముతో "మిమ్మల్ని ఏది అడ్డుకుందో చెప్పండి" అని అడిగారు. అప్పుడాయన (సఅసం) చిరునవ్వులో క్రోధచిహ్నాలను నేను స్పష్టంగా చూశాను. నేను ఉన్నది ఉన్నట్టుగా చెప్పుకున్నాను. "దైవ ప్రవక్తా! నాకు ఎలాంటి కారణం లేదు, నేను ఆరోగ్యవంతుణ్ణి. సుఖసంతోషాలకు కొదవలేదు, నావద్ద వాహనం కూడా ఉంది. కాని కేవలం బద్ధకం, అలక్ష్యాలే

నన్ను ఈ అదృష్టానికి నోచుకోకుండా చేశాయి."

నా ఈ స్పష్టమయిన మాటలు విని ప్రవక్త (సఅసం) "సరే వెళ్ళు. దేవుడు నీ విషయంలో ఏదైనా తీర్పు ఇచ్చేవరకు నిరీక్షించు" అని అన్నారు. నేను లేచి నా తెగ ప్రజల్లో కూర్చున్నాను. నా తెగ ప్రజలు నన్ను నిందించడం మొదలు పెట్టారు. "నీవు కూడా ఏదో ఒక సాకు ఎందుకు చెప్పలేదు. నీవు మాకు ఎప్పుడూ ధర్మ కార్యాల్లో ముందు ఉంటావుగా" అని అన్నారు. కాని మరో ఇద్దరు మిత్రులు కూడా ఇలాగే నిజం చెప్పారని తెలిసిన తర్వాత నా మనస్సు కుదుటపడింది. నేను నా నిజాయితీపై నిలకడగా వుండటానికి నిశ్చయించుకున్నాను.

తర్వాత మహాప్రవక్త(సఅసం) మా ముగ్గురితో ఎవ్వరూ మాట్లాడకూడదని ఒక బహిరంగ ప్రకటన చేయించారు. ఈ ప్రకటన కాగానే మదీనా నగరమే మారిపోయినట్లు అనిపించింది. నేను నా వాళ్ళలోనే అసహాయుణ్ణి, అపరిచితుణ్ణి అయిపోయాను. సంఘంలో ఎవ్వరూ నాతో మాట్లాడేవారుకాదు, సలామ్ చేసేవారుకాదు. చివరికి నేను చాల విసుగుచెంది, మనసు కకావికలమయిపోగా ఒక రోజు నా చిన్ననాటి మిత్రుడు, చిన్నాన్న కొడుకు అయిన అబూ ఖతాద (రజి)వద్దకు వెళ్ళాను. వెళ్ళి సలామ్ చేశాను. కాని ఆ దైవ దాసుడు నా సలామ్‌కు జవాబుకూడా పలుకలేదు.

అప్పుడు నేను "అబూ ఖతాదా! దేవుని మీద ప్రమాణం చేసి అడుగుతున్నాను. నాకు దైవంపట్ల, ఆయన ప్రవక్త (సఅసం) పట్ల ప్రేమాభిమానాలు లేవా చెప్పు" అన్నాను, అతను మౌనం వహించాడు. నేను మళ్ళీ అడిగాను. కాని అతను అప్పటికీ జవాబు ఇవ్వలేదు. మూడవసారి నేను ప్రమాణంచేసి అడిగినప్పుడు అతను ముక్తసరిగా "ఆ విషయం దైవానికి, ఆయన, ప్రవక్త(సఅసం)కే బాగా తెలుసు" అని పలికాడు. నాకు దుఃఖం పొంగివచ్చింది. కళ్లనుండి అశ్రువులు జలజల రాలాయి. నేను విచారంతో వెనుతిరిగి వచ్చాను.

ఆ రోజుల్లోనే బజారులో ఒక సిరియా వర్తకుడు నాకు గుస్సాన్ రాజు వ్రాసిన ఉత్తరం ఇచ్చాడు. ఆ క్రైస్తవ రాజు ఇలా వ్రాశాడు. "మీ నాయకుడు మీపైన చాలా దౌర్జన్యం చేస్తున్నాడని మేము విన్నాం. మీరు ఏదో నీచమయిన వ్యక్తి కారు, మీకున్న గౌరవం ఎలాంటిదో మాకు తెలుసు. మీరు మా వద్దకు వచ్చేయండి. మేము మీ హెూదాకు తగినట్లుగా గౌరవ మర్యాదలు చేసి సత్కరిస్తాము." ఉత్తరం చూడగానే మరో ఆపద వచ్చిపడింది అనుకున్నాను. అప్పటికప్పుడే ఆ లేఖను పొయ్యిలోకి విసిరి పడేశాను.

నలభై రోజులు అదే స్థితిలో గడిచిపోయాయి. తర్వాత ప్రవక్త (సఅసం) వార్తాహరుడు ఒక ఆదేశాన్ని తీసుకువచ్చాడు. దాని ప్రకారం నేను నా భార్య నుండి కూడా వేరై పోవాలి. "అయితే నేను తలాఖ్ ఇచ్చివేయాలా" అని అడిగాను.

"అవసరంలేదు, వేరుగా ఉండాలి. అంతే" అని చెప్పివెళ్ళిపోయాడు. దాని ప్రకారం నేను నా భార్యను పుట్టింటికి పంపేశాను. ఆమెతో నేను "ఇప్పుడు నీవు కూడా దేవుని తీర్పు వచ్చే వరకు వేచి ఉండు" అన్నాను.

యాభయవ రోజు నేను ఫజ్ర్ నమాజ్ తరువాత విసుగెత్తిన ప్రాణంతో అత్యంత నైరాశ్యంతో విచారంతో నా ఇంటికప్పు మీద కూర్చుని ఉన్నాను. అకస్మాత్తుగా ఎవరో నన్ను పిలిచి "కాబ్! నీకు శుభం కలుగుగాక!!" అని అన్నారు, అది వినగానే నాకు అర్థమయిపోయింది. వెంటనే నేను నా దేవుని సన్నిధిలో సజ్దాలో పడిపోయాను.

ఇక ప్రజావెల్లువ పొంగి గుంపులు గుంపులుగా నా వద్దకు శుభాకాంక్షలు తెలుపడానికి రావడం ప్రారంభించింది. నేను లేచి తిన్నగా ప్రవక్త (సఅసం) వద్దకు మస్జిద్‌కు వెళ్ళాను. అప్పుడు మహాప్రవక్త (సఅసం) ముఖారవిందం ఆనందంతో ప్రకాశించిపోవడం నేను కళ్ళారా చూశాను, నేను ముందు వెళ్ళి మహాప్రవక్త (సఅసం)కు సలామ్ చేయగానే "కాబ్! నీకు శుభం. ఇది నీ జీవితంలో మహాపర్వదినం" అన్నారు ఆయన. నేను 'హుజూర్! ఈ క్షమాపణ మీ పక్షాన లభించిందా లేక దైవం పక్షానా?' అని అడిగాను. ఆయన 'దైవం పక్షంగానే' అని చెప్పి తౌబా సూరా ఆయత్‌లను చదివి వినిపించారు.

5. క్షమాపణ వేడుకోవడంలో ఎప్పుడూ జాప్యం చేయకూడదు. జీవితం గురించి ఎప్పుడు ఏమిజరుగుతుందో, ఆచరణ అవకాశం ఎప్పుడు అంతమయి పోతుందో ఎవరికీ తెలియదు. రాబోయే క్షణం మనుగడదో లేక మృత్యువుదో తెలియదు. ఎల్లప్పుడూ పరలోకంలో మనకు కలగబోయే పరిణామాలను జ్ఞప్తి చేసుకుంటూ ఉండాలి. క్షమాపణ, పశ్చాత్తాపాల ద్వారా హృదయం, ఆత్మ, మేథ, నోళ్ళను ప్రక్షాళనం చేసుకుంటూ ఉండాలి.

మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు: "పగలు ఏ వ్యక్తి అయినాపాపం చేసివుంటే అతడు రాత్రివేళ దేవుని వైపునకు మరలుతాడని దేవుడు రాత్రివేళ తన చెయ్యిచాపుతాడు. రాత్రి ఎవరయినా పాపం చేసివుంటే అతడు పగలు తన ప్రభువు వైపునకు మరలి తన పాపాలకు క్షమాపణ వేడుకొంటాడని దేవుడు పగలు తన చెయ్యి చాపుతాడు. ఇలా చివరకు సూర్యుడు పశ్చిమాన ఉదయించే వరకూ జరుగుతూ ఉంటుంది" (ముస్లిమ్)

దేవుడు చెయ్యిచాపడం అంటే ఆయన తన పాపులైన దాసుల్ని తన వైపునకు పిలుస్తున్నాడని, తన కరుణాకటాక్షాలతో అతని పాపాలను కప్పి వేయాలని కోరుతున్నాడని అర్థం. దాసుడు ఒకవేళ తాత్కాలిక ఉద్రేకానికి లోనయి ఏదయినా పాపం చేస్తే తక్షణమే అతడు కరుణామయుడు, అమితదయగలవాడు అయిన దేవుని వైపునకు పరుగెత్తి వేడుకోవాలి. అందులో ఏమాత్రం ఆలస్యం చేసినా పాపం మీద పాపం పెరుగుతూపోతుంది. షైతాన్ అనుక్షణం మానవుని కోసం పొంచి ఉండే శత్రువు, వాడు అతణ్ణి మార్గభ్రష్టుణ్ణి చేసే ప్రయత్నంలో ఒక్కక్షణం కూడా అజాగ్రత్తగా ఉండడు.

6. నిండు మనస్సుతో, చిత్తశుద్ధితో మీ జీవిత దిశనే మార్చి వేసేలా తౌబా చేసి క్షమాపణ వేడుకోవాలి. తౌబా తర్వాత మీరు మరో మనిషిలా కనపడాలి.

ఖుర్‌ఆన్‌లో దేవుని ఆజ్ఞ: "విశ్వాసులారా! మీరు దేవుని సన్నిధిలో నిజమయిన, స్వచ్ఛమైన తౌబాచేసి క్షమాపణ వేడుకోండి. ఆ విధంగా మీ ప్రభువు మీ పాపాలను మీకు దూరం చేసి మిమ్మల్ని అడుగున కాలువలు ప్రవహించే ఉద్యానవనాల్లో ప్రవేశింప జేస్తాడని ఆశించవచ్చు. ఆ దినం దైవం తన ప్రవక్తను, ఆయనతో పాటు విశ్వసించిన వారినీ అవమానపరచడు." *(అత్తహరీమ్:8)*

అంటే మనోమస్తిష్కాలలో పాపం వైపునకు మొగ్గే ఆలోచన ఏమాత్రంరాని విధంగా తౌబా చేయాలి. అటువంటి తౌబాలో నాలుగు అంశాలున్నాయి. ఒకవేళ పాపం దైవ హక్కులకు సంబంధించినదయితే అలాంటి తౌబాలో మూడు అంశాలున్నాయి.

1. మనిషి వాస్తవికంగా తన పాపాలను తలచుకొని సిగ్గుపడాలి.

2. ఇకముందు పాపాలకు దూరంగా ఉండడానికి దృఢసంకల్పం చేసుకోవాలి.

3. తన జీవితాన్ని సంస్కరించుకోడానికి, సరిదిద్దుకోడానికి నిరంతరకృషిలో నిమగ్నమయిపోవాలి. ఒక వేళ ఇతర మానవుని హక్కును హరించివేస్తే క్షమాపణలో ఉన్న నాలుగవ అంశం ఏమంటే-

4. ఆ వ్యక్తి హక్కును అతనికి తిరిగి అప్పచెప్పాలి. లేదా అతనిచేత మాఫీ చేయించుకోవాలి.

ఇటువంటి తౌబా ద్వారానే వాస్తవానికి మానవుడు పాపాలనుంచి బయటపడి, పరిశుద్ధుడవుతాడు. అతని ఒక్కొక్కపాపం అతని ఆత్మనుండి దూరమవుతుంది. అతడు సత్క్రియల ద్వారా సంస్కరించబడిన జీవితంతో దేవుని సమ్ముఖానికి చేరుకుంటాడు. దేవుడు అతనికి తన స్వర్గంలో ఆశ్రయం కల్పిస్తాడు.

మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు:

☆ దాసుడు ఏదయినా పాపం చేసినప్పుడు అతని హృదయంలో ఒకనల్లని మచ్చ ఏర్పడుతుంది.

అప్పుడు ఒకవేళ అతడు

☆ పాపాల జోలికి పోకుండా ఉంటే, పాపభావంతో పశ్చాత్తాపపడి దేవుని మన్నింపును కోరుకుంటే

☆ దేవుని వైపునకు మరలి పాపాలకు దూరంగా ఉండడానికి కృత నిశ్చయం చేసుకుంటే

దేవుడు అతని హృదయాన్ని ప్రకాశింపజేస్తాడు, అలాకాకుండా అతను మళ్ళీ పాపానికి పాల్పడితే ఆ నల్లని మచ్చ మరింత అధికం అవుతుంది. చివరకు అది పూర్తిగా హృదయాన్ని ఆక్రమించుకొంటుంది, ఈ త్రుప్పునే దైవం తన దివ్యగ్రంథంలో ఇలా ప్రస్తావించాడు:

"ముమ్మాటికీ కాదు. అసలు విషయం ఏమంటే, వారి హృదయాలపై వారి దుష్కార్యాల త్రుప్పు పేరుకొని పోయింది."

7. పశ్చాత్తాపం చెందిన తర్వాత దానిపై స్థిరంగా ఉంటానని దృఢసంకల్పం చేసుకోవాలి. దైవానికిచ్చిన మాటకు వ్యతిరేకంగా ఎలాంటి పని జరగకూడదనే విషయాన్ని అనుక్షణం గుర్తుంచుకోవాలి. పవిత్రత, సంస్కరణల విషయంలో మీలో రోజు రోజుకు కలుగుతున్న మార్పును బట్టి మీ సంకల్పబలాన్ని అంచనా వేసుకుంటూ వుండాలి, ఒకవేళ అన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ కాలుజారి మళ్ళీ ఏదయినా తప్పు (పాపం) జరిగితే, అప్పటికీ ఎలాంటి నిరాశకూ లోనుకాకూడదు. మళ్ళీ దైవాన్ని శరణుజొచ్చి ఆయన అనుగ్రహం కోసం యత్నించాలి. దైవ సన్నిధిలో విలపిస్తూ, "ప్రభూ! నేను చాలా బలహీనుణ్ణి, నన్ను కరుణించు, నన్ను అవమానకరంగా నీ గడప నుండి నెట్టి వేయకు. నీ గడప తప్ప శరణుపొందడానికి నాకు మరో గడప (మార్గం) లేదు." అని మొరపెట్టుకోవాలి.

హజ్రత్ షేఖ్ సఅది (రహ్మాలై) ఇలా అన్నారు, "ప్రభూ! ధనం వల్లనే నేను అవమానం పాలయ్యాను. నీదరి తప్ప నాకు మరో దిక్కులేదు."

హజ్రత్ అబూసయీద్ అబుల్ ఖైర్ (రహ్మాలై) కూడా ఈ విషయాన్ని ఒక కవితలో ఇలా వర్ణించారు.

"మరలిరా దేవుని వైపునకు, మరలిరా, నీవు ఏమయినా, ఎలా అయిపోయినా

(ఫర్వాలేదు) దేవుని వైపునకు మరలిరా. చివరికి నీవు అవిశ్వాసివయినా, అగ్ని పూజారివయినా, విగ్రహారాధకుడివయినా సరే, దేవుని వైపునకు మరలిరా, మా ఈ దర్బారు నిరాశానిస్పృహల దర్బారుకాదు, ఒకవేళ నీవు వందసార్లు పశ్చాత్తాపం చెంది తౌబా చేసి దాన్ని భంగం చేసినా సరే, (మావైపునకు) మరలిరా."

దైవానికి, అన్ని ఇతర విషయాలకన్నా తన దాసుడు చేసిన తౌబా వల్లనే ఎక్కువ సంతోషం కలుగుతుంది. తౌబా అంటేనే మరలిరావడం. దాసుడు ఏదయినా ఉద్రేకం వల్ల అపమార్గంలోపడి పాపపంకిలంలో కూరుకుపోతే అతను దైవాన్ని మరచిపోతాడు. దైవం నుండి తప్పిపోయినవాడిలా అతను ఎంతో దూరంపోయిపడతాడు. అయితే మళ్ళీ అతను తిరిగొచ్చి సిగ్గుతో దేవుని వైపునకు మరలితే, దేవునికి తన తప్పిపోయిన దాసుడు తిరిగి లభ్యమయినట్లే. ఈ పరిస్థితినే అంతిమ దైవ సందేశహరుడు (సఅసం) ఎంతో ఉదాత్తమయిన ఉపమానం ద్వారా ఇలా వివరించారు:

"మీలో ఎవరి ఒంటె అయినా నీళ్ళు, పచ్చికా లభించని ఎడారిలో తప్పిపోయిందనుకోండి. అతని అన్నపానీయాల సరంజామా కూడా ఆ తప్పిపోయిన ఒంటె మీదే వుందనుకోండి. అతను తన ఒంటె కోసం ఆ భయంకర నిర్జన ఎడారి ప్రాంతంలో నలువైపులా గాలించి నిరాశ చెందుతాడు. చివరికి జీవితం మీదే విరక్తి కలిగి ఒక చెట్టుకిందకు పోయి చావు కోసం నిరీక్షిస్తూ పడుకుంటాడు. సరిగ్గా అదే పరిస్థితిలో తన సామగ్రి అంతటినీ వీపుమీద మోస్తున్న తన ఒంటె (అకస్మాత్తుగా) తన దగ్గరికి వచ్చి నిలబడివుండటం కనిపించిందనుకోండి. ఇక అతను ఆనందంతో ఎంత పొంగిపోతాడో ఆలోచించండి. అలాగే మీలో ఎవరయినా దారి తప్పి మళ్ళీ దారికి వచ్చి, అపమార్గం తర్వాత తిరిగి విధేయతా వైఖరిని అవలంబించినప్పుడు మీ ప్రభువు అంతకన్నా అత్యధికంగా సంతోషిస్తాడు." (తిర్మిజి)

మరొక సందర్భంలో మహాప్రవక్త (సఅసం) ఈ యదార్థాన్ని అత్యంత ప్రభావవంతమైన వేరొక ఉపమానం ద్వారా ఇలా వివరించారు.

"ఒకసారి కొందరు యుద్ధఖైదీలు బందీలయి వచ్చారు. వారిలో ఒక స్త్రీ కూడావుంది. పాలుత్రాగే ఆమె పసిబిడ్డ ఆమె నుండి తప్పిపోయ్యాడు. ఆమె అమితమయిన మాతృమమకారంతో ఏ పిల్లవాడు కనబడినా తన హృదయానికి హత్తుకొని పాలు త్రాగిస్తూవుండేది. ఆ స్త్రీ పరిస్థితిని చూసి దైవప్రవక్త (సఅసం) సహాబా(రజి)లను ఇలా అడిగారు "ఈ తల్లి తన పిల్లవాణ్ణి స్వయంగా తన చేజేతులా అగ్నిలో పడవేస్తుందని మీరు నమ్ముతారా?". సహాబా (రజి)లు,

"దైవప్రవక్తా! స్వయంగా తన చేతులారా పడవేయడం సంగతి అలావుంచి ఆ పసివాడు పడిపోతుంటే ఈమె తన ప్రాణాన్ని ఒడ్డి మరీ వాణ్ణి రక్షిస్తుంది." అని బదులిచ్చారు.

దానికి ప్రవక్త (సఅసం) ఇలా అన్నారుః

"ఈ తల్లికి తన బిడ్డపైన ఎంత వాత్సల్యం, కారుణ్యం వుందో, దేవుడు తన దాసులపట్ల అంతకంటే ఎన్నోరెట్లు దయ, జాలి కలవాడు."

8. విడవకుండా తౌబా చేస్తూ దేవుణ్ణి క్షమాపణ వేడుకొంటూనే వుండాలి. ఉదయం నుండి సాయంత్రం వరకు మానవుని వల్ల ఎన్ని తప్పులు జరుగుతాయో తెలీదు. కొన్ని సమయాల్లో స్వయంగా మానవునికి వాటి స్పృహ కూడా వుండదు. ఘోరమయిన పాపం చేస్తూనే తౌబా చేస్తే క్షమాపణ వేడుకునే అవసరం వుంటుందని అనుకోరాదు. మానవునికి ఎప్పుడూ క్షమాపణ అవసరమే. అడుగడునా అతని వల్ల తప్పులు జరుగుతూనే వుంటాయి.

స్వయంగా మహాప్రవక్త (సఅసం) రోజుకు డెబ్భయ్యేసి సార్లు, ఒక్కోసారి వందేసి సార్లు కూడా క్షమాపణ వేడుకుంటుండేవారు. (బుఖారి, ముస్లిమ్)

9. పాపం చేసి, క్షమాపణ వేడుకొని తన జీవితాన్ని సంస్కరించుకున్న వాణ్ణి ఎప్పుడూ చిన్నచూపు చూడరాదు. హజ్రత్ ఇమ్రాన్ బిన్ అల్ హుసైన్ (రజి) మహాప్రవక్త (సఅసం) జీవిత కాలంలోని ఒక సంఘటనను వివరిస్తూ ఇలా అన్నారు.

"జుహైనా తెగకు చెందిన ఒక స్త్రీ చెడు పని చేయడం వల్ల గర్భవతి అయింది. ఆమె ప్రవక్త (సఅసం) సన్నిధికి వచ్చి "దైవ ప్రవక్తా! నేను వ్యభిచారశిక్షకు పాత్రురాలినయ్యాను. ఇస్లామ్ శాసనాన్ని అమలు పరచి నన్ను శిక్షించండి." అంది. మహాప్రవక్త (సఅసం) ఆమె సంరక్షకుణ్ణి పిలిపించి, నీవు ఈమెపట్ల సత్ప్రవర్తనతో మెలుగుతూవుండు. ఆమెకు బిడ్డపుట్టిన తర్వాత ఆమెను నా వద్దకు తీసుకురా అని పురమాయించారు. అలాగే శిశువు జన్మించిన తరువాత ఆ స్త్రీ వచ్చింది. అప్పుడు దైవ ప్రవక్త (సఅసం) "ఆమె వస్త్రాలను ఆమె శరీరానికి కట్టివేయండి (రాళ్ళు రువ్వి శిక్షించే సమయంలో బట్టలు ఊడిపోయి ఆమె వివస్త్రకాకుండా). ఆ తర్వాత రాళ్ళు రువ్వే శిక్షను అమలు చేయమని (అనుచరులను) ఆదేశించారు. అలాగే ఆమెను శిక్షించడం జరిగింది. తర్వాత మహాప్రవక్త (సఅసం) ఆమె జనాజా నమాజు చేశారు.

"అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) 'దైవ ప్రవక్తా! ఆమె చెడ్డపని చేసింది కదా! అలాంటి స్త్రీకి మీరు జనాజా నమాజు చేస్తున్నారా!" అని అడిగారు. అందుకు ప్రవక్త

(సఅసం) ఆమె చేసిన తౌబాను మదీనాలోని డెబ్బయి మంది వ్యక్తులకు పంచినా అదే వారి మోక్షానికి సరిపోతుంది. తన ప్రాణాన్ని దేవుని సమ్ముఖంలో సమర్పించిన ఆమె కంటే ఉత్తమ వ్యక్తిని ఎవరినయినా చూశావా?" అని అన్నారు.

10. సయ్యిదుల్ ఇస్తిగ్‌ఫార్ (క్షమాపణా అర్థింపుల్లో మేటి అయినది) అలవరచుకోండి. మహాప్రవక్త (సఅసం) షద్దా బిన్ అవస్ (రజి)కు ఇదే సయ్యిదుల్ ఇస్తిగ్‌ఫార్ (క్షమాపణకై ఉత్తమ దుఆ) అని తెలిపారు.

اَللّٰهُمَّ اَنْتَ رَبِّيْ لَاۤ اِلٰهَ اِلَّاۤ اَنْتَ خَلَقْتَنِيْ وَاَنَا عَبْدُكَ وَاَنَا عَلٰى

عَهْدِكَ .وَوَعْدِكَ مَا اسْتَطَعْتُ اَعُوْذُ بِكَ مِنْ شَرِّ مَا صَنَعْتُ

اَبُوْٓءُ لَكَ بِنِعْمَتِكَ عَلَيَّ وَاَبُوْٓءُ بِذَنْبِيْ فَاغْفِرْلِيْ فَاِنَّهٗ لَا يَغْفِرُ

الذُّنُوْبَ اِلَّاۤ اَنْتَ (بخاری، ترمذی)

అల్లాహుమ్మ అన్త రబ్బీ లా ఇలాహ ఇల్లా అన్తఖలక్‌తనీ వఅనా అబ్దుక వఅనా అలా అహదిక, వవ' దిక, మస్తత'తు అఊజుబిక మిన్ షరిమా సన'తు అబూఉలక బిని'మతిక అలయ్య వ అబూఉ బిజన్బీ ఫగ్‌ఫిర్ లీ ఫఇన్నహూ లా ఎగ్‌ఫిరుజ్జునూబ ఇల్లాఅన్త (బుఖారి,తిర్మిజి)

"దేవా, నీవే నా ప్రభువువి. నీవు తప్ప మరొక ఆరాధ్యదైవం లేడు. నీవు నన్ను పుట్టించావు. నేను నీ దాసుణ్ణి, నేను నీ దాస్యాన్ని గురించి నీ పట్ల విధేయతను గురించి చేసిన వాగ్దానంపై నా శక్తి కొలదీ నిలకడ చూపుతాను. నా వల్ల ఏ పాపం జరిగినా, దాని దుష్ఫలితాల నుండి తప్పించుకోడానికి నీ శరణుకోరుతున్నాను. నీవు నాకు ఏయే వరాలు ప్రసాదించావో వాటిని గురించి నేను నీ ముందు ఒప్పుకుంటున్నాను. నా పాపాన్ని కూడా ఒప్పుకుంటున్నాను. ప్రభూ! నా అపరాధాన్ని మన్నించు, నీవు తప్ప నా పాపాల్ని ఇంకెవరు మన్నించగలరు?"

# 2. దుఆ మర్యాదలు

1. దుఆ (అర్థింపు)ఎల్లప్పుడూ దైవంతోనే చేయాలి. ఆయన్ని తప్ప ఇతరుల్ని అవసరాలు నెరవేర్చే నిమిత్తం వేడుకోరాదు. దుఆ అనేది ఆరాధనా సారం. ఆరాధనకు అర్హుడు దేవుడు మాత్రమే. పవిత్ర ఖుర్‌ఆన్ ఇలా ఉపదేశిస్తుంది:

"ఆయన (అల్లాహ్)కే మొరపెట్టుకోవడం ధర్మం. ఆయన్ని విడిచి ఈ ప్రజలు వేటికి మొరపెట్టుకుంటున్నారో అవి వారి మొరల (దుఆల)కు ఎలాంటి సమాధానం ఇవ్వజాలవు. వ్యక్తి తన రెండు చేతులూ నీళ్ళ వైపునకు చాపి (దూరాన్నుంచే) ఆ నీళ్ళు తన నోటిలోనికి వచ్చిపడాలని కోరినట్లుంది, వాటికి మొరపెట్టుకోవడం. నిజానికి ఆ నీళ్ళు అతనిదాకా ఎన్నటికీ చేరలేవు. అదే విధంగా అవిశ్వాసుల మొరలు (దుఆలు) ఎలాంటి ఫలితాన్నీ ఇవ్వకుండా వృథా అవుతున్నాయి." *(అర్రాద్ : 14)*

అంటే, అవసరాలు తీర్చే, పనులు నెరవేర్చే సర్వాధికారాలూ దేవుని అధీనంలోనే వున్నాయి. ఆయనకు తప్ప ఇంకెవరికీ ఎలాంటి అధికారాలూ లేవు. అందరూ ఆయనపైన ఆధారపడి వున్నవారే. ఆయన తప్ప దాసుల మొరల్ని ఆలకించేవాడు, వాటికి సమాధానం ఇచ్చేవాడు ఇంకెవ్వరూ లేరు.

"మానవులారా! మీరంతా అల్లాహ్ సమక్షంలో అగత్యపరులే, అల్లాహ్ ఒక్కడే నిరపేక్షాపరుడు. అక్కరలేనివాడు, ఉత్తమ గుణగణాలవాడు." *(అల్‌ఫాతిర్ : 15)*

దేవుడు ఇలా ఉపదేశించినట్లు మహాప్రవక్త (సఅసం) ప్రవచించారు:

"నా దాసులారా! దౌర్జన్యం చెయ్యడాన్ని నేను నిషేధిస్తున్నాను. అలాగే మీరు ఒకరిపైన మరొకరు హింసా దౌర్జన్యాలు చెయ్యడాన్ని అధర్మంగా భావించండి. నా దాసులారా! నేను మార్గం చూపిన వారు తప్ప మీలో ప్రతి ఒక్కడూ మార్గహీనుడే. అందువల్ల మీరు నా మార్గదర్శనాన్నే కోరండి, నేను మీకు మార్గం చూపుతాను. నా దాసులారా! నేను ఆహారం ప్రసాదించిన వాడు తప్ప మీలో ప్రతి ఒక్కడూ ఆకలిగొన్నవాడే. కనుక మీ ఉపాధి కొరకు నన్నే వేడుకోండి. మీకు నేను ఉపాధి నిస్తాను. నా దాసులారా నేను వస్త్రాలు ప్రసాదించిన వాడు తప్ప మీలో ప్రతి ఒక్కడూ వస్త్రవిహీనుడే. కాబట్టి మీరు బట్టలకోసం నన్ను వేడుకోండి, నేను మీకు (బట్టలు) ధరింపజేస్తాను. నా దాసులారా! మీరు రాత్రి వేళ పాపాలు చేస్తారు, పగటి వేళా పాపాలు చేస్తారు, నేను సమస్త పాపాలను క్షమిస్తాను, కనుక క్షమాపణ కోసం నన్నే వేడుకోండి." (ముస్లిమ్)

మహాప్రవక్త (సఅసం) మరొక సందర్భంలో ఇలా ప్రవచించారు:

"మనిషి తన అవసరాలన్నింటి కోసం దైవాన్నే అర్థించాలి. చివరికి చెప్పువారు తెగిపోయినా సరే దైవాన్నే వేడుకోవాలి. ఉప్పు కావలసి వస్తే దాని కొరకు కూడా ఆయన్నే అర్థించాలి." (తిర్మిజి)

దీనిని బట్టి మనిషికి ఎలాంటి అవసరం కలిగినా అది ఎంత చిన్నదైనా దానికై దైవాన్నే వేడుకోవాలని తెలుస్తోంది. ఆయన తప్ప మానవుని మొర ఆలకించేవాడుకాని, కోరికల్ని తీర్చేవారు కాని ఎవరూ లేరు.

2. ధర్మయుక్తమయిన, పరిశుద్ధమయిన వాటి కొరకే దైవాన్ని అర్థించాలి. అధర్మమైన కోరికల్ని పాపకార్యాలను ఆశించి దైవం ఎదుట చేతులు జాపడం కంటే ఘోర అపచారం, సిగ్గులేని విషయం మరొకటి ఉండదు. అధర్మమయిన, నిషిద్ధమయిన కోరికల పరిపుష్టి కోసం దైవాన్ని వేడుకోవడం అంటే ధర్మాన్ని ఎగతాళి చెయ్యడమే అవుతుంది. అదే విధంగా, దైవం ఆదిలోనే నిర్ణయించిన ఎలాంటి మార్పుకు వీలులేని విషయాల కోసం కూడా దుఆ చెయ్యరాదు. ఉదాహరణకు పొట్టివాడు పొడుగుకావాలని దుఆ చెయ్యడం, అతి పొడుగరి తన పొడుగు తగ్గించమని అర్థించడం, ఎన్నటికీ వృద్ధాప్యం రాకుండా నిత్యయవ్వనుడుగా ఉండాలన్న కోరికతో వేడుకోవడం మొదలయినవి.

దివ్యఖుర్‌ఆన్‌లో దైవం ఇలా ఆదేశిస్తున్నాడు:

"మీరు ప్రతి ఆరాధనలో మీ దిశను సరిగ్గా ఆయన వైపునే స్థిరపరచండి. ఆయన్నే పిలవండి, మీ ధర్మాన్ని ఆయన కొరకే ప్రత్యేకం చేసుకొని (మెలగండి)" (అల్‌ఆరాఫ్ : 29)

దైవ సన్నిధిలో తన అవసరాలను గురించి వేడుకునే వ్యక్తి అవిధేయతా మార్గంలో నడుస్తూ, ధర్మయుక్తం కాని కోరికల కోసం వేడుకోరాదు. సద్వర్తనను, పవిత్ర భావాలను సమర్పించి ఉత్తమమైన కోరికల గురించి మాత్రమే దైవ సన్నిధిలో నివేదించుకోవాలి.

3. దుఆ ఎంతో చిత్తశుద్ధితో, పవిత్ర సంకల్పంతో చెయ్యాలి. దేవునికి మన పరిస్థితుల్ని గురించి పూర్తిగా తెలుసని, ఆయన మన పట్ల అమిత దయగలవాడని, అసలు ఆయనే తన దాసుల మొరల్ని ఆలకించేవాడని, వాటిని స్వీకరించే వాడని, దృఢంగా నమ్ముతూ దుఆ చెయ్యాలి. ఇతరులు చూడటం కోసమని, ప్రదర్శన కోసమని దుఆ చెయ్యరాదు. షిర్క్ (బహుదైవారాధన)కు చెందిన ఏ విషయానికి తావీయకుండా దుఆ చెయ్యాలి.

దేవుడు ఇలా ఆదేశిస్తున్నాడు:

"కనుక, దైవాన్ని అర్థించండి, మీ విధేయతాభావాన్ని ఆయనకే ప్రత్యేకం చేస్తూ" (అల్ మోమిన్)

"ఓ ప్రవక్తా, నా దాసులు నా గురించి నిన్ను అడిగితే, నేను వారికి అత్యంత సమీపంలోనే వున్నానని, పిలిచేవాడు నన్ను పిలిచినప్పుడు నేను అతని ప్రార్థనను స్వీకరిస్తానని, వారికి తెలుపు. కనుక వారు నా సందేశాన్ని స్వీకరించాలి. నా పట్ల విశ్వాసం కలిగివుండాలి, రుజుమార్గాన నడిచేందుకు". *(అల్ బఖర : 186)*

4. మనస్సును పూర్తిగా లగ్నంచేసి ఎంతో శ్రద్ధాభక్తులతో దుఆ చేయాలి. దైవం ఎప్పుడూ మేలు చేస్తాడనే ఆశించాలి. మీ దృష్టిని, మీరు చేసిన పాపాలరాశిపై కాకుండా అమితమయిన దైవ కారుణ్యంపైనా, ఆయన అసాధారణ క్షమాగుణంపైనా కేంద్రీకరించాలి. అన్యమనస్కుడై, నిర్లక్ష్యంతో, యాంత్రికంగా కేవలం మాటల్ని వల్లించడానికి చేసే దుఆ అసలు దుఆయే కాదు. అలాగే దైవ క్షమ ఎడల భరోసా లేనివారు చేసే దుఆ కూడా నిజమయిన దుఆ అనిపించుకోదు.

"మీ దుఆ స్వీకరించబడుతుందని ఆశిస్తూ (మనసులగ్నం చేసి) దుఆ చేయండి. నిర్లక్ష్యంగా పరధ్యానంతో చేసే దుఆ స్వీకరించబడదు." (తిర్మిజి)

5. ఎంతో భయభక్తులతో, వినయవినమ్రతతో (దైవ) దాస్యభావంతో దుఆ చేయాలి. భయభక్తులంటే - హృదయం అమితమయిన దైవ భీతితో ఆయన దర్పం, ఔన్నత్యాల ముందు కంపించిపోతూ అంతరంగంలో జనించిన ఈ స్థితి మన శరీరంపై కూడా బహిర్గతమయ్యే విధంగా దుఆ చేయాలన్న మాట. అంతేకాదు శిరస్సువంచి, చూపులు దించి, హీనస్వరంతో, అన్ని విధాలా మన అసహాయత వ్యక్తమయ్యేలా దుఆ చేయాలి.

ఒకసారి ఒక వ్యక్తి నమాజ్ చేస్తూ మధ్యమధ్యలో గడ్డంతో ఆడుకుంటుండగా మహాప్రవక్త (సఅసం) చూసి "ఇతని హృదయంలో భయభక్తులే గనక ఉంటే అవి అతని శరీరంపై కూడా బహిర్గతమయి ఉండేవి." అని అనుచరులతో అన్నారు.

"నేను కడు నిరుపేదను, దీనుణ్ణి, ఫకీర్ని. దురదృష్టవశాత్తు నేను నీ సన్నిధిని నోచుకోలేకపోతే నాకు మరో మార్గం లేదు. నా దగ్గర నా అన్నది ఏమీలేదు. నాకు లభించినదంతా దైవమే ప్రసాదించాడు. ఆయన తిరస్కరిస్తే నాకిక ఇవ్వగలవారెవరూ ప్రపంచంలో ఉండరు. దైవమే సమస్త వస్తువులకు నిజమయిన యజమాని. ఆయన దగ్గరే అన్ని రకాల నిక్షేపాలున్నాయి. దాసుడు కేవలం యాచకుడు. అగత్యపరుడు మాత్రమే." అన్న భావం దుఆ చేసేటప్పుడు మనిషి హృదయంలో జనించి తీరాలి.

"మీ ప్రభువును కడు వినమ్రంగా వేడుకోండి." అని దివ్యఖుర్‌ఆన్ బోధిస్తుంది. దాసుడు ప్రభువు సన్నిధిలో ఎంతోదీనంగా, నిర్భాగ్యుడిగా విలపిస్తూ వేడుకోవాలి. అతని మనోమస్తిష్కాలు, భావోద్రేకాలు, సమస్త అవయవాలు దైవసన్నిధిలో మోకరిల్లాలి. అతని అంతర్బాహ్యాలన్నింటా అతను దైవం ఎదుట చేసే విలాపం తొణికిసలాడాలి. ఇదే దైవ దాస్యంలో ఇమిడి ఉన్న ప్రత్యేకత.

6. దైవాన్ని చాటుమాటుగ తక్కువ స్వరంతో వేడుకోవాలి. దేవుని సన్నిధిలో విలపిస్తూ దుఆ చేయాలి. కాని ఈ విలాపాన్ని లోకుల ముందు ప్రదర్శించరాదు. దాసుని వినయం, విధేయత, ఫిర్యాదు కేవలం దేవుని ముందే వ్యక్తం కావాలి. కొన్ని సమయాల్లో దుఆ బిగ్గరగా కూడా చేయవచ్చు. అయితే ఏకాంతంలో అలా చేయాలి లేదా సామూహికంగా దుఆ చేస్తున్నప్పుడు బిగ్గరగా దుఆ చేయవచ్చు. అలా చేస్తే వినేవారు "ఆమీన్" అంటారు. సాధారణ సమయాల్లో మౌనంగా దుఆ చేసుకోవాలి. మన విలాపం, ఫిర్యాదులు ప్రజల ముందు ప్రదర్శించడం కోసం కాదనే విషయాన్ని గ్రహిస్తూ దుఆ చేయాలి.

"ప్రవక్తా! – లోలోన, వినయంతోనూ, భయపడుతూనూ, నోటితోనూ, మెల్లని శబ్దంతోనూ నీ ప్రభువును ఉదయం, సాయంత్రం స్మరించు. నీవు ఏమరుపాటులో మునిగి ఉన్నవారిలో చేరకు." *(అల్ ఆరాఫ్ : 205)*

హజ్రత్ జకరియా దాస్యస్థాయిని అభివర్ణిస్తూ దివ్యఖుర్‌ఆన్ ఇలా తెలుపుతోంది:

"అప్పుడు ఆయన తన ప్రభువును మెల్ల మెల్లగా పిలిచాడు." *(మర్యం : 3)*

7. దుఆ చేసే ముందు ఏదైనా ఒక పుణ్యకార్యం తప్పకుండా చేయడం మంచిది. ఉదాహరణకు దానధర్మాలు చేయడం, ఆకలితో ఉన్నవారికి భోజనం పెట్టడం, నఫిల్ నమాజ్ చేయడం రోజా పాటించడం వగైరా. దురదృష్టవశాత్తు ఏదయినా ఆపద వచ్చినప్పుడు చిత్తశుద్ధితో కేవలం దేవుని కొరకు ఆచరించిన మన సత్క్రియలను సాక్షిగా ఉంచి దుఆ చేసుకోవచ్చు. దివ్యఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది :

"పవిత్ర వచనాలు ఆయనకే అర్పితం అవుతాయి. పుణ్యకార్యాలు (చేసిన) వారికి ఉన్నత స్థానాన్ని ప్రాప్తింపచేస్తాయి." *(ఫాతిర్: 10)*

మహాప్రవక్త (సఅసం) ఒకసారి కటిక చీకటి రాత్రిలో ఒక గుహలో చిక్కుకుపోయిన ముగ్గురు అనుచరుల గాథను వినిపించారు. వారు ముగ్గురు చిత్తశుద్ధితో చేసిన తమ సత్క్రియలను సాక్షిగా ఉంచి దేవుణ్ణి వేడుకోగా దేవుడు వారి ఆపదను దూరం చేశాడు. ఆ సంఘటన ఇది :

ముగ్గురు మిత్రులు కలసి ఒకరాత్రి ఒక గుహలో తలదాచుకున్నారు. దైవవశాత్తు పర్వతంపై నుండి ఒక పెద్ద బండరాయి జారి గుహ ముఖద్వారానికి అడ్డంగా వచ్చిపడింది. గుహ మూసుకుపోయింది. అది చాలా పెద్ద రాతిబండ. ఆ బండను తొలగించే శక్తి వారికి లేదు. అప్పుడు వారు తమ తమ జీవితాలలో చేసుకున్న స్వచ్ఛమయిన పుణ్యకార్యాల్ని సాక్షిగా ఉంచి దేవుణ్ణి వేడుకోవాలని, దేవుడు అలాంటి దుఆ వింటే తమ ఆపద తొలగి పోగలదని పరస్పరం సంప్రదించుకున్నారు.

తరువాత అందులో ఒకతను ఇలా దుఆ చేశాడు.

"నేను అడవిలో మేకల్ని మేపేవాణ్ణి. అదే నా జీవనాధారం. అడవి నుండి, తిరిగిరాగానే ముందు వృద్ధులైన నా తల్లి దండ్రులకు, ఆ తర్వాత నా పిల్లలకూ పాలు త్రాగించే వాణ్ణి. ఒకరోజు నేను ఆలస్యంగా వచ్చాను. అప్పుడు నా వృద్ధ తల్లి దండ్రులు పడుకొని ఉన్నారు. పిల్లలు మెలుకువతోనే ఉన్నారు. అయితే ఆకలితో ఉన్నారు. పాలు తల్లి దండ్రుల కంటే ముందు పిల్లలకు త్రాగించడం నాకు ఇష్టంలేదు. అలా అని తల్లిదండ్రులకు నిద్రాభంగంచేసి వారికి కష్టం కల్గించడానికి కూడా నాకు మనస్కరించలేదు. అందువల్ల పాల పాత్రను పట్టుకొని రాత్రంతా వారి వద్ద నిలుచుని ఉండిపోయాను. పిల్లలు నా కాళ్ళు చుట్టుకుని ఏడుస్తున్నా సహిస్తూ, నేను మాత్రం ఉదయం వరకు అలాగే నిల్చుని ఉండిపోయాను.

"దేవా! నేను ఈ పనిని కేవలం నీ ప్రసన్నత కొరకే చేశాను. దాని శుభంతో గుహముఖం నుండి ఈ రాతిని తొలగించు." వెంటనే రాతి బండ కొంచెం తొలగింది. ఆకాశం కనబడసాగింది.

రెండవ వ్యక్తి ఇలా దుఆ చేశాడు.

"నేను కొందరు కూలీలతో పని చేయించుకుని అందరికీ కూలీ ఇచ్చి వేశాను. కాని ఒక వ్యక్తి తన కూలిని తీసుకోకుండా వెళ్ళిపోయాడు. కొన్ని రోజుల తరువాత అతడు తన కూలి తీసుకోడానికి వచ్చాడు. నేను అతనితో ఈ ఆవులు, మేకలు, సేవకులు అన్నీ నీవే, తీసుకువెళ్ళు అన్నాను. అతడు నాతో పరిహాసం చేయకు అన్నాడు. పరిహాసం కాదు, వాస్తవంగా ఇవన్నీ నీవే, నీవు వదలివెళ్ళిన డబ్బుని వ్యాపారంలో పెట్టాను, దేవుడు కరుణించాడు, వ్యాపారం బాగా సాగింది, నీవు చూస్తున్నదంతా దాని నుండి ప్రాప్తించినదే, నీవు సంతోషంగా వీటిని తీసుకెళ్ళు, ఇవన్నీ నీవే, అన్నాను. అతడు అన్నిటినీ తీసుకొని వెళ్లిపోయాడు."

"దేవా! ఇలా నేను కేవలం నీ ప్రీతి కోసం చేశాను, దేవా, దాని శుభంతో గుహముఖం నుండి ఈ రాతిని తొలగించు."

రాతిబండ ఇంకా కొంచెం తొలగింది, మూడవ వ్యక్తి ఇలా దుఆ చేశాడు.

"నా చిన్నాన్న కూతురు ఒకామె ఉండేది. ఆమెను నేను గాఢంగా ప్రేమించాను. ఆమె నన్ను కొంత డబ్బు అడిగింది. నేను డబ్బు ఇచ్చి వేశాను. కాని నా అవసరం తీర్చుకోడానికి నేనామె దగ్గరకు సమీపించగానే దేవునికి భయపడు, నీచమైన ఈ పనికి దూరంగా జరుగు" అంది ఆమె. నేను వెంటనే లేచిపోయాను, నేను ఆ డబ్బును కూడా ఆమెకే వదిలేశాను.

"దేవా! నీకు అంతా తెలుసు, నేను అలా కేవలం నీ ప్రీతి కోసం చేశాను. దేవా! దాని శుభంతో గుహముఖాన్నుండి ఈ రాతిని తొలగించు." దైవం గుహ ద్వారాన్నుండి ఆ బండను తొలగించాడు. ఆ ముగ్గురూ ఆ ఆపద నుండి బయట పడ్డారు.

8. ఉత్తమ లక్ష్యాలకై దుఆ చేయడంతో బాటు జీవితాన్ని దైవ మార్గదర్శనం ప్రకారం సంస్కరించుకొని, సరిదిద్దుకోడానికి కూడా ప్రయత్నించాలి, పాపాలను, నిషిద్ధ పదార్థాలు, కార్యాలను పూర్తిగా విసర్జించాలి. ప్రతి విషయంలోనూ దైవ మార్గాన్ని పాటించాలి. భయభక్తుల జీవితాన్ని గడపాలి. హరామ్ తిని త్రాగి, హరామ్‌నే ధరించి నిర్భయంగా హరామ్ సంపదతోనే తన శరీరాన్ని పోషిస్తూ దుఆ చేసేవాడు తన దుఆ స్వీకరించబడుతుందని ఆశించడం ఘోరమయిన అజ్ఞానం, పెంకితనం. దుఆ స్వీకరించబడాలంటే మనిషి మాటలు చేతల్లో కూడా దైవం హితవులకు అనుగుణంగా వుండడం అవసరం.

మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు.

"దేవుడు పవిత్రుడు. ఆయన పవిత్రమయిన సంపదనే స్వీకరిస్తాడు. ప్రవక్తలకు ఇచ్చిన ఆజ్ఞలనే దేవుడు విశ్వాసులకు కూడా ఇచ్చాడు. ప్రవక్తలను ఆయన ఇలా ఆజ్ఞాపించాడు. "ప్రవక్తలారా! పరిశుద్ధమైన ఆహారాన్ని భుజించండి, సత్ క్రియలను ఆచరించండి."

ఆయన విశ్వాసులకు ఇలా బోధించాడుః "విశ్వాసులారా! మేము మీకు ప్రసాదించిన పరిశుద్ధమయిన, ధర్మసమ్మతమయిన పదార్థాలనే భుజించండి."

మహా ప్రవక్త (సఅసం) ఒక వ్యక్తిని గురించి తెలిపారు, అతను చాలా దూరం ప్రయాణం చేసి పవిత్ర స్థలాన్ని చేరుకుంటాడు. అతడు దుమ్ము ధూళితో నిండివుంటాడు. తన రెండు చేతుల్ని ఆకాశం వైపునకు చాపి, "నా ప్రభూ! నా ప్రభూ! అంటాడు. అయితే అతడు తిన్న ఆహారపానీయాలు అధర్మమయినవి, అతని బట్టలూ అధర్మమైనవి, అధర్మ వస్తువులతోనే అతడి శరీరం పోషించబడింది,

అటువంటి (అవిధేయుడయిన) వ్యక్తి చేసే దుఆ ఎలా స్వీకరించబడుతుంది?"
(సహీ ముస్లిమ్)

9. దుఆ సతతం చేస్తూనే వుండాలి. దేవుని సమ్ముఖంలో మీ అసహాయతను, దాస్య భావాన్ని వ్యక్తం చేయడం కూడా ఆరాధనే. మీరు దుఆ చేసుకోవాలని దేవుడే ఆజ్ఞాపించాడు. "దాసుడు నన్ను పిలిచినప్పుడు నేను అతని విన్నపాన్ని వింటాను" అని ఆయన దివ్య ఖుర్‌ఆన్‌లో బోధించాడు.

దుఆ చేయడానికి విసుగుచెందనే కూడదు. దుఆ వల్ల అదృష్టం మారుతుందో, మారదో అన్న అనుమానం కలగకూడదు. అదృష్టం మారడం, మారకపోవడం దుఆ అంగీకరించబడడం, అంగీకరించబడకపోవడం అనేది పరిపూర్ణజ్ఞాని, అత్యంత వివేక సంపన్నుడయిన దేవుని అభీష్టంపైన ఆధారపడి వుంటాయి. ఒక ఫకీరుగా, అసహాయుడిగా ఎప్పుడూ దుఆ చేస్తూ వుండడమే దాసుని పని. ఒక్క క్షణం కూడా తాను అతీతుడినని అనుకోరాదు.

దైవ ప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు, "దుఆ చెయ్యడంలో వినమ్రుడయిన వాడే అందరికంటే గొప్ప వినమ్రుడు." (తిబ్రాని)

దైవ ప్రవక్త (సఅసం) ఈ విషయాన్ని కూడా బోధించారు:

"దేవుని వద్ద దుఆకు మించిన గౌరవప్రదమయిన విషయం మరొకటి లేదు." (తిర్మిజి)

విశ్వాసి గొప్పదనం ఇదే, అతడు సుఖదుఃఖాల్లో, కలిమిలేముల్లో ఆపదలో ఆనందాల్లో, అన్ని పరిస్థితుల్లోనూ దేవుణ్ణే వేడుకుంటాడు. ఆయన సమ్ముఖంలోనే తన అవసరాల్ని నివేదించుకుంటాడు. శుభ శ్రేయాల కోసం ఆయన్నే వేడుకుంటూ ఉంటాడు. ఇదే విశ్వాసి ప్రత్యేకత. మరో సందర్భంలో ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు.

"దైవాన్ని వేడుకోని వ్యక్తిపైన దైవం ఆగ్రహాన్ని చూపిస్తాడు." (తిర్మిజి)

10. దుఆ స్వీకరించబడే విషయంలో దేవునిపైన పూర్తిగా నమ్మకం కలిగి ఉండాలి. ఒకవేళ ప్రభావాలు త్వరగా కనిపించకపోతే నిరాశ చెంది దుఆ చేయడం వదలి వేయరాదు. దుఆ స్వీకరించబడుతుందో లేదో అన్న భావంతో ఆందోళన చెందకూడదు. దానికి బదులు దుఆ చేయడంపైనే శ్రద్ధవహించాలి.

ఈ విషయంలో హజ్రత్ ఉమర్ (రజిఅన్) ఇలా అన్నారు :

"దుఆ స్వీకరించబడుతుందా అన్న చింతలేదు నాకు. నేను దుఆ

చేయడం గురించే ఆలోచిస్తాను. నాకు దుఆ చేసే సద్బుద్ధి కలిగిందంటే అది అంగీకరింపబడటం కూడా జరిగిపోతుంది."

మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారుః

"విశ్వాసి దైవాన్ని ఏదయినా అర్థించడానికి మరలినప్పుడు దేవుడు అతని అభ్యర్థనను తప్పకుండా నెరవేరుస్తాడు. అంటే అతని కోరిక (ఇహలోకంలోనైనా) నెరవేరుతుంది. లేదా అతడు కోరిన వస్తువు పరలోకంలో భద్రపరచబడుతుంది. ప్రళయదినాన దేవుడు ఒక విశ్వాసిని తన సన్నిధికి రప్పిస్తాడు. అతనిని తన ముందు నిలబెట్టి అడుగుతాడు, 'నా దాసుడా! నేను దుఆ చేయమని నీకు ఆజ్ఞాపించాను, నేను నీ దుఆను అంగీకరిస్తానని కూడా మాట ఇచ్చాను. మరి దుఆ చేశావా?' ఆ దాసుడు, 'ప్రభూ! దుఆ చేశాను' అంటాడు. మళ్ళీ దేవుడు అడుగుతాడు, 'నీవు నా ఎదుట దుఆ కూడా చేశావు. నేను దాన్ని అంగీకరించాను. నేను నీ దుఃఖాన్ని దూరం చేయాలని ఫలానా రోజు దుఆ చేశావు కదూ? నేను ఆ దుఃఖాన్నుండి నిన్ను విముక్తి చేశానా?' దాసుడు అంటాడు, 'ఔను ప్రభూ! నిజమే,' మళ్ళీ దేవుడు అంటాడుః ఆ దుఆను మాత్రం నేను అంగీకరించి ప్రపంచంలోనే నీ కోరికను నెరవేర్చాను. తర్వాత ఫలానా రోజు మళ్ళీ నీవు మరో కష్టంతో బాధపడుతున్నప్పుడు, దేవా! ఈ ఆపద నుండి కాపాడమని దుఆ చేశావు, కానీ నీవు ఆ బాధ నుండి విముక్తి చెందలేదు. ఆ బాధను అనుభవించావు. అందుకు ఆ వ్యక్తి, 'నిజమే ప్రభూ!' అంటాడు. అప్పుడు దేవుడు ఆ దుఆ ప్రతిఫలంగా స్వర్గంలో నీ కొరకు రకరకాల వరాల్ని సమకూర్చి ఉంచాను, అలాగే దేవుడు ఇతర అవసరాల విషయంలో కూడా అడిగి తెలుసుకొని ఇదే విధంగా చెబుతాడు."

మహాప్రవక్త (సఅసం) మరొక హదీసులో ఇలా ప్రవచించారు.

"విశ్వాసి చేసిన ప్రతి దుఆ విషయంలో దేవుడు ఫలానా దుఆను నేను ప్రపంచంలో అంగీకరించాను, ఫలానా దుఆను నేను నీ పరలోక జీవితం కొరకు అట్టే పెట్టాను, అని చెప్పని దుఆ అంటూ వుండదు. ఆ సమయంలో విశ్వాసి, నేను చేసిన ఏ దుఆ కూడా ప్రపంచంలో అంగీకరించబడకుండా వుంటే ఎంత బాగుండేది. అని అనుకుంటాడు." అందుచేత దాసుడు సర్వావస్థల్లోనూ దుఆ చేసుకుంటూనే వుండాలి.

11. దుఆ చేసేటప్పుడు బాహ్యనియమాలయిన శుచి శుభ్రతలను కూడా పూర్తిగా పాటించాలి. అలాగే హృదయాన్ని, దుష్ట ఆలోచనలు, చెడునమ్మకాలు, పనికిమాలిన తలంపులు రాకుండా పవిత్రంగా ఉంచుకోవాలి.

"దైవానికి ప్రియులయిన దాసులు నిస్సందేహంగా అమితంగా తౌబా చేస్తారు. ఎంతో శుచీ శుభ్రతలు పాటిస్తారు" అని ఖుర్‌ఆన్ పేర్కొంటున్నది.

"నీ ప్రభువు ఆధిక్యతను స్తుతించు, నీ ఆత్మను పవిత్రంగా ఉంచుకో" అని కూడా "ముద్దస్సిర్" సూరాలో దేవుడు ఆదేశిస్తున్నాడు.

12. ఇతరులకోసం కూడా దుఆ చేస్తూ ఉండాలి. అయితే ముందు మన కోసం దుఆ చేసుకొని, ఆపై ఇతరుల కోసం దుఆ చేయాలి. దివ్యఖుర్‌ఆన్‌లో హజ్రత్ ఇబ్రాహీం(అలైహి), హజ్రత్ నూహ్(అలైహి) చేసిన దుఆలలో మనకు ఇదే విషయం తెలుస్తుంది.

"నా ప్రభూ! నన్ను నమాజ్‌ను స్థాపించేవాడుగా చెయ్యి. నా సంతతిలో కూడా (ఈ పని చేసే వాళ్ళను ప్రభవింపజెయ్యి) ప్రభూ! నా ప్రార్థనను స్వీకరించు. ప్రభూ! నన్నూ, నాతల్లి దండ్రుల్నీ, విశ్వసించే వారందర్నీ లెక్క ఖరారు అయ్యే రోజున క్షమించు" అని హజ్రత్ ఇబ్రాహీమ్ (అలైహి) దుఆ చేశారు. *(ఇబ్రాహీమ్: 40,41)*

"నా ప్రభూ! నన్ను మన్నించు, నా తల్లిదండ్రుల్ని, విశ్వసించి నా ఇంట ప్రవేశించిన విశ్వాసులను కూడా మన్నించు. ఇంకా, విశ్వసించిన స్త్రీ పురుష లందరినీ మన్నించు" అని హజ్రత్ నూహ్ (అలైహి) దుఆ చేశారు. *(నూహ్ : 28)*

మహాప్రవక్త(సఅసం) ఎవరినైనా ప్రస్తావిస్తే అప్పుడు ఆ వ్యక్తి కోసం దుఆ చేసేవారు; అయితే మొదట ఆ దుఆను తనతో ప్రారంభించేవారు అని హజ్రత్ ఉబై బిన్ కఅబ్ (రజి) ఉల్లేఖించారు. *(తిర్మిజి)*

13. ఒకవేళ మీరు ఇమామత్(నమాజ్ నాయకత్వం) చేస్తుంటే ఎల్లప్పుడూ సమగ్రమయిన దుఆలు చేయాలి. దుఆలో బహువచనాన్ని ప్రయోగించాలి. పవిత్ర ఖుర్‌ఆన్‌లో పేర్కొన్న దుఆలలో సాధారణంగా బహువచనాలు ప్రయోగించబడ్డాయి. 'ఇమామ్' ముఖ్తదీలందరికీ ప్రతినిధి. అతను బహువచన ప్రయోగంతో దుఆ చేస్తున్నప్పుడు ముఖ్తదీలు "ఆమీన్" అంటూ వుండాలి.

14 దుఆలో సంకుచిత దృష్టిని స్వార్థబుద్దిని చూపరాదు. దేవుని విస్తృత కారుణ్యాన్ని పరిమితమని భావించి ఆయన కరుణాకటాక్షాలను మన సొంతం చేసుకునే విధంగా దుఆ చేయరాదు.

హజ్రత్ అబూ హురైరా (రజి) ఇలా అన్నారు:

"మస్జిదె నబవీలో ఒక అనాగరికుడు (బదవి) వచ్చాడు. అతడు నమాజు

చేసుకొన్న తరువాత దుఆ చేస్తూ "దేవా! నాపైన, ముహమ్మద్ (సఅసం)పై నా దయ చూపు. మాపై తప్ప ఇంకెవరిపైనా దయ చూపకు" అన్నాడు.

అప్పుడు దైవ ప్రవక్త (సఅసం) నీవు దేవుని అపారకారుణ్యాన్ని పరిమితం చేశావు అన్నారు. (బుఖారి)

15. దుఆలో అనవసరమయిన పదాల గారడీ చేయడాన్ని మానుకోవాలి. మామూలు ధోరణిలో (విలపిస్తూ) దుఆ చేయాలి. రాగాలు తీయడాన్ని వదలివేయాలి. ఒకవేళ యెప్పుడయినా అప్రయత్నంగా నోటి నుండి భారీ పదాలు వెలువడితే ఫరవాలేదు. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) కూడా గంభీర పదజాలంతో కూడిన కొన్ని దుఆలు చేశారు. ఉదాహరణకు ఆయన (సఅసం)చేసిన అత్యంత భావగర్భితమయిన దుఆను హజ్రత్ జైద్ బిన్ అర్ఖమ్ (రజి) ఉల్లేఖించారు:

اَللّٰهُمَّ اِنِّيْ اَعُوْذُ بِكَ مِنْ قَلْبٍ لَّا يَخْشَعُ وَنَفْسٍ لَّا تَشْبَعُ
وَعِلْمٍ لَّا يَنْفَعُ، وَدَعْوَةٍ لَّا يُسْتَجَابُ لَهَا۔

అల్లాహుమ్మ ఇన్నీ అవూజుబిక మిన్ ఖల్బి(ల్లా యఖ్షవు వ నఫ్సి(ల్లా తష్బవు వ ఇల్మి(ల్లా యన్ఫవు వదవతి(ల్లా యస్తజాబులహా

"దేవా! భయభక్తులు లేని హృదయం, సహనంలేని మనస్సు, ప్రయోజనంలేని జ్ఞానం, స్వీకరించబడని దుఆ – వీటి నుండి నేను నీ శరణు వేడుకుంటున్నాను."

16. దేవుని సన్నిధిలో మీ అవసరాల్ని కోరికల్ని నివేదించుకునే ముందు ఆయనను స్తుతించాలి. రెండు రకాత్‌ల నఫిల్ నమాజ్ కూడా చేసుకోవాలి. దుఆ ప్రారంభంలోనూ, ఆఖరిలోనూ మహాప్రవక్త (సఅసం)పైన దురూద్ కూడా పఠించాలి.

మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు:

"దేవునితోగాని లేక తోటి మానవునితోగాని అవసరం వచ్చిన సందర్భం ఏర్పడితే అతడు మొదట వుజూ చేసి రెండు రకాత్‌లు నమాజ్ చేయాలి, తర్వాత దేవుణ్ణి స్తుతించాలి. ప్రవక్త (సఅసం)పై దురూద్, సలామ్ పఠించాలి. (ఆ తర్వాత దేవుని సన్నిధిలో తన అవసరాన్ని విన్నవించుకోవాలి)" (తిర్మిజి)

"దేవుని స్తుతితో ప్రవక్త ముహమ్మద్(సఅసం)పైన దురూద్‌తో సలామ్‌తో దాసుడు చేసే దుఆ దైవ సన్నిధిలో స్వీకరించబడుతుంది." అని ప్రవక్త (సఅసం) అన్నారు.

హజ్రత్ ఫజాల (రజి) ఇలా అన్నారు :

"మహాప్రవక్త (సఅసం) మస్జిద్‌లో కూర్చుని వున్నారు, అప్పుడు ఒక వ్యక్తి వచ్చి నమాజ్ చేశాడు. తర్వాత అతడు "దేవా! నన్ను కటాక్షించు" అన్నాడు. అది విని దైవ ప్రవక్త (సఅసం) అతనితో "నీవు వేడుకోవడంలో తొందరపడ్డావు. నమాజ్ చేసుకొన్న తరువాత మొదట దేవుని స్తోత్రం చేయాలి. తర్వాత దురూదె షరీఫ్ చదవాలి. ఆపై దుఆ చేసుకోవాలి" అని బోధించారు. అలా చెబుతూ వుండగానే ఇంకొక వ్యక్తి వచ్చాడు. అతడు నమాజ్ చేసుకున్నాక దేవుణ్ణి స్తుతించాడు. దురూదె షరీఫ్ చదివాడు. అప్పుడు ప్రవక్త (సఅసం) ఇప్పుడు దుఆ వేడుకో, దుఆ స్వీకరించబడుతుంది" అని అన్నారు. (తిర్మిజి)

17. దైవాన్ని అన్ని వేళలా వేడుకుంటూవుండాలి. ఎందుకంటే ఆయన తన దాసులు చేసే మొర వినడానికి ఎప్పుడూ సిద్ధంగా వుంటాడు. అయితే కొన్ని ప్రత్యేక సందర్భాలలో దేవుడు తన దాసులు చేసే దుఆలను వెంటనే స్వీకరిస్తాడని హదీసుల్లో వచ్చింది. అందువల్ల అలాంటి ప్రత్యేక వేళల్లో ప్రత్యేక దుఆలను తప్పకుండా చేయాలి.

1. రాత్రి వేళ నడిఝామూ తర్వాత (రాత్రి చివరి భాగంలో) ప్రజలు హాయిగా గాఢ నిద్రలో నిమగ్నులయి ఉంటారు. వాతావరణం ప్రశాంతంగా వుంటుంది. అటువంటి సమయంలో ఎవరయినా లేచి రహస్యంగా తన ప్రభువుతో సంభాషిస్తూ ఏమీ లేని ఫకీరులా మిక్కిలి వినయంతో ఆయన ముందు తన అవసరాలను గురించి మొరపెట్టుకుంటే అతనిపై దేవుని ప్రత్యేక అనుగ్రహం వర్షిస్తుంది.

ఈ సందర్భంలో మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు:

"దేవుడు ప్రతిరోజూ రాత్రివేళ ఈ ప్రపంచ ఆకాశంపైకి వస్తాడు. అలా వచ్చి రాత్రి చివరి భాగం సమీపించగానే-నాతో మొరపెట్టుకునే వారెవరు? నేను వారి దుఆలను స్వీకరిస్తాను, నన్ను అర్థించేవారెవరు? నేను వారికి ప్రసాదిస్తాను, నన్ను క్షమాపణ వేడుకునేదెవరు? నేను వారిని క్షమిస్తాను" అని అంటాడు. (తిర్మిజి)

2. లైలతుల్ ఖద్ర్ వేళ సాధ్యమయినంత ఎక్కువగా దుఆ చేయాలి. ఎందుకంటే ఈ రాత్రి వేయి నెలల కంటే యెక్కువ శ్రేష్ఠమయినది. ఆ రాత్రి ప్రత్యేకంగా ఈ క్రింది దుఆ చేయడం మంచిది.

اَللّٰهُمَّ اِنَّكَ عَفُوٌّ تُحِبُّ الْعَفْوَ فَاعْفُ عَنِّيْ

19

"అల్లాహుమ్మ ఇన్నక అఫువ్వున్ తుహిబ్బుల్ అఫ్వ ఫఅఫుఅన్ని"

దేవా! నీవు ఎక్కువగా క్షమించేవాడవు. క్షమించడాన్ని ఇష్టపడతావు. కనుక నన్ను క్షమించు. (తిర్మిజి)

3. జిల్‌హజ్ 9వ తేదీన అర్ఫాత్ మైదానంలో దైవఅతిథులు కూడినప్పుడు (తిర్మిజి)

4. శుక్రవారం జుమా ఖుత్బా ప్రారంభమైనప్పటి నుండి నమాజ్ ముగింపు వరకూ, అదే రోజు అస్ర్ నమాజ్ తర్వాత నుండి మగ్రిబ్ నమాజ్ వరకు.

5. అజాన్ వేళలో, జిహాద్ మైదానంలో ముజాహిద్‌లు పంక్తులుగా ఏర్పడుతున్నప్పుడు.

"రెండు విషయాలు దైవ సన్నిధిలో తిరస్కరించబడవు. ఒకటి అజాన్ వేళలో చేసే దుఆ. రెండు జిహాద్‌లో (వరుసలుతీరి నిల్చున్న వేళ చేసే దుఆ)" అని దైవ సందేశహరులు (సఅసం) అన్నారు. (అబూదావూద్)

6. అజాన్, తక్బీర్‌ల మధ్య విరామసమయంలో:

"అజాన్, ఇఖామత్‌ల మధ్య విరామంలో చేసిన దుఆ వృధాపోదు" అని దైవ సందేశహరులు (సఅసం) అన్నారు. దానిపై సహాబా (రజిఅన్) "దైవ ప్రవక్తా! ఆ విరామ సమయంలో ఏ దుఆ చేయాలి?" అని అడిగినప్పుడు మహాప్రవక్త (సఅసం) ఈ దుఆ చేయమని సెలవిచ్చారు.

اَللّٰهُمَّ اِنِّیْٓ اَسْأَلُكَ الْعَفْوَ وَالْعَافِيَةَ فِی الدُّنْيَا وَالْاٰخِرَةِ

"అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుకల్ అఫ్వ వల్ ఆఫియత ఫిద్దున్యా వల్ ఆఖిరహ్."

దేవా! నేను ఇహలోకంలోనూ, పరలోకంలోనూ దయ, క్షమ, శాంతి, శ్రేయస్సు, రక్షణలు ప్రసాదించమని నిన్ను అర్థిస్తున్నాను.

7. రమజాన్ శుభ దినాలలో, ప్రత్యేకించి ఇఫ్తార్ వేళలో (బజ్జార్)

8. ఫర్జ్ నమాజుల అనంతరం (తిర్మిజి)

ఒంటరిగా దుఆ చేసినా లేదా ఇమామ్‌తో పాటు దుఆ చేసినా

9. సజ్దా స్థితిలో

ఈ సందర్భంలో మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు :

"సజ్‌దా స్థితిలో దాసుడు తన ప్రభువుకు అత్యంత సమీపాన ఉంటాడు. అందువల్ల మీరు ఈ స్థితిలో ఎక్కువగా దుఆ చేస్తూ వుండండి."

10. అలివికాని ఆపదసమయంలో,ఎనలేని కష్టాలలో చిక్కుకున్నప్పుడు (హాకిమ్)

11. ఏవైనా ధార్మిక సమావేశాలు జరిగినప్పుడు (బుఖారి, ముస్లిమ్)

12. దివ్య ఖురాన్ పారాయణం ముగిసిన తరువాత. (తిబ్రాని)

18. దిగువ స్థానాలలోనూ దుఆ చేసే అలవాటు చేసుకోవాలి.

హజ్రత్ హసన్ బస్రి (రహ్మాలై) మక్కా నుంచి బస్రా బయలుదేరే ముందు ఆయన మక్కా ప్రజల పేరిట ఒక లేఖ రాశారు. అందులో ఆయన మక్కాలో వుండటంలోని ప్రాముఖ్యతను వివరిస్తూ మక్కాలోని ఈ క్రింది స్థలాల్లో చేసిన దుఆ ప్రత్యేకంగా అంగీకరించబడుతుందని కూడా విస్పష్టం చేశారు.

1. ముల్తజిం దగ్గర
2. మీజాబ్ క్రింద
3. కాబా లోపల.
4. జమ్‌జమ్ దగ్గర.
5. సఫా, మర్వా కొండల మీద
6. సఫా, మర్వాల మధ్య సయీా చేసే చోట
7. ముఖామె ఇబ్రాహీమ్ వెనుక.
8. అరఫాత్‌లో
9. ముజ్దల్ఫాలో
10. మినాలో
11. మూడు, "జమరాత్"ల వద్ద. (హిస్నెహిసీన్)

19. దేవుణ్ణి వేడుకోవడానికి పవిత్ర ఖుర్‌ఆన్‌లో ప్రవక్త ప్రవచనాలలో వున్న పదాలనే జ్ఞాపకం చేసుకునేందుకు ప్రయత్నించాలి. దేవుడు తన ప్రవక్తలకు పుణ్యపురుషులకు దుఆ వేడుకోడానికి బోధించిన పదాలు, పద్ధతులకంటే మంచివి మరొకరు ఎలా బోధించగలరు? దేవుడు బోధించిన, ప్రవక్తలు అనుసరించిన పదాలలోని ప్రభావం, వాటి మాధుర్యం, భావ సమగ్రత, శుభాలు ఇంకొకరి పదాలలో ఎలా సాధ్యం?

అలాగే మహాప్రవక్త (సఅసం) రాత్రింబవళ్ళు చేసిన దుఆలలోని ఆవేదన, మాధుర్యం, సమగ్రత, పరిపూర్ణ దాస్యభావంలో అనన్యమైనది. అలాంటి ఉత్తమ దుఆలకు మించిన దుఆలు వేరుగా లభ్యంకావు.

ఖుర్‌ఆన్, హదీసుల్లో సూచించబడిన దుఆలను మాటిమాటికి వల్లించడం వల్ల వాటి పదాలను, భావాలను యోచించడంవల్ల మానసిక, భావపరమైన శిక్షణ లభిస్తుంది. అంటే విశ్వాసి కోరికలు, అర్థింపులు ఎలా ఉండాలి, ఏ విషయాల్లో అతను తన శక్తి సామర్థ్యాలను వ్యయపరచాలి, అతని జీవిత లక్ష్యానికి కావలసిన విషయాలేమిటి వగైరా విషయాలకు సంబంధించిన శిక్షణ లభిస్తుందన్నమాట.

నిస్సంశయంగా దుఆకు భాష, శైలి, పదజాలాలతో ఎలాంటి నిమిత్తంలేదు. దాసుడు తన దైవాన్ని ఏ భాషలోనయినా, ఏ పదాల్లోనయినా వేడుకోవచ్చు. ఏది కోరుకోవాలనుకున్నా కోరుకోవచ్చు. కానీ మనకు దేవుడు ప్రసాదించిన అపారమైన అనుగ్రహం ఏమంటే - ఆయన తనను ఏది అడగాలి, ఎలా అడగాలి అనే విషయాలు కూడా బోధించాడు. ఇహపరాల సాఫల్యానికి విశ్వాసి ఎటువంటి దృక్పథం కలిగి ఉండాలో అతను తన హృదయంలో ఎలాంటి కోరికలకు, వాంఛలకు తావియ్యాలో దేవుడు విశదీకరించాడు. అంతే కాదు, దాసుని ఇహపరాల అవసరాలకు, శ్రేయస్సుకు సంబంధించిన ప్రతి అంశం దైవం నేర్పిన దుఆలలో ఉంది. కాబట్టి ఖుర్‌ఆన్‌లో, ప్రవక్త సంప్రదాయాలలో చూపిన పదాలనే ప్రయోగించి దుఆ చేయడం, ఖుర్‌ఆన్‌లో సూచించబడిన దుఆలను లేక మహాప్రవక్త (సఅసం) వివిధ సమయాల్లో చేసిన దుఆలనే మాటిమాటికీ పఠించడం మంచిది. ఒకవేళ ఖుర్‌ఆన్ హదీసుల్లోని దుఆలు కంఠస్థం చేయకపోతే అప్పటి వరకు కనీసం మన దుఆల్లో ఖుర్‌ఆన్, హదీసులు చూపించిన దుఆల భావాలయినా వ్యక్తం కావాలి.

రాబోయే అధ్యాయంలో పవిత్ర ఖుర్‌ఆన్, మరియు మహాప్రవక్త (సఅసం) సూచించిన కొన్ని సమగ్రమైన దుఆలను గురించి తెలుసుకుందాం. శుభప్రదమైన దుఆలను కంఠస్థం చేయడం, వాటినే పలకడం ఎంతైనా అవసరం.

# 3. ఖుర్‌ఆన్‌లోని సమగ్రమైన దుఆలు

## మన్నింపు కొరకు దుఆ

رَبَّنَا ظَلَمْنَآ اَنْفُسَنَا وَاِنْ لَّمْ تَغْفِرْلَنَا وَتَرْحَمْنَا لَنَكُوْنَنَّ مِنَ الْخَاسِرِيْنَ ٥ (الاعراف)

"రబ్బనా జలమ్‌నా అన్‌ఫుసనా వ ఇల్లమ్‌తగ్‌ఫిర్‌ లనా వ తర్‌హమ్నా లనకూనన్న మినల్‌ ఖాసిరీన్‌" *(అల్‌ ఆరాఫ్‌: 23)*

ప్రభూ! మమ్మల్ని మేము అన్యాయం చేసుకున్నాము. నీవు మమ్మల్ని మన్నించకపోతే, కనికరించకపోతే మేము నిశ్చయంగా సర్వనాశనం అయిపోతాము.

దైవం గనక మానవుని పాపాలను క్షమించి, తన అపార అనుగ్రహాన్ని కురిపించకపోతే అతను నిస్సందేహంగా నాశనమైపోతాడు.

## ఇహపరాల సాఫల్యం కొరకు దుఆ

رَبَّنَآ اٰتِنَا فِى الدُّنْيَا حَسَنَةً وَّفِى الْاٰخِرَةِ حَسَنَةً وَّقِنَا عَذَابَ النَّارِ

"రబ్బనా ఆతినా ఫిద్దున్యా హసనతవ్వ ఫిల్‌ ఆఖిరతి హసన తవ్వఖినా అజాబన్నార్‌" *(అల్‌ బఖర-201)*

మా ప్రభూ! ఇహలోకంలోనూ, పరలోకంలోనూ మాకు మంచిని ప్రసాదించు. మమ్మల్ని నరకాగ్ని యాతన నుండి కాపాడు.

## సహన స్థైర్యాల కొరకు దుఆ

رَبَّنَآ اَفْرِغْ عَلَيْنَا صَبْرًا وَّثَبِّتْ اَقْدَامَنَا وَانْصُرْنَا عَلَى الْقَوْمِ الْكَافِرِيْنَ ٥ (البقره. ٢٥٠)

"రబ్బనా అఫ్‌రిగ్‌ అలైనా సబ్రవ్వ సబ్బిత్‌ అక్‌ దామనా వన్‌సుర్నా అలల్‌ ఖౌమిల్‌ కాఫిరీన్‌ *(అల్‌ బఖర: 250)*

మా ప్రభూ! మాకు సహన స్థైర్యాలు ప్రసాదించు. మా కాళ్ళకు నిలకడను చేకూర్చు. తిరస్కారులకు ప్రతిగా మాకు నీ సహాయాన్ని అనుగ్రహించు.

## షైతాన్ కీడు నుండి రక్షణ

رَبِّ اَعُوْذُ بِكَ مِنْ هَمَزَاتِ الشَّيَاطِيْنِ ٥ وَاَعُوْذُ بِكَ رَبِّ
اَنْ يَّحْضُرُوْنِ ٥ (المومنون ٩٧، ٩٨)

"రబ్బి అవూజుబిక మిన్ హమజాతిష్షయాతీన్. వఅవూజుబిక రబ్బి అఁయ్యహ్‌జురూన్" (అల్ మూమినూన్: 97,98)

ప్రభూ! షైతానుల ప్రేరణనుండి నీ శరణుకోరుతున్నాను. అవి నావద్దకు రాకుండా కూడా నీ శరణు కోరుతున్నాను.

## నరక శిక్ష నుండి రక్షణ

رَبَّنَا اصْرِفْ عَنَّا عَذَابَ جَهَنَّمَ ۖ اِنَّ عَذَابَهَا كَانَ غَرَامًا ۖ
اِنَّهَا سَآءَتْ مُسْتَقَرًّا وَّمُقَامًا (الفرقان ٦٥، ٦٦)

"రబ్బనస్‌రిఫ్ అన్నా అజాబజహన్నమ, ఇన్న అజాబహా కాన గరామా. ఇన్నహా సాఅత్ ముస్తఖర్రవ్వ ముఖామా" (అల్ పుర్ ఖాన్ : 65,66)

మా ప్రభూ! మమ్మల్ని నరక శిక్షనుండి కాపాడు. నిస్సందేహంగా దాని శిక్ష ప్రాణాంతకమయింది. అది చాలా చెడ్డనివాసం, మరెంతో చెడుస్థానం.

## హృదయ సంస్కరణ కొరకు దుఆ

رَبَّنَا لَا تُزِغْ قُلُوْبَنَا بَعْدَ اِذْ هَدَيْتَنَا وَهَبْ لَنَا مِنْ لَّدُنْكَ
رَحْمَةً ۚ اِنَّكَ اَنْتَ الْوَهَّابُ (آل عمران - ٨)

"రబ్బనా లాతుజిగ్ ఖులూబనా బాదఇజ్ హదైతనా వహబ్ లనా మిల్లదున్క రహ్మహ్. ఇన్నక అన్తల్ వహ్హాబ్" (అలి ఇమ్రాన్ : 8)

ప్రభూ! నువ్వు మాకు సరయిన మార్గాన్ని చూపావు. ఇక మా మనసుల్ని వక్రమార్గం వైపునకు మళ్ళించకు. నీ కారుణ్యనిధి నుండి మాకు ప్రసాదించు, నిజమైన దాతవు నీవే.

## హృదయ పవిత్రత కొరకు దుఆ

رَبَّنَا اغْفِرْ لَنَا وَلِإِخْوَانِنَا الَّذِينَ سَبَقُونَا بِالْإِيمَانِ وَلَا تَجْعَلْ
فِي قُلُوبِنَا غِلًّا لِّلَّذِينَ آمَنُوا رَبَّنَا إِنَّكَ رَءُوفٌ رَّحِيمٌ ۝ (الحشر)

"రబ్బనగ్ ఫిర్ లనా వలి ఇఖ్వానినల్లజీన సబఖూనా బిల్ ఈమాని వలాతజ్ అల్ ఫీఖులూబినా గిల్లల్ లిల్లజీన ఆమనూ, రబ్బనా ఇన్నక రవూఫు(ర్రహీమ్" *(అల్ హష్ర్: 10)*

మా ప్రభూ! మమ్మల్ని, మాకు పూర్వం విశ్వసించిన సోదరులందరినీ మన్నించు, విశ్వసించిన వారి పట్ల మా హృదయాలలో ఎలాంటి కాపట్యం ఉంచకు. మా ప్రభూ! నువ్వు అమితంగా క్షమించేవాడవు, కరుణించేవాడవు.

## పరిస్థితులు చక్కబడటానికి

رَبَّنَا آتِنَا مِن لَّدُنكَ رَحْمَةً وَهَيِّئْ لَنَا مِنْ أَمْرِنَا رَشَدًا (الكهف)

"రబ్బనా ఆతినా మిల్లదున్క రహ్మతవ్వ హయ్యి లనా మిన్ అమ్రినా రషదా *(అల్ కహఫ్ : 10)*

ప్రభూ! నీ ప్రత్యేక అనుగ్రహాన్ని మాపై కురిపించు, మా వ్యవహారాలు చక్కబడేలా చెయ్యి.

## క్షమాభిక్ష కొరకు దుఆ

رَبَّنَا آمَنَّا فَاغْفِرْ لَنَا وَارْحَمْنَا وَأَنتَ خَيْرُ الرَّاحِمِينَ ۝ (المؤمنون ۱۰۹)

"రబ్బనా ఆమన్నా ఫగ్ ఫిర్ లనా వర్ హమ్నా వ అన్తఖై రు(ర్రాహి మీన్"
*(అల్ మూమినూన్- 9,10,)*

మా ప్రభూ! మేము విశ్వసించాము. ఇక మమ్మల్ని క్షమించు, మాపై కనికరించు. నీవు గొప్ప కనికరం గలవాడవు.

## కుటుంబ సభ్యుల వల్ల మనశ్శాంతి కొరకు దుఆ

رَبَّنَا هَبْ لَنَا مِنْ أَزْوَاجِنَا وَذُرِّيَّاتِنَا قُرَّةَ أَعْيُنٍ وَاجْعَلْنَا لِلْمُتَّقِينَ
إِمَامًا (الفرقان ۷۴)

"రబ్బనా హబ్ లనా మిన్ అజ్వాజినా వ జుర్రియ్యాతినా ఖుర్రత అ'యునిం వ్వజ్అల్నా లిల్ ముత్తఖీన ఇమామా" (అల్ పుర్ ఖాన్: 74)

మా ప్రభూ! మా భార్యా పిల్లల ద్వారా మాకు నేత్రానందం కలిగించు. మమ్మల్ని భయభక్తులు గలవారి ఇమామ్‌గా చెయ్యి.

(అంటే- మేము భయభక్తుల్లో అందరినీ మించిపొయ్యేలా, సత్కార్యాల్లో అందరికంటే ముందుండేలా చెయ్యి అని అర్థం.)

## తల్లి దండ్రుల కొరకు దుఆ

رَبَّنَا اغْفِرْلِىْ وَلِوَالِدَىَّ وَلِلْمُؤْمِنِيْنَ يَوْمَ يَقُوْمُ الْحِسَابُ (ابراہیم)

"రబ్బనగ్ ఫిర్లీ వలివాలిదయ్య వలిల్ మూమినీన యౌమయకూముల్ హిసాబ్" (ఇబ్రాహీమ్: 41)

ప్రభూ! నాకూ, నా తల్లి దండ్రులకూ విశ్వసించిన వారందరికీ లెక్క ఖరారు అయ్యే రోజున క్షమాభిక్షపెట్టు.

## పరీక్ష నుండి బయటపడేందుకు

رَبَّنَا لَا تُؤَاخِذْنَا اِنْ نَّسِيْنَا اَوْ اَخْطَاْنَا رَبَّنَا وَلَا تَحْمِلْ عَلَيْنَا

اِصْرًا كَمَا حَمَلْتَهٗ عَلَى الَّذِيْنَ مِنْ قَبْلِنَا رَبَّنَا وَلَا تُحَمِّلْنَا مَا

طَاقَةَ لَنَا بِهٖ وَاعْفُ عَنَّا وقف وَاغْفِرْلَنَا وَارْحَمْنَا وقف اَنْتَ مَوْلٰنَا

فَانْصُرْنَا عَلَى الْقَوْمِ الْكَافِرِيْنَ ٥

"రబ్బనా లాతుఆఖిజ్‌నా ఇన్‌న్నసీనా ఔ అఖ్‌తానా రబ్బనా వలాతహ్‌మిల్ అలైనా ఇస్రన్ కమాహమల్తహూ అలల్లజీన మిన్ ఖబ్‌లినా రబ్బనా వలాతుహమ్మిల్నా మాలా తాకతలనా బిహీ- వఉఫుఅన్నా, వగ్‌ఫిర్ లనా, వర్ హమ్నా, అన్తమౌలానా ఫన్ సుర్నా అలల్ కౌమిల్ కాఫిరీన్."
(అల్ బఖర: 286)

మా ప్రభూ! మా పాపాలను, పొరపాటు వల్ల జరిగే మా తప్పుల్ని పట్టుబోకు. స్వామీ! మా పూర్వీకుల మీద మోపిన భారాన్ని మాపై మోపకు. ప్రభూ! ఏ బరువునయితే మోసే శక్తి మాలో లేదో దాన్ని మాపై పెట్టకు.

మమ్మల్ని మన్నించు, మమ్మల్ని క్షమించు. మమ్మల్ని కరుణించు. నీవే మాకు రక్షకుడవు. తిరస్కారులకు ప్రతిగా మాకు సహాయపడు.

## తిరస్కారుల బారినుండి రక్షణ

عَلَى اللّٰهِ تَوَكَّلْنَا ۚ رَبَّنَا لَا تَجْعَلْنَا فِتْنَةً لِّلْقَوْمِ الظّٰلِمِيْنَ ۝ وَنَجِّنَا
بِرَحْمَتِكَ مِنَ الْقَوْمِ الْكٰفِرِيْنَ ۝

"అలల్లాహి తవక్కల్నా. రబ్బనా లాతజ్అల్నా ఫిత్నతల్ లిల్ ఖౌమిజ్జాలిమీన్. వనజ్జినా బిరహ్మతిక మినల్ ఖౌమిల్ కాఫిరీన్"

మేము అల్లాహ్‌పైనే భారం వేశాము. మా ప్రభూ! మమ్మల్ని దౌర్జన్యపరుల కొరకు పరీక్షగా చేయకు, నీ కరుణాకటాక్షాలతో మమ్మల్ని తిరస్కారుల బారి నుండి కాపాడు.

## విశ్వాస స్థితిలో మరణం

فَاطِرَ السَّمٰوٰتِ وَالْاَرْضِ اَنْتَ وَلِيّٖ فِي الدُّنْيَا وَالْاٰخِرَةِ تَوَفَّنِيْ
مُسْلِمًا وَّاَلْحِقْنِيْ بِالصّٰلِحِيْنَ ۝ (يوسف ١٠١)

"ఫాతిరస్సమావాతి వల్ అర్జి అన్త వలియ్యీ ఫిద్దున్యా వల్ ఆఖిరతి తవప్ఫనీ ముస్లిమఁ వ్వఅల్‌హిఖ్‌నీ బిస్సాలిహీన్." (యూసుఫ్: 101)

భూమ్యాకాశాల నిర్మాతా! నువ్వే ఇహపరలోకాల్లో నా సంరక్షకుడవు. నా ముగింపుని ముస్లిమ్‌గా చెయ్యి. చివరకు నన్ను సజ్జనులలో చేర్చు.

رَبَّنَآ اِنَّنَا سَمِعْنَا مُنَادِيًا يُّنَادِيْ لِلْاِيْمَانِ اَنْ اٰمِنُوْا بِرَبِّكُمْ
فَاٰمَنَّا رَبَّنَا فَاغْفِرْ لَنَا ذُنُوْبَنَا وَكَفِّرْ عَنَّا سَيِّاٰتِنَا وَتَوَفَّنَا مَعَ
الْاَبْرَارِ ۝ رَبَّنَا وَاٰتِنَا مَا وَعَدْتَّنَا عَلٰى رُسُلِكَ وَلَا تُخْزِنَا
يَوْمَ الْقِيٰمَةِ ۗ اِنَّكَ لَا تُخْلِفُ الْمِيْعَادَ (آل عمران ١٩٣، ١٩٤)

"రబ్బనా ఇన్ననా సమీనా మునాదియఁ య్యునాదీ లిల్ ఈమాని అన్ ఆమినూ బిరబ్బికుమ్ ఫఆమన్నా రబ్బనా ఫగ్ ఫిర్‌లనా జునూబనా

వకఫ్ఫిర్ అన్నా సయ్యి ఆతినా వ తవప్ఫనా మఅల్ అబ్రార్. రబ్బనా వ ఆతినా మా వ అద్తనా అలా రుసులిక వలాతుఖ్ జినా యౌమల్ ఖియామహ్. ఇన్నక లాతుఖ్ లిఫుల్ మీఆద్." *(ఆలి ఇమ్రాన్ - 193-194)*

ప్రభూ! మేము ఒక పిలిచేవాడి పిలుపును విన్నాము. అతడు విశ్వాసం వైపునకు పిలిచేవాడు. మీ ప్రభువును నమ్మండి అని అనేవాడు. మేము అతని ఆహ్వానాన్ని స్వీకరించాము. కనుక మా స్వామీ! మేము చేసిన తప్పుల్ని క్షమించు, మాలో ఉన్న చెడుల్ని దూరం చెయ్యి. మా ముగింపును సజ్జనులయిన వారితో పాటు చెయ్యి. దేవా! ఏ బాసలనయితే నువ్వు నీ ప్రవక్తల ద్వారా చేశావో వాటిని మా విషయంలో నెరవేర్చు. ప్రళయం నాడు మమ్మల్ని పరాభవానికి గురి చెయ్యకు. నిస్సందేహంగా నువ్వు నీ వాగ్దానాలకు భిన్నంగా వ్యవహరించేవాడవుకావు.

# 4. ప్రవక్త చేసిన సమగ్రమైన దుఆలు

మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) తన దైనందిన జీవితంలో వివిధ సందర్భాలలో చేసిన దుఆలను హదీసువేత్తలు నిర్విరామకృషితో సేకరించి గ్రంథస్థం చేశారు. దివ్యఖుర్‌ఆన్‌లో వచ్చిన దుఆలతో పాటు మహాప్రవక్త(సఅసం) నేర్పిన ఇతర దుఆలను కూడా చేస్తూ ఉండాలి. ఈ దుఆలు సమగ్రమయినవిగా ఉండటమే గాక వీటి పఠనం వల్ల అనంత శుభాలు కూడా కలుగుతాయి. పోతే ఒక విశ్వాసి ఆలోచనా సరళి ఎలా ఉండాలి? అతను దైవ సన్నిధిలో ఎలాంటి కోరికలు కోరుకోవాలి? అతని కోరికల లక్ష్యం ఏమిటి? అన్న విషయాలు కూడా ఈ దుఆల ద్వారా బోధపడతాయి.

నిజం చెప్పాలంటే మనిషి చేసే దుఆలోనే, అంటే అతను కోరుకునే కోరికలలోనే అతని ఆంతర్య నిజ స్వరూపం ద్యోతకమవుతుంది. ముఖ్యంగా ఇతరులెవ్వరికీ తెలియకుండా మనిషి ఒంటరిగా ఏకాంత సమయాల్లో కేవలం విశ్వప్రభువు మాత్రమే వింటున్నాడనే తృప్తికరమైన భావంతో చేసే దుఆ అతని ఆంతర్యానికి అద్దం పడుతుంది.

ప్రజల మధ్య ఉన్నా, ప్రజలకు వేరుగా వున్నా విశ్వాసి చేసే దుఆలలో అతని చిత్తశుద్ధి, భక్తి తత్పరత, శ్రద్ధాసక్తులు తొణికిసలాడుతూ వుంటాయి. నిరంతరం ఎంతో భయభక్తులతో చేసే ఈ దుఆల మూలంగా అతనిలో తానొక పరిపూర్ణమయిన దైవదాసుడననే అనుభూతి కలుగుతూ వుంటుంది. తద్వారా అతను దైవానికి మరింత సన్నిహితుడవుతూ ఉంటాడు. అలాంటి విశ్వాసి ఏ దుఆ చేసినా అందులో ద్యోతకమయ్యే సారాంశం ఒక్కటే- "దేవా! నాకు నీ సాన్నిధ్యాన్ని ప్రసాదించు. నీ ఆగ్రహాన్నుంచి తప్పించి నీకు ప్రీతిపాత్రుడినయ్యేలా అనుగ్రహించు. పరలోక సాఫల్యాన్ని ప్రాప్తింపజెయ్యి" ఇవే విశ్వాసి దుఆల ప్రధానోద్దేశం.

మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారని హజ్రత్ ఉస్మాన్ (రజి) తెలియజేశారు:

"ఉదయం సాయంత్రం ఈ దుఆ చేసే దాసునికి ఏ వస్తువూ హాని చెయ్యజాలదు."

بِسْمِ اللّٰهِ الَّذِىْ لَا يَضُرُّ مَعَ اسْمِهٖ شَيْئٌ فِى الْاَرْضِ وَلَا فِى

السَّمَآءِ وَهُوَ السَّمِيْعُ الْعَلِيْمُ (مسند احمد)

"బిస్మిల్లాహిల్లజీ లాయజుర్రు మ'అస్మిహీ షైయున్ ఫిల్ అర్జి వలా ఫిస్సమాయి వహువస్సమీఉల్ అలీమ్" (ముస్నద్ అహ్మద్)

దేవుని పేరుతో (ప్రతి పనీ) ప్రారంభిస్తాను. ఆయన పేరు కారణంగా భూమ్యాకాశాల్లోవున్న ఏ వస్తువూ నష్టం చేయజాలదు. ఆయన అన్నీ వినేవాడు. అన్నీ తెలిసినవాడు.

మహాప్రవక్త (సఅసం) నిత్యం క్రమం తప్పకుండా ఉదయం, సాయంత్రం, ఈ దుఆ చేసే వారని, ఎన్నటికీ దాన్ని విడిచిపెట్టేవారు కాదని హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) అన్నారు.

اَللّٰهُمَّ اِنِّیٓ اَسْئَلُكَ الْعَافِيَةَ فِی الدُّنْيَا وَالْاٰخِرَةِ اَللّٰهُمَّ اِنِّیٓ

اَسْئَلُكَ الْعَفْوَ وَالْعَافِيَةَ فِیْ دِيْنِیْ وَدُنْيَایَ وَاَهْلِیْ وَمَالِیْ

اَللّٰهُمَّ اسْتُرْ عَوْرَاتِیْ وَاٰمِنْ رَوْعَاتِیْ اَللّٰهُمَّ احْفَظْنِیْ مِنْ بَيْنِ

يَدَیَّ وَمِنْ خَلْفِیْ وَعَنْ يَّمِيْنِیْ وَعَنْ شِمَالِیْ وَمِنْ فَوْقِیْ، وَاَعُوْذُ

بِعَظْمَتِكَ اَنْ اُغْتَالَ مِنْ تَحْتِیْ (ترمذی)

"అల్లాహుమ్మ ఇన్నీ అస్ అలుకల్ ఆఫియత ఫిద్దున్యా వల్ ఆఖిరతి; అల్లాహుమ్మ ఇన్నీ అస్ అలుకల్ అఫ్వ వల్ ఆఫియత ఫీదీనీ వదున్యాయ వ అహ్లీ వ మాలీ; అల్లాహుమ్మస్తుర్ ఔరాతీ వ ఆమిన్ రౌఆతీ; అల్లాహుమ్మహ్ఫజ్నీ మింబైని యదయ్య వమిన్ ఖల్ఫీ వఅఁయ్యమీనీ వఅన్ షిమాలీ వమిన్ ఫౌకీ వ అఊజు బిఅజ్మతిక అన్ ఉగ్తాల మిన్ తహ్తీ" (తిర్మిజి)

దేవా! నేను ఇహపరలోకాల్లో శ్రేయస్సును అర్థిస్తున్నాను. దేవా! ధార్మిక, ప్రాపంచిక విషయాల్లో నా భార్యాపిల్లలు, ధన సంపదల వ్యవహారాల్లో నేను నీ వద్ద క్షమాభిక్షను, మన్నింపును, శాంతిని, శ్రేయస్సుల్ని కోరుతున్నాను. దేవా! నీవు నన్ను (నా తప్పిదాలను) కప్పిపుచ్చి, నా ఆవేదనా ఆందోళనలను శాంతి సౌఖ్యాలుగా మార్చివేయి. దేవా! ముందునుంచి, వెనుకనుంచి, ఎడమ వైపు నుంచి, కుడివైపు నుంచి, పైనుంచి (అన్ని వైపులనుంచి) నన్ను రక్షించు. నా క్రింద నుంచి అకస్మాత్తుగా వచ్చి నన్ను అంతంచేసే ఆపదలనుంచి రక్షణకు నేను

నీ మహోన్నత శరణు కోరుతున్నాను. (అంటే దేవా! భూమిలో కూరుకుపోయే శిక్షనుండి కూడా నన్ను కాపాడు.)

## సోమరితనం, పిరికితనం నుండి రక్షణకు

హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) వివరించారు: "నేను ఎక్కువగా మహా ప్రవక్త (సఅసం) సేవలో గడిపే వాణ్ణి. మహాప్రవక్త (సఅసం) తరచుగా ఈ దుఆ పఠిస్తూ ఉండటం నేను విన్నాను :

اَللّٰهُمَّ اِنِّيْ اَعُوْذُبِكَ مِنَ الْهَمِّ وَالْحُزْنِ وَالْعِجْزِ وَالْكَسَلِ،

وَالْبُخْلِ وَالْجُبْنِ وَضَلْعِ الدَّيْنِ وَغَلَبَةِ الرِّجَالِ - (بخاری مسلم)

"అల్లాహుమ్మ ఇన్నీ అవూజుబిక మినల్ హమ్మి వల్ హుజ్ని వల్ ఇజ్ జి వల్ కసలి వల్ బుఖ్లి వల్ జుబ్ని వజల్ ఇద్దయిని వగలబతిర్రిజాల్"
(బుఖారి, ముస్లిమ్)

దేవా! నేను నీ శరణుకోరుతున్నాను. బాధలూ దుఃఖాల నుండి, నిస్సహాయత, సోమరి తనాల నుండి, పిసినారితనం పిరికితనాల నుండి, రుణభారం నుండి, ప్రజలవత్తిడి నుండి.

## ధర్మనిష్ఠ, సౌశీల్యత కొరకు

اَللّٰهُمَّ اِنِّيْ اَسْئَلُكَ الْهُدٰى وَالتُّقٰى وَالْعَفَافَ وَالْغِنٰى ؛

"అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుకల్ హుదా వత్తుకా వల్ అఫాఫ వల్ గినా"

దేవా! నీ మార్గదర్శనం, ధర్మనిష్ఠ, సౌశీల్యత, సంతుష్టి ప్రసాదించమని అర్థిస్తున్నాను.

ఈ దుఆలో ఎంతో సమగ్రత ఉంది. ఈ నాలుగు మాటల్లో మహాప్రవక్త (సఅసం) వాస్తవానికి ఒక దైవ విశ్వాసికి కావలసిన వాటినన్నింటినీ కోరుకున్నారు.

## ఇహపరాల పరాభవం నుండి రక్షణకై

اَللّٰهُمَّ اَحْسِنْ عَاقِبَتَنَا فِى الْاُمُوْرِ كُلِّهَا وَاَجِرْنَا مِنْ خِزْيِ الدُّنْيَا

وَعَذَابِ الْاٰخِرَةِ - (طبرانی)

"అల్లాహుమ్మ అహ్సిన్ ఆకిబతనా ఫిల్ ఉమూరి కుల్లిహా వ అజిర్నా మిన్ ఖిజ్‌యిద్దున్యా వ అజాబిల్ ఆఖిరహ్." (త్వబ్రానీ)

దేవా! అన్ని వ్యవహారాల్లోనూ మాకు మంచి పరిణామ ఫలం లభించేలా చెయ్యి. మాకు ఇహలోకపు అవమానం నుండి, పరలోకపు శిక్ష నుండి భద్రత కల్పించు.

## నమాజ్ తర్వాత చేసే దుఆ

హజ్రత్ ముఆజ్ (రజిఅన్) ఇలా అన్నారు.

ఒక రోజు మహాప్రవక్త (సఅసం) నా చేతిని పట్టుకొని "ఓ ముఆజ్! నీ వంటే నాకు ఎంతో ప్రేమ" అని అన్నారు. మళ్లీ ఆయన, "ఓ ముఅజ్! ఏ నమాజ్ తర్వాత అయినా సరే నీవు ఈ వచనాలను విడువకు. ప్రతి నమాజ్ తర్వాత ఈ వచనాలను తప్పకుండా పఠించాలని నేను నీకు ఉపదేశిస్తున్నాను" అని చెప్పారు.

اَللّٰهُمَّ اَعِنِّیْ عَلٰی ذِكْرِكَ وَشُكْرِكَ وَحُسْنِ عِبَادَتِكَ

"అల్లాహుమ్మ అయిన్నీ అలాజిక్ రిక వషుక్ రిక వహుస్ని ఇబాదతిక్"

దేవా! నిన్ను ధ్యానించడంలో నీకు కృతజ్ఞతలర్పించడంలో, వుత్తమరీతిలో నిన్ను ఆరాధించడంలో నీవు నాకు సహాయపడు.

## దైవ ప్రవక్త ఉపదేశం

హజ్రత్ షద్దాద్ బిన్ ఔస్ (రజి) ఇలా తెలియజేశారు:

దైవ సందేశహరులు (సఅసం) నాకు ఇలా ఉపదేశించారు: "షద్దాద్! ప్రపంచంలో ప్రజలు వెండి బంగారాలను ప్రోగు చేయడంలో నిమగ్నులయి ఉండటాన్ని చూసినప్పుడు నీవు ఈ వచనాలను ప్రోగుచేసుకో!!"

اَللّٰهُمَّ اِنِّیْٓ اَسْئَلُكَ الثَّبَاتَ فِی الْاَمْرِ وَالْعَزِیْمَةَ عَلَی الرُّشْدِ،
وَاَسْئَلُكَ شُكْرَ نِعْمَتِكَ وَحُسْنَ عِبَادَتِكَ وَاَسْئَلُكَ قَلْبًا
سَلِیْمًا وَّلِسَانًا صَادِقًا وَّاَسْئَلُكَ مِنْ خَیْرِ مَا تَعْلَمُ وَاَعُوْذُبِكَ
مِنْ شَرِّ مَا تَعْلَمُ وَاَسْتَغْفِرُكَ لِمَا تَعْلَمُ اِنَّكَ اَنْتَ عَلَّامُ الْغُیُوْبِ۔

(مسند احمد)

"అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుకస్సబాత ఫిల్అమ్రి వల్ అజీమతి అలర్రుష్ది వ అస్అలుక షుక్ర న్యామతిక వహుస్న ఇబాదతిక వ అస్అలుక

ఖల్ఖన్ సలీమఁవ్వలిసానన్ సాదిఖఁ వ్వ అస్అలుక మిన్ ఖైరి మాతాలము వ అవూజుబిక మిన్ షర్రి మాతాలము వ అస్తగ్ఫిరుక లిమాతాలము ఇన్నక అన్త అల్లాముల్ గుయూబ్" (ముస్నద్ అహ్మద్)

దేవా! నాకు నిలకడలో, నిజాయితీలో స్థయిర్యాన్నీ పటిష్ఠతనూ ప్రసాదించమని కోరుతున్నాను. నీ వరాలకు కృతజ్ఞత తెలుపుకునేందుకు, నీకు అత్యుత్తమ దాస్యం చేసేందుకు సద్బుద్ధిని అర్థిస్తున్నాను. ఇంకా, దేవా! నాకు వినమ్ర హృదయాన్ని, సత్యం పలికే నోటిని అనుగ్రహించమని కోరుతున్నాను. నీ వెరిగిన ప్రతి మంచిని కోరుతున్నాను. నీ వెరిగిన ప్రతి చెడు నుండి నీ రక్షణ కోరుతున్నాను. నీకు తెలిసిన పాపాలన్నిటినీ మన్నించమని ప్రాధేయపడుతున్నాను. నిస్సందేహంగా, గోప్యమైన విషయాలన్నీ నీకు బాగా తెలుసు"

## మన్నింపునకై, దైవ ప్రసన్నతకై దుఆ

హజ్రత్ అబూహురైరా (రజిఅన్) ఇలా తెలుపుతున్నారు, మహాప్రవక్త (సఅసం) హజ్రత్ సల్మాన్ ఫార్సీకు ఉపదేశం చేస్తూ ఇలా ప్రవచించారు.

"(సల్మాన్) నేను నీకు కొన్ని వచనాలు నేర్పగోరుతున్నాను. వాటి ద్వారా రహ్మాన్‌ని అర్థించు. రహ్మాన్ వైపునకు పరుగిడు. రేయింబవళ్ళు ఈ వచనాల్లోనే దైవాన్ని వేడుకో."

اَللّٰھُمَّ اِنِّیٓ اَسْئَالُکَ صِحَّۃً فِیْ اِیْمَانٍ وَّ اِیْمَانًا فِیْ حُسْنِ خُلُقٍ وَّ
نَجَاحًا یَّتْبَعُہٗ فَلَاحٌ وَّرَحْمَۃً مِّنْکَ وَعَافِیَۃً وَّ مَغْفِرَۃً مِّنْکَ وَ
رِضْوَانًا- (طبرانی، حاکم)

"అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక సిహ్హతన్ ఫీ ఈమానిఁవ్వ ఈమానన్ ఫీహుస్నిఖులుఖిఁ వ్వ నజాహ య్యత్బఉహు ఫలాహుఁ వ్వ రహ్మతమ్మిన్‌క వఆఫియతన్ వ మగ్ఫిరతమ్మిన్క వ రిజ్వానా" (త్విబ్రానీ, హాకిమ్)

దేవా! బలమూ, ఆరోగ్యమూకల విశ్వాసాన్నీ, సద్వర్తనలో ఈమాన్ ప్రభావాన్ని ప్రసాదించమని అర్థిస్తున్నాను. పరలోక సాఫల్యాన్ని సుగమం చేసే సఫలతను కోరుతున్నాను. ఇంకా నీ నుండి కారుణ్యాన్ని, శాంతిని, పాపక్షమాపణను, నీ ప్రీతిని వేడుకుంటున్నాను.

## పాపప్రక్షాళన కొరకు

దైవ సందేశహరులు(సఅసం) ఈ దుఆ చేస్తుండేవారని హజ్రత్ ఉమ్మెసల్మా (రజిఅన్) వివరించారు:

اَللّٰهُمَّ نَقِّ قَلْبِىْ مِنَ الْخَطَايَا كَمَا نَقَّيْتَ الثَّوْبَ الْاَبْيَضَ مِنَ
الدَّنَسِ اَللّٰهُمَّ بَعِّدْ بَيْنِىْ وَبَيْنَ خَطِيْئَتِىْ كَمَا بَعَّدْتَّ بَيْنَ
الْمَشْرِقِ وَالْمَغْرِبِ (معجم کبیر)

"అల్లాహుమ్మ నక్కి కల్బీ మినల్ ఖతాయా కమానక్కయిత స్సౌబల్ అబ్ యజ మినద్దనసి అల్లాహుమ్మ బయ్యిద్ బైని వబైన ఖతీఅతీ కమాబ అద్ త్త బైనల్ మష్రికి వల్ మగ్రిబ్." (మో'జమ్ కబీర్)

దేవా! తెల్ల బట్టల నుండి మలినాన్ని తొలగించి పరిశుభ్రం చేసినట్టు నా హృదయాన్నుండి పాపపంకిలాన్ని దూరంచేసి పరిశుద్ధం చెయ్యి. దేవా! నీవు తూర్పు పడమరల్ని ఎంత దూరంగా ఉంచావో, పాపాల నుండి నన్ను అంత దూరంగా ఉంచు.

## ప్రజల దృష్టిలో గౌరవం కొరకు

اَللّٰهُمَّ اجْعَلْنِىْ صَبُوْرًا وَّاجْعَلْنِىْ شَكُوْرًا وَّاجْعَلْنِىْ فِىْ عَيْنِىْ صَغِيْرًا
وَّفِىْ اَعْيُنِ النَّاسِ كَبِيْرًا۔

"అల్లాహుమ్మజ్ అల్నీ సబూరవ్వజ్ అల్నీ షకూరవ్వజ్ అల్నీ ఫీఅయ్‌నీ సగీరవ్వ ఫీ ఆ'యునిన్నాసి కబీరా" (హదీస్)

దేవా! నన్ను అత్యంత సహన శీలిగా, అత్యధికంగా కృతజ్ఞత చూపేవాడుగా చెయ్యి. నన్ను దృష్టిలో హీనంగానూ ఇతరుల దృష్టిలో గొప్పవానిగాను రూపొందించు.

## సమగ్రమయిన దుఆ

హజ్రత్ ఆయిషా (రజిఅన్) ఇలా వివరిస్తున్నారు : ఒకసారి దైవ సందేశహరులు(సఅసం) నా వద్దకు వచ్చారు. అప్పుడు నేను నమాజ్ చేస్తూవున్నాను. దైవ ప్రవక్త (సఅసం)కు నాతో ఏదో పని కలిగింది. నాకు చాలా ఆలస్యమైంది.

అప్పుడు ఆయన "ఆయిషా! సంగ్రహమయిన, సమగ్రమయిన దుఆ చేస్తూ వుండు" అని అన్నారు. తర్వాత నేను దైవ సందేశహరు(సఅసం) ని దగ్గరకు వచ్చి "దైవ ప్రవక్తా! సంగ్రహమయిన దుఆ ఏమిటో కాస్త చెప్పండి" అని అడిగాను. అప్పుడాయన ఈ దుఆ పఠించమని వినిపించారు.

اَللّٰهُمَّ اِنِّيْٓ اَسْئَالُكَ مِنَ الْخَيْرِ كُلِّهٖ عَاجِلِهٖ وَاٰجِلِهٖ مَا عَلِمْتُ مِنْهُ وَمَالَمْ اَعْلَمْ وَاَعُوْذُبِكَ مِنَ الشَّرِّ كُلِّهٖ عَاجِلِهٖ وَاٰجِلِهٖ مَا عَلِمْتُ مِنْهُ وَمَالَمْ اَعْلَمْ وَاَسْئَالُكَ الْجَنَّةَ وَمَا قَرَّبَ اِلَيْهَا مِنْ قَوْلٍ اَوْعَمَلٍ وَاَعُوْذُبِكَ مِنَ النَّارِ وَمَا قَرَّبَ اِلَيْهَا مِنْ قَوْلٍ اَوْعَمَلٍ وَاَسْئَالُكَ مِمَّا سَاَلَكَ بِهٖ مُحَمَّدٌ وَاَعُوْذُ بِكَ مِمَّا تَعَوَّذَ مِنْهُ مُحَمَّدٌ وَمَا قَضَيْتَ لِيْ مِنْ قَضَآءٍ فَاجْعَلْ عَاقِبَتَهٗ رُشْدًا ـ (حاكم)

"అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక మినల్ ఖైరి కుల్లిహీ ఆ'జిలిహీ వ ఆజిలిహీ మా అలిమ్తు మిన్హు వమాలమ్ ఆలమ్ వ అవూజుబిక మినష్షరి కుల్లిహీ ఆ'జిలిహీ వ ఆజిలిహీ మా అలిమ్తు మిన్హు వమాలమ్ ఆ'లమ్. వ అస్అలుకల్ జన్నత వమాఖర్రబ ఇలైహా మిన్ కౌలిన్ అవ్ అమలిన్. వ అవూజుబిక మినన్నారి వమా ఖర్రబ ఇలైహా మిన్ ఖౌలిన్ అవ్ అమలిన్. వ అస్అలుక మిమ్మానఅలకబిహీ ముహమ్మదున్ వ అవూజుబిక మిమ్మాతఅవ్వజ మిన్హు ముహమ్మదున్ వమా కజైతలీ మిన్ కజాయిన్ ఫజ్అల్ ఆకిబతహూ రుష్దా" (హాకిమ్)

దేవా! నేను సమస్త మేళ్ళను గురించి నిన్ను యాచిస్తున్నాను. - వెంటనే లభించేదీ ఆలస్యంగా లభించేదీను. (నాకు) తెలిసినవీ తెలియనివి కూడా, (అలాగే) నేను సమస్త చెడుల నుండి నీ శరణుకోరుతున్నాను. వెంటనే ప్రాప్తించేదీ ఆలస్యంగా దాపురించేదీను. (నాకు) తెలిసినవీ తెలియని చెడుల నుండి కూడా. (దేవా!) నాకు స్వర్గప్రాప్తిని కలిగించమని, స్వర్గానికి దరిచేర్చే మాటలను చేతలను ప్రసాదించమని అర్థిస్తున్నాను. (అలాగే) నేను నరకం నుండి, నరకానికి సమీపంగా తీసికెళ్ళే మాటలూ, చేతల నుండి కూడా నీ శరణు

కోరుతున్నాను. నేను, నిన్ను ముహమ్మద్ (సఅసం) అర్థించిన మేళ్ళను ప్రసాదించమని అర్థిస్తున్నాను. ఏ విషయాలనుండి ముహమ్మద్ (సఅసం) నీ శరణు కోరారో వాటన్నింటి (నష్టం) నుండి కూడా నేను నీ శరణు వేడుతున్నాను. (దేవా!) నా విషయంలో నీవు ఎలాంటి తీర్మానం చేసినా దాని పరిణామం శ్రేయస్కరమైనదిగా చెయ్యమని అర్థిస్తున్నాను.

## ఇస్లామ్‌పై నిలకడ కొరకు

اَللّٰهُمَّ احْفَظْنِيْ بِالْاِسْلَامِ قَآئِمًا وَّاحْفَظْنِيْ بِالْاِسْلَامِ قَاعِدًا وَّاحْفَظْنِيْ بِالْاِسْلَامِ رَاقِدًا وَّلَا تُشْمِتْ بِيْ عَدُوًّا حَاسِدًا۔

"అల్లాహుమ్మహ్ఫజ్‌నీ బిల్ ఇస్లామి కాయిమన్ వహ్ఫజ్‌నీ బిల్ ఇస్లామి కాయి దవ్వహ్ఫజ్‌నీ బిల్ ఇస్లామి రాకిదవ్వలాతుష్మిత్ బీ అదువ్వన్ హాసిదా."

దేవా! లేస్తూ, కూర్చుంటూ నిద్రపోతూ మేల్కొంటూవున్న సర్వావస్థల్లోనూ నాకు ఇస్లామ్‌పై నిలకడ ప్రసాదించు. ఏ శత్రువుకూ, అసూయాపరునికీ నన్ను అపహాస్యం చేసే అవకాశం ఇవ్వకు.

## నవ ముస్లిమ్ దుఆ

హజ్రత్ అబూమాలిక్ అష్జయి (రజి) తన తండ్రి ఇలా చెప్పినట్లు తెలుపుతున్నారు.

ఒకరు ఇస్లామ్ ధర్మాన్ని స్వీకరించినప్పుడు దైవ ప్రవక్త (సఅసం) అతనికి నమాజ్ పద్ధతి నేర్పించిన తర్వాత ఈ దుఆ చేయమని హితవు చేసేవారు.

اَللّٰهُمَّ اغْفِرْلِيْ، وَارْحَمْنِيْ وَاهْدِنِيْ، وَعَافِنِيْ وَارْزُقْنِيْ ؛

"అల్లాహుమ్మగ్‌ఫిర్లీ వర్‌హమ్నీ వహ్‌దినీ, వ ఆఫినీ వర్‌జుఖ్నీ."

దేవా! నీవు నాకు క్షమాభిక్ష ప్రసాదించు, నన్ను కరుణించు, నన్ను ఋజుమార్గాన నడిపించు, నాకు శాంతి, సంక్షేమాలనూ, ఉపాధినీ ప్రసాదించు.

## ద్వంద్వ స్వభావం, అవినీతి నుండి రక్షణకు

اَللّٰهُمَّ اِنِّيْ اَعُوْذُ بِكَ مِنْ مُّنْكَرَاتِ الْاَخْلَاقِ وَالْاَعْمَالِ

وَالْاَهْوَآءِ، اَللّٰهُمَّ اِنِّيْٓ اَعُوْذُبِكَ مِنَ الشِّقَاقِ وَالنِّفَاقِ وَ

سُوْٓءِ الْاَخْلَاقِ۔

"అల్లాహుమ్మ ఇన్నీ అవూజుబిక మిమ్మున్ కరాతిల్ అఖ్లాఖి వల్ ఆమాలి వల్ అహ్వాయి, అల్లాహుమ్మ ఇన్నీ అవూజుబిక మినష్షికాకి వన్నిఫాకి వ సూయిల్ అఖ్లాక్"

దేవా! దుర్గుణాలనుండి, దుష్కార్యాల నుండి, మనోవాంఛల బారి నుండి నేను నీ శరణు వేడుకుంటున్నాను. దేవా! నేను కలహం, కాపట్యం, నీతిరాహిత్యాల నుండి నీ శరణు కోరుతున్నాను.

## ఋణబాధ నుండి విముక్తి కొరకు

హజ్రత్ అబూవాయిల్ ఇలా వివరిస్తున్నారు :

హజ్రత్ అలి (రజిఅన్) దగ్గర (యజమానికి) ఋణగ్రస్తుడయిన ఒక బానిస హాజరయి "అయ్యా! నాకు సహాయం చేయండి. నేను (విమోచన కొరకు) నా యజమాని ఋణాన్ని తీర్చలేక పోతున్నాను" అన్నాడు. అప్పుడు హజ్రత్ అలి (రజిఅన్) "నాకు దైవ ప్రవక్త (సఅసం) నేర్పిన దుఆ నీకు వినిపించనా? నీకు ఉహుద్ పర్వతమంత అప్పు ఉన్నా సరే దేవుడు దాన్ని తీర్చివేస్తాడు." అన్నారు.

"అయితే ఆ దుఆ నాకు తప్పకుండా నేర్పించండి" అని బానిసకోరగా ఆయన ఈ దుఆ వినిపించారు.

اَللّٰهُمَّ اكْفِنِيْ بِحَلَالِكَ عَنْ حَرَامِكَ وَاَغْنِنِيْ بِفَضْلِكَ عَمَّنْ سِوَاكَ۔

"అల్లాహుమ్మక్ఫినీ బిహలాలిక అన్ హరామిక వగ్నినీ బిఫజ్లిక అమ్మన్ సివాక్."

దేవా! నాకు ధర్మ సమ్మతమయిన ఆహారాన్ని ప్రసాదించి, అధర్మపు ఉపాధి నుండి నన్ను దూరంగా వుంచు. నీ అనుగ్రహంతో, నీపై తప్ప నేను ఇతరులెవరిపైనా ఆధారపడకుండా సంతుష్టిని ప్రసాదించు.

# 5 దరూద్, సలామ్

మానవ మహోపకారి మహాప్రవక్త ముహమ్మద్(సఅసం) కోసం అత్యధికంగా దరూద్, సలామ్ పఠించాలి. వాస్తవం చెప్పాలంటే ఆయన మనకు చేసిన అపారమైన ఉపకారాలకు, కనబరచిన అసామాన్య కరుణా కటాక్షాలకు సరితూగగల బదులు మనం ఆయనకేమీ ఇవ్వలేము, ఒకవేళ ఏదైనా ఇవ్వగలిగితే - అది ఆయన పట్ల దృఢమైన విశ్వాసంతో, త్యాగ భావంతో, ప్రేమాభిమానాలతో - మనం దరూద్ పఠించి కానుకగా సమర్పించుకుని ఇంకా దైవంతో ఇలా ప్రార్థించగలం:

"ప్రభూ! నీ ప్రవక్త మా కొరకు రేయింబవళ్ళు భరించిన అతి భయంకరమైన బాధలు, మా మార్గదర్శకత్వం కొరకు, ధర్మకాంతిని మా వరకు చేరవేయడానికి, ఆయన తనప్రాణాన్ని పణంగా పెట్టిన తీరు-ఈ మహోపకారాన్ని మేము ఏ విధంగానూ తీర్చుకోలేము. నిన్నే మేము అర్థిస్తున్నాము. ప్రభూ! ఎడతెగని కరుణామృతాన్ని ఆయనపై కుమ్మరించు, ఆయన ఔన్నత్యాన్ని ఇనుమడింపజేయి, ఆయన నెలకొల్పిపోయిన ధర్మాన్ని దుష్టశక్తుల బారినుండి కాపాడి దాన్ని మరింత విస్తరింపజేయి. పరలోకంలో నీ సాన్నిధ్యాన్ని పొందిన వారందరిలో కన్నా మిన్నగా ఆయనకు నీ సాన్నిధ్యాన్ని ప్రాప్తంచెయ్యి" అని దైవాన్ని వేడుకోవడం తప్ప మరేమీ చెయ్యలేము.

దివ్యఖుర్ఆన్‌లో దేవుడు స్పష్టంగా ముస్లిమ్‌లకు ఇలా బోధించాడు. "అల్లాహ్, ఆయన దూతలు ప్రవక్తపై నిరంతరం దరూద్ పంపిస్తున్నారు. ముస్లిములారా! మీరు ఆయనకు దరూద్ సలాములు పంపండి."

హజ్రత్ ఉబయ్ బిన్ కఅబ్ (రజిఅన్)తో దైవ ప్రవక్త ఇలా అన్నారు: "ఉబయ్! దరూద్, సలామ్ పఠించడంలో నీ సమయాన్నంతటినీ వినియోగించావంటే ఇహపరలోకాల్లో నీ సంరక్షణా బాధ్యతను అల్లాహ్ స్వీకరిస్తాడు".

(ముస్నద్ అహ్మద్)

హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) ప్రవక్త (సఅసం) బోధించిన ఒక ప్రవచనాన్ని ఇలా వివరించారు.

"ఏ వ్యక్తి ఒకసారి నాకు దరూద్ పంపిస్తాడో ఆ వ్యక్తిపైన దేవుడు పదిసార్లు తన కారుణ్యాన్ని కురిపిస్తాడు. అతనికి పది పుణ్యాలను ప్రసాదిస్తాడు. పది పాపాలను క్షమిస్తాడు. అంతస్తును పదింతలుగా పెంచుతాడు." (నసాయి)

ప్రవక్త (సఅసం) ఈ విషయాన్ని కూడా తెలియపరిచారు. ఒక వ్యక్తి నాకు దరూద్ పంపుతున్నప్పుడు అలా దరూద్ పంపుతున్నంత సమయమూ అతనికి

దైవ దూతలు దరూద్ పంపుతూ ఉంటారు. (అహ్మద్, ఇబ్నుమాజ)

ఎవరైతే ప్రవక్త (సఅసం) పేరును విని ఆయనకు దరూద్ పంపరో మహాప్రవక్త (సఅసం) అలాంటి వ్యక్తిని పిసినారిగా అభివర్ణించారు. ఈ విషయాన్నే ఆయన ఇలా ప్రవచించారు:

"తన ఎదుట నా ప్రస్తావన వచ్చినప్పుడు నా కొరకు దరూద్ పంపని వ్యక్తి పరమ పిసినిగొట్టు." (తిర్మిజి)

అందరికంటే అధికంగా తన కొరకు దరూద్, సలామ్ పంపే వ్యక్తిని దైవ ప్రవక్త (సఅసం) తుది దినాన తన సాన్నిహిత్యానికి హక్కుదారుగా అభివర్ణించారు.

ఆయన (సఅసం) ఇలా అన్నారు.

ఏ వ్యక్తి నా కొరకు అందరికంటే అధికంగా దరూద్, సలామ్ పంపిస్తాడో ఆ వ్యక్తి ప్రళయ దినాన నా సాన్నిహిత్యానికి అందరికంటే అధికంగా హక్కుదారుడు అవుతాడు. (తిర్మిజి)

మహాప్రవక్త (సఅసం) తన అనుచరులకు (రజిఅన్) వివిధ సమయాల్లో వివిధ రకాలుగా దరూద్‌ను నేర్పించారు. ఆ దరూద్ పదాల్లో కొంచెం భేదం ఉన్నా మనం వాటిలో ఏ దరూద్‌నయినా పఠించ వచ్చు. సాధారణంగా మనం నమాజ్‌లో పఠించే దరూద్‌ను హజ్రత్ అబ్దుల్లాహ బిన్ అబ్బాస్ (రజిఅన్) ఉత్కృష్టమైనదిగా అభివర్ణించారు:

اَللّٰهُمَّ صَلِّ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰٓى اٰلِ مُحَمَّدٍ كَمَا صَلَّيْتَ عَلٰٓى اِبْرَاهِيْمَ
وَعَلٰٓى اٰلِ اِبْرَاهِيْمَ اِنَّكَ حَمِيْدٌ مَّجِيْدٌ۔
اَللّٰهُمَّ بَارِكْ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰٓى اٰلِ مُحَمَّدٍ كَمَا بَارَكْتَ عَلٰى
عَلٰٓى اِبْرَاهِيْمَ وَعَلٰٓى اٰلِ اِبْرَاهِيْمَ اِنَّكَ حَمِيْدٌ مَّجِيْدٌ (صحاح ستة مسند احمد)

'అల్లాహుమ్మ సల్లిఅలా ముహమ్మదివ్వ అలా ఆలి ముహమ్మదిన్ కమా సల్లయ్‌త అలా ఇబ్రాహీమ వ అలాఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్మజీద్."

"అల్లాహుమ్మ బారిక్ అలా ముహమ్మదివ్వ అలాఆలి ముహమ్మదిన్ కమా బారక్‌త అలా ఇబ్రాహీమ వ అలాఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్మజీద్" (సిహాసిత్త ముస్నద్ అహ్మద్)

ఓ దేవా! ఏ విధంగా నీవు ఇబ్రాహీమ్ (అలై) ఇబ్రాహీమ్ (అలైస) అనుయాయులపైన కరుణ చూపావో, అదే విధంగా ముహమ్మద్ (సఅసం) పై ముహమ్మద్ (సఅసం) అనుయాయులపైన కరుణ చూపు. నిస్సందేహంగా నీవు

అత్యంత పవిత్ర గుణాలు కలవాడవు. మహోన్నతుడవు.

ఓ దేవా! ఏ విధంగానయితే నీవు ఇబ్రాహీం (అలైస)కు ఇబ్రాహీం (అలైస) అనుయాయులకు శుభాలను ప్రసాదించావో, అదే విధంగా ముహమ్మద్ (సఅసం)కు ముహమ్మద్ (సఅసం) అనుయాయులకు శుభాలను ప్రసాదించు. నిస్సందేహంగా నీవు పవిత్రమయిన గుణాలు కలిగినవాడవు మహోన్నతుడవు.

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ (రజిఅన్) ప్రజలతో ఇలా అన్నారు. "మీరు ప్రవక్త (సఅసం)కు దరూద్ పంపిస్తున్నప్పుడు ఉత్తమ పద్ధతిలో పంపించండి. ఎందుకంటే ఈ దరూద్‌ని ప్రవక్త (సఅసం) సన్నిధికి పంపించడం సాధ్యమే.ఆ సంగతి మీకు తెలియదుకదా!" అప్పుడు ప్రజలు ఆ దరూద్‌ని నేర్పించమని ఆయనను కోరారు. అందుకు ఆయన ఇలా పఠించండి అని అన్నారు.

اَللّٰهُمَّ اجْعَلْ صَلٰوتَكَ وَرَحْمَتَكَ وَبَرَكَاتِكَ عَلٰى سَيِّدِ
الْمُرْسَلِيْنَ وَاِمَامِ الْمُتَّقِيْنَ وَخَاتَمِ النَّبِيِّيْنَ مُحَمَّدٍ عَبْدِكَ
وَرَسُوْلِكَ اِمَامِ الْخَيْرِ وَقَآئِدِ الْخَيْرِ وَرَسُوْلِ الرَّحْمَةِ ، اَللّٰهُمَّ
ابْعَثْهُ مَقَامًا يَّغْبِطُهٗ بِهِ الْاَوَّلُوْنَ ٥ اَللّٰهُمَّ صَلِّ عَلٰى مُحَمَّدٍ وَّ
عَلٰى اٰلِ مُحَمَّدٍ كَمَا صَلَّيْتَ عَلٰى اِبْرَاهِيْمَ وَعَلٰى اٰلِ اِبْرَاهِيْمَ اِنَّكَ
حَمِيْدٌ مَّجِيْدٌ ٥ اَللّٰهُمَّ بَارِكْ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰى اٰلِ مُحَمَّدٍ كَمَا
بَارَكْتَ عَلٰى اِبْرَاهِيْمَ وَعَلٰى اٰلِ اِبْرَاهِيْمَ اِنَّكَ حَمِيْدٌ مَّجِيْدٌ (ابن ماجہ)

"అల్లాహుమ్మజ్ అల్ సలాతకవరహ్మతకవ బరకాతిక అలాసయ్యిదిల్ ముర్‌సలీనవ ఇమామిల్ ముత్తఖీనవ ఖాతమిన్ న్నబియ్యీన ముహమ్మదిన్ అబ్ దిక వరసూలిక ఇమామిల్ ఖైరి వ కాయిదిల్ ఖైరి వ రసూలిర్రహ్మతి, అల్లాహుమ్మబ్ అస్‌హు మఖామయ్యగ్‌బితుహూ బిహిల్ అవ్వలూన్. అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదివ్వ అలాఆలి ముహమ్మదిన్ కమాసల్లయ్‌త అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్మజీద్. అల్లాహుమ్మ బారిక్ అలా ముహమ్మదివ్వ అలాఆలి ముహమ్మదిన్ కమాబారక్‌త అలా ఇబ్రాహీమ వఅలా, ఆలీ ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్మజీద్." (ఇబ్నెమాజ)

దేవా! ప్రవక్తల నేత, దైవభీతిపరుల నాయకుడు, అంతిమ దైవ సందేశ హరుడు అయిన నీ దాసుడు ముహమ్మద్‌పైన అపార శుభాలను కారుణ్యాన్ని వర్షింపజెయ్యి. ఆయన నీ ప్రవక్త. మంచితనానికి ప్రతీక, శ్రేయస్సు వైపు నడిపించే సారధి. కారుణ్యమూర్తి.

దేవా! పూర్వులకు గర్వకారణమయిన మహోన్నత స్థానాన్ని ఆయనకు ప్రాప్తింపజెయ్యి.

ఓ దేవా! ఏ విధంగా నీవు ఇబ్రాహీమ్ (అలై)పై ఇబ్రాహీమ్ (అలై) అనుయాయులపై కరుణ చూపావో అదే విధంగా ముహమ్మద్ (సఅసం)మీద ముహమ్మద్ (సఅసం) అనుయాయుల మీదా నీ కరుణ చూపు. నిస్సందేహంగా నీవు అత్యంత పవిత్ర గుణాలు కలవాడవు, మహోన్నతుడవు.

ఓ దేవా! ఏ విధంగానయితే నీవు ఇబ్రాహీం (అలై)కు ఇబ్రాహీం (అలై) అనుయాయులకు శుభాలను ప్రసాదించావో, అదేవిధంగా ముహమ్మద్(సఅసం)కు ముహమ్మద్(సఅసం) అనుయాయులకు శుభాలను ప్రసాదించు. నిస్సందేహంగా నీవు పవిత్రమయిన గుణాలు కలిగినవాడవు, మహోన్నతుడవు.

హజ్రత్ అబూ మస్‌ఊద్ అన్సారి (రజి) ఇలా అన్నారు: "ఒకసారి బషీర్ బిన్ సాద్ (రజి) ప్రవక్త (సఅసం)ను దైవ ప్రవక్తా! మేము మీకు దరూద్ ఎలా పంపించాలని అడగ్గా, మహాప్రవక్త (సఅసం) కొంచెం సేపు మౌనం వహించి, ఆ తర్వాత ఇలా పఠించండి అని చెప్పారు.

اَللّٰهُمَّ صَلِّ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰٓى اٰلِ مُحَمَّدٍ كَمَا صَلَّيْتَ عَلٰٓى اٰلِ اِبْرَاهِيْمَ

وَبَارِكْ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰٓى اٰلِ مُحَمَّدٍ كَمَا بَارَكْتَ عَلٰٓى اِبْرَاهِيْمَ

فِى الْعَالَمِيْنَ اِنَّكَ حَمِيْدٌ مَّجِيْدٌ۔ مسلم

"అల్లాహుమ్మ సల్లిఅలా ముహమ్మదివ్వ అలాఆలి ముహమ్మదిన్ కమా సల్లయిత అలాఆలి ఇబ్రాహీమ. వ బారిక్ అలా ముహమ్మదిఁ వ్వ అలాఆలి ముహమ్మ దిన్ కమాబారక్త అలా ఇబ్రాహీమ ఫిల్ ఆలమీన ఇన్నక హమీదుమ్మజీద్" (ముస్లిం)

అల్లాహ్, ఏ విధంగానయితే నీవు ఇబ్రాహీమ్ (అలై) అనుయాయులపై దయచూపావో అదే విధంగా ముహమ్మద్ (సఅసం)పై ముహమ్మద్ (సఅసం) అనుయాయులపై దయచూపు. ఏ విధంగానైతే నీవు ప్రపంచంలో ఇబ్రాహీం (అలై) పై శుభాలను వర్షింపజేశావో అదే విధంగా ముహమ్మద్‌పైనా, ముహమ్మద్ (సఅసం) అనుయాయులపైనా శుభాలను వర్షింపజెయ్యి. నిస్సందేహంగా నీవు అత్యంత పవిత్రమైన గుణాలు గలవాడవు, మహోన్నతుడవు.

# 6 ఖుర్బానీ దుఆ

ఖుర్బానీ చేయవలసిన పశువు ముఖాన్ని ఖిబ్లాదిశకు పరుండబెట్టి మొదట ఈ దుఆ పఠించాలి.

إِنِّیْ وَجَّهْتُ وَجْهِیَ لِلَّذِیْ فَطَرَ السَّمٰوٰتِ وَالْاَرْضَ حَنِیْفًا وَّمَآ
اَنَا مِنَ الْمُشْرِکِیْنَ ، اِنَّ صَلٰوتِیْ وَنُسُکِیْ وَمَحْیَایَ وَمَمَاتِیْ لِلّٰهِ
رَبِّ الْعٰلَمِیْنَ لَاشَرِیْکَ لَهٗ وَبِذٰلِكَ اُمِرْتُ وَاَنَا مِنَ الْمُسْلِمِیْنَ
اَللّٰهُمَّ لَكَ وَمِنْكَ۔

"ఇన్నీ వజ్జహ్తు వజ్ హి యలిల్లజీ ఫతరస్సమావాతి వల్ అర్ జ హనీఫవ్వమా అనా మినల్ ముష్రికీన్; ఇన్న సలాతీ వనుసుకీ వమహ్యాయ వ మమాతీ లిల్లాహి రబ్బిల్ ఆలమీన లాషరీకలహూ వ బిజాలికవుమిర్తు వఅనా మినల్ ముస్లిమీన్; అల్లాహుమ్మ లక వమిన్క్."

నేను పూర్తి ఏకాగ్రతతో భూమ్యాకాశాలను సృష్టించిన దేవుని వైపునకు నా ముఖాన్ని తిప్పాను. నేను షిర్క్ చేసేవారికి చెందినవాడినికాను. నా నమాజ్, నా ఖుర్బానీ, నా జీవితం, నా మరణం సమస్తం విశ్వప్రభువు కోసమే. ఆయనకు ఎవరూ సాటిలేరు. ఈ ఆదేశమే నాకు లభించింది. నేను ముస్లిమ్ని, విధేయుడిని. దేవా! ఇది నీవు ప్రసాదించినదే, నీకే సమర్పితం.

తర్వాత " బిస్మిల్లాహ్ అల్లాహు అక్బర్" అంటూ పదునైన కత్తితో పశువు మెడను "జిబహ్" చేయాలి. పిదప ఈ దుఆ పఠించాలి.

اَللّٰهُمَّ تَقَبَّلْهُ مِنِّیْ كَمَا تَقَبَّلْتَ مِنْ خَلِیْلِكَ اِبْرَاهِیْمَ وَحَبِیْبِكَ
مُحَمَّدٍ عَلَیْهِمَا الصَّلٰوةُ وَالسَّلَامُ۔

"అల్లాహుమ్మ తకబ్బల్హు మిన్నీ కమాతకబ్బల్లత మిన్ ఖలీలిక ఇబ్రాహీమ వ హబీబిక ముహమ్మదిన్ అలైహిమ స్సలాతు వస్సలామ్."

(ఒకవేళ కుర్బానీ పశువులో ఒకరికన్నా ఎక్కువవాటాదారులుంటే ఈ దుఆలో "మిన్నీ" అనే పదానికి బదులుగా "మిన్" అనే పదాన్ని పఠించి వాటా దారుల పేర్లను పలకాలి).

దేవా! నీవు నా ఈ కుర్బానీని స్వీకరించు, నీవు, నీ మిత్రులయిన ఇబ్రాహీమ్ (అలైహి) ముహమ్మద్ (సఅసం)ల కుర్బానీని అంగీకరించినట్టే. వారుభయులకూ శాంతి కలుగుగాక!

కుర్బానీ పశువును ఇతరులచే కూడా "జిబహ్" చేయించవచ్చు. అయితే స్వయంగా మీరే జిబహ్ చేయడం మంచిది. జిబహ్ చేసేటప్పుడు పూర్తి స్పృహతో మీరు పఠించే దుఆలలోని భావంపైన దృష్టికేంద్రీకరించాలి. అంటే "మా సర్వస్వం దేవుని కొరకే, ఆయన మార్గంలోనే ఇదంతా అర్పితం కావాలి. ఆయన ఆదేశంతో, ఆయన మార్గంలో ఈ రోజు మేము పశువుని కుర్బానీ చేస్తున్నాము. రేపటి రోజు ఆయన ఆజ్ఞయితే ఈ భావాలతోనే మాకు ప్రియప్రదమయిన మా ప్రాణాన్ని సయితం ఆయన మార్గంలో అర్పిస్తాము." అనే భావన కలగాలి.

# 7. అకీకా దుఆ

అకీకా అంటే మేక లేక మేక పోతును బిడ్డపుట్టిన ఏడవ దినాన ఆబిడ్డ తరపున సద్‌కాగా జిబహ్ చేయడం అని అర్థం.

మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు.

"ఏడవ దినం పిల్లవాడికి నామకరణం చేయాలి. అతని వెంట్రుకలు గొరిగించి మలినం అంతా దూరంచేయాలి. తర్వాత అతని తరపున అకీకా చేయాలి.

పశువును జిబహ్ చేస్తున్నప్పుడు దాన్ని ఖిబ్లాకు అభిముఖంగా పడుకోబెట్టాలి. ఖుర్బానీ పశువును జిబహ్ చేసే ముందు పఠించే దుఆను మొదట పఠించాలి. అంటే **"ఇన్నీ వజ్జహ్‌తు నుండి లకవమిన్‌క"** వరకు పఠించాలి. తర్వాత **బిస్మిల్లాహి అల్లాహు అక్బర్** అంటూ పదునైన కత్తితో మెడకోసి జిబహ్ చెయ్యాలి.

ఆ తర్వాత ఈ దుఆ పఠించాలి.

اَللّٰهُمَّ هٰذِهٖ عَقِيْقَةُ ........ تَقَبَّلْهُ كَمَا تَقَبَّلْتَ مِنْ حَبِيْبِكَ

مُحَمَّدٍ وَّخَلِيْلِكَ اِبْرَاهِيْمَ عَلَيْهِمَا الصَّلٰوةُ وَالسَّلَامُ دَمُهَا بِدَمِهٖ

لَحْمُهَا بِلَحْمِهٖ شَعْرُهَا بِشَعْرِهٖ عَظْمُهَا بِعَظْمِهٖ -

**"అల్లాహుమ్మ హాజిహీ అకీకతు... తఖబ్బల్‌హు కమాతఖబ్బల్‌త మిన్ హబీబిక ముహమ్మదివ్వ ఖలీలిక ఇబ్రాహీమ అలైహిముస్సలాతు వస్సలాము. దముహూ బిదమిహీ లహ్‌ముహూ బిలహ్‌మిహీ షా'రుహు బిషా'రిహీ అజ్‌ముహూ బి అజ్ మిహ్"**

ఇక్కడ హాజిహీ అకీకతు అన్న తర్వాత అకీకా చేస్తున్న పిల్లవాడి పేరును లేక పాప పేరును పలకాలి.

**"ఓ దేవా! ఈ అకీకా.........కి చెందింది. దీన్ని స్వీకరించు, నీవు నీ ప్రేమపాత్రుడయిన ముహమ్మద్ (సఅసం) నీ మిత్రుడయిన ఇబ్రాహీమ్**

(అలై)ల తరుపున స్వీకరించిన విధంగా. దీని రక్తం పిల్లవాడి రక్తానికి ఫిదియా, దీనిమాంసం పిల్లవాడి శరీరానికి ఫిదియా, దీని వెంట్రుకలు పిల్లవాడి వెంట్రుకలకు ఫిదియా. దీని ఎముకలు పిల్లవాడి ఎముకలకు ఫిదియా. (దేవా దీన్ని స్వీకరించు.)"

స్తోమత కలిగిన వారు తమ సంతానం తరఫున తప్పకుండా సద్కా ఇవ్వాలి. అకీకా ఒక మంచి సద్కా, మగపిల్లవాడయితే రెండు మేకలు లేక మేకపోతులను జిబహ్ చేయాలి. ఆడపిల్లయితే ఒకమేక లేక మేక పోతును జిబహ్ చేయాలి. మగపిల్లవాడికి కూడా ఒకే మేకను బలి ఇవ్వడం సముచితమే, అయితే స్తోమత లేనటువంటి వారు, పేదరికంతో బాధపడుతున్నా అకీకా చేయడం అవసరమని భావించి మోయలేని భారంతో ఈ బాధ్యతను నిర్వహించడం మాత్రం తగని పని.

అకీకా మాంసాన్ని కూడా పంచవచ్చు. ఐతే వండిన తర్వాత దాన్ని పేదలకు, అగత్యపరులకు, ఇరుగుపొరుగు వారికి పంపించడం మంచిది. బంధువులకు, స్నేహితులకు కూడా అకీకా మాంసాన్ని ఇవ్వవచ్చు.

హజ్రత్ హసన్ (రజిఅన్) అకీకా సమయంలో మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు: " పశువు కాలు ఒకటి దాయాకు పంపించండి. మిగిలింది మీరు భుజించండి, ఇతరులకు పెట్టండి." (అబూదావూద్)

# 8. తరావీహ్ దుఆ

'తరావీహ్' తర్వీహ్‌కు బహువచనం. తరావీహ్‌లో ప్రతి నాలుగు రకాత్‌ల తర్వాత కూర్చోవడాన్ని, విశ్రాంతి తీసుకోవడాన్ని తర్వీహ్ అంటారు. అందువల్ల రమజాన్‌లో అదనంగా చేసే నమాజ్‌ని తరావీహ అంటారు. తర్వీహ అంటే ప్రతి నాలుగు రకాత్‌ల తర్వాత కూర్చోవడం, విశ్రాంతి తీసుకోవడం (మస్నూన్) ప్రవక్త సంప్రదాయం. తర్వీహ్‌లో ఈ దుఆ పఠించాలి.

سُبْحَانَ ذِي الْمُلْكِ وَالْمَلَكُوتِ سُبْحَانَ ذِي الْعِزَّةِ وَالْعَظَمَةِ
وَالْهَيْبَةِ وَالْقُدْرَةِ وَالْكِبْرِيَاءِ وَالْجَبَرُوتِ۔ سُبْحَانَ الْمَلِكِ
الْحَيِّ الَّذِي لَا يَنَامُ وَلَا يَمُوتُ سُبُّوحٌ قُدُّوسٌ، رَبُّنَا وَرَبُّ
الْمَلَائِكَةِ وَالرُّوحِ اَللّٰهُمَّ أَجِرْنَا مِنَ النَّارِ يَا مُجِيرُ يَا مُجِيرُ
يَا مُجِيرُ۔

"సుబహాన జిల్ ముల్కి వల్ మలకూతి సుబహాన జిల్ ఇజ్జతి వల్ అజ్మతి వల్ హైబతి వల్ ఖుద్ రతి వల్ కిబ్ రియాయి వల్ జబ్ రూత్ సుబ్ హానల్ మలికిల్ హయ్యిల్లజి లాయనాము వలా యమూతు సుబ్బూహున్, కుద్దూసున్ రబ్బునా వరబ్బుల్ మలాయికతి వర్రూహ్. అల్లాహుమ్మ అజిర్ నా మినన్నారి యా ముజీరు యాముజీరు యాముజీర్."

ప్రభుత్వం, అధికారం కలవాడయిన ఆయన పవిత్రుడు, గౌరవం, ఔన్నత్యం, శక్తి, ఘనత, ఉత్కృష్టతలు కలవాడైన ఆయన పవిత్రుడు. నిత్యుడు, శాశ్వతుడు, సార్వభౌముడైన ఆయన పవిత్రుడు.

ఆయన ఎన్నిటికీ నిద్రించడు, ఆయనకు నాశనం లేదు. ఆయన అత్యంత పవిత్రుడు నిష్కల్మషుడు. ఆయన మా ప్రభువు, దైవదూతల ప్రభువు. హజ్రత్ జిబ్రయీల్ ప్రభువు.

ఓ దేవా! మమ్మల్ని నరకాగ్ని నుంచి రక్షించు. రక్షకుడా! రక్షకుడా!! రక్షకుడా!!!

తరావీహ నమాజ్ సామూహికంగా చేయాలి. వీలుంటే పూర్తిఖుర్‌ఆన్‌ను నమాజ్‌లో వినడానికి ప్రయత్నించాలి. తరావీహని అత్యంత గౌరవ భావంతో, ఎంతో శ్రద్ధాసక్తులతో, నిదానంగా సమతూకంగా ఖుర్‌ఆన్ పఠించే హాఫీజ్ వెనుక ఈ నమాజ్ చెయ్యడానికి ప్రయత్నించాలి. వెనుక నమాజ్ చేసేవారు చికాకు పడేలా హాఫిజ్ నమాజ్‌లో ఎక్కువ ఆలస్యం చేయకూడదు.

పవిత్ర ఖుర్‌ఆన్‌ను పఠించవలసిన రీతిలో విస్పష్టంగా పఠించాలి. తలమీద భారాన్ని దించుకుంటున్నట్టు ఖుర్‌ఆన్‌ని వేగంగా, అర్థం చేసుకోకుండా పఠించడం వాస్తవంగా ఖుర్‌ఆన్ పట్ల అత్యాచారం జరపటమే అవుతుంది. ఖుర్‌ఆన్‌పై మనస్సు లగ్నం చేసి, ఏకాగ్రతతో భావాన్ని అర్థం చేసుకుంటూ పఠించాలి.

అలాగే తరావీహ నమాజ్ కూడా ప్రశాంత హృదయంతో, నిదానంగా ఏకాగ్రతతో చేసుకోవాలి. నిర్లక్ష్యంతో, అతివేగంగా రుకూ, సజ్‌దాలు చేయడం నమాజ్ లక్ష్యాన్ని నిర్లక్ష్యం చేయటమే. అలా చేస్తే నమాజ్‌లోని మాధుర్యాన్ని కూడా కోల్పోతారు.

# 9. కునూతె నాజిలా

ఒకవేళ విశ్వాసులు ఏదయినా విషమ పరిస్థితికి లోనయి వారికి శత్రుభయం ఆవహించి ఉంటే నమాజ్‌లలో, కునూతెనాజిలా పఠించాలి – ముఖ్యంగా ఫజ్ర్ నమాజ్‌లో. ఫజ్ర్ నమాజ్ రెండవ రకాత్‌లో రుకూ నుండి లేవగానే నిల్చుని ఈ దుఆ చదవాలి. తర్వాత సజ్‌దా చేయాలి. దైవ ప్రవక్త (సఅసం), ఆయన అనుచరులు (రజి) విషమ పరిస్థితుల్లో ఈ దుఆను నమాజ్‌లలో పఠించారని హదీసుల వల్ల తెలుస్తున్నది. ముఖ్యంగా ఫజ్ర్ నమాజ్‌లో దీన్ని పఠించేవారు.

اَللّٰهُمَّ اهْدِنَا فِيْمَنْ هَدَيْتَ وَعَافِنَا فِيْمَنْ عَافَيْتَ وَتَوَلَّنَا
فِيْمَنْ تَوَلَّيْتَ وَبَارِكْ لَنَا فِيْمَا اَعْطَيْتَ وَقِنَا شَرَّ مَا قَضَيْتَ فَاِنَّكَ
تَقْضِيْ وَلَا يُقْضٰى عَلَيْكَ اِنَّهٗ لَا يَذِلُّ مَنْ وَّالَيْتَ وَلَا يَعِزُّ مَنْ
عَادَيْتَ تَبَارَكْتَ رَبَّنَا وَتَعَالَيْتَ نَسْتَغْفِرُكَ وَنَتُوْبُ اِلَيْكَ ۝
اَللّٰهُمَّ عَذِّبِ الْكَفَرَةَ الَّذِيْنَ يَصُدُّوْنَ عَنْ سَبِيْلِكَ وَ
يُكَذِّبُوْنَ رُسُلَكَ وَيُقَاتِلُوْنَ اَوْلِيَآءَكَ ۔ اَللّٰهُمَّ اغْفِرْ لِلْمُؤْمِنِيْنَ
وَالْمُؤْمِنَاتِ وَالْمُسْلِمِيْنَ وَالْمُسْلِمَاتِ وَاَصْلِحْ ذَاتَ بَيْنِهِمْ وَاَلِّفْ
بَيْنَ قُلُوْبِهِمْ وَاجْعَلْ فِيْ قُلُوْبِهِمُ الْاِيْمَانَ وَالْحِكْمَةَ وَثَبِّتْهُمْ
عَلٰى مِلَّةِ رَسُوْلِكَ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَاَوْزِعْهُمْ اَنْ يُّوْفُوْا
بِعَهْدِكَ الَّذِيْ عَاهَدْتَّهُمْ عَلَيْهِ وَانْصُرْهُمْ عَلٰى عَدُوِّكَ وَ
عَدُوِّهِمْ اِلٰهَ الْحَقِّ وَاجْعَلْنَا مِنْهُمْ ۔

"అల్లాహుమ్మహ్‌దినా ఫీమన్ హదైత వ ఆఫినా ఫీమన్ ఆఫైత వత వల్లినా ఫీమన్ తవల్లైత వబారిక్ లనా ఫీమా ఆతైత వకినా షర్రమా ఖజైత ఫ ఇన్నక తక్ జియ వలాయుక్‌జా అలైక ఇన్నహూ లా యజిల్లు మవ్వాలైత వలాయఇజ్జు మన్ ఆదైత తబారక్‌త రబ్బనా వత ఆలైత

నస్తగ్ఫిరుక వనతూబు ఇలైక్ అల్లాహుమ్మ అజ్జిబిల్ కఫరతల్లజీన యసుద్దూన అన్ సబీలిక వ యుకజ్జిబూన రుసులుక వ యుఖాతిలూన ఔలియాఅక అల్లాహుమ్మగ్ ఫిర్ లిల్ మూమినీన వల్ మూమినాతి వల్ ముస్లిమీన వల్ ముస్లిమాతి వఅస్లిహ్ జాత బైనిహిమ్ వ అల్లిఫ్ బైన కులూబిహిమ్ వజ్ అల్ ఫీ కులూబిహిముల్ ఈమాన వల్ హిక్మత వ సబ్బిత్ హుమ్ అలా మిల్లతి రసూలిక సల్లల్లాహు అలైహి వ సల్లమ వఅవ్ జీ'హుమ్ అఁయ్యూఫూ బి అహ్దికల్లజీ ఆహద్తహుమ్ అలైహి వన్ సుర్ హుమ్ అలా అదువ్విక వ అదువ్విహిమ్ ఇలాహల్ హఖ్ఖి వజ్ అల్ నా మిన్ హుమ్."

దేవా! నీవు మాకు సన్మార్గాన్ని ప్రసాదించి సన్మార్గగాములలో చేర్చు. మాకు శ్రేయస్సును ప్రసాదించి శ్రేయస్సు పొందినవారిలో చేర్చు. నీవు మా రక్షకుడవై నీ రక్షణ పొందిన వారిలో మమ్మల్ని చేర్చు. నీవు మాకు ప్రసాదించిన వాటిలో వృద్ధిని కలిగించు. నీవు నిర్ణయించిన చెడుల చెడుగునుండి మమ్మల్ని కాపాడు. నీవే అన్నిటిని నిర్ణయిస్తావు. నీపైన ఎవరి నిర్ణయమూ చెల్లదు. నీ రక్షణ పొందిన వారు ఎన్నటికీ అవమానంపాలు కాలేరు. నీచే శత్రువుగా పరిగణించబడిన వాడు ఎన్నటికీ గౌరవం పొందలేదు. నీవు అత్యంత శుభాలు ప్రసాదించే వాడవు.

మహోన్నతుడు, మహోత్కృష్టుడవయిన మా ప్రభూ! మేము నిన్ను క్షమాపణ అర్థిస్తున్నాము! నీ సన్నిధిలో పశ్చాత్తాపాన్ని వెల్లడిస్తున్నాము. దేవా! నీ మార్గంలో అవరోధాలు సృష్టిస్తున్న, నీ ప్రవక్తలను తిరస్కరిస్తున్న, నీ భక్తులతో పోరాడుతున్న తిరస్కారులను శిక్షించు.

దేవా! విశ్వసించిన పురుషులను, స్త్రీలను, ముస్లిమ్ పురుషులను, స్త్రీలను క్షమించు. వారి పరస్పర సంబంధాలను మెరుగుపరచు. వారి అంతరాళాల్లో ప్రేమ, విశ్వాసం, వివేకం సృజించు. వారిని వారి ప్రవక్త (సఅసం) సమాజంలో స్థిరంగా ఉంచు. నీవు వారినుంచి తీసుకున్న వాగ్దానాన్ని వారు నేరవేర్చగలిగే సద్బుద్ధిని అనుగ్రహించు. నీకూ, వారికీ శత్రువులైన వారిని ఎదుర్కొనేలా వారికి సహాయం చెయ్యి. దేవా! మా మొరలను ఆలకించు, మమ్మల్ని కూడా వారిలో చేర్చు.

# 10 హాజత్ నమాజ్

ఎప్పుడయినా ఏదయినా చిన్నదైనా పెద్దదైనా అవసరం ఏర్పడినప్పుడల్లా దేవుని సన్నిధిలో నిల్చొని రెండు రకాత్‌ల నఫిల్ (సలాతుల్ హాజిత్) నమాజ్ చేసుకోవాలి. తర్వాత దేవుణ్ణి స్తుతించి దరూద్ చదివి ఈ దుఆ పఠించాలి. అప్పుడు దేవుడు మీ దుఆను స్వీకరిస్తాడని ఆశించగలం. మహాప్రవక్త (సఅసం) అన్నారు:

"ఎవరికయినా దేవునితో లేదా తోటి మనిషితో ఏదయినా అవసరం కలిగినప్పుడు అతను బాగా వుజూ చేసి రెండు రకాత్‌ల నమాజ్ చేయాలి. తర్వాత దేవుణ్ణి స్తుతించాలి. ప్రవక్త (సఅసం) కోసం దరూద్ పఠించాలి. ఆ తర్వాత దేవునితో ఇలా దుఆ చేయాలి."

لَآ اِلٰهَ اِلَّا اللّٰهُ الْحَلِيْمُ الْكَرِيْمُ سُبْحَانَ اللّٰهِ رَبِّ الْعَرْشِ
الْعَظِيْمِ وَالْحَمْدُ لِلّٰهِ رَبِّ الْعَالَمِيْنَ اَسْئَلُكَ مُوْجِبَاتِ رَحْمَتِكَ
وَعَزَآئِمَ مَغْفِرَتِكَ وَالْغَنِيْمَةَ مِنْ كُلِّ بِرٍّ وَّالسَّلَامَةَ مِنْ
كُلِّ اِثْمٍ لَا تَدَعْ لِيْ ذَنْبًا اِلَّا غَفَرْتَهٗ وَلَا هَمًّا اِلَّا فَرَّجْتَهٗ وَلَا
حَاجَةً هِيَ لَكَ رِضًا اِلَّا قَضَيْتَهَا يَا اَرْحَمَ الرَّاحِمِيْنَ۔ (ترمذی،
ابن ماجہ)

"లా ఇలాహ ఇల్లల్లాహుల్ హలీముల్ కరీము, సుబ్‌హానల్లాహి రబ్బుల్ అర్‌షిల్ అజీమ్ వల్‌హమ్‌దు లిల్లాహి రబ్బిల్ ఆలమీన్ అస్‌అలుక మూజిబాతి రహ్‌మతిక వ అజాయిమ మగ్‌ఫిరతిక వల్ గనీమత మిన్ కుల్లి బిర్రివ్వస్సలామత మిన్‌కుల్లి ఇస్‌మిన్ లాతదాలి జమ్‌బన్ ఇల్లాగఫర్‌తహూ వలా హమ్మన్ ఇల్లాఫర్రజ్‌తహూ వలా హాజతన్ హి యలక రిజన్ ఇల్లా కజైతహా యా అర్‌హమ ర్రాహిమీన్." (తిర్మిజి, ఇబ్నుమాజ)

దేవుడు తప్ప ఇంకెవ్వరూ ఆరాధ్యదైవం లేడు. ఆయన గొప్ప ఉదారుడు, ఆయన ఎంతో కనికరించేవాడు, పరిశుద్ధుడు, పరమోన్నతుడు.

ఆయన మహత్తరమైన విశ్వసింహాసనానికి యజమాని. సర్వలోకాల పరిపోషకుడైన ఆయనే అన్ని కృతజ్ఞతలకూ, స్తుతులకూ అర్హుడు.

దేవా! నీ కారుణ్యం మన్నింపులు తప్పని సరిగా ప్రాప్తించే వాటి భిక్ష పెట్టమని వేడుకుంటున్నాను. ప్రతి శుభంలోనూ భాగం ప్రసాదించమని, ప్రతి పాపానికీ దూరంగా ఉంచమని అర్థిస్తున్నాను. దేవా! నీవు నా పాపాన్ని మన్నించకుండా, నా దుఃఖాన్ని దూరం చేయకుండా నన్ను వదలకు. నా అవసరం ఏదైనా, నీకిష్టమయిందయితే, దాన్ని నెరవేర్చకుండా విడిచిపెట్టకు. దయగలవారిలోకెల్లా అత్యధిక దయగలవాడా!

# 11 ఖుర్‌ఆన్ కంఠస్థం చేసుకునేందుకు

పవిత్ర ఖుర్‌ఆన్‌ను కంఠస్థం చేయడానికి, జ్ఞాపకం ఉంచుకోడానికి ప్రవక్త (సఅసం) హజ్రత్ అలీ (రజి)కు నేర్పిన దుఆను పఠించడం అలవరచుకోవాలి.

హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్నె అబ్బాస్ (రజి) ఇలా అన్నారు.

"ఒకసారి మేము ప్రవక్త (సఅసం) సమావేశంలో కూర్చొని ఉన్నాము. అప్పుడు హజ్రత్ అలీ (రజి) వచ్చి, తన జ్ఞాపకశక్తిని నిందించుకుంటూ, దైవ ప్రవక్తా నాకు ఖుర్‌ఆన్ ఆయత్‌లు జ్ఞాపకం ఉండడం లేదు. ఏది నేర్చుకున్నా జ్ఞాపకం ఉండడం లేదు" అని అన్నారు.

మహాప్రవక్త (సఅసం) హజ్రత్ అలీ (రజి) మాటలు విని, అబుల్ హసన్! నేను నీకొక దుఆ నేర్పనా, దాన్ని పఠిస్తే నీవూ లాభం పొందుతావు, ఇతరులకు నేర్పితే వారు కూడా లాభం పొందుతారు. నీవు ఏది నేర్చుకున్నా, అది నీ హృదయంలో నిలిచిపోయి జ్ఞాపకం ఉండేలా చేస్తుంది. అందుకు హజ్రత్ అలీ (రజి) 'దైవ ప్రవక్తా! అటువంటి దుఆను తప్పకుండా నేర్పండి' అన్నారు.

అప్పుడు ఆయన (సఅసం) ఆ దుఆను గురించి ఇలా విశదీకరించారు.

"శుక్రవారం రాత్రివేళ ఈ దుఆను పఠించు, మూడు లేక అయిదు లేక ఏడు శుక్రవారాల్లో క్రమం తప్పకుండా పఠించు. దైవానుగ్రహం వల్ల ఈ దుఆ గురి తప్పని బాణం వలె పనిచేస్తుంది. నాకు సత్య ధర్మాన్ని ప్రసాదించి పంపిన ఆ దేవుని సాక్షి! విశ్వాసి చేసే ఈ దుఆ ఎప్పుడూ నిరుపయోగం కాజాలదు."

హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్నె అబ్బాస్ (రజి) ఇలా అన్నారుః

"అయిదు లేక ఏడు శుక్రవారాలు గడిచాయోలేదో మళ్ళీ ఒక రోజు హజ్రత్ అలీ (రజి) మొదటిసారి వలె ప్రవక్త (సఅసం) సమావేశానికి వచ్చి "ప్రవక్తా! మొదట నేను నాలుగు ఆయత్‌లు కంఠస్థం చేసేవాణ్ణి, కానీ తిరిగి వల్లించేటప్పుడు వాటిని మరచిపోయే వాణ్ణి, ఐతే ఇప్పుడు నేను నలభయి ఆయత్‌ల వరకు జ్ఞాపకం చేస్తున్నాను, తిరిగి వాటిని వల్లించే తరుణంలో, దైవ గ్రంథం తెరుచుకొని నా ముందు ఉన్నట్లే అనిపిస్తుంది. అలాగే పూర్వం నేను ఒక హదీసు విని తిరిగి వల్లించడానికి యత్నిస్తే మరచిపోయేవాణ్ణి. ఇప్పుడేమో ఎన్నో హదీసులు వింటున్నాను వాటిని చెప్పు జెప్పేటప్పుడు ఒక అక్షరం కూడా

తప్పుపోవడం లేదు" అన్నారు.

మహాప్రవక్త (సఅసం) అదివిని "కాబా ప్రభువు సాక్షి! అబుల్ హసన్ నిజమైన విశ్వాసి" అన్నారు.

దుఆను పఠించే పద్ధతిని విపులీకరిస్తూ మహాప్రవక్త(సఅసం) ఇలా హితవు చేశారు. శుక్రవారం రాత్రి ఈ దుఆ పఠించాలి. నా సోదరుడు యాఖూబ్(అలై) కుమారులు తమ క్షమాపణ కొరకు దుఆ చేయమని ఆయనను అభ్యర్థించినప్పుడు త్వరలో నేను మీ క్షమాపణ కొరకు దుఆ చేస్తాను అని ఆయన అన్నారు. అంటే శుక్రవారం రాత్రి వచ్చాక మీ కొరకు దుఆ చేస్తాను అని హజ్రత్ యాకూబ్ (అలై) ఉద్దేశ్యం. కాబట్టి అలీ(రజి)! నీవు శుక్రవారంరోజు తహజ్జుద్ సమయాన లేవాలి. ఎందుకంటే ఈ సమయం దుఆ స్వీకరించబడే సమయం. ఆ సమయంలో మనస్సు నిశ్చలంగా ఉంటుంది. ఒకవేళ 'రాత్రి చివరి భాగంలో మేల్కోలేకపోతే అర్థ రాత్రి మేలుకో, ఒకవేళ అర్థరాత్రివేళ కూడా మేల్కోలేకపోతే రాత్రి మొదటి భాగంలో నాలుగు రకాత్‌ల నఫిల్ నమాజ్ చెయ్యి. మొదటి రకాత్‌లో ఫాతిహా సూర, తర్వాత, "యాసీన్" సూర, రెండవ రకాత్‌లో ఫాతిహా సూరాతోపాటు దుఖ్ఖాన్ సూరా, మూడవ రకాత్‌లో ఫాతిహా సూరా తర్వాత "అలిఫ్ లాం మీమ్ సజ్‌ద" సూరా, నాల్గవ రకాత్‌లో ఫాతిహా సూరా తర్వాత "ముల్క్" సూరా పఠించాలి. తర్వాత అత్తహియ్యాత్ చదివి సలామ్ చేయాలి. ఆపై దేవుణ్ణి స్తుతించాలి. మంచి రీతిలో (అంతిమ దైవ) ప్రవక్త (సఅసం) కొరకు ఇతర సమస్త ప్రవక్తల కొరకు దరూద్ సలామ్ పఠించాలి. తర్వాత విశ్వాసులయిన పురుషులు విశ్వాసులయిన స్త్రీలందరికి మన్నింపునకై దుఆ చేయాలి. నీ కంటే ముందు విశ్వసించిన సోదరుల మన్నింపు కొరకు వేడుకోవాలి. తరువాత ఈ దుఆ పఠించాలి.

اَللّٰهُمَّ ارْحَمْنِيْ بِتَرْكِ الْمَعَاصِيْ اَبَدًا مَّا اَبْقَيْتَنِيْ وَارْحَمْنِيْ
اَنْ اَتَكَلَّفَ مَا لَا يَعْنِيْنِيْ وَارْزُقْنِيْ حُسْنَ النَّظَرِ فِيْمَا يُرْضِيْكَ عَنِّيْ
اَللّٰهُمَّ بَدِيْعَ السَّمٰوٰتِ وَالْاَرْضِ ذَا الْجَلَالِ وَالْاِكْرَامِ وَالْعِزَّةِ
الَّتِيْ لَا تُرَامُ اَسْئَلُكَ يَا اَللّٰهُ يَا رَحْمٰنُ بِجَلَالِكَ وَنُوْرِ
وَجْهِكَ اَنْ تُلْزِمَ قَلْبِيْ حِفْظَ كِتَابِكَ كَمَا عَلَّمْتَنِيْ وَارْزُقْنِيْ
اَنْ اَتْلُوَهٗ عَلَى النَّحْوِ الَّذِيْ يُرْضِيْكَ عَنِّيْ اَللّٰهُمَّ بَدِيْعَ السَّمٰوٰتِ

وَالْاَرْضِ ذَاالْجَلَالِ وَالْاِكْرَامِ وَالْعِزَّةِ الَّتِىْ لَاتُرَامُ اَسْئَلُكَ
يَا اَللّٰهُ يَارَحْمٰنُ بِجَلَالِكَ وَنُوْرِ وَجْهِكَ اَنْ تُنَوِّرَبِكِتَابِكَ
بَصَرِىْ وَاَنْ تُطْلِقَ بِهٖ لِسَانِىْ وَاَنْ تُفَرِّجَ بِهٖ عَنْ قَلْبِىْ وَاَنْ
تَشْرَحَ بِهٖ صَدْرِىْ وَاَنْ تَغْسِلَ بِهٖ بَدَانِىْ فَاِنَّهٗ لَا يُعِيْنُنِىْ
عَلَى الْحَقِّ غَيْرُكَ وَلَا يُؤْتِيْهِ اِلَّآ اَنْتَ وَلَاحَوْلَ وَلَا قُوَّةَ اِلَّابِاللّٰهِ
الْعَلِىِّ الْعَظِيْمِ۔ (ترمذی)

"అల్లాహుమ్మర్ హమ్‌నీ బితర్ కిల్ మఆసీ అబదమ్‌మ్మా అబ్కై తనీ, వర్ హమ్‌నీ అన్ అతకల్లఫ మాలాయానీనీ, వర్ జుక్ నీ హుస్‌నన్నజ్ రి ఫీమా యుర్ జీక అన్నీ. అల్లాహుమ్మ బదీ అస్సమావాతి వల్ అర్ జి జల్ జలాలి వల్ ఇక్రామి వల్ ఇజ్జతిల్లతీ లాతురాము అస్‌అలుక యాఅల్లాహు యా రహ్మాను బిజలాలిక వనూరి వజ్ హిక అన్ తుల్ జిమ కల్ బీ హిఫ్‌జ కితాబిక కమా అల్లమ్‌తనీ వర్ జుక్ నీ అన్ అత్ లువహూ అలన్నహ్ విల్లజీ యుర్ జీక అన్నీ. అల్లాహుమ్మ బదీ అస్సమావాతి వల్ అర్ జి జల్ జలాలి వల్ ఇక్రామి వల్ ఇజ్జతిల్లతీ లాతురాము అస్‌అలుక యా అల్లాహు యా రహ్మాను బిజలాలిక వనూరి వజ్ హిక అన్ తునవ్విర బికితాబిక బసరీ వఅన్ తుత్ లిక బిహీ లిసాని వ అన్ తుఫర్రిజ బిహీ అన్ కల్ బీ వ అన్ తష్‌రహబిహీ సద్ రీ వఅన్ తగ్ సిల బిహీ బదనీ ఫ ఇన్నహూ లాయుఈనునీ అలల్ హఖ్ఖి గైరుక వలా యూతీహి ఇల్లా అన్త వలాహౌల వలా కువ్వత ఇల్లా బిల్లాహిల్ అలీయ్యిల్ అజీమ్." (తిర్మిజి)

"దేవా! నీవు నన్ను బ్రతకనిచ్చినన్నాళ్ళు ఎల్లప్పుడూ నేను పాపాలకు దూరంగా ఉండేలా నన్ను నీ కారుణ్యంతో కటాక్షించు. నీ కారుణ్యంతో లక్ష్య రహితమైన వ్యర్థమైన విషయాలకు దూరంగా ఉండే శక్తిని ప్రసాదించు. నీ సంతోషం ప్రాప్తించే కార్యాల విషయంలో నాకు మంచి పరిశీలనా దృష్టినీ అవగాహనా దృష్టినీ ప్రసాదించు. దేవా! భూమ్యాకాశాలను ఏ పూర్వపు నమూనా లేకుండా సృష్టించినవాడా! ఔన్నత్యం, గౌరవం కలవాడా! ఎదిరించనలవికాని పరమోన్నత అధికారం కలవాడా! ఓ దేవా! ఓ కరుణామయుడా! నీ ఘనతను,

నీ జ్యోతిని సాక్షీభూతంగా ఉంచి అర్థిస్తున్నాను. ఏ విధంగానయితే నీవు నీ గ్రంథాన్ని నాకు బోధించావో అదే విధంగా నాకు దాన్ని జ్ఞాపకం ఉంచుకునే శక్తినీ ప్రసాదించు. ఆ గ్రంథాన్ని ఎలా పఠిస్తే నీ సంతోషం ప్రాప్తిస్తుందో, అలా పఠించేలా నన్ను అనుగ్రహించు.

భూమ్యాకాశాల సృష్టికర్తా! ఔన్నత్యం గౌరవం కలవాడా! ఎదిరించనలివికాని అధికారంకలవాడా! ఓ దేవా! ఓ కరుణామయుడా! నేను నీ ఘనతను, నీ మహోజ్వల జ్యోతి సాక్షిగా నిన్ను అభ్యర్థిస్తున్నాను, నీ గ్రంథం జ్యోతితో నా కన్నులను కాంతిమంతం చెయ్యి. నా నోటి నుండి దాని పదాలను ధారాళంగా వెలువరింపజెయ్యి. నా హృదయం నుండి విచారాన్ని, దుఃఖాన్ని దూరం చెయ్యి. ఆ గ్రంథ శుభాలతో నా హృదయ కవాటాన్ని తెరువు. దాని శుభంతో నాశరీరాన్ని కడిగివేసి పరిశుద్ధం చెయ్యి. ధర్మం విషయంలో నీవు తప్ప నాకు సహాయం చేయగల శక్తినివ్వగలవారెవరూ లేరు. సత్యాన్ని ప్రసాదించేవాడివి నీవు మాత్రమే. పాపాలకు దూరంగా ఉండేందుకు పుణ్యకార్యాలపై స్థిరంగా ఉండేందుకు కావలసిన శక్తి, మహోన్నతుడయిన, మహాత్కృష్టుడయిన దేవుని ద్వారానే లభించగలదు.

# 12 ఖుర్‌ఆన్ అవగాహనకు దుఆ

దివ్య ఖుర్‌ఆన్‌ని పఠించడం, దాని భావాలను అధ్యయనం చేసి ఆలోచించడం, విశ్వాసి చేసే ప్రీతికరమయిన ఆరాధన. ఖుర్‌ఆన్ పఠనం పట్ల ఆసక్తి దేవునితో సంబంధానికి తార్కాణం. దేవునితో సంబంధం ఏర్పరచుకోడానికి మార్గం కూడా. ఖుర్‌ఆన్‌ని అధ్యయనం చేయడం, సునిశితంగా పరిశీలన చేయడం వల్ల విశ్వాసికి ఆధ్యాత్మిక ఆనందం కూడా కలుగుతుంది. దాని ద్వారానే అతనికోసం వివేచన, విచక్షణాజ్ఞానాల కవాటాలు తెరుచుకుంటాయి.

దివ్య ఖుర్‌ఆన్ నిస్సంశయంగా అత్యంత సరళమయిన, సులభమైన గ్రంథం. ఖుర్‌ఆన్ ద్వారా హితవు పొంది దాని ఆజ్ఞల్ని ఆచరించేందుకు ఖుర్‌ఆన్ బోధనలు అత్యంత సాధారణమయినవి, విస్పష్టమైనవి. ఎలాంటి చిక్కుల్లేనివి, పరిశుద్ధమయినవి. అయితే దాని నిగూఢభావాలను, మర్మ హేతువుల్ని అందులోని వివేచనను గ్రహించడానికి మీరు ఖుర్‌ఆన్ అవగాహనకు కావల్సిన మర్యాదలతో, షరతులతో దాన్ని అధ్యయనం చేయాలి. మనఃపూర్వకంగా దాన్ని గ్రహించే కోరికతో, దానిగురించి ఆలోచించాలి. ఎట్టి పరిస్థితిలోనూ దానిపట్ల నిర్లక్ష్యభావం, ఉపేక్షాభావం కనబరచరాదు. నిరంతరం అధ్యయనం చేస్తూనే ఉండాలి. జీవితమంతా అధ్యయనం చేస్తూనే ఉండాలి.

అధ్యయనం చేస్తున్నప్పుడు కొన్ని క్లిష్టమయిన సందర్భాలు తారసపడతాయి. అక్కడ ఎంత లోతుగా పరిశీలన, చింతన జరిపినా మీ మనసు అర్థాన్ని గ్రహించి తృప్తిపడదు. మీరు దాన్ని ఒక చిక్కు సమస్యగా భావిస్తారు. కాని యదార్థానికి మీరు ఖుర్‌ఆన్‌ని అధ్యయనం చేయాలని తలిస్తే అసలు నిరాశా నిస్పృహలకు లోనుకాకూడదు. ఖుర్‌ఆన్‌పట్ల అభ్యంతరం తెలిపే అనుచితమయిన ఆలోచన మనస్సులో ఏర్పడనీయరాదు. చికాకుపడి ఖుర్‌ఆన్ గురించి చింతన, పరిశీలన చేయడం మానుకోరాదు. పూర్తి ఏకాగ్ర చిత్తులయి దైవం వైపునకు మరలాలి. సంపూర్ణంగా మనసు లగ్నం చేసుకొని దైవాన్ని ఈ కష్టతరమైన సమస్యకు పరిష్కారాన్ని అర్థించాలి. అంతేకాని ఖుర్‌ఆన్ ఆయత్‌లకు తమ అభిలాష, అభిప్రాయాలకు అనుగుణంగా తమకు ఇష్టమైన అర్థాలు కల్పించుకునే బుద్ధిహీనమయిన సాహసం చేయరాదు. ఒక సత్యాన్వేషిలా పవిత్ర ఖుర్‌ఆన్ పదాల ద్వారా ఏ అర్థమయితే స్ఫురిస్తుందో దానిపైనే స్థిరంగా నిలవాలి. తర్వాత అత్యంత దీనత్వంతో, వినమ్రతతో, ఆవేదనతో, దైవాన్ని వేడుకోవాలి.

దేవా! నా ఈ చిక్కును విడదీయి, వాస్తవమయిన భావార్థాన్ని విశదపరచు. యదార్థమయిన భావార్థం పట్ల నా మనస్సుకు తృప్తిని ప్రసాదించు అని ప్రార్థించాలి.

ఈ లక్ష్యసిద్ధికి రాత్రి నఫిల్ నమాజుల్లో కొంచెం బిగ్గరగా, నింపాదిగా ఖుర్ఆన్ పఠనం కూడా చేయాలి. దానితో బాటు ఈ దుఆ కూడా చేయాలి. దైవ చిత్తమైతే ఈ దుఆ వల్ల ఎంతో ఉపయోగం కలుగుతుంది.

ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు.

" దాసుడెవరయినా, ఏదైనా బాధలోనో, దుఃఖంలోనో ఉన్నప్పుడు ఈ దుఆ పఠిస్తే దేవుడు అతని దుఃఖాన్ని దూరం చేసి సంతోషాన్ని, ఆనందాన్ని ప్రసాదిస్తాడు."

اَللّٰهُمَّ اِنِّیْ عَبْدُكَ، اِبْنُ عَبْدِكَ، اِبْنُ اَمَتِكَ نَاصِيَتِیْ
بِيَدِكَ، مَاضٍ فِیْ حُكْمِكَ، عَدْلٌ فِیْ قَضَآءِكَ اَسْئَالُكَ بِكُلِّ
اسْمٍ هُوَلَكَ، سَمَّيْتَ بِهٖ نَفْسَكَ اَوْ اَنْزَلْتَهٗ فِیْ كِتَابِكَ
اَوْعَلَّمْتَهٗ اَحَدًا مِّنْ خَلْقِكَ اَوِاسْتَاْثَرْتَ بِهٖ فِیْ عِلْمِ الْغَيْبِ
عِنْدَكَ، اَنْ تَجْعَلَ الْقُرْاٰنَ رَبِيْعَ قَلْبِیْ، وَنُوْرَصَدْرِیْ وَجِلَآءَ
حُزْنِیْ وَذِهَابَ هَمِّیْ وَغَمِّیْ۔ (مسند احمد، ابن حبان)

"అల్లాహుమ్మ ఇన్నీ అబ్దుక ఇబ్ను అబ్దిక, ఇబ్ను అమతిక, నాసియతీ బియదిక్, మాజిన్ ఫీ హుక్మిక, అద్ లున్ ఫీ ఖజాయిక, అస్అలుక బికుల్లిస్మిన్ హువలక, సమ్మైతబిహీ నఫ్సక ఔ అన్ జల్ తహూ ఫీ కితాబిక, ఔ అల్లమ్ తహూ అహదమ్ మిన్ ఖల్ కిక అవిస్తాసర్ త బిహీ ఫీ ఇల్ మిల్ గైబి ఇన్దక, అన్ తజ్ అలల్ ఖుర్ఆన రబీఅ ఖల్ బీ వనూరసద్ రీ వజిలాఅ హుజ్ నీ, వజిహాబ హమ్మీ వగమ్మీ. (ముస్నద్ అహ్మద్- ఇబ్నె హిబ్బాన్)

ఓ దేవా! నేను నీ దాసుణ్ణి. నీ దాసుడి కుమారుణ్ణి, నీ దాసురాలి కుమారుణ్ణి, నా జుట్టు నీ చేతిలో ఉంది. నాపైన నీ అధికారమే చెల్లుతుంది. నా విషయంలో నీ నిర్ణయమే న్యాయవంతమైనది. ఏ పేర్లనయితే నీవు నీకై నామకరణం చేసుకున్నావో లేక నీవు నీ గ్రంథంలో అవతరింపజేశావో లేక నీ

సృష్టితాల్లో ఎవరికైనా తెలియ జేశావో, లేక నీవు నీ అగోచరాల భాండాగారంలో గుప్తంగానే ఉంచావో ఆ పేర్ల ఆధారంగా నిన్ను అభ్యర్థిస్తున్నాను. ఖుర్ఆన్‌ను నా మనస్సునకు వసంతంగాను, నా హృదయానికి కాంతిగాను, నా దుఃఖానికి నివారిణిగాను, ఆందోళనకు చికిత్సగాను చేయి.

ఈ హదీసును ఉల్లేఖించిన హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ (రజిఅన్) ఇలా అన్నారు. "మేము ఈ దుఆను నేర్చుకోవాలా?" అని కొందరు మహాప్రవక్త (సఅసం)ను అడుగగా ఆయన (సఅసం) "ఏ వ్యక్తి అయినా ఈ దుఆను వింటే, అతను దాన్ని తప్పకుండా నేర్చుకోవాలి, కంఠస్థం చేసుకోవాలి." అని సెలవిచ్చారు.

# 13 జుమా ప్రసంగం

ఇస్లామ్ భావాల ప్రేరణకు, విశ్వాసం పటిష్టం అవడానికి, దైవ సంస్మరణ విధులను ఒక రీతి, ఒక పద్ధతి ప్రకారం నిర్వహించడానికి జుమా ప్రసంగాన్ని అత్యంత ప్రభావవంతంగా, క్రమబద్ధంగా రూపొందించడం జరిగింది. సహజ రీతిలో ప్రతివారం విశ్వసించిన వారికి, వారి బాధ్యతలను గుర్తు చెయ్యడానికి, ధర్మ విధులను బోధించడానికి, ఇస్లామ్ సేవ చేసే తపనను పెంపొందించడానికి అనుపమానమయిన ఒక కార్యక్రమం అది. అయితే దాని వల్ల తగిన ప్రయోజనం పొందాలంటే శ్రోతలకు తెలిసిన భాషలో కూడా ప్రసంగించాలి.

ఇక రెండవ ప్రసంగానికి (ఖుత్‌బయే సానియ) సంబంధించినంత వరకు అది అరబీ భాషలోనే ఉండాలి. మొదటి ప్రసంగం మాత్రం శ్రోతలకు తెలిసిన భాషలో కూడా జరగాలి. ప్రస్తుత పరిస్థితులను ముందుంచుకుని ధర్మ విధులు ఏమిటో క్లుప్తంగా, సమగ్రంగా ఉపన్యాస రూపంలో తెలుపడం మంచిది.

ప్రతివారం క్రమం తప్పకుండా ఓ పద్ధతి ప్రకారం ప్రజల అభిప్రాయాలను మలచడానికి, ఆచరణను ప్రోత్సహించడానికి ప్రయత్నించాలి. ఒకవేళ మీరు అలా చేయజాలకపోతే కనీసం అరబీలో ఒక ప్రసంగాన్ని చదివి, దాని అనువయిన అనువాదాన్ని శ్రోతలు గ్రహించగల భాషలో వినిపించాలి. ఈ అరబీ ప్రసంగం విషయంలో మీరు ప్రవక్త (సఅసం) లేక ఖుల్‌ఫాయె రాషిదీన్ చేసిన ఏదైనా ఒక ప్రసంగాన్ని ఎంపిక చేసుకోవడం చాలా మంచిది.

మేము ప్రవక్త(సఅసం) చేసిన ప్రసంగంలోని వాక్యాలను దిగువ పొందు పరుస్తున్నాము.

మొదటి దాని ప్రాముఖ్యం ఏమంటే - ఇది చరిత్రాత్మకమయిన ప్రసంగం, హిజ్రత్ తర్వాత ఆయన (సఅసం) మదీనాలో మొదటి శుక్రవారం నాడు ఈ ప్రసంగం చేశారు. రెండవది, ఆయన(సఅసం)ఇందులో విశ్వసించినవారు ఖుర్‌ఆన్‌తో ప్రగాఢ సంబంధాన్ని ఏర్పరచుకోవాలని, దాన్ని నిరంతరం అధ్యయనం, అనుశీలనం చేస్తూ వుండాలని అత్యంత భావయుక్తంగా ప్రేరేపించారు. ఎందుకంటే దానితో సంబంధం ఏర్పరచుకోకుండా ధర్మంతో సంబంధం కలిగి ఉండడం అసంభవం.

**మదీనాలో ప్రథమ ప్రసంగం (ఖుత్బయె ఊలా) ఇది :**

اَلْحَمْدُ لِلّٰهِ اَحْمَدُهٗ وَاَسْتَعِيْنُهٗ وَاَسْتَغْفِرُهٗ وَاَسْتَهْدِيْهِ وَ
اُوْمِنُ بِهٖ وَلَآ اَكْفُرُهٗ ، وَاُعَادِيْ مَنْ يَّكْفُرُهٗ - وَاَشْهَدُ اَنْ لَّآ
اِلٰهَ اِلَّا اللّٰهُ وَحْدَهٗ لَا شَرِيْكَ لَهٗ وَاَشْهَدُ اَنَّ مُحَمَّدًا عَبْدُهٗ
وَرَسُوْلُهٗ - اَرْسَلَهٗ بِالْهُدٰى وَالنُّوْرِ وَالْمَوْعِظَةِ عَلٰى فَتْرَةٍ مِّنَ
الرُّسُلِ وَقِلَّةٍ مِّنَ الْعِلْمِ وَضَلَالَةٍ مِّنَ النَّاسِ وَانْقِطَاعٍ مِّنَ
الزَّمَانِ وَدُنُوٍّ مِّنَ السَّاعَةِ وَقُرْبٍ مِّنَ الْاَجَلِ - وَمَنْ يُّطِعِ اللّٰهَ
وَرَسُوْلَهٗ فَقَدْ رَشَدَ وَمَنْ يَّعْصِهِمَا فَقَدْ غَوٰى وَفَرَّطَ وَضَلَّ
ضَلَالًا بَعِيْدًا اُوْصِيْكُمْ بِتَقْوَى اللّٰهِ فَاِنَّهٗ خَيْرُ مَآ اَوْصٰى بِهِ
الْمُسْلِمُ الْمُسْلِمَ اَنْ يَّحُضَّهٗ عَلَى الْاٰخِرَةِ وَاَنْ يَّاْمُرَهٗ بِتَقْوَى اللّٰهِ
فَاحْذَرُوْا مَا حَذَّرَكُمُ اللّٰهُ مِنْ نَّفْسِهٖ وَلَآ اَفْضَلَ مِنْ ذٰلِكَ
نَصِيْحَةً وَّلَآ اَفْضَلَ مِنْ ذٰلِكَ ذِكْرًا وَّاِنَّ تَقْوَى اللّٰهِ لِمَنْ عَمِلَ
بِهٖ عَلٰى وَجَلٍ وَّمَخَافَةٍ مِّنْ رَّبِّهٖ عَوْنُ صِدْقٍ عَلٰى مَا تَبْغُوْنَ مِنْ
اَمْرِ الْاٰخِرَةِ وَمَنْ يُّصْلِحِ الَّذِيْ بَيْنَهٗ وَبَيْنَ اللّٰهِ مِنْ اَمْرِهٖ فِي
السِّرِّ وَالْعَلَانِيَةِ لَا يَنْوِيْ بِذٰلِكَ اِلَّا وَجْهَ اللّٰهِ يَكُنْ لَّهٗ ذِكْرًا
فِيْ عَاجِلِ اَمْرِهٖ وَذُخْرًا فِيْمَا بَعْدَ الْمَوْتِ حِيْنَ يَفْتَقِرُ الْمَرْءُ اِلٰى
مَا قَدَّمَ وَمَا كَانَ سِوٰى ذٰلِكَ يَوَدُّ لَوْ اَنَّ بَيْنَهَا وَبَيْنَهٗ اَمَدًا
بَعِيْدًا وَّيُحَذِّرُكُمُ اللّٰهُ نَفْسَهٗ وَاللّٰهُ رَءُوْفٌ بِالْعِبَادِ وَالَّذِيْ
صَدَقَ قَوْلُهٗ ، وَاَنْجَزَ وَعْدَهٗ لَا خُلْفَ لِذٰلِكَ فَاِنَّهٗ يَقُوْلُ عَزَّ وَ
جَلَّ مَا يُبَدَّلُ الْقَوْلُ لَدَيَّ وَمَآ اَنَا بِظَلَّامٍ لِّلْعَبِيْدِ فَاتَّقُوا اللّٰهَ
فِيْ عَاجِلِ اَمْرِكُمْ وَاٰجِلِهٖ فِي السِّرِّ وَالْعَلَانِيَةِ فَاِنَّهٗ مَنْ يَّتَّقِ اللّٰهَ

يُكَفِّرْ عَنْهُ سَيِّاٰتِهِ وَيُعْظِمْ لَهُ اَجْرًا۔ وَمَنْ يَّتَّقِ اللّٰهَ فَقَدْ فَازَ فَوْزًا عَظِيماً۔ وَاِنَّ تَقْوَى اللّٰهِ يُوَقِّيْ مَقْتَهُ وَيُوَقِّيْ عُقُوبَتَهُ وَيُوَقِّيْ سُخْطَهُ ، وَاِنَّ تَقْوَى اللّٰهِ يُبَيِّضُ الْوُجُوْهَ۔ وَيُرْضِى الرَّبَّ وَ يَرْفَعُ الدَّرَجَةَ۔

خُذُوْا بِحَظِّكُمْ وَلَا تُفَرِّطُوْا فِيْ جَنْبِ اللّٰهِ وَ قَدْ عَلَّمَكُمُ اللّٰهُ كِتَابَهُ۔ وَنَهَجَ لَكُمْ سَبِيْلَهُ لِيَعْلَمَ الَّذِيْنَ صَدَقُوْا وَيَعْلَمَ الْكَاذِبِيْنَ۔ فَاَحْسِنُوْا كَمَا اَحْسَنَ اللّٰهُ اِلَيْكُمْ وَعَادُوْا اَعْدَاءَهُ۔ وَجَاهِدُوْا فِي اللّٰهِ حَقَّ جِهَادِهِ۔ هُوَ اجْتَبٰكُمْ وَ سَمّٰكُمُ الْمُسْلِمِيْنَ لِيَهْلِكَ مَنْ هَلَكَ عَنْ بَيِّنَةٍ وَّيَحْيٰى مَنْ حَيَّ عَنْ بَيِّنَةٍ وَلَا قُوَّةَ اِلَّا بِاللّٰهِ۔

فَاَكْثِرُوْا ذِكْرَ اللّٰهِ وَاعْمَلُوْا لِمَا بَعْدَ الْيَوْمِ فَاِنَّهُ مَنْ يُّصْلِحْ مَا بَيْنَهُ وَبَيْنَ اللّٰهِ يَكْفِهِ اللّٰهُ مَا بَيْنَهُ وَبَيْنَ النَّاسِ۔

ذَالِكَ بِاَنَّ اللّٰهَ يَقْضِيْ عَلَى النَّاسِ وَلَا يَقْضُوْنَ عَلَيْهِ وَيَمْلِكُ مِنَ النَّاسِ وَلَا يَمْلِكُوْنَ مِنْهُ اَللّٰهُ اَكْبَرُ وَلَا قُوَّةَ اِلَّا بِاللّٰهِ الْعَظِيْمِ٥

(طبری جلد ۱۲ ص ۲۵۵)

"అల్ హమ్‌దు లిల్లాహి అహ్‌మదుహూ, వఅస్త యీనుహూ వ అస్తగ్ ఫిరుహూ వఅస్తహ్‌దీహి, వ వూమినుబిహీ, వలా అక్ ఫురుహూ, వ ఉఆదీ మ(య్యక్ ఫురుహూ. వ అష్ హదు అన్ ల్లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహూ, లాషరీక లహూ వ అష్‌హదు అన్న ముహమ్మదన్ అబ్ దుహూ వరసూలుహు. అర్ సలహూబిల్ హుదా వన్నూరి వల్ మౌఇజతి అలాఫత్ రతి(మ్మినర్రుసులి, వకిల్లతిమ్మినల్ ఇల్మి, వ జలాలతిమ్మినన్నాసి, వన్ కితాఇ మ్మినజ్జమాని, వదునువ్వివ్ మినస్సాఅతి, వకుర్ బిమ్మినల్ అజలి వమ(య్యుతిఇల్లాహ వ రసూలహూ ఫకద్ రషద, వమ(య్యాసిహి మా ఫకద్ గవా, వఫ(రత వజల్ల జలాలమ్‌బయీదా. ఊసీకుమ్ బితకవల్లాహి. ఫఇన్నహూ ఖైరు మాఔసా

బిహి ల్ ముస్లిముల్ ముస్లిమ, అ(య్యుహజ్జహా అలల్ ఆఖిరతి వఅయ్యాము రహా బితక్వల్లాహి. ఫహ్జరూ మాహజ్జరకు ముల్లాహు మిన్నఫ్సీహి, వలా అఫ్జల మిన్ జాలిక నసీహత(వ్వలా అఫ్జల మిన్ జాలిక జిక్ ర(వ్వ ఇన్న తక్వల్లాహి లిమన్ అమిల బిహీ అలా వ జలి(వ్వ మఖాఫతిమి(్రబ్బిహి ఔను సిద్ కిన్ అలా మా తబగూన మిన్ అమ్రిల్ ఆఖిరతి వమ(యుస్లిహి ల్లజీ బైనహూ వబైనల్లాహి మిన్ అమ్రిహీ ఫిస్సి(రి వల్ అలానియతి, లాయన్వీ బిజాలిక ఇల్లా వజ్ హల్లాహి యకుల్లహూ జిక్రన్ ఫీ ఆజిలి అమ్రిహి వజుఖ్రన్ ఫీమా బా'అదల్ మౌతి హీన యఫ్తకిరుల్ మర్ఉ ఇలా మా కద్దమ వమాకాన సివా జాలిక యవద్దు లౌ అన్న బైనహో వ బైనహూ అమదమ్ బైదవ్వ యుహజ్జిరు కుముల్లాహు నఫ్సహూ వల్లాహు రవూఫుమ్ బిల్ ఇబాద్ వల్లజీ సదక ఖౌలహు వ అన్ జజ వాఅదహూ లా ఖులిఫ లిజాలిక ఫ ఇన్నహూ యకూలు అజ్జవజల్ల మా యుబద్దలుల్ కౌలు లదయ్య వమాఅనాబిజల్లామిల్ లిల్ అబీది. ఫత్తకుల్లాహ ఫీ ఆ'జిలి అమ్రికుమ్ వ ఆజిలిహీ ఫిస్సి(రి వల్ అలానియతి ఫ ఇన్నహూ మ(య్యత్తఖిల్లాహ యుకఫ్ఫిర్ అన్హు సయ్యిఆతిహి వ యూజిమ్ లహూ అజ్రా. వ మ(య్యత్త కిల్లాహ ఫకద్ ఫాజ ఫౌజన్ అజీమా. వ ఇన్న త్తక్వల్లాహి యువక్ఖీ మక్తహూ వయువక్ఖీ ఉఖూబతహూ వ యువక్ఖీ సుఖ్తహూ వ ఇన్న త్తక్వల్లాహి యుబయ్యిజుల్ వుజూహ్ వయుర్ జి(్రబ్బ వ యర్ఫఉద్దరజ.

ఖుజూబిహజ్జికుమ్ వలా తుఫ(్రితూ ఫీజన్బిల్లాహి వకద్ అల్లమకు ముల్లాహు కితాబహు. వ నహజలకుమ్ సబీలహూ లియాలమ ల్లజీన సదకూ వ యాలమల్ కాజిబీన్. ఫ అహ్సినూ కమా అహ్సనల్లాహు ఇలైకుమ్ వ ఆదూ ఆదాఅహూ వ జాహిదూ ఫిల్లాహి హఖ్ఖ జిహాదిహీ. హువజ్తబాకుమ్ వ సమ్మాకుముల్ ముస్లిమీన లియహ్లిక మన్ హలక అన్ బయ్యినతివ్వ యహ్యా మన్ హయ్య అన్ బయ్యినతిన్ వలా కువ్వత ఇల్లాబిల్లాహ్.

ఫఅక్సిరూ జిక్రల్లాహి వామలూ లిమా బాదల్ యౌమి ఫఇన్నహూ మయ్యుస్లిహు మా బైనహు వబైనల్లాహి యక్ఫిహి ల్లాహు మా బైనహు వబైనన్నాస్.

*జాలిక బి అన్నల్లాహ యక్ జీ అలన్నాసి వలాయక్ జూన అలైహి వయమ్‌లిక మినన్నాసి వలాయమ్‌లికూన మిన్‌హు అల్లాహు అక్ బరు వలా కువ్వత ఇల్లా బిల్లాహిల్ అజీమ్"* (త్రిబి: 12, పేజి 255)

"కృతజ్ఞత, స్తుతి దైవం కొరకే. నేను ఆయనకు కృతజ్ఞతల్ని అర్పిస్తున్నాను. ఆయన సహాయాన్ని అర్థిస్తున్నాను. ఆయన క్షమాభిక్షను వేడుకుంటున్నాను. హితవు చేయమని ఆయనను అభ్యర్థిస్తున్నాను. ఆయనను విశ్వసిస్తున్నాను. ఆయనను తిరస్కరించను. ఆయనను తిరస్కరించిన వాణ్ణి నా శత్రువుగా భావిస్తున్నాను. అల్లాహ్ తప్ప ఇంకొక ఆరాధ్య దైవం లేడు. ఆయన ఒక్కడేనని, ఆయనకు ఎవరూ సాటిలేరని నేను సాక్ష్యమిస్తున్నాను. ముహమ్మద్ (సఅసం) దేవుని దాసులనీ, ఆయన సందేశహరులనీ నేను సాక్ష్యమిస్తున్నాను. ఆయన రాకకు పూర్వం యుగాల తరబడి ప్రవక్తల రాక నిలిచిపోయింది. వాస్తవమయిన జ్ఞానదీపిక కాంతి విహీనమైపోయింది. మార్గభ్రష్టత్వం రాజ్యమేలుతుండేది. జీవన వ్యవస్థ ఛిన్నాభిన్నమయిపోసాగింది. ప్రళయం సమీపించింది. ప్రతి వ్యక్తి అంతం అతని తలపైన తాండవిస్తుండేది. అలాంటి తరుణంలో ఆయనకు దైవం, మార్గదర్శక జ్యోతిని, బోధనా కాంతినీ ఇచ్చి పంపాడు.

ఎవడైతే (ప్రవక్తను విశ్వసించి) దేవుడిపట్లా, ఆయన ప్రవక్త (సఅసం) పట్ల విధేయత పాటించాడో అతను మార్గదర్శనాన్ని పొందాడు. ఎవడయితే (ప్రవక్తను తిరస్కరించి) దేవుడిపట్లా ఆయన ప్రవక్త (సఅసం) పట్ల అవిధేయతచూపాడో అతను మార్గభ్రష్టుడయ్యాడు. సంకుచితతత్వంలో పడిపోయాడు. సత్యమార్గం నుండి తప్పిపోయి అపమార్గాన పడిపోయాడు.

దేవునికి భయపడుతూ ఉండాలని నేను మీకు హితవు చేస్తున్నాను, ఒక విశ్వాసి ఇంకొక విశ్వాసికి చేసే అత్యుత్తమమైన హితవు ఏమంటే, అతణ్ణి పరలోక సంపదను సమకూర్చుకోడానికి ప్రోత్సహించాలి, దేవుని పట్ల భయభక్తులతో జీవించేలా అతనికి హితవు చేయాలి. కాబట్టి ఏ విధంగానయితే ఆయన తనకు భయపడమని ఆజ్ఞాపించాడో ఆ విధంగా అల్లాహ్‌కు భయపడండి. ఇంతకంటే మంచిహితవుగాని, జ్ఞాపకం చేసే విషయంగాని వేరే ఉండజాలదు.

వాస్తవం ఏమంటే, దేవునికి భయపడుతూ జీవితం గడిపే దాసునికి అతని దైవభీతి పరలోకంలో అత్యుత్తమ ఫలితాన్నిచ్చే నిజమయిన సాధనంగా పరిణమిస్తుంది. అదే మీరూ కోరుకునేది. ఏ వ్యక్తి అయితే చిత్తశుద్ధితో, కేవలం

దేవుని సంతోషం కొరకు, దేవునితో తన విషయాలన్నీ బహిరంగంగాను, గోప్యంగాను, అన్ని పరిస్థితుల్లోనూ చక్కదిద్దు కుంటాడో అతనికి ప్రపంచంలో వెంటనే లభించే ప్రతి ఫలం ఏమంటే – అతను సజ్జనుడుగా పరిగణించబడతాడు. మరణించిన తరువాత పరలోకంలో అతడు ఉత్తమగతిని పొందుతాడు. అప్పుడు ప్రతి వ్యక్తీ తాను చేసిన సత్కార్యాలకు ప్రతి ఫలం పొందవలసిన అత్యంత అవసరం కలిగి ఉంటాడు. అవి కాక అతను తాను చేసిన చెడుపనులు తనకు చాలా దూరంగా ఉంటే ఎంత బాగుండును అని అభిలషిస్తాడు. దేవుడు తన గురించి మిమ్మల్ని భయపెడుతున్నాడు. దేవుడు తన దాసుని పట్ల అమితమయిన దయగలవాడు.

ఎవరి వాక్కయితే సత్యమైనదో, ఎవరి వాగ్దానం తప్పకుండా నెరవేరుతుందో ఆ దేవుని సాక్షి! ఈ విషయం జరిగి తీరుతుంది. ఎందుకంటే మహోన్నతుడయిన ఆయనే స్వయంగా విశదీకరిస్తున్నాడు: "నా వాక్కులో ఎలాంటి మార్పూ ఉండదు. నేను నా దాసులకు రవ్వంత అయినా అన్యాయం చేసే వాణ్ణికాను. కాబట్టి ఇహం, పరం సర్వవిషయాల్లో బహిరంగంగాను, గోప్యంగాను మీరు దేవునికి భయపడండి. వాస్తవమేమిటంటే, దేవుని క్రోధానికి భయపడిన వారి పాపాలను దైవం ప్రక్షాళనం చేస్తాడు. ఇంకా అతని ప్రతిఫలాన్ని ఎన్నోరెట్లు పెంచుతాడు. ఆయనకు భయపడినవారు చాల గొప్పసాఫల్యాన్ని పొందినవారవుతారు. క్షుణ్ణంగా తెలుసుకోండి. దైవభీతి దాసుడిని దైవ ఆగ్రహాన్నుండి తప్పిస్తుంది. ఆయన శిక్ష నుండి కాపాడుతుంది. ఆయన అయిష్టత నుండి రక్షిస్తుంది. మరో వాస్తవాన్ని కూడా బాగా తెలుసుకోండి. దైవ భీతి, దాసుల ముఖాలను కాంతిమంతంగాను, తేజోవంతంగాను చేస్తుంది. స్వామికి తన దాసుని పట్ల సంతోషాన్ని కలిగిస్తుంది. దాసుని స్థానాన్ని ఉన్నతం చేస్తుంది.

గమనించండి మీరు మీమీ భాగ్యంలో ఉన్న పుణ్యకార్యాలను సమకూర్చుకోండి, దేవుడు మీకు తన గ్రంధజ్ఞానాన్ని ప్రసాదించి, తన ఋజుమార్గాన్ని స్పష్టంగా తెలియపరచాడు. మీరు ఏమాత్రం అశ్రద్ధ చేయకండి. ఎందుకంటే, విశ్వసించిన వారమని చెప్పుకునే వారిలో సత్యవంతులెవరో, అసత్యవంతులెవరో ఆయన తెలుసుకోవాలి. దేవుడు మీ పట్ల సద్వర్తనంతో వ్యవహరించినట్లే మీరు కూడా ప్రజల పట్ల సద్వర్తనంతో వ్యవహరించండి. ఆయన శత్రువుల్ని మీ శత్రువులుగా భావించండి, ఆయన మార్గంలో నిరంతర సంఘర్షణ చేయండి,

దాని హక్కు పూర్తిగా నెరవేర్చండి. ఆయన మిమ్మల్ని తన ధర్మం కోసం ఎంపిక చేశాడు. ఆయన మీకు "ముస్లిమ్" అని నామకరణం చేశాడు. ఎందుకంటే, నాశనమయ్యేవారు స్పష్టమయిన ప్రమాణం చూసి నాశనం కావాలి. జీవించే వారు స్పష్టమయిన ప్రమాణం ఆధారంగా జీవించాలి. సర్వ శక్తులకు మూలం కేవలం దేవుడు మాత్రమే.

కాబట్టి దేవుని స్మరణ అత్యధికంగా చేస్తూ ఉండండి. ఈ రోజు తర్వాత వచ్చే రేపటి కొరకు కావలసిన కర్మలు చేస్తూ ఉండండి. ఎందుకంటే, ఏ దాసుడయితే తనకూ, దేవునికీ ఉన్న పరస్పర సంబంధాన్ని సరిదిద్దుకుంటాడో, దేవునికి, దాసులకు మధ్యనున్న సర్వ విషయాల్లోనూ ఆ దాసునికి దేవుడే సహాయపడతాడు. ఎందుకంటే, దేవుడే దాసుల వ్యవహారాలను నిర్ణయం చేస్తాడు. దాసులు దేవుని వ్యవహారాన్ని నిర్ణయించలేరు. మానవుల విషయాలన్నింటికీ ఆయనే స్వామి. ఆయన విషయాలేవీ మానవుల అధీనంలో లేవు. ఆయన అందరికీ అధికుడు. సర్వశక్తులు ఆయన వద్దనే ఉన్నాయి.

## ఖుర్‌ఆన్ పట్ల ఆసక్తి (ఖుత్బయె ఊలా)

اِنَّ الْحَمْدَ لِلّٰهِ اَحْمَدُهٗ وَاَسْتَعِيْنُهٗ وَنَعُوْذُ بِاللّٰهِ مِنْ شُرُوْرِ اَنْفُسِنَا
وَمِنْ سَيِّئَاتِ اَعْمَالِنَا مَنْ يَّهْدِهِ اللّٰهُ فَلَا مُضِلَّ لَهٗ وَمَنْ
يُّضْلِلْهُ فَلَا هَادِیَ لَهٗ وَاَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَحْدَهٗ لَا
شَرِيْكَ لَهٗ۔

اِنَّ اَحْسَنَ الْحَدِيْثِ كِتٰبُ اللّٰهِ قَدْ اَفْلَحَ مَنْ زَيَّنَهُ اللّٰهُ
فِیْ قَلْبِهٖ وَاَدْخَلَهٗ فِی الْاِسْلَامِ بَعْدَ الْكُفْرِ، وَاخْتَارَهٗ عَلٰى مَا
سِوَاهُ مِنْ اَحَادِيْثِ النَّاسِ اِنَّهٗ اَصْدَقُ الْحَدِيْثِ وَاَبْلَغُهٗ۔
اَحِبُّوْا مَنْ اَحَبَّ اللّٰهَ وَاَحِبُّوا اللّٰهَ مِنْ كُلِّ قُلُوْبِكُمْ وَلَا تَمَلُّوْا
كَلَامَ اللّٰهِ وَذِكْرَهٗ وَلَا تَقْسُوْا عَلَيْهِ قُلُوْبَكُمْ۔

اُعْبُدُوا اللّٰهَ وَلَا تُشْرِكُوْا بِهٖ شَيْئًا، اِتَّقُوا اللّٰهَ حَقَّ
تُقٰتِهٖ وَصَدِّقُوْا صَالِحَ مَا تَعْمَلُوْنَ بِاَفْوَاهِكُمْ وَتَحَابُّوْا بِرَوْحِ
اللّٰهِ بَيْنَكُمْ۔ وَالسَّلَامُ عَلَيْكُمْ وَرَحْمَتُهُ اللّٰهِ۔(اعجاز القرآن)

"ఇన్నల్ హమ్‌ద లిల్లాహి అహ్‌మదుహూ వ అస్తఈనుహూ వనవూజు బిల్లాహి మిన్ షురూరి అన్ ఫుసినా వమిన్ సయ్యిఆతి ఆమాలినా మయ్యాహ్ దిహి ల్లాహు ఫలాముజిల్లలహూ వమయ్యుజ్‌లిల్‌హు ఫలా హాదియలహూ వష్‌హదు అఁల్లాఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహూ లా షరీకలహు.

"ఇన్న అహ్‌సనల్ హదీసి కితాబుల్లాహి కద్ అఫ్‌లహమన్ జయ్యన హుల్లాహు ఫీ కల్ బిహీ వ అద్ ఖలహూ ఫిల్ ఇస్లామి బాదల్ కుఫ్రి, వఖ్ తారహూ అలామాసివాహూ మిన్ అహాదీసిన్నాసి ఇన్నహూ అస్‌తకుల్ హదీసి వఅబ్ లగుహూ. అహిబ్బూమన్ అహబ్బల్లాహ వ అహిబ్బుల్లాహ మిన్ కుల్లి కులీబికుమ్ వలా తమల్లూ కలామల్లాహి వజిక్‌రహూ, వలాతక్‌సూ అలైహి కులూబకుమ్,

ఉబుదుల్లాహ వలాతుష్‌రికూబిహీ షయ్య, ఇత్తకుల్లాహ హక్కతుఖాతిహీ వసద్దికూ సాలిహ మాతామలూన బిఅఫ్ వాహి కుమ్ వతహాబ్బూ బిరోహి ల్లాహి బైనకుమ్. వస్సలాము అలైకుమ్ వరహ్‌మతుల్లాహ్" (ఏజాజుల్ ఖుర్ఆన్)

"నిస్సందేహంగా కృతజ్ఞత, స్తోత్రం దేవునికే చెల్లు. నేను ఆయన స్తుతీ, స్తోత్రం చేస్తాను. ఆయన సహాయం అర్థిస్తాను. మేము మనస్సు ప్రేరేపించే దుశ్చర్యల నుండి, దుష్కార్యాల బారి నుండి ఆయన కటాక్షఛాయల్లో శరణు వేడుకుంటాము. దేవుడు ఎవరికి తన ప్రబోధనా భాగ్యం ప్రసాదించాడో (వాస్తవానికి ఎవరు హితాభిలాషులో వారికే ఆయన తన ప్రబోధనా భాగ్యాన్ని ప్రసాదిస్తాడు.) వారిని ఎవరూ మార్గభ్రష్టులుగా చేయలేరు. ఎవరినయితే దేవుడు మార్గభ్రష్టులను చేస్తాడో (ఎవరికయితే ఋజుమార్గాన నడవాలన్న కోరిక లేదో వారినే ఆయన మార్గభ్రష్టులుగా చేస్తాడు) వారికి ఎవరూ మార్గం చూపలేరు. అల్లాహ్ తప్ప ఇంకెవడూ ఆరాధనకు అర్హుడుకాడనీ, ఆయన ఒక్కడే అనీ, ఆయనకు సాటి ఇంకెవరూ లేరని నేను సాక్ష్యమిస్తున్నాను.

"వాస్తవం ఏమిటంటే, అన్నిటికంటే ఉత్తమ వాక్కు దేవుని గ్రంథం, ఎవరి హృదయంలో దైవ గ్రంథపు దివ్యకాంతి ఉందో, ఎవరికయితే తిరస్కారం

తర్వాత దేవుడు ఇస్లామ్ స్వీకరించే భాగ్యం కల్పించాడో, ఎవడయితే మానవ మాత్రుల గ్రంధాలన్నిటినీ విడనాడి ఒక్క దైవగ్రంధాన్నే (రుజుమార్గం అనుసరణకై) ఎంపిక చేసుకున్నాడో అతను సాఫల్యం పొందాడు.

"నిస్సంశయంగా దైవగ్రంధం సంపూర్ణంగా సత్యమయినది, అత్యంత ప్రభావవంతమయినది. దాని పట్ల శ్రద్ధాసక్తులు కలిగి వున్నవారిపట్ల మీరు కూడా ప్రేమాభిమానాలు కలిగి ఉండండి, పూర్తి ఏకాగ్రచిత్తులయి దేవుని పట్ల నిజమయిన ప్రేమను జనింపజేయండి. నిత్యం దైవవాణిని పఠించడంలో, దైవాన్ని స్మరించడంలో, ఏమాత్రం అలసత్వం చూపకండి. దైవవాణి పట్ల మీరు విముఖులయిపోవడంగాని, మీ హృదయాలు కఠినంగా మారిపోవడంగాని ఎన్నటికీ జరగకూడదు. కనుక కేవలం దేవుని ఆరాధనే చేయండి. అణుమాత్రం కూడా ఇతరుల్ని ఆయనకు సాటిగా భావించకండి. మీరు ఆయనకు భయపడవలసిన రీతిలో భయపడుతూ ఉండండి. మీరు మీ సత్ క్రియల్ని వాక్కు ద్వారా కూడా దృఢపరుస్తూ ఉండండి. (అంటే దైవ విశ్వాసిగా మీ వ్యక్తిత్వానికి తగినట్లుగానే మాట్లాడండి) దైవ కారుణ్యం, ధార్మికతల ప్రాతిపదికపై పరస్పరం, ప్రేమానురాగాలు కలిగి ఉండండి. వస్సలాము అలైకుమ్ వరహ్మతుల్లాహ్."

## జుమా రెండవ ప్రసంగం (ఖుత్బయె సానియ)

اَلْحَمْدُ لِلّٰهِ حَمْدًا كَثِيْرًا وَّالصَّلٰوةُ وَالسَّلَامُ عَلٰى رَسُوْلِهٖ اَرْسَلَهُ

اللّٰهُ شَاهِدًا وَّنَذِيْرًا وَّدَاعِيًا اِلَى اللّٰهِ بِاِذْنِهٖ وَسِرَاجًا مُّنِيْرًا

وَعَلٰٓى اٰلِهٖ وَاَصْحَابِهٖ وَسَلَّمَ تَسْلِيْمًا كَثِيْرًا كَثِيْرًا ط

اَمَّا بَعْدُ :- فَيَاۤ اَيُّهَا النَّاسُ ! اُوْصِيْكُمْ بِتَقْوَى اللّٰهِ فَاِنَّ

تَقْوَى اللّٰهِ مِلَاكُ الْحَسَنَاتِ - وَعَلَيْكُمْ بِالطَّاعَةِ فَاِنَّهٗ مَنْ يُّطِعِ

اللّٰهَ وَرَسُوْلَهٗ فَقَدْ فَازَ فَوْزًا عَظِيْمًا - وَقَالَ اللّٰهُ تَعَالٰى فِىْ كِتَابِهٖ

الْمَجِيْدِ - اِنَّ اللّٰهَ وَمَلٰٓئِكَتَهٗ يُصَلُّوْنَ عَلَى النَّبِيِّ يٰۤاَيُّهَا الَّذِيْنَ

اٰمَنُوْا صَلُّوْا عَلَيْهِ وَسَلِّمُوْا تَسْلِيْمًا -

اَللّٰهُمَّ صَلِّ عَلٰى سَيِّدِنَا وَمَوْلَانَا مُحَمَّدٍ وَّعَلٰٓى اٰلِهٖ وَاَصْحَابِهِ الَّذِيْنَ

اتبَعُوهُ فِىْ سَاعَةِ الْعُسْرَةِ۔ اَللّٰهُمَّ اَمْطِرْ شَابِيْبَ رِضْوَانِكَ عَلَى السَّابِقِيْنَ الْاَوَّلِيْنَ مِنَ الْمُهَاجِرِيْنَ وَالْاَنْصَارِ خُصُوْصًا عَلٰى اَفْضَلِ الْبَشَرِ بَعْدَ الْاَنْبِيَآءِ بِالتَّحْقِيْقِ اَمِيْرِ الْمُؤْمِنِيْنَ سَيِّدِنَا اَبِىْ بَكْرِ نِ الصِّدِّيْقِ رَضِىَ اللّٰهُ تَعَالٰى عَنْهُ وَعَلٰى اَمِيْرِ الْمُؤْمِنِيْنَ سَيِّدِنَا عُمَرَ بْنِ الْفَارُوْقِ رَضِىَ اللّٰهُ عَنْهُ وَعَلٰى اَمِيْرِ الْمُؤْمِنِيْنَ سَيِّدِنَا عُثْمَانَ بْنِ عَفَّانَ رَضِىَ اللّٰهُ تَعَالٰى عَنْهُ وَعَلٰى اَمِيْرِ الْمُؤْمِنِيْنَ سَيِّدِنَا عَلِىِّ بْنِ اَبِىْ طَالِبٍ كَرَّمَ اللّٰهُ وَجْهَهُ وَعَلٰى وَلَدَيْهِ السَّعِيْدَيْنِ سَيِّدَا شَبَابِ اَهْلِ الْجَنَّةِ اَلْحَسَنُ وَالْحُسَيْنُ رَضِىَ اللّٰهُ تَعَالٰى عَنْهُمَا وَعَلٰى اُمِّهِمَا سَيِّدَةِ نِسَاءِ اَهْلِ الْجَنَّةِ فَاطِمَةَ الزَّهْرَاءِ رَضِىَ اللّٰهُ تَعَالٰى عَنْهَا وَعَلٰى سَائِرِ الصَّحَابَةِ وَالتَّابِعِيْنَ رِضْوَانُ اللّٰهِ تَعَالٰى عَلَيْهِمْ اَجْمَعِيْنَ۔

اَللّٰهُمَّ انْصُرْ مَنْ نَصَرَ دِيْنَ مُحَمَّدٍ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَاجْعَلْنَا مِنْهُمْ وَاخْذُلْ مَنْ خَذَلَ دِيْنَ مُحَمَّدٍ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَلَا تَجْعَلْنَا مِنْهُمْ عِبَادَ اللّٰهِ! رَحِمَكُمُ اللّٰهُ اِنَّ اللّٰهَ يَاْمُرُ بِالْعَدْلِ وَالْاِحْسَانِ وَ اِيْتَاءِ ذِى الْقُرْبٰى وَيَنْهٰى عَنِ الْفَحْشَاءِ وَالْمُنْكَرِ وَالْبَغْىِ يَعِظُكُمْ لَعَلَّكُمْ تَذَكَّرُوْنَ ۝ اُذْكُرُوا اللّٰهَ يَذْكُرْكُمْ وَادْعُوْهُ يَسْتَجِبْ لَكُمْ وَ لَذِكْرُ اللّٰهِ تَعَالٰى اَعْلٰى وَاَوْلٰى وَاَعَزُّ وَاَجَلُّ وَاَتَمُّ وَاَهَمُّ وَاَعْظَمُ وَاَكْبَرُ۔

"అల్ హమ్‌దు లిల్లాహి హమ్‌దన్ కసీరం వ్వస్సలాతు వస్సలాము అలారసూలిహి అర్ సలహుల్లాహు షాహిదం వ్వ నజీరం వ్వదాయియన్ ఇలల్లాహి బి ఇజ్ నిహీ వ్వసిరాజమ్మునీరా వఅలా ఆలిహీ వఅస్‌హాబిహీ వసల్లమ తస్‌లీమన్ కసీరన్ కసీరా.

అమ్మా 'బాద్ ఫయాఅయ్యు' హన్నాస్! ఊసీకుమ్ బితక్వల్లాహి ఫ ఇన్న తక్వల్లాహి మిలాకుల్ హసనాత్. వఅలైకుమ్ బిత్తాఅతి ఫఇన్నహా మైయ్యతి యిల్లాహ వరసూలహూ ఫఖద్ ఫాజఫాజన్ అజీమా. వకాలల్లాహుతఆలా ఫీకితా బిహిల్ మజీద్ - ఇన్నల్లాహ వమలాయికతహూ యుసల్లూన అలన్ నబియ్యి యా అయ్యుహల్లజీన ఆమనూ సల్లూ, అలైహి వసల్లిమూతస్లీమా.

అల్లాహుమ్మ సల్లిఅలా సయ్యిదినా వ మౌలానా ముహమ్మదివ్వ అలా ఆలిహీ వ అస్హాబిహిల్లజీన త్తబఊహు ఫీసాఅతిల్ ఉస్రహ్. అల్లాహుమ్మ అమ్తిర్ షఆబీబ రిజ్వానిక అలస్సాబికీనల్ అవ్వలీన, మినల్ ముహాజిరీన వల్ అన్సారి ఖుసూసన్ అలా అఫ్జలిల్ బషరి బాదల్ అంబియాయి బిత్తహ్కీకీ అమీరిల్ మూమినీన సయ్యిదినా అబీబక్ర్ నిస్సిద్దీక్ రజిఅల్లాహు త ఆలా అన్హు. వ అలా అమీరిల్ మూమినీన సయ్యిదినా ఉమరల్ ఫారూకి రజి అల్లాహుతాలా అన్హు. వఅలా అమీరిల్ మూమినీన సయ్యిదినా ఉస్మానీబ్ని అఫ్ఫాన్ రజిఅల్లాహు తాలా అన్హు. వఅలా అమీరిల్ మూమినీనసయ్యిదినా అలియ్యిబ్ని అబీతాలిబ్ క్రమల్లాహు వజ్హహు. వఅలా వలదైహిస్సయీదైనిసయ్యిదాషబాబి అహ్లిల్ జన్నతి అల్హసను వల్హుసైను రజి అల్లాహు తఆలా అన్హుమా. వఅలా ఉమ్మిహిమా సయ్యిదతి నిసాయి అహ్లిల్ జన్నతి ఫాతిమతజ్జహ్రాయి రజియల్లాహు తఆలా అన్హా. వ అలా సాయిరిస్సహాబతి వత్తాబియ్యీన రిజ్వానుల్లాహి తఆలా అలైహిం అజ్మయీన్.

అల్లాహుమ్మన్ సుర్ మన్నసర దీన ముహమ్మదిన్ సల్లల్లాహు అలైహి వసల్లమ వజ్అల్నా మిన్ హుమ్. వఖ్జుల్ మన్ ఖజలదీన ముహమ్మదిన్ సల్లల్లాహు అలైహి వ సల్లమ, వలాతజ్ అల్నా మిన్హుమ్. ఇబాదల్లా రహిమకు ముల్లాహు ఇన్నల్లాహ యాముడు బిల్ అద్లి వల్ ఇహ్సాని వయీతాయి జిల్ కుర్బా వయన్హా అనిల్ ఫహషాయి వల్మున్కరి వల్బగీ యయి'జుకుమ్ అల్లకుమ్ తజక్కరూన్ ఉజ్కురుల్లాహ యజ్కుర్కుమ్ వద్ ఊహు యస్తజిబ్లకుమ్ వలజిక్రుల్లాహి తఆలా ఆలా వ ఔలా వ అఅజ్జ వఅజల్లు వఅతమ్మ వ అహమ్మ వ ఆజము వ అక్బర్.

(జుమా రెండవ ప్రసంగం తప్పనిసరిగా అరబీభాషలోనే పఠించవలసి ఉంది. కనుక, ఇక్కడ దీని అనువాదం ఇవ్వడం లేదు.)

# 14 నికాహ్ ప్రసంగం

నికాహ్ వల్ల షరీఅత్ (ఇస్లామీయ చట్టం) దృక్పథం తెలియ జేయడానికి, అది కోరే విషయాలను స్పష్టంగా అవగాహన చేయించడానికి, నికాహ్ సంబంధం వల్ల మోపబడే మహత్తర బాధ్యతలను జ్ఞాపకం చేయడానికి నికాహ్ సమావేశంలో "ఖుత్బా" పఠించడం ప్రవక్త సంప్రదాయం (సున్నత్). ఈ సందర్భంలో "ఖుత్బా" వల్ల పూర్తిగా ప్రయోజనం పొందడానికి నికాహ్ చేయించేవారు నికాహ్ ప్రసంగం అనువాదాన్ని కూడా వారి మాతృ భాషలో వివరిస్తే ఎంతో బాగుంటుంది. అప్పుడే శ్రోతలు నికాహ్ అంటే ఏమిటో చక్కగా అర్థం చేసుకోగలరు. ఈ ఉద్దేశ్యంతోనే మేము నికాహ్ (అరబీ) ప్రసంగంతో బాటు దాని అనువాదాన్ని కూడా దిగువ పొందుపరుస్తున్నాము.

اِنَّ الْحَمْدَ لِلّٰهِ نَسْتَعِيْنُهٗ وَنَسْتَغْفِرُهٗ وَنَعُوْذُ بِاللّٰهِ مِنْ شُرُوْرِ
اَنْفُسِنَا مَنْ يَّهْدِهِ اللّٰهُ فَلَا مُضِلَّ لَهٗ وَمَنْ يُّضْلِلْهُ فَلَا هَادِيَ لَهٗ.
وَاَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَاَشْهَدُ اَنَّ مُحَمَّدًا عَبْدُهٗ وَ
رَسُوْلُهٗ.

يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا اتَّقُوا اللّٰهَ حَقَّ تُقٰتِهٖ وَلَا تَمُوْتُنَّ اِلَّا وَ اَنْتُمْ
مُّسْلِمُوْنَ ۝

يٰۤاَيُّهَا النَّاسُ اتَّقُوْا رَبَّكُمُ الَّذِيْ خَلَقَكُمْ مِّنْ نَّفْسٍ وَّاحِدَةٍ وَّ
خَلَقَ مِنْهَا زَوْجَهَا وَبَثَّ مِنْهُمَا رِجَالًا كَثِيْرًا وَّنِسَآءً وَاتَّقُوا اللّٰهَ
الَّذِيْ تَسَآءَلُوْنَ بِهٖ وَالْاَرْحَامَ اِنَّ اللّٰهَ كَانَ عَلَيْكُمْ رَقِيْبًا ۝

يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا اتَّقُوا اللّٰهَ وَقُوْلُوْا قَوْلًا سَدِيْدًا يُّصْلِحْ لَكُمْ
اَعْمَالَكُمْ وَيَغْفِرْ لَكُمْ ذُنُوْبَكُمْ وَمَنْ يُّطِعِ اللّٰهَ وَرَسُوْلَهٗ فَقَدْ فَازَ
فَوْزًا عَظِيْمًا

وَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَاللّٰهِ اِنِّىْ لَاَخْشَاكُمْ لِلّٰهِ وَاَتْقَاكُمْ
لَهٗ وَلٰكِنِّىْٓ اَصُوْمُ وَاُفْطِرُ وَاُصَلِّىْ وَاَرْقُدُ وَاَتَزَوَّجُ النِّسَآءَ فَمَنْ رَّغِبَ
عَنْ سُنَّتِىْ فَلَيْسَ مِنِّىْ (بخاری)

ఇన్నల్ హమ్‌దలిల్లాహి నస్‌తఈనుహూ వ నస్తగ్‌ఫిరుహూ వ నఊజుబిల్లాహి మిన్ షురూరి అన్‌ఫుసినా మ(యహ్‌దిహిల్లాహు ఫలాముజిల్లలహూ వ మ(య్యుజ్‌లిల్‌హు ఫలాహాదియ లహూ. వ అష్‌హదుఅ(ల్లా ఇలాహ ఇల్లల్లాహు వ అష్‌హదు అన్న ముహమ్మదన్ అబ్దుహూ వ రసూలుహు.

యాఅయ్యుహల్లజీన ఆమనుత్త కుల్లాహ హక్క తుకాతిహీ వలా తమూతున్న ఇల్లా వ అన్‌తుమ్ ముస్లిమూన్.

యా అయ్యుహన్నాసుత్తకూ రబ్బకుముల్లజీ ఖలకకుమ్ మిన్నఫ్‌సి వ్వాహిదతివ్వ ఖలక మిన్‌హా జౌజహా వబస్స మిన్‌హుమా రిజాలన్ కసీర(వ్వనిసాఅ.. వత్తకుల్లా హల్లజీ తసాఅలూన బిహీ వల్ అర్‌హామ్. ఇన్నల్లాహ కాన అలైకుమ్ రకీబా.

యా అయ్యుహల్లజీన ఆమనుత్తకుల్లాహ వ ఖూలూ ఖౌలన్ సదీదయ్యుస్‌లిహ్ లకుమ్ ఆమాలకుమ్ వ యగ్‌ఫిర్ లకుమ్ జునూబకుమ్ వమయ్యుతి యిల్లాహ వ రసూలహు ఫకద్ ఫాజ ఫౌజన్ అజీమా.

(మిష్కాత్)

వకాల రసూలుల్లాహి సల్లల్లాహు అలైహి వసల్లమ వల్లాహి ఇన్నీ లా అఖ్‌షాకుమ్ లిల్లాహి వ అత్‌కాకుమ్ లహూ వలాకిన్నీ అసూము వ ఉఫ్‌తిరు వ ఉసల్లీ వ అర్‌కుదు వఅతజ(వ్వజున్నిసాఅ ఫమ(రగిబ అన్ సున్నతీ ఫలైస మిన్నీ. (బుఖారీ)

"స్తోత్రం, కృతజ్ఞతా భావం అల్లాహ్ కొరకే. ఆయన్నే సహాయం కొరకు అర్థిస్తాము. అపరాధాల మన్నింపుకై ఆయన్నే వేడుకుంటాము. మన మనస్సుల్లో పుట్టే చెడుగునుండి, మా చేష్టల దుష్పరిణామం నుండి మేము ఆయన రక్షణనే కోరుకుంటున్నాము. ఎవరికైతే అల్లాహ్ సన్మార్గం చూపాడో వాడిని ఎవ్వరూ మార్గం తప్పించలేరు. ఎవరినైతే దారితప్పేందుకు అల్లాహ్ వదిలివేసాడో వాడికి మరెవ్వరూ మార్గం చూపలేరు.

"అల్లాహ్ తప్ప మరో దైవం లేదని నేను సాక్ష్యమిస్తున్నాను. ముహమ్మద్(స) ఆయన దాసుడూ, ఆయన సందేశహరుడని కూడా నేను సాక్ష్యమిస్తున్నాను."

ఆ తరువాత ఖుత్బాలో పఠించబడేవి కొన్ని దివ్య ఖుర్ఆన్‌లోని ఆయత్‌లు, వాటి అర్థం ఇది.

☆ "విశ్వసించిన ఓ ప్రజలారా! అల్లాహ్‌కు ఏ విధంగా భయపడాలో ఆ విధంగా భయపడండి. ముస్లిమ్‌లుగా తప్ప మీరు మరణించకండి."

*(ఆలి ఇమ్రాన్ 102)*

☆ "మానవులారా! మీ ప్రభువుకు భయపడండి, ఆయన మిమ్మల్ని ఒకే ప్రాణి నుండి పుట్టించాడు. అదే ప్రాణి నుండి దాని జతను సృష్టించాడు. ఆ జంట ద్వారా ఎంతో మంది పురుషుల్ని, స్త్రీలను అవనిలో వ్యాపింపజేశాడు. ఎవరి పేరు చెప్పుకుని మీరు పరస్పరం మీ హక్కుల్ని కోరుతారో ఆ దైవానికి భయపడండి. బంధుత్వపు సంబంధాల విచ్ఛిత్తికి దూరంగా ఉండండి అల్లాహ్ మిమ్మల్ని గమనిస్తున్నాడనే విషయాన్ని తెలుసుకోండి." (నిసా)

☆ "విశ్వసించిన వారలారా, అల్లాహ్ ఎడల భయభక్తులు కలిగి మెలగండి. నోటితో నిత్యం సరైన మాటనే పలకండి. అల్లాహ్ మీ ఆచరణల్ని సంస్కరిస్తాడు. మీ అపరాధాలను మన్నిస్తాడు. అల్లాహ్‌కూ ఆయన ప్రవక్తకూ విధేయులైవున్నవారు గొప్ప సాఫల్యాన్ని పొందుతారు. (అహ్జాబ్ 71)

ఖుత్బా చివరిలో వినిపించే హదీసు అర్థం ఇదిః మహాప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారుః

"దైవసాక్షిగా చెబుతున్నాను. నేను మీ అందరికంటే దైవానికి ఎక్కువగా భయపడేవాడిని. మీ అందరికన్నా నేనే ఎక్కువగా దేవుని అయిష్టతకు దూరంగా ఉండేవాడిని. అయితే (నేను పెళ్ళి మానేసి వైరాగ్యం అవలంబించలేదు) నా పరిస్థితి ఎలా ఉందంటే, నేను అప్పుడప్పుడు నఫిల్ ఉపవాసాన్ని పాటిస్తాను. ఉపవాసం లేకుండా కూడా గడుపుతాను. రాత్రి వేళల్లో నమాజ్ కూడా చేస్తాను, నిద్రకూడా పోతాను. అంతేకాదు నేను స్త్రీలను వివాహంకూడా చేసుకుంటాను. ఇది నా సంప్రదాయం ఎవరైతే నా సంప్రదాయాన్ని ఇష్టపడరో వారితో నాకు ఎలాంటి సంబంధం ఉండదు.

# 15. ఇస్తిఖారా

జీవితపు ముఖ్య విషయాల్లో ఉదాహరణకు ప్రయాణం, వివాహం, ఉద్యోగం, వ్యాపారం మొదలయిన వాటిలో ఇస్తిఖార చేస్తూ ఉండాలి. ఇస్తిఖార అంటే శ్రేయస్సునూ, మేలును అర్థించడం అని అర్థం. ముఖ్యమయిన, ధర్మసమ్మతమైన పనుల్లో ఏది మేలయినదో స్పష్టంకాకపోతే వాటి విషయంలో తప్పకుండా ఇస్తిఖార పాటించాలి. తరువాత మీ హృదయం ఎటువైపు ఆకర్షితమవుతుందో దాన్నే దైవ నిర్ణయమని భావించి అనుసరించాలి. ఇస్తిఖార చేసే పద్ధతి ఇది: ఎప్పుడయినా అసాధారణమయిన పని ఎదురయితే, మక్రూహ్, నిషిద్ధ వేళల్లో తప్ప ఏ సమయంలోనయినాసరే రెండు రకాత్‌ల నఫిల్ నమాజ్ చేసుకోవాలి. తరువాత ఇస్తిఖార దుఆ పఠించాలి.

హజ్రత్ సాద్ బిన్ అబీ వకాస్ (రజిఅన్) ప్రవక్త (సఅసం) ఇలా అన్నారని ఉల్లేఖించారు.

"దేవునికి ఇస్తిఖార చేయడం ఆదమ్ సంతతికి శుభకరమయిన పని. దేవుని నిర్ణయానికి తలవొగ్గడం కూడా ఆదమ్ సంతతికి శుభకరమయినదే. దేవునితో ఇస్తిఖార చేయకపోవడం, దైవ నిర్ణయాన్ని సంతోషంగా శిరసావహించకపోవడం, ఆదమ్ సంతతికి దురదృష్టకరం." (ముస్‌నద్ అహ్మద్)

మహాప్రవక్త (సఅసం) మరో సందర్భంలో ఇలా అన్నారు:

ఇస్తిఖార చేసేవాడు ఎన్నటికీ వైఫల్యం చెందడు. ఇతరులతో సంప్రదించి సలహా తీసుకునేవాడు ఎన్నటికీ పరాభవంపాలుకాడు. ఖర్చుపెట్టడంలో జాగ్రత్త వహించేవాడు ఇతరులపైన ఎన్నటికీ ఆధారపడడు." (తిబ్రాని)

హజ్రత్ జాబిర్ (రజి) ఇలా ఉల్లేఖించారు:

"దైవప్రవక్త (సఅసం) మాకు ఏ విధంగానైతే ఖుర్‌ఆన్ బోధించేవారో అలాగే ప్రతి పనిలోనూ ఇస్తిఖార చేయడాన్ని గురించి కూడా బోధించేవారు. మీలో ఎవరయినా ఏదయినా ఒక ముఖ్య విషయాన్ని గురించి సందిగ్ధంలో వుంటే అలాంటి వ్యక్తి రెండు రకాత్‌ల నఫిల్ నమాజ్ చేసి, ఆ తరువాత ఈ దుఆ పఠించాలి అని ప్రవక్త అనేవారు." (బుఖారి)

اَللّٰهُمَّ اِنِّيْ اَسْتَخِيْرُكَ بِعِلْمِكَ وَاَسْتَقْدِرُكَ بِقُدْرَتِكَ وَاَسْئَلُكَ

مِنْ فَضْلِكَ الْعَظِيْمِ فَاِنَّكَ تَقْدِرُ وَلَآ اَقْدِرُ وَتَعْلَمُ وَلَآ اَعْلَمُ وَاَنْتَ

عَلَّامُ الْغُيُوْبِ -

اَللّٰهُمَّ إِنْ كُنْتَ تَعْلَمُ اَنَّ هٰذَا الْاَمْرَ خَيْرٌ لِّيْ فِيْ دِيْنِيْ وَمَعِيْشَتِيْ

وَعَاقِبَةِ اَمْرِيْ فَاقْدِرْهُ لِيْ وَيَسِّرْهُ لِيْ ثُمَّ بَارِكْ لِيْ فِيْهِ وَاِنْ

كُنْتَ تَعْلَمُ اَنَّ هٰذَا الْاَمْرَ شَرٌّ لِّيْ فِيْ دِيْنِيْ وَمَعِيْشَتِيْ وَعَاقِبَةِ

اَمْرِيْ فَاصْرِفْهُ عَنِّيْ وَاصْرِفْنِيْ عَنْهُ وَاقْدُرْ لِيَ الْخَيْرَ حَيْثُ كَانَ

ثُمَّ اَرْضِنِيْ بِهٖ -

"అల్లాహుమ్మ ఇన్నీ అస్తఖీరుక బి ఇల్మికవ అస్తక్ దిరుక బి కుద్ రతిక వఅస్ అలుక మిన్ ఫజ్ లికల్ అజీమి ఫఇన్నక తక్ దిరు వలా అక్ దిరు వతాలము వలా ఆలము వ అన్త అల్లాముల్ గుయూబ్.

అల్లాహుమ్మ ఇన్ కున్తతాలము అన్న హాజల్ అమ్ర* ఖై రున్ ఫీదీనీ వమయీాషతీ వ ఆకిబతి అమ్ రీ ఫక్ దురూహులీ వయస్సిరుహులీ సుమ్మ బారిక లీఫీహి వ ఇన్ కున్త తాలము అన్న హాజల్ అమ్ షరున్ల్లీ ఫీదీనీ, వమయీాషతీ వ ఆకిబతి అమ్ రీ ఫస్ రిఫ్ హు అన్నీ వస్ రిఫ్ నీ అన్ హు వక్ దుర్ లిల్ ఖై ర హైసుకాన సుమ్మ అర్ జినీబిహీ."

"ఓ దేవా! నీ జ్ఞానం సాక్షిగా నేను శ్రేయస్సును అర్థిస్తున్నాను. నీ శక్తి పేరిట నేను నీ మహత్తర కటాక్షాన్ని అభ్యర్థిస్తున్నాను. నీవే సర్వశక్తిమంతుడివి. నాకు రవ్వంత కూడా శక్తిలేదు. నీవు సర్వజ్ఞుడివి. నేను జ్ఞానం లేనివాణ్ణి. అగోచరమయిన విషయాలన్నీ నీకే బాగా తెలుసు..

దేవా! నీ దృష్టిలో ఈ పని నా ఇహపరాల రీత్యా, పరిణామాల రీత్యా నాకు శ్రేయస్కరమయినదయితే దానిని నాకు ప్రాప్తం చెయ్యి. దానిని నాకు సులభ సాధ్యం చెయ్యి. దానిని నాకు శుభకరమయినదిగా చెయ్యి. ఒకవేళ నీ దృష్టిలో ఈ పని నా ఇహపరాల రీత్యా, పరిణామ ఫలం రీత్యా నా పాలిట చెడుదైతే, ఆ పనిని నాకు దూరంగా ఉంచు. దాని నుండి నన్ను కాపాడు. నా శ్రేయోశుభాలు ఎందులో ఉన్నాయో దానిని నాకు ప్రాప్తం చెయ్యి. తరువాత దానిమీద నాకు మక్కువ, ఏకాగ్రతలు కూడా కలిగించు."

---

* ఇక్కడ హాజల్ అమ్రకు బదులుగా తన అవసరాన్ని పేర్కొనాలి. లేదా హాజల్ అమ్ర్ అంటూ తన అవసరాన్ని ఆలోచించుకోవాలి.

# 16 ఉత్తమమయిన పేర్లు

ఆత్మశుద్ధికీ, మానసిక సంతృప్తికీ ప్రామాణికమయిన, సురక్షితమయిన మార్గం మీరు దైవనామ సంస్మరణ చేస్తూ ఉండడమే. ఆయన లక్షణాలను, గుణగణాలను సంస్మరిస్తూ ఉండాలి. ఆ గుణగణాలు మనపై మోపే బాధ్యతలను గురించి యోచిస్తూ ఉండాలి. ప్రగాఢ విశ్వాసంతో, సచేతనంగా ఆ గుణాలు మనోమస్తిష్కాలను ఆవహించి ఉండేలా అలవాటు చేసుకోవాలి.

ఖుర్ఆన్‌లో ఇలా ఉంది:

"విశ్వసించిన వారలారా! దేవుని సంస్మరణ అత్యధికంగా చేస్తూ ఉండండి ఉదయం, సాయంత్రం ఆయన సంస్మరణలో నిమగ్నులై ఉండండి."

*(అల్ అహ్‌జాబ్ : 41,42)*

అల్ ఆరాఫ్ సూరాలో ఇలా ఉంది:

"అల్లాహ్‌కు మంచి మంచి పేర్లు ఉన్నాయి. ఆ పేర్లతో ఆయనను పిలుస్తూ ఉండండి." (180)

ఆ పేర్ల వివరాలు, వాటి విస్తృతమయిన హక్కుల నిర్వర్తన ఖుర్ఆన్‌లో కూడా విపులంగా వర్ణించబడింది. మహాప్రవక్త (సఅసం) కూడా ఈ గుణాల సంఖ్య వివరాలు, వాటిని భద్రంగా గుర్తుంచుకుంటే లభించే ప్రతిఫలం వివరిస్తూ వాటిని స్మరించాలని ప్రోత్సహించారు. ఆయన (సఅసం) ఇలా అన్నారు.

"దేవునికి 99- అంటే ఒకటి తక్కువ వంద పేర్లు ఉన్నాయి. వాటిని భద్రంగా జ్ఞాపకముంచుకునే వ్యక్తి స్వర్గంలో ప్రవేశిస్తాడు." (బుఖారి)

దేవుని గుణాలను భద్రంగా జ్ఞాపకముంచుకోవడం అంటే మీరు వాటిని అర్థం చేసుకోవాలి. అర్థాన్ని ఆకళింపు చేసుకోవాలి. వాటి హక్కులను నిర్వర్తించాలి, వాటి ప్రకారం తమ జీవితాన్ని మలచుకోవడానికి ప్రయత్నించాలి అని భావం. దీని సరయిన విధానం: ఖుర్ఆన్‌ని శ్రద్ధాసక్తులతో పారాయణం చేసుకోవాలి. దాన్ని అధ్యయనం చేసే అలవాటు చేసుకోవాలి. క్రమం తప్పకుండా దాన్ని గురించి చింతన, పరిశీలన చేయడం నిరంతర దిన చర్యగా చేసుకోవాలి. తర్వాత ప్రామాణికమయిన హదీసులను భక్తిశ్రద్ధలతో పఠించడం కూడా అలవరచుకోవాలి. వాటిలో దేవుని గుణాల భావార్థం, వాటి పట్ల మన బాధ్యతలను నిర్వర్తించడం

అంటే ఏమిటో స్పష్టంచేయబడ్డాయి. మహాప్రవక్త సంప్రదాయ సిద్ధమైన సంస్మరణలను, దుఆలను కూడా ఏకాగ్రచిత్తంతో, లగ్నహృదయంతో పఠించాలి. సాధారణంగా ఈ గుణాలను పేర్కొన్న దుఆ పఠించాలి. ఖుర్ఆన్ పరిజ్ఞానం గల విద్వాంసులు ఖుర్ఆన్ నుంచే దేవుని ఈ 99 పేర్లను సేకరించారు.

### *1. అల్లాహ్*

ఇది విశ్వసృష్టికర్త ఉనికిపట్టుకు పేరు, ఇది సర్వోన్నత గుణాలకు, శుభశ్రేయాలకు మూలం. ఈ పేరుతో ఆయన్ని తప్ప ఎప్పుడూ ఎవరినీ పిలువడం జరగలేదు. అలా పిలువడం సరయినది కూడా కాదు. అల్లాహ్‌యే మీ ప్రేమానురాగాలకు కేంద్రం. ఆయన ఒక్కడే మీ ఆరాధన, త్యాగానికి అర్హుడు. అన్ని అపాయాలూ, ఆపదల నుండి రక్షణ పొందడానికి ఆయనే శరణ్యం. అందుచేత ఆయన ప్రేమతోనే హృదయాన్ని నింపుకోవాలి. చిత్తశుద్ధితో ఆయనను ఆరాధించాలి. ఆయనపైనే నమ్మకం, భరోసా కలిగి ఉండాలి.

"విశ్వాసం గల విశ్వాసులు అల్లాహ్ ఎడల ప్రగాఢ ప్రేమ కలిగి ఉంటారు."
*(అల్ బఖర : 165)*

"ఓ ప్రవక్తా! ఈ గ్రంథాన్ని మీకు సత్యంతో అవతరింపజేశాము. అందుచేత శుద్ధమయిన విధేయతతో అల్లాహ్‌నే ఆరాధించండి. తెలుసుకోండి, విధేయత, దాస్యం కేవలం అల్లాహ్‌కే చెల్లు."
*(అజ్‌జుమర్ : 2)*

"చెప్పివేయండి. నాకయితే ఈ ఆదేశమే ఇవ్వబడింది. నేను అల్లాహ్‌నే ఆరాధించాలి. ఇంకొకర్ని ఆయనకు భాగస్వామిగా చేయకూడదు."
*(అర్రాద్:36)*

"విశ్వసించిన వారు కేవలం అల్లాహ్‌పైనే నమ్మకం కలిగి ఉంటారు."
*(ఇబ్రాహీమ్ : 11)*

### *2. అర్రహ్మాన్*

కారుణ్యం అత్యధికంగా ఉప్పొంగిపోయేవాడు, అమితమయిన కనికరం పొంగి పొరలేవాడు. అనంతకరుణ జూపేవాడు. తన కారుణ్యంతో మానవునికి మహోన్నతమయిన వరాలను ప్రసాదించేవాడు ఆయన- అర్రహ్మాన్.

"అర్రహ్మాన్(కరుణామయుడు) ఈ ఖుర్ఆన్‌ని బోధించాడు. మానవుణ్ణి సృష్టించి మాట్లాడే శక్తిని ప్రసాదించాడు" *(అర్రహ్మాన్ : 1)*

దేవుని కారుణ్యానికి ప్రత్యక్ష సాక్ష్యం ఏమంటే ఆయన మానవునికి

ఖుర్ఆన్ లాంటి మహత్తర వరాన్ని ప్రసాదించాడు. మానవునికి మాట్లాడే శక్తిని ఇచ్చి ఇతర ప్రాణుల్లో ప్రత్యేక స్థానాన్ని అనుగ్రహించాడు.

### *3. అర్రహీమ్*

కనికరం నిరంతరం కురిపించేవాడు, తన శాశ్వత కారుణ్యా పరంపర ఎన్నటికీ తెగిపోకుండా చూసేవాడు, ఆయన అర్రహీమ్. ఈ లోకంలో మానవుడు ఆయన కారుణ్యా ఛాయల్లోనే తన మనుగడను సాగిస్తున్నాడు. ప్రగతిని పొందుతున్నాడు. మంచి మార్గంలో పురోగమిస్తున్నాడు. ఆచరణా వ్యవధిని పొందుతున్నాడు. విశ్వసించినవారు ఆయన ఈ గుణ సంపత్తి ప్రభావం చేతనే స్వర్గంలాంటి ప్రశాంత నిలయంలో సుఖ, సౌభాగ్యాల జీవితాన్ని పొందుతారు.

"నీవు దేవుని వరాలను లెక్కించాలని కోరుకుంటే లెక్కించ లేవు. అంటే దేవుని అనంత వర ప్రసాదాలను ఊహించలేము. మానవుడు జీవితంలో అనుక్షణం దేవుని కారుణ్యం, కటాక్షాల అవసరం కలిగి ఉన్నాడు. ఆయన కరుణ, కనికరాలు నిరంతరం వర్షిస్తూనే ఉన్నాయ్. *(అన్ నహ్లా : 18)*

"మీపైన దయను చూపుతున్న వాడు ఆయనే. ఆయన దూతలు మీ కోసం కారుణ్యం దుఆలు చేస్తారు; తద్వారా ఆయన మిమ్మల్ని చీకట్లలో నుండి వెలుతురులోకి తీసుకురావాలని. ఆయన విశ్వసించిన వారిపైన అమితమైన కరుణ చూపేవాడు. వారు ఆయనను కలుసుకునే దినాన సలామ్‌తో వారికి స్వాగతం పలుకబడుతుంది. దేవుడు వారికి ప్రతిఫలంగా గౌరవ ప్రతిష్ఠల్ని సమకూర్చి ఉంచాడు." *(అల్ అహ్‌జాబ్ : 43, 44)*

### *4. అల్ మలిక్*

విశ్వానికి నిజ సార్వభౌముడు. ఆయన పరిపాలనాధికారం ఉభయ లోకాల్లోనూ ఉంది, ఆయనే అల్‌మలిక్.

"యదార్థమయిన, సార్వభౌముడయిన అల్లాహ్ మహోన్నతుడు."
*(తాహా:114)*

### *5. అల్ కుద్దూస్*

సర్వలోపాలు, దోషాలకు అతీతుడు, పరిశుద్ధుడు, పవిత్రుడు, అందుకే ఆయన పంపించిన శాసనం ప్రతి దోషానికీ దూరంగా సురక్షితంగా ఉంది.

### *6 అస్సలామ్*

సర్వదౌర్బల్యాలకు, బలహీనతలకు అతీతమయి సురక్షితంగా ఉన్నవాడు.

### *7 అల్ మూమిన్*

సకల ఆపదలు, యాతనల నుండి కాపాడి ప్రశాంతిని ప్రసాదించేవాడు.

**8. అల్ ముహైమిన్**

తన సృష్టిని కనిపెట్టుకు ఉండేవాడు, తప్పులనుండి కాపాడేవాడు.

**9. అల్ అజీజ్**

గౌరవం, అధికారాలకు ఏకైక మూలాధారం, ఆయన అధికారం సర్వాన్నీ పరివేష్టించి ఉంది.

"అన్ని గౌరవాలూ అల్లాహ్‌కే చెందుతాయి." *(యూనుస్ : 65)*

**10. అల్ జబ్బార్**

గొప్ప ప్రాబల్యం గలవాడు. ఆధిక్యత కలవాడు, బలం కలవాడు. సృష్టి వ్యవస్థను సరిదిద్దేవాడు.

**11. అల్ ముతకబ్బిర్**

మహత్తుకలవాడు, గొప్పదనానికి సరోవరం. ఆయన గొప్పదనంలో ఏ ఒక్కరూ భాగస్వాములు కారు.

"ఆయనే అల్లాహ్. ఆయన తప్ప మరో దైవం లేడు. నిజసార్వభౌముడు, పరమ పవిత్రుడు, బలహీనతలకు, కొరతలకు అతీతుడు. ప్రశాంతత ప్రసాదించేవాడు, కనిపెట్టి ఉండేవాడు. అన్నిటా ఆధిక్యత గలవాడు, శక్తిమంతుడయిన శాసకుడు, మహోన్నతుడు, ప్రజలు చేసే బహుదైవారాధనకు అల్లాహ్ అతీతుడు, పవిత్రుడు." *(అల్‌హ(ష్ : 23)*

**12. అల్ ఖాలిక్**

సముచిత స్వరూపం, శక్తిసామర్థ్యాలనూ ఇచ్చి, తీర్చిదిద్ది అత్యుత్తమంగా సృజించేవాడు.

**13. అల్‌బారి**

ప్రతి వస్తువునూ లేమి నుండి ఉనికిలోకి తెచ్చేవాడు. అద్వితీయుడయిన సృజనకర్త.

**14. అల్ ముసవ్విర్**

సృష్టికి రూపాన్నిచ్చేవాడు.

"తానుకోరిన విధంగా (తల్లుల) కడుపులో మీ రూపాన్ని మలిచేవాడు ఆయనే." *(ఆలి ఇమ్రాన్ : 6)*

"ఆయన మీ రూపురేఖలను తీర్చిదిద్దాడు. ఎంతో మంచి రూపాలను తీర్చిదిద్దాడు." *(అల్ మూ'మిన్ : 64)*

"ఆయనే అల్లాహ్. ఆయన విశ్వసృష్టికర్త. సృష్టిపథకాన్ని తయారు చేసి దాన్ని అమల్లోకి తెచ్చేవాడు. దాని ప్రకారం రూపాల రూపకల్పన చేసేవాడు. ఆయనకు మంచి మంచి పేర్లున్నాయి." *(అల్ హష్ర్ : 24)*

### *15. అల్ గప్ఫార్*

ఎంతో ఎక్కువగా క్షమించేవాడు, క్షమాభిక్ష పెట్టేవాడు.

"నేను చెప్పాను. మీరు మీ దైవాన్ని క్షమాభిక్ష కోరండి. ఆయన చాలా ఎక్కువగా క్షమించేవాడు" అని. *(నూహ్ : 10)*

### *16. అల్ కహ్హార్*

తన సృష్టిపైన సంపూర్ణ ఆధిక్యత, అధికారాలు కలవాడు.

### *17. అల్ వాహెద్*

ఒక్కగానొక్కడు. ఆయన ఉనికిలో, గుణగణాల్లో, శక్తి సామర్థ్యాలలో, హక్కుల్లో ఆయనకు మరెవరూ సాటికారు.

"ఈ రోజు ఎవరి పాలన (అధికారం) చెల్లుతుంది? అల్లాహ్‌దే. ఆయన ఒక్కడే అందరిపైన ఆధిక్యత కలవాడు." *(అల్ మూ'మిన్ : 16)*

### *18. అత్ తవ్వాబ్*

దాసుల్ని గమనించేవాడు. పాపుల పశ్చాత్తాపాన్ని స్వీకరించేవాడు.

"పశ్చాత్తాపం చెందాలని దేవుడు వారి వైపునకు మరలాడు. నిస్సందే హంగా దేవుడు అత్యధికంగా పశ్చాత్తాపాన్ని స్వీకరించేవాడూ, కరుణించేవాడూ." *(అత్ తౌబా : 118)*

### *19. అల్ వహ్హాబ్*

నిస్వార్థంగా క్షమాభిక్ష పెట్టేవాడు, ఉదారంగా దానం చేసేవాడు.

"మాకు నీ వద్ద నుండి కారుణ్యాన్ని ప్రసాదించు. నిశ్చయంగా నీవు చాలా ఉదార స్వభావుడివి." *(ఆలి ఇమ్రాన్ : 8)*

### *20. అల్ ఖల్లాక్*

అన్ని విధాలా, అన్ని వేళలా, ప్రతీదాన్ని సృష్టించేవాడు, సృష్టిక్రియలో పరిపూర్ణుడు.

"భూమ్యాకాశాలను సృజించినవాడు, అలాంటి వాటిని మళ్ళీ సృజించ లేడా? ఎందుకు సృజించలేడు (తప్పకుండా సృజించగలడు)! ఆయన మహా సృజనకర్త, విజ్ఞాని." *(యాసీన్ : 81)*

### *21. అర్-రజ్జాక్*

తన సృష్టికి పుష్కలంగా ఉపాధినిచ్చేవాడు, అవసరాలను తీర్చేవాడు.

*22.* **అల్–మతీన్**

అత్యంత పటిష్టవంతుడు, బలశాలి.

"నిస్సందేహంగా అల్లాహ్ పుష్కలంగా ఉపాధి నిచ్చేవాడు. బలశాలి, పటిష్టమయినవాడు, శక్తిమంతుడు." *(అజ్ జారియాత్ : 58)*

*23.* **అల్–ఫత్తాహ్**

సృష్టిమధ్య సరయిన తీర్పునిచ్చేవాడు, ఆపద్బాంధవుడు.

*24.* **అల్–అలీమ్**

దాసుల ప్రతిమాటను, ప్రతిపనినీ, భావాన్నీ, అభిప్రాయాన్నీ ప్రత్యక్షంగా ఎరిగినవాడు.

"చెప్పు, మన ప్రభువు మనల్ని సమావేశపరుస్తాడు, మన మధ్య సరయిన విధంగా తీర్పుచేస్తాడు. నిస్సందేహంగా ఆయన ఎంతో న్యాయవంతంగా తీర్పుచేసేవాడు, అన్నీ ఎరిగినవాడు అని చెప్పు." *(సబా : 26)*

*25.* **అల్ ముహీత్**

సృష్టి సర్వాన్ని పరివేష్టించి ఉన్నవాడు, ఆయన జ్ఞానపరిధికి, శక్తికీ వెలుపల ఏదీలేదు.

"దైవం వారిని అన్ని వైపులనుంచి పరివేష్టించి ఉన్నాడు."

*(అల్ బురూజ్ : 20)*

*26.* **అల్–కదీర్**

ప్రతి విషయంపైనా పూర్తి ఆధిపత్యం, అధికారాలు గలవాడు.

"నిస్సందేహంగా దైవం ప్రతిదానికీ సమర్థుడు, తన జ్ఞానంతో ప్రతిదాన్ని పరివేష్టించి ఉన్నాడు." *(అల్ తలాఖ్ : 12)*

*27.* **అల్ హలీమ్**

శిక్షించడంలో తొందరపడనివాడు, దాసులకు సర్దుకునే అవకాశాన్ని చ్చేవాడు, సహనశీలి.

*28.* **అల్ గఫూర్**

అత్యధికంగా మన్నించేవాడు, తప్పుల్ని గోప్యంగా ఉంచేవాడు.

*29.* **అల్– అఫువ్**

అత్యధికంగా క్షమించేవాడు.

*30.* **అష్–షకూర్**

సృష్టి చేసే సత్కార్యాలకు ఎంతో విలువనిచ్చేవాడు.

"వాస్తవమేమంటే, అల్లాహ్ మాత్రమే ఆకాశాలను భూమిని తడబడకుండా

ఆపి ఉంచినవాడు. అవి జారిపోతే అల్లాహ్ కాక మరెవరూ లేరు వాటిని నిలిపేవాడు. నిస్సందేహంగా అల్లాహ్ ఎంతో మన్నించేవాడు, సహనశీలుడూను."
(అల్ ఫాతిర్:41)

"అల్లాహ్ వారిని క్షమించి వేసినా, అది సాధ్యమే. అల్లాహ్ అమితంగా క్షమించేవాడు, మన్నించేవాడున్నూ." (అన్ నిసా : 99)

"వారిలా అంటారు, అల్లాహ్‌కు కృతజ్ఞతలు, ఆయన మా దుఃఖాన్ని దూరం చేశాడు. నిస్సందేహంగా మా ప్రభువు ఎంతో చూపోపు వహించేవాడు, విలువ నిచ్చేవాడున్నూ." (ఫాతిర్: 34)

**31. అల్ అజీమ్**

తన ఉనికిలోను గుణగణాల్లోనూ మహోన్నతుడు, మహిమగలవాడు.

"నీవు మహోన్నతుడయిన నీ ప్రభువు నామాన్ని కీర్తిస్తూ ఉండు."
(అల్ వాఖిఅహ్: 74)

**32 అల్ వాసి**

అత్యంత ఉదారుడు, అత్యంత ఉదారంగా తన దాసులకు మేలు చేసేవాడు.

"అల్లాహ్ అత్యంత ఉదార స్వభావుడు, అన్నీ తెలిసినవాడు, తాను కోరినవారికి దివ్య జ్ఞానం ప్రసాదిస్తాడు. ఎవరికైతే అలాంటి జ్ఞానం లభించిందో వాస్తవంలో వారికి మహాభాగ్యం లభించినట్లే." (2:268, 269)

**33. అల్– హకీమ్**

విశ్వవ్యవస్థ విషయంలోను, తనదాసుల విషయంలోను అత్యంత వివేకవంతంగా నిర్ణయం చేసేవాడు.

"నిస్సందేహంగా అల్లాహ్ అన్నీ తెలిసినవాడు, వివేకవంతమయిన నిర్ణయాలు చేసేవాడు. తాను కోరిన వారిని తన అనుగ్రహంలోకి తీసుకునేవాడు, దౌర్జన్యపరుల కోసం ఆయన బాధాకరమయిన శిక్ష సిద్ధం చేసి ఉంచాడు." (అద్ దహ్ర్:30,31)

**34. అల్ హయ్య్**

జీవితానికి మూలనిధి. చావు, నిద్ర, కునుకూలేని పవిత్రుడు.

"ఎన్నటికీ చావులేని నిత్యజీవుడిపైన భరోసా ఉంచండి."
(అల్ ఫుర్ఖాన్ : 58)

**35. అల్ కయ్యూమ్**

విశ్వ వ్యవస్థను నెలకొలిపి సృష్టిక్రమాన్ని నిర్వహించేవాడు.

"అల్లాహ్ తప్ప ఆరాధ్యదైవం ఎవ్వడూ లేడు. నిత్య సజీవుడు, విశ్వ

వ్యవస్థను నిలిపినవాడు, ఆయన నిదురపోడు, ఆయనకు కునుకూరాదు."
(2:255)

### 36. అస్ సమీ

దాసుల (పిలుపు)ను ఆలకించేవాడు. దాసుల స్థితి అంతా తెలిసినవాడు,

### 37 అల్ బసీర్

దాసుల మధ్య సరయిన న్యాయం జేయడానికి వారి ఆచరణలనూ, వ్యవహారాలనూ బాగా గమనించేవాడు.

"అల్లాహ్ న్యాయవంతంగా, నిష్పక్షపాతంగా తీర్పునిచ్చేవాడు. అల్లాహ్‌ను విడనాడి వీరు వేటికైతే మొర పెట్టుకుంటున్నారో అవి ఏ విషయంలోనూ నిర్ణయం చేయలేవు. నిస్సంకోచంగా అల్లాహ్ మాత్రమే అన్నిటినీ ఆలకించేవాడు, చూచేవాడు." *(40:20)*

### 38 అల్ లతీఫ్

అత్యంత సూక్ష్మగ్రాహి, సూక్ష్మాతి సూక్ష్మమయిన యుక్తుల్ని అవలంబించేవాడు.

### 39. అల్ ఖబీర్

దాసుల ప్రతి ఒక్క విషయం పూర్తిగా తెలిసినవాడు.

"కుమారా! ఆవగింజంతటి వస్తువయినా సరే, అది ఏ రాతి క్రింద ఉన్నా, ఆకాశాల్లో ఉన్నా లేదా నేలలో దాగి ఉన్నా దాన్ని అల్లాహ్ వెలికి తీస్తాడు. నిస్సందేహంగా అల్లాహ్ (అత్యంత) సూక్ష్మగ్రాహి, అన్నీ తెలిసినవాడు." *(లుఖ్మాన్:16)*

### 40. అల్ అలీ

ఎంతో ఉన్నతుడు, ఉన్నత స్థానంగలవాడు.

### 41. అల్ కబీర్

ఎంతో మహనీయుడు, గొప్పవాడు. ఆయన గొప్పదనంలో ఆయనకు మరెవరూ సహవర్తులు కారు, సాటిరారు, పోటీలేరు.

### 42. అల్ హక్క్

యదార్థమయిన, ధర్మమయిన ఉనికి గలవాడు. ఒకరు తిరస్కరించినా ఆయన సత్యతపైన ఎలాంటి ప్రభావమూ పడదు.

"ఆయన ఉనికి యదార్థం (సత్యం)తో కూడుకున్నది. వీరు అల్లాహ్‌ను కాదని పిలుస్తున్నవన్నీ అసత్యంతో కూడుకున్నవి. ఇంకా అల్లాహ్ మాత్రమే ఉన్నతుడు, మహనీయుడు" *(31:30)*

### 43. అల్ ముబీన్

సత్యాన్ని ప్రస్ఫుటపరిచేవాడు, సత్యాన్ని సత్యమయినదిగా రుజువు చేసేవాడు.

"వారు తెలుసుకోవాలి, అల్లాహ్ సత్యం. సత్యాన్ని సత్యంగా చేసి చూపేవాడు." *(అన్ నూర్:25)*

### 44. అల్ మౌలా

విశ్వసించిన వారిని ఆదుకునేవాడు, అండగా నిలిచేవాడు, స్వామి. పనులు చక్కబెట్టేవాడు.

### 45. అన్ నసీర్

విశ్వసించిన వారికి సహాయమూ, సహకారమూ అందజేసేవాడు.

"అల్లాహ్‌తోటే సంబంధం కలిగి ఉండండి, ఆయనే మీ నిజస్వామి; ఎంత మంచి సమర్థకుడు ఆయన! ఎంత మంచి సహాయకుడు!" *(అల్‌హజ్: 78)*

"విశ్వసించిన వారి స్వామి, పనులు నెరవేర్చేవాడు దైవమే. విశ్వసించని వారికి సహాయం చేసేవాడూ లేడు, సహాయసహకారం అందజేసేవాడూ లేడు." *(ముహమ్మద్:11)*

### 46. అల్ కరీమ్

ఉదారంగా ప్రవర్తించేవాడు. అనుగ్రహించేవాడు.

"మానవుడా! మహెూదార (కరీమ్)ప్రభువు విషయంలో నిన్ను మోసపుచ్చిన విషయం ఏమిటి? ఆ ప్రభువు- నీ సృజనకు పథకం తయారు చేశాడు. నీ నిర్మాణాన్ని సరిదిద్దాడు. నిన్ను ఎంతో సముచితమయిన రీతిలో సృష్టించాడు. తాను తలచినరూపంలో నిన్ను మలిచాడు."*(అల్ఇన్‌ఫితార్: 6-8)*

### 47. అల్ గనీ

సృష్టిపట్ల నిరపేక్షాపరుడు. సృష్టి నుండి తానేమీ కాంక్షించనివాడు.

### 48. అల్ హమీద్

తన ఉనికిలోనే పరిశుద్ధుడు, సద్గుణుడు. పొగడ్తలూ, స్తోత్రాల అపేక్షలేనివాడు.

"ఎవరు కృతజ్ఞులుగా ఉంటారో, వారి కృతజ్ఞత వారికే లాభకరం.

ఎవరయితే కృతఘ్నులవుతారో (వారిని గురించి) దైవం నిరపేక్షాపరుడు. తనకు తానే పరిశుద్ధ గుణగణాలు కలవాడు." *(లుఖ్మాన్: 12)*

### *49. అల్ కవీ*

అత్యంత బలం కలవాడు, ఆయన ఎదుట ఎవరి శక్తి సామర్థ్యాలూ పనికిరావు.

### *50. అష్ షదీద్*

చాలా పటిష్టంగా పట్టుకునేవాడు. ఆయన పట్టునుండి తప్పించుకోవడం ఎవరి తరమూ కాదు.

"ఇదే విధంగా ఫిరౌన్ సంతతీ, వారికి పూర్వపు ప్రజల వ్యవహారం జరిగింది. వారు దైవాదేశాలను తిరస్కరించారు. అల్లాహ్ వారిని వారి అపరాధాల కారణంగా పట్టుకున్నాడు. అల్లాహ్ ప్రచండ శక్తిమంతుడు. తీవ్రంగా శిక్షించేవాడు కూడా." *(అల్ అన్‌ఫాల్ : 52)*

### *51 అర్ రకీబ్*

తనదాసుల ఆచరణను, వ్యవహారాలను కనిపెట్టి ఉండేవాడు.

"నమ్మండి, దైవం మిమ్మల్ని కనిపెట్టుకుని ఉన్నాడు."

*(అన్ నిసా:1)*

### *52. అల్ కరీబ్*

తన దాసులకు అతి సమీపంగా ఉండేవాడు.

### *53. అల్ ముజీబ్*

దాసుల ప్రార్థనలు ఆలకించేవాడు, స్వీకరించేవాడు.

"నా దాసులు నా గురించి మిమ్మల్ని అడిగినప్పుడు వారితో చెప్పండి, నేను వారికి బహుసమీపాన ఉన్నాను, పిలిచేవాడు నన్ను పిలిచినప్పుడు నేను అతని ప్రార్థనను ఆలకిస్తాను." *(అల్ బఖర:186)*

"కనుక మీరు ఆయన్ని క్షమాభిక్ష అర్థించండి, ఆయన సన్నిధివైపునకు పశ్చాత్తాపంతో మరలండి. నిస్సందేహంగా నా ప్రభువు ఎంతో సామీప్యంలో ఉన్నాడు. మొరలనాలకించేవాడు." *(హూద్ : 61)*

### *54. అల్ వకీల్*

దాసుల పనులు పూర్తి చేసే బాధ్యత తీసుకునేవాడు. పనులు నెరవేర్చేవాడు.

"వారు ఇలా సమాధానం చెప్పారు. మాకు అల్లాహ్ చాలు. ఆయన

అత్యుత్తమంగా పనులు నెరవేర్చేవాడు." *(3:173)*

## *55. అల్ హసీబ్*

దాసులను ప్రశ్నించేవాడు, వారి లెక్కలను తీసుకునేవాడు.

"నిస్సందేహంగా అల్లాహ్ ప్రతి విషయంలోనూ లెక్క తీసుకుంటాడు." *(4:86)*

## *56. అల్ జామె*

శరీరావయవాలను ప్రోగుచేసేవాడు. ప్రళయ దినాన దాసులను సమావేశపరచేవాడు.

"ప్రభూ! నువ్వు నిశ్చయంగా మానవులందర్ని ఒక రోజున సమావేశ పరుస్తావు. ఆరోజు రాకలో ఏమాత్రం సందేహంలేదు." (3:9)

## *57. అల్ కాదిర్*

ప్రతి పని చెయ్యగల శక్తి సామర్థ్యాలు గలవాడు.

"మానవుడు ఏమనుకుంటున్నాడు? మేము (పిండి పిండి అయి చిందు వందయిన) అతని ఎముకల్ని ప్రోగు చెయ్యలేమని భావిస్తున్నాడా? మేము అతని వ్రేళ్ళను ఒక్కొక్క దాన్ని చక్కబరిచే సామర్థ్యం కలవారము."

*(అల్ కియామః3,4)*

## *58. అల్ హఫీజ్*

తనదాసుల్ని ప్రతి ఇక్కట్టునుండి, ఆపదనుండి రక్షించేవాడు.

"నిస్సందేహంగా నా ప్రభువు ప్రతి వస్తువుని పరిరక్షిస్తాడు." *(హూద్ : 57)*

## *59. అల్ ముకీత్*

తన సృష్టికి దాని భాగాన్ని సరిగ్గా, పూర్తిగా ఇవ్వగల సమర్థుడు, ఉపాధినిచ్చేవాడు.

"అల్లాహ్ ప్రతి వస్తువుకు సరయిన భాగాన్ని ఇవ్వడంలో సమర్థుడు."

*(అన్ నిసా : 85)*

## *60. అల్ వదూద్*

దాసులపట్ల అఖండ ప్రేమగలవాడు.

## *61. అల్ మజీద్*

పెద్దరికం, విశిష్టతగలవాడు.

"ఆయన ఎంతో క్షమాగుణంగలవాడు, అఖండ ప్రేమ గలవాడు, అర్ష్ అధికారాసనాధీశుడు, మహత్తు, పెద్దరికం గలవాడు." *(అల్ బురూజ్ః 14,15)*

***62. అష్ షహీద్***

ప్రతిచోటా ఉండేవాడు, ప్రతిచోటా కానగలిగేవాడు, ప్రతి దాన్నీ చూచేవాడు.

"అల్లాహ్ ప్రతి దాన్నీ చూచేవాడు." *(అల్ ముజాదలహ్ః 6)*

***63. అల్ వారిస్***

ప్రతి దానికీ నిజస్వామి. ఆయన స్వామ్యం ఎన్నడూ అంతమవదు.

***64. అల్ ముహీ***

సృష్టికి జీవాన్నిచ్చేవాడు, "మేమే జీవితాన్నీ, మృత్యువునూ ప్రదానం చేసేవారము. మేమే నిజమయిన వారసులం, స్వాములము." *(అల్ హిజ్రఃః23)*

***65. అల్ వలీ***

విశ్వాసుల్ని సమర్థించేవాడు, సంరక్షకుడు.

***66. అల్ ఫాతిర్***

ప్రతి దాన్నీ సృష్టించేవాడు,

"ఆకాశాలను, భూమిని సృష్టించేవాడా, నీవే నా సంరక్షకుడివి, ప్రపంచంలోనూ పరలోకంలోనూ." *(యూసుఫ్ః 101)*

***67. అల్ మాలిక్***

ప్రతి దాని నిజస్వామి, ఆయన సమక్షంలో అందరూ అశక్తులు, అధీనులు.

"ప్రతిఫల దినస్వామి" (1ః3)

***68. అల్ ముక్తదిర్***

ప్రతి వస్తువుపైనా సంపూర్ణ అధికారం గలవాడు, ఏ పనిలోనూ బద్ధుడు కానివాడు.

***69. అల్ మలీక్***

సర్వాధికారి అయిన చక్రవర్తి.

"దైవంపట్ల భయభక్తులు కలవారు సెలయేరులు ప్రవహించే నందనవనాలలో ఉంటారు, సర్వాధికారాలు కల చక్రవర్తి దర్బారులో" *(అల్ కమర్ః 55)*

**70. అల్ అవ్వల్**

సర్వసృష్టిరాసుల సృష్టికి పూర్వమే ఉన్నవాడు, ఆద్యుడు.

**71. అల్ ఆఖిర్**

సర్వ సృష్టిరాసుల వినాశం తరువాత కూడా ఉండేవాడు.

**72. అల్ జాహిర్**

సృష్టిలోని ప్రతి అణువు ద్వారా దైవత్వం వ్యక్తమయ్యేవాడు.

**73. అల్ బాతిన్**

దృష్టికి గోచరించనివాడు, గోప్యమయినవాడు.

"ఆయన అందరికన్నా మొదటివాడు. అందరికన్నా కడపటివాడు. అన్నింటి ద్వారా వ్యక్తమయ్యేవాడు. అన్నింటికీ కనిపించని వాడు." *(అల్‌హదీద్:3)*

**74. అల్ ఖాహిర్**

దాసులపైన పరిపూర్ణ ఆధిక్యత, అధికారాలు కలవాడు.

"ఆయన తన దాసులపై పూర్తి ఆధిక్యత గలవాడు." *(అల్ అన్ ఆమ్:18)*

**75. అల్ కాఫీ**

తన దాసులయిన మానవుల సకల అవసరాలకు ఆయనే చాలు.

"తన దాసుల కొరకు దైవం చాలడా"? *(అజ్ జుమర్: 36)*

**76. అష్ షాకిర్**

దాసుల ప్రయత్నాలకు, ఆచరణకు విలువనిచ్చేవాడు.

"అల్లాహ్ విలువనిచ్చేవాడు. అన్నీ తెలిసినవాడు." *(అన్ నిసా : 147)*

**77. అల్ ముస్తఆన్**

సహాయం అర్థించదగిన శక్తి.

"సహాయం అర్థించవలసింది అల్లాహ్‌నే." *(యూసుఫ్ 18)*

**78. అల్ బదీ**

ఏ నమూనా లేకుండా సృష్టించే వాడు. అద్వితీయ నిర్మాత.

"భూమ్యాకాశాలను నిర్మించిన అనుపమ నిర్మాత." *(అల్ బఖర :117)*

**79. అల్ గాఫిర్**

పాపాలను క్షమించేవాడు

"పాపాలను క్షమించేవాడు, పశ్చాత్తాపాన్ని స్వీకరించేవాడు."

*(అల్ మూ'మిన్ : 3)*

**80. అల్ హాకిమ్**

తన దాసులపై పరిపాలన చేసేవాడు, ఏకైక శాసకుడు, శాసన నిర్మాత.

"పరిపాలన కేవలం అల్లాహ్‌కే చెల్లు" *(యూసుఫ్ : 40)*

**81. అల్ గాలిబ్**

పరిపూర్ణ అధికారాలూ, అన్నింటిపైనా అదుపూ గలవాడు.

"అల్లాహ్ తన పనిమీద పూర్తి అదుపు గలవాడు." *(యూసుఫ్ : 21)*

**82. అల్ హకమ్**

నిష్పక్షపాతంగా తీర్పునిచ్చేవాడు.

"అయితే, నేను అల్లాహ్ తప్ప వేరొకరిని న్యాయనిర్ణేతగా ఎంచుకోవాలా?"

*(అల్ అన్ ఆమ్ : 114)*

**83. అల్ ఆలిమ్**

బహిర్గతమైన, గుప్తమై ఉన్న వాటినన్నింటినీ ఎరిగినవాడు.

**84. అల్ ముతఆల్**

సర్వావస్థల్లో ఉన్నతంగా, అన్నిటికీ అతీతంగా ఉండేవాడు.

"గోచర అగోచర వస్తువుల నెరిగిన మహనీయుడు, ఉన్నతుడు."

*(అర్రాద్ : 9)*

**85. అర్ రఫీ**

అన్నింటినీ మించిన ఉన్నత స్థానాలు కలవాడు.

"ఉన్నత స్థానాలు గలవాడు, విశ్వ అధికారాసనాధీశుడు."

*(అల్ మూ'మిన్ :15)*

**86. అల్ హాఫిజ్**

ఆపదలూ, దుర్ఘటనల నుండి రక్షించేవాడు,

"అల్లాహ్‌యే అత్యుత్తమ రక్షకుడు." *(యూసుఫ్ : 64)*

**87. అల్ మున్తఖిమ్**

తన శత్రువులు, తన్ను ప్రేమించే వారి శత్రువులపైన ప్రతీకారం తీర్చుకునేవాడు.

**96. అర్ రబ్**

పరిపోషకుడు, అన్ని అపాయాల నుండి రక్షిస్తూ, పరిణామాల అన్ని వనరులను సమకూర్చుతూ ఉన్నత గమ్యానికి చేర్చేవాడు, ప్రభువు, యజమాని.

"స్తోత్రం, కృతజ్ఞతలూ కేవలం సకల లోకాల ప్రభువైన అల్లాహ్ కొరకే" *(అల్ ఫాతిహా:1)*

**97. అల్ హాఫీ**

స్పృష్టితాలను గుర్తుపెట్టుకు వుండేవాడు, అమితదయగలవాడు.

"నిస్సంశయంగా ఆయన నాపైన అమితదయగలవాడు" *(మర్యమ్ : 47)*

**98. అల్ అహద్**

ఒక్కడే, సాటిలేనివాడు, సరిసమానుడు లేనివాడు.

**99. అస్ సమద్**

నిరపేక్షాపరుడు, అందరూ తనపైనే ఆధారపడి ఉండగా, తాను ఎవరిపైనా ఆధారపడనివాడు.

"ఇలా అనండి: అల్లాహ్ ఒక్కడే నిరపేక్షాపరుడు, అందరూ ఆయన పైనే ఆధారపడి ఉన్నారు." *(అల్ ఇఖ్లాస్:1,2)*

# ఈ పుస్తకంలో దుఆలు

అనుదినం వివిధ సమయ సందర్భాలలో పఠించవలసిన దుఆలు అనేకం ఖుర్ఆన్‌లో, హదీసుల్లో వచ్చాయి. వాటిని కంఠస్తం చెయ్యడానికి ప్రయత్నించాలి. వాటి భావాలను తెలుసుకోవాలి. ఈ దుఆలు, వేడుకోలులోని విషయాలే మన మనస్సుల్లోని నిజమైన కోరికలుగా మారే వరకు వీటిని చిత్తశుద్ధితో, ఏకాగ్రతతో అమిత శ్రద్ధాసక్తులతో ఎల్లప్పుడూ అర్థిస్తూ ఉండాలి. దైవం ఉపదేశించిన పదజాలంలోనే దుఆలు పఠించాలి.

ఆయన ప్రియభక్తులు పఠించిన దుఆలనే పఠిస్తూ ఉండాలి. అలా చెయ్యడమే సమంజసం, అదే ఒక విశ్వాసి సముచిత స్థానం. అదే మన కోసం ఉభయలోకాల మహాభాగ్యం. ఈ భావనతో కూడిన ఖుర్ఆన్, హదీసుల దుఆలనే ఎంపిక చేసి ఈ గ్రంథంలో పొందుపరచడం జరిగింది. అవి వివిధ శీర్షికల క్రింద చోటు చేసుకున్నాయి. అవసరమొచ్చినప్పుడు ఆయా దుఆలను సంబంధిత శీర్షికలలో తీసి కంఠస్థం చేసుకోవడం ఎంతో శ్రేయోదాయకం.

**— : సమాప్తం :—**

"అపరాధం చేసిన వారిపైన మేము ప్రతీకారం తీర్చుకున్నాము, విశ్వసించినవారికి సహాయం చేయడం మా విధి." (అర్ రూమ్ : 47)

***88. అల్ కాయిమ్ బిల్ కిస్త్***

న్యాయవంతమైన నిర్వహణ చేసేవాడు.

***89. అల్ ఇలాహ్***

ఆరాధ్యుడు. ఆయన తప్ప ఇంకొకడు ఆరాధనకు అర్హుడు కాడు.

"న్యాయవంతమైన నిర్వహణ చేసేవాడు, ఆయన తప్ప మరో ఆరాధ్య దైవం లేడు." (ఆలి ఇమ్రాన్ : 18)

***90. అల్ హాది***

ఋజుమార్గాన్ని చూపించేవాడు, ప్రవక్తనూ, గ్రంథాన్నీ పంపించేవాడు.

"నిస్సందేహంగా అల్లాహ్ విశ్వసించిన వారికి ఋజుమార్గాన్ని చూపిస్తాడు." (అల్ హజ్ : 54)

***91. అర్ రవూఫ్***

దాసులమీద అమితంగా దయచూపేవాడు.

"అల్లాహ్ తన దాసులపట్ల అమితంగా దయకలవాడు." (అల్‌బఖరః207)

***92. అన్ నూర్***

ఉభయలోకాలను ప్రకాశింప జేసేవాడు. కాంతికి నిలయమైనవాడు.

"అల్లాహ్ భూమ్యాకాశాల జ్యోతి." (అన్ నూర్ : 35)

***93. అల్ అక్రమ్***

గౌరవోన్నతులు కలవాడు. దాసులపట్ల ఉదారంగా వ్యవహరించేవాడు.

"చదువు! నీ ప్రభువు అత్యంత ఆదరణీయుడు" (అల్ అలఖ్ : 3)

***94. అల్ ఆలా***

అందరికన్నా అధికుడు. మహోన్నతుడు.

"అందరికన్నా అధికుడు, మహోన్నతుడయిన నీ ప్రభువునామాన్ని స్మరించు." (అల్ ఆలా : 1)

***95. అల్ బర్***

తన సృష్టితాల పట్ల ఉపకారవైఖరి నవలంబించేవాడు.

"నిస్సంశయంగా, ఆయన అమితంగా మేలు చేసేవాడు, దయానిధి" (అల్ తూర్ : 28.